ముగిసినను తిరుగ నాసంగకపోవుటచేగాక వంగూరు సుబ్బారావుగారు కీర్తిశేషులగుటకుఁ గూడ విచారించి మరల మొదలెత్తి చిరకాలముక్రిందట సంకల్పించిన శతకసంపుటప్రకటన మిప్పటికి సాగించితిమి. క్రమముగ వేలువేలుసంపుటములుగ భక్తి, శృంగార, నీతి, మతవిషయశతకములతో నింకఁ గొన్ని సంపుటములను బ్రచురింపనున్న మాయుద్యమమున కాంధ్రమహాజనులతోడ్పాటవసరము.

మొదటి సంపుటమున ముద్రితాముద్రితశతకములు 20 సమకూర్చితిమి. ఈ రెండవసంపుటమున 20 సమకూర్చినారము. ఇందలి యముద్రితశతకములన్నియుఁ బ్రచురణార్థము మాకొసంగుటయేగాక శతకములనన్నింటిని సంస్కరించి విపులములగు పీఠికలువ్రాసి శ్రీ శేషాద్రిరమణకవులు, శతావధానులు తోడ్పడుటచే నిప్పటి కిసర్వాంగ సుందరమగు భక్తిరసశతక మొదటిసంపుటము ప్రచురింపఁ గలిగితిమి.

ఆంధ్రమహాజనుల యాదరణప్రోత్సాహములఁ బట్టి కడమసంపుటములనుగూడఁ ద్వరలోఁ బ్రచురించుటకుఁ బ్రయత్నింప నున్నారము.

తండయార్పేట, చెన్నపురి. 1-8-1926.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

# విషయసూచిక.

# భక్తిరసశతకములు

## రెండవ సంపుటము.

# పీఠిక.

ఈ సూర్యనారాయణశతకమును వరాహ వేంకట నృసింహకవి రచించెను ఇతఁడు భారద్వాజ గోత్రుఁడు, బ్రాహ్మణుఁడు. జగన్నాయకశతకము రచించిన వరాహగిరి కొండరాజు నీతఁడు నేకగోత్రులే గాని యిరువురును తమ పూర్వులను చెప్పికొనక పోవుటచే నిందెవరు పూర్వులో యిరువురకుఁ గల సంబంధమెట్టిదో తెలియఁగ వీలు కాలేదు.

“శ్రితసంపత్సురవల్లియా నరసవెల్లిగా” అను పద్యమువలనఁ గవి నరసవెల్లిలోని సూర్యనారాయణ స్వామినిగూర్చి యీశతకము రచించెనని యూహింపనగునుగాని నరసవెల్లి యెచట నున్నదో కవి సంబంధు లెవరేని యటఁ గలరేమో తెలియవచ్చుట లేదు. తత్రత్యులీ విషయమునఁ బ్రయత్నించి కవి జీవితము ప్రచురించుట యవసరము.

ఈ సూర్యనారాయణశతకము భావజటిలముగ సాంస్కృతిక సమాసబంధురముగ నున్నది. కొన్ని చోటుల పద్యమునంతటి నాక్రమించికొనిన సమాసములు గలవు. భావములు స్వతంత్రములై రమణీయములై యున్నవి. సూర్యభగవానుని తేజోవిభ

వములు, ప్రభావములు, శక్తిసామర్థ్యములు పురాణకథలు ఒక్కొక్కపద్యమున నొక్కొక్క రీతిగాఁ గవి వర్ణించి తనకవితానైపుణ్యము సాటియున్నాఁడు. ఇందలి పద్యములు స్వతంత్రము లనియుఁ బ్రాతస్స్మరణీయములనియుఁ దలంచుచున్నారము.

ప్రశస్తమగు నీశతకము ప్రచురించిన వావిళ్లవా రాంధ్రజనులకు వందనీయులు.

నందిగామ.
1-1-25

ఇట్లు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

మస్ఫురద్దేమని, ర్మితగేహంబునఁ బద్మినీముఖసు
తుల్ సేవింప ధాత్రీసురా, ర్పితలీలాకృతి
నొప్పునిన్నుఁ దలఁతుఁ శ్రీసూ... 4

శా. శ్రీమత్పద్మసముద్భవాదితనువుల్ చేకొందు
నెవ్వాఁడు నా, నామాయల్ గనుపట్టముజ్జగ
ములఁ గావించి రతాలయ, వ్యామోహంబున
నొప్పునట్టి నిగమవ్యాలీఢపాదాబ్జు నిఁ, బ్రేమఁ
గన్గొని సంస్మరింతు మదిలో శ్రీసూ... 5

శా. ఛాయాదిప్రియకాంతలఁ మధురభాషాలీలచేఁ
దన్పుచుఁ, గాయం బుజ్జ్వలమై పరిష్కృతపరి
ష్కారంబునై మించ లో,కాయాసంబు లణంచి
దుర్మదబలవ్యాసంగిదైత్యోత్కరా, జేయుస్ఫూర్తి
నెసంగు నిన్నుఁ దలఁతుఁ శ్రీసూ... 6

శా. వేదప్రోక్తనమస్కృతు ల్సలుపుచుఁ బృథ్వీసు
ర ల్మెచ్చి నీ, పాదాబ్జస్మరణైకనిత్యభజనాపారీణు
లై నిల్వఁగా, ఖేదంబు ల్తొలఁగించి వారలకు
నుత్కృష్టాపవర్గం బవి, చ్ఛేదాసక్తి నొసంగు
నిన్నుఁ దలఁతుఁ శ్రీసూ... 7

మ. అకలంకస్ఫటికంబు నూతనజలోద్యద్దీప్తి నాగం
తుక, ప్రకటచ్ఛాయ ధరించినట్లు జలగోళం
బొటఁ జంద్రుండు నీ, సకలోస్రంబులు దాల్చి

మము న్లోకాంధకారంబుతోఁ,దుదిముట్టన్విద
ళింపుచున్భువనబంధుత్వంబువాటించుచున్,నృదు
పాదాంబుజముల్ దలంతు మదిలో శ్రీసూ...

శా. ఆయుర్దాయ మొసంగి మానవులు ధర్మ్యార్థకామ్య
రూపక్రియల్,సేయంజూచుచు సాక్షివై నిలిచి
యత్నాంత్రప్రభావోన్నతిన్, గాయంబుల్ పదఁ
ద్రోచుచున్ యముఁడవై నానాదిలోకస్థితుల్,
దేయప్రక్రియ సంఘటింతువు గదా శ్రీసూ...

మ. సుతదారాద్యనసంబె ముఖ్య మని యూచున్
శాశ్వతం బంచు సంతత మజ్ఞాని బుధుండు శోక
రహితానందామృతోద్యోగసం,గతి కర్తవ్య మ
టంచు నాగమశిఖాగమ్యత్వదంఘ్రిద్వయీ,ధృత
చిత్తంబున నర్తనంబు నలుపున్ శ్రీసూ... 27

మ. అరుణత్వంబును బంకజాతదళసవ్యాపారమున్
శ్రీమనో,హరరూపంబును దేవతామకుటరత్న
ప్రభాచ్ఛాయయున్, దరదర్శనిధనుర్ధ్వజప్రబల
నానాచిహ్నము లొప్పు నీ,చరణ నీరుఁ భవదం
ఘ్రు లొక్కకరణిన్ శ్రీసూ... 28

మ. మునిదాఘువ్యథఁ జిక్కి చాతకము సంతోషించి
నీలాభ్ర ద,ర్శనమున్ గోరినమాడ్కి భూరిభవసం
తాపార్తి నే నెంతయున్,బడలుచున్ గుందుచు నిష్ట

మొంటక ముదిఁ బ్రార్థించి తేవంకఁ జా,చిర
యుష్మద్దయ దక్క నొండు గలదే శ్రీనా...
మ. ఇలఁ దీవ్రాతపబాధ కోర్వక నరుండెంతే వడిన్
ఛాచెం,తల నున్నట్టికుజంబుఁ జేరుగతి నానా
ఘోరసాంసారిక,జ్వలనజ్వాలలఁ జిక్కి మానవుఁ
డుసంజాతార్తి నీపాదముల్,విలసద్భక్తిఁ దలంచి
కొల్చును గదా శ్రీనా... — 80
మ. కలికాలంబున భక్తియోగమహిమన్ గైవల్య
మర్థించి యా,ర్యు లహోయశ్రవణక్రియాదిము
ఖులై యుష్మత్కథాజాలమున్,బలుమాఱున్ బఠి
యించి నిత్యము భవత్పాదాంబుజధ్యానము,ర్మిలిఁ
గావింపుచ్చు ముక్తు లౌదురుగదా శ్రీనా... 81
మ. అరవిందప్రభవాభవప్రముఖసర్వామర్త్యవర్యుల్
భవ,త్పరమప్రాభవసాగరోర్మికలనాప్రాదుర్భవాం
భఃకణో,త్కర మొక్కమ్మడిఁ గ్రమ్మినన్ వివశులై
కన్పింతు రే నెంత చె,ప్పఁగ గారుణ్యముతోడఁ
బ్రోవఁ దగదే శ్రీనా... 82
శా. మాయాపింఛికఁ దాల్చి కౌతుకముతో మాయా
విచందంబునన్,ద్రోయన్ రాని తమోవిభూతి
జగతిన్ దోరంబుగా నించి తే,జాయన్ మూల
మెఱుంగనీక మహిమన్ సర్గాదికృత్యంబులన్,
జేయం జాలిననీకౌశల్యావనముల్ శ్రీనా... 83

శా. నీనామస్మరణంబుచేత దురితానీకంబు మాన్యప్రభా
వ, ద్భానుజ్వాలల శుష్కదావముగతిన్ భస్మీకృ
తంబై జనం, డా నత్యంతవిశుద్ధబుద్ధిఁ దగి నీ దాసుం
డు హృత్కాసారసా, నీకుం జేయుండు నిర్భయుండును
గదా. శ్రీసూ... ౮౪

మ. అమనోవాక్పరిపాద్యుఁ డంచు శ్రుతు లుద్య
చ్ఛక్తిఁ జెల్వంగ నస్రముద్వృత్తిన్ మదిలో స్మరిం
చుచు నవార్యధ్యాస్ఫూర్తిఁ గీర్తించినన్, సుమనీషుల్
దగ దంత్రదోషము ఘటించున్ గాద నిస్సీం
తయున్, విమలజ్ఞానఫలోపలబ్ధిఁ గొలుతున్ శ్రీ
సూ... ౮౫

మ. అథ వేథాస్యహరీశచండికలలో నాద్యుండవై నిం
చునో, శ్కృభవస్ఫూర్తిఁ [illegible] హేతుఁడని వేద్యం
గోరియున్న ద్భద, ప్రథమప్రార్థనముల్ గణించుచు
మదిన్ బ్రార్థించి తెల్పంగి భూ, రిథవాంభోధిఁ
దరింపఁ జేసెదోగదా శ్రీసూ... ౮౬

శా. కామక్రోధముదాదిశత్రువులు వీఁక న్మూఁకలైనాఁడి
చే, లో మాలిన్య మొనర్పఁ దక్కులుచచిత్తు లోప్ర
థనిర్ముక్తులై, నీమంత్రంబు జపించి నీచరణముల్
నిత్యంబు సేవించుచున్, శ్రేయున్ బంధవిముక్తిఁ
గాంతురుగదా శ్రీసూ... ౮౭

శా. ప్రావృట్కాలము దోఁచువేళ నసితాభ్రశ్రేణు
లభ్రంబునన్, ధావింపం బ్రభవించుమాడ్కిఁ దరి
తో నానాప్రవృత్తు ల్మదిన్, బ్రోవు ల్గట్టి జనించు బద్ధు
లగుజీవు ల్మత్తు లౌచున్ భవ, త్సేవన్ జేసి వడిన్
సుఖింతురు గదా శ్రీ... 38

మ. భ్రమ శక్తిన్ గనుపట్టు రాజతములీలన్ దోఁచు
నీయందు లోకము లజ్ఞానసమృద్ధి నంచు బుధవర్గం
బెంచి తత్త్వప్రబోధము రంజిల్ల భవత్పదాంబు
రుహముల్ ధ్యానించి నీలోన వారి మహాబ్ధిం
బలె నైక్య మొందును గదా శ్రీ... 39

మ. మృగతృష్ణ ల్మరుభూములందుఁబలె భవల్లీలాస్వరూ
పంబునన్ జగము ల్గన్పడఁ జూచి యజ్ఞుఁడు సదా
సత్యం బటంచున్ మృగం,బు గతిన్ సన్మిథ్యవాం
బురాశిఁ గడవన్ బోలేక తాపత్రయా,ర్తిఁ గడున్
స్రుక్కుచు నిన్నుఁ జెందఁడు గదా శ్రీ...40

మ. గరిమన్ వహ్ని జనించి తద్భవనమున్ గాల్చు
నీరంబువై, ఖరిఁ జిత్తంబునఁ బుట్టి తన్మలినమున్
గన్పట్ట బాధించు మ,త్సరముఖ్యారులఁ గూడఁ
బట్టి యపరోక్షజ్ఞానఖడ్గంబునన్, శిరముల్ ద్రుంచి
నవాఁడె ముక్తుఁడు గదా శ్రీ... 41

మ. అకలంకద్యునదీతరంగముల నుద్యత్పంకముం

గ ధ్యానోచితస్వాంతనా, లేకుం డెప్పుడు యుష్మ
దీయకృప కోలిఁ బాత్రుఁ డౌదుఁ గనము, నేకం
బొప్పఁగ ముక్తిఁ గాంచుదుగదా శ్రీసూ...60

శా. వైరాగ్యంబును దత్త్వబోధమును శశ్వద్యోగ
ముం గల్గి నం, సారసక్తిఁ దొలంగుచుఁ బుడ
మి నిస్సంగాత్ము లైనట్టివా, రాయాథాతురభావ
ముఁ గనుచు సందానందముఁ గాంచుటల్,
చేరఁ రానిభవత్కృపామహిమగా శ్రీసూ...

మ. శమముయుఁ సత్య మహింసయుఁ సమతియుఁ
సర్వేంద్రియోత్థానముఁ, శమముఁ ద్యాగ
ము గల్గి నిశ్చలతపశ్శక్తిఁ బ్రవర్తింపరే, మ
దిఁ భక్తి జనింప నీచరణసక్తధ్యానబుద్ధిఁ జరిం
చి మహానందము నొందఁ గంటి జగతిఁ శ్రీ
సూ... 62

మ. సగుణుం డంచును నిర్గుణుం డనుచు శాస్త్రజ్ఞుల్
వివాదింపుచో, సగుణవ్యక్తియు నీవు నిత్య
మయి సత్యస్ఫూర్తిఁ గనుపట్టు దా,ని గుణశ్రీక
లితుండవని జగముల్ గన్గొంచు మెచ్చఁ ద
యా, దృగనీకావృతుఁ జేసి సన్నుతువే శ్రీసూ.

మ. శ్రుతిశాస్త్రంబు లెఱింగి బోధమహిమఁ జుద్ధాం
తరంగుండనై, మతిమత్త్వంగతి గాంచి యోగమ

రణిన్ మన్నింపుచున్ పోహముం, చతులప్రాధి
ని నిర్భజించు విబుధుం డంభోధి నప్పాయసా,
కృతి దోఁపన్ భవదైక్య మొందును గదా
శ్రీసూ... ౬౪

శా. యోగస్యందన మెక్కి సత్వగుణమాతో వేతుఁ
డై యీషణ, త్యాగాస్త్రాసన మెక్కువెట్టి హృ
దమోఘాస్త్రంబు సంధించుచున్, రాగ త్రి
చ్ఛాఁగనీపయిం బరవుమర్త్యుం బట్టి నిర్వాణలక్ష్మీ
గేహంబునఁ గట్టివైతువుగదా శ్రీసూ... ౬౫

మ. మునిసభ్యుల్ త్వాఁగందిమూడఁ దమితోఁ బూర్వ
క్రియాపాశముల్, గోని యజ్ఞానపరంపరాయువ
నికన్ గొట్టాడఁగా నిల్పి జీవనికాయోచితసాల
భంజికల భాస్వత్ప్రీతి నర్తింపఁజే, సిన నిన్నెంచి
భజింప శక్యమగునే శ్రీసూ... ౬౬

మ. జలధిన్ గ్రుంకినవాఁ డశేషతటినీస్నానవ్రతో
ద్భూతస, త్ఫలమున్ గాంచినమాడ్కి సర్వ
దివిషద్వర్యాకృతిన్ మించుని, న్నలఘుప్రీతిభ
జించువాఁ డఖిలదేవాగణ్యకారుణ్యదృ, క్కీలనా
బద్ధముఖాబ్జుఁ డై తిరుగఁడే శ్రీసూ...

శా. సంతానద్రుమ మర్థికిం బలె నశేషస్వీయభక్తాళి
త్వం తేష్టార్థ మొసంగు నిన్నిడిచి యన్యాదిత్య

నిం గొల్చుచుఁ, భ్రాంతిఁ భూపతిఁ జేరఁ
బోక సుభటుఁ బ్రార్థించువాఁ డక్షులఁ, జిం
తింపంగతమేమి మోహవశుఁ డై శ్రీసూ... 58

మ. మును నీపాదసరోజభక్తుఁడగు రాముం డా
ర్తవిప్రాంగనా, మునిదైతేయ వనాటముఖ్యుల
మదిఁ మోదంబు రెట్టింపఁగ, న్గాని కైవల్యపదం
బొసంగె భవదంఘ్రుల్ సేవ్యఁ జింతించువా
రి నుపేక్షించుట నీకుఁ గాది యగునే శ్రీసూ.

మ. ధనదారాత్మజసక్తి లేక మదిలోఁ దత్త్వార్థవిదం
కేయసా, స్వనముం గోరి యొనర్చువాఁ డపుడు
దంచత్కర్ణరంధ్రంబులఁ, వినునే గాలులంరాయ
కంధరవిలంబిస్వర్ణఘంటావళీ, నినదానవ్యతదీయ
కంఠరవముఁ శ్రీసూ... 60

శా. శాంతిఁ గ్రోధము లోభ మస్థిరమతిఁ మత్సం
గతి న్మత్సరం, బంగర్వోహము దత్త్వగోష్ఠి నిది
ధ్యాసప్రవృత్తి న్మదం, బెం చేకాముము దేహధర్మ
కలనాదృష్టి న్విదారించి నీ, చింత నృత్తులువాఁడె
ముక్తుఁడుగదా శ్రీసూ... 61

మ. హరిసంరక్షణము సుధాకరధరుం డంతంబు
సర్గంబు వా, క్తరుణీభర్తయుఁ గల్పుటల్ బుధులు
వక్కాణింతు రాకృత్యముల్, పరమస్త్రీప్రముఖా

శా. తూలంబై భవదాగ్రహంబున మరుద్గోత్రంబు
తూఁగాడున, త్తూలంబైన సుమేరుశైల నిలుచు
నీతూర్ణప్రసాదోన్నతిన్, గాలాదు ల్లనియుండ
నెల్లజగముల్ గావించి రక్షింపవా, శ్రీ లోకే
శముఖుల్ ద్వాదశ్యులగుచున్ శ్రీసూ... 67

శా. లోకంబుల్ గలిగింపఁ బెంపఁ జెరుపన్ లోలుం
డవై చిత్తమం, దాకాంక్షించినమాత్ర మున్న
మె సత్యస్ఫూర్తి వర్తించుచో, నే కాలంబు
రణేచ్ఛ మాన కదురై హింసించుచుండేవాం శే,
చీకై కొంకలు పద్మ్య కాదుఁగుగదా శ్రీసూ...

శా. నీకారుణ్యము లేక ప్రాగ్భవకృతానిత్యక్రియా
రాశి బ్రస్ఫోరంబు నహించి మానవుల కర్యం
తార్తిసౌఖ్యోన్నతుల్, చేకూరంగ నటించు
తావకమరీచివ్యాప్తి లేకున్న నుం, ద్రుస్ఫూర్తిఁ
దమిస్రముల్ పెరుగవే శ్రీసూ... 69

మ. శితనారాచపరంపరన్ దెరల కక్షాప్రకాశోన్న
తిన్, బ్రతికాణంబుల నిన్ త్రికాలముల నాం
వన్ జూడు ముందేవాద్రై, త్యతతిన్ విప్రవిసర్జితా
ర్ఘ్యమహాయున్ దాటించి నీమంత్ర మూర్తిత
శక్తిన్ నిసుమించి వర్తిలుఁ గదా శ్రీసూ...

* రథటుల్.

మ. అనుకంపారసదృష్టి ము న్ముకులభృత్యశ్రేణి రక్షిం
పవే, నను రక్షింపకయున్న నాఁ గలుగనే
నైర్మల్యాద్వైపమ్యముల్, జను లెంచఁగా సముప
ర్తినై నిలిచి కాంతుఁగా బహుభాగంబుఁ జే,నిఁక
ని న్నుత్తముఁ బిల్వ మెత్తురా మదిఁగా శ్రీసూ...

శా. రోగజ్ఞానవిరక్తి నత్త్వగుణసద్భోగ్యసురశ్రేణి
కిఁగా, రాగం బొప్పఁగ ముక్తిసౌఖ్య మిది నన్
రక్షింపకున్నఁగా గృపా,రోగు క్షేత్ర ని దివలఁగా
విడిచి భాగ్యోదారుల న్మున్ను గాఁ, గ్రేఁగంటఁగా
గనుఁగొంచుఁ బ్రోవ నగునే శ్రీసూ... 76

మ. ద్విరదంబుల్ రథముల్ ధనంబులు మణుల్ కేళి
లు రాజ్యంబు ముం,గిరము ల్యూహలు చెలము
ల్నినుపడిఁగా దెబ్బుంచుఁ గాంచుంచ లే,మరు సంసా
రసముద్రకారణవిధానోద్యుక్తయుక్తగృప, స్థిర
బుద్ధిఁగా దయసేయు మంటి నెపుడుఁగా శ్రీసూ.

శా. ఏలా వేదపురాణశాస్త్రములు ని న్మప్రాధ్యసేవిం
పన, బ్బాలెందుప్రభఁ జీకటుల్ బలె నఘవ్రాతం
బు నిర్మూలమై, ప్రాలఁగా ముక్తిపదంబుఁ గాంచు
రనుచుఁగా వాక్రుచ్చు నే నగ్గలిఁగా, శీలం బొప్ప
భజింతు నీచరణముల్ శ్రీసూ... 78

మ. ఘనము ల్నీచము లైనజన్మములు మత్కర్మాను

కాలంబుల్తై, వెనుకన్ గల్గినఁ గల్గనీ హృదయ
మే వేళన్ భవత్పాదచిం, తనమున్ దప్పకనల్పు
చుండుటకు నానోటన్ బ్రసాదింపవే, యెనఁటు
ల్లన్గాని చిత్తవీథి వగవన్ శ్రీసూ... 79

మ. తనువు ల్వీడుచు మున్న శేషనిరయస్థానస్థితానే
కయాతనలన్ బల్మి భుజించినాఁడ నిఁకఁ దద్బా
ధ ల్విజృంభించినన్, గని చింతింపనుగాని నీభ
టుఁడ నానాదుర్గతుల్ చేరఁగాం, చె నటంచున్
జనులాడుచుండ వగతున్ శ్రీసూ... 80

మ. నిగమాంతంబు లనేకరూపములచే నీతత్త్వ
మూహించుచోఁ, బొగడం జొచ్చితి ముంద
బుద్ధి నకటా బోధ్యుండ వెట్లౌదువో, తగ
బోధం బెటు లబ్బునో తెలియ దీతత్త్వంబు
గాంతించుచున్, మిగులం గొల్చెద నీపదంబు
తెలమిన్ శ్రీసూ... 81

మ. జననీగర్భగుహాంతరాళనిరయస్థానంబులం దున్న
[illegible] స్మృతిఁ బాయునంచు మదిలోఁ
దల్చి [illegible] నీపాదచింతనము స్వాంత చేయు
చుంటి నిఁక సత్కారుణ్యదృక్సంధుఁడవై, చిన్మాయంబు
నటింపఁ బ్రోవఁదగదే శ్రీసూ... 82

మ. శ్రుతిశాస్త్రంబులు నిత్యమంచు భవదస్తోకాద్య

లాతః కేశవ మునిస్తుత్యాంఘ్రిపంకేజ సుస్థిర
సంజ్ఞారమణీశ లోకనయనా శ్రీసూ... 87

శా. ఛాయావల్లభ దుష్కృతాంతక మహా
భద్రసంధాయకా, ధ్యేయాకార శివస్వరూప
శుభటాత్రిస్తోమ విచ్ఛేదకా, మాయాలీల ముకుం
దవాసరమణీ మార్తాండ నక్తంచరా, జేయా
ద్వాదశరూప చండకిరణా శ్రీసూ... 88

శా. అంతా దేవతలా పారిత్కారికరోగ్రాఖండదోర్దం
డసం, శ్రాంతేష్వాసవిముక్తకాండజలధారాంధ్య
స్తమందేహాక, ల్వాంతవ్యక్తహుతాశనోత్ఖ్యుతఘ
మస్తామర్త్య మర్త్యావలీ, చింతాసంతతి నిగ్రహం
చడుతతిన్ శ్రీసూ... 89

మ. కలకే నీసరివేల్పు లిజ్జగములన్ గంగాధరాంభో
జభూ, బలభిద్వామనముఖ్యనిర్జరశిరోభాస్వత్కి
రీటాగ్రభా, గలసద్రత్నసముంచిత శ్రుతిశిఖాగ
మ్యప్రభాభూషితాం, ఘ్రిలుత శ్వేతకభూరిదు
ష్కృతగణా శ్రీసూ... 90

మ. సరివే ల్పెచ్చట లేదు నీకు శుచిముఖ్యాప్రాగ
మాఖ్యాసభా, సురవిజ్ఞానకళావిలోలహృదయ
క్షోణీసురాలోక్యదు, ర్భగభానూత్కరచండదుం
డలవినిర్యద్దివ్యరుగ్వారిత, క్షీరకాండోదరపూరి
తోరుతిమిరా శ్రీసూ... 91

మ. మెఱపుల్ బుద్బుద సంపద ల్పొదలు నెమ్మేను
ల్గనచ్ఛాయలై, పరగున్ సంసృతిసౌఖ్యముల్
బహువిధస్వప్నంబులై తోఁచు బంధురభోగం
బులు బుద్బుదంబులగతిన్ బొల్పొందు నెవ్వా
రల, స్థిరరూపంబులు నీవి నమ్మనగునే శ్రీసూ.

మ. శరణం బంటిభవత్పదస్మరణదీక్షాప్రాప్తి నూల్కొం
టి మ,త్సరమోహాదుల నంటకుంటి మతిమచ్ఛాం
గత్య మిమ్మంటి నే, మఱుపా టింతయుఁ గాన
కుంటిఁ దొలికర్మశ్రేణి పోఁగొంటిఁ జెచ్చెరఁ దాప
త్రయిఁ బాపుమంటి నెపుడున్ శ్రీసూ... 24

మ. ధనలుబ్ధత్వము దీఱఁగా ముముక్షు చేతశ్శుద్ధిపుట్టా
ఱ సజ్జనసాంగత్యము మీఱఁ బుత్రరతివాత్స
ల్యంబునుం బాఱఁ ద,త్కనకాంతల్ గడతేఱ
నెల్లపుడు సత్కృత్యంబు లెల్లన్ ఘటించి నిన్నుం
గొల్చితి నన్నుఁ బ్రోవవలదే శ్రీసూ... 25

శా. విత్తప్రాప్తిగతు ల్దలంపక సదా విద్యావినోదం
బునన్, మత్తుండై దినకృత్యముల్ సలుపుచున్
మాన్యద్విజేంద్రాళిచేఁ, జిత్తస్థైర్యము గల్గి నీదు
పదముల్ సేవించుభూదేవుఁ డు, ద్వృత్తిన్
ముక్తిపదంబు గాంచును గదా శ్రీసూ... 26

మ. మనుజుం డర్థముఁ గోరి నీచరణముల్ మన్నింప

కర్థించుచుఁ, ధనికశ్రేణుల నాశ్రయించి పిదపన్
దైన్యంబు దీపింపఁ దన్నయంబుగ జను లెల్ల
హాస్యములుఁ సేయఁ బ్రాప్తి లేదంచు నేఁ,
చినవంతఁ బలుచింతఁ జెందునుగదా శ్రీనా...

మ. తనయుల్ మిత్రులు సన్నలుఁ సతియు మిత్రశ్రే
ణియుం గొల్వఁగా, ధనికత్వంబునఁ దత్సుఖంబు
తనకుఁ దక్కొల టంచుఁ మనంబున హర్షిం
చుచు మూఢుఁ డంతకభటుల్ పోరాడువేళన్
జనిం,చినభీతిఁ గడుదుఃఖ మొందునుగదా శ్రీ.

మ. నృపులం గొల్చుచు వేషధారి యగుచుఁ
బేరంబు లశ్రాంతముఁ,జపలత్వంబునసల్పుచుఁ
పరగృహస్థానేచ్ఛ వర్తించుచుఁ, విపులద్ర
వ్యముఁగూర్చి మోదమునఁ బృథ్వీదేవవంశ్యుండు
దాఁ,గృపణుండై చెడుఁ గాదె నిన్నెఱుఁగమిన్
శ్రీనా... ౧౪

మ. కృతపాపంబులు లెక్కపెట్టక మహాహీనాకృతిన్
దాల్చి దానతతిన్ గైకొనుచుఁ దురన్నముల
నంత్యప్రీతి భక్షించుచుఁ, వ్రతము ల్గోరక
యాహ్నికక్రియ లొగిన్ వర్జించి విప్రుండు సం,
చితవిత్తంబునఁ బ్రాప్తిఁ జెందక చెడుఁ శ్రీనా.

శా. పాతిసర్యోయ సచింత్యాకాయ సుమహామా
ణ [illegible] శ్రిత్వై తేయ నతాదికే

యు ధృతశాతేయుఁ జగద్ధేయు సం, భృతతి
గ్మాంశునికాయు సద్గుణగణామేయుఁ హృతా
పాయు స,త్కృతరాధేయు సహాయు నిన్నుఁ
గొలుతుఁ శ్రీ... 100

మ. ధృతచక్రాబ్జనిషంగచాపు విలసత్కీర్తిప్రభావంచి
తా,మృతసంతానకలాపు ఖండితభట శ్రేణీబృ
హత్పాపు ధీ,రతతిధ్యేయసురూపు సత్యమధురా
లాపుఁ నతశ్రీపు వ,ర్జితకోపుఁ సుకలాపు
నిన్నుఁ గొలుతుఁ శ్రీసూ... 101

మ. అవితాంభోజభవాండుఁ గిల్బిషకదళ్యారణ్యవే
దండు ర,త్నవిచిత్రార్జునకుండలద్యుతిసముద్యద్గం
డుమందేహదా,నవసేనాదళనోత్సుకప్రబలనానా
కాండుఁ గాండాదిభూ,రివిహారార్హవిచండుని
న్నుఁగొలుతుఁ శ్రీసూ... 102

మ. నతశక్రాదికిరీటకోటిమణిసంతానస్ఫురత్పాదుదా
రితభక్తాఖిలఖేదు మానిజనతాశ్రీదుఁ మహా
మోదుః జా,లితమర్యాదు విపత్సుహృద్భయద
మార్వినాదు దివ్యాస్త్రని,ర్జితనానావలలాదు
నిన్నుఁ దలఁతుఁ శ్రీసూ... 103

మ. సురవర్యస్తుతనాము భవ్యసుగుణస్తోముఁ సమ
స్తాశ్రితో,త్కరసంతాపవిరాము లోకభయకృ
త్సంగ్రాము నానావిధా,భరణోద్దాము సుధాము

సత్కులసరస్వతోన్నము నిష్కామము భూరిరమా
లంకృతధామము నిన్నుఁ దలఁతున్ శ్రీసూ...104

మ. శతపత్రాయతనేత్ర సర్వసుమనస్సంస్తుత్యచారి
త్ర దు, ష్కృతసంఘాతలతాలవిత్ర మునిరాడి
ష్టాటవీచైత్ర ని,ర్జితమందేవానిశాటగోత్రఁగిరణ
శ్రేణీలసద్గాత్ర సం,శ్రితలోకావనసూత్ర నిన్నుఁ
దలఁతున్ శ్రీసూ... 105

మ. కుతుకం బొప్ప నమస్కరింతు మఱి నీకున్ సేవక
శ్రేణికిన్, ధృతదివ్యాయుధపాణికిన్ మణిగణో
దీర్ణప్రభాపుంజరం,జితగాంగేయశతాంగవాలికి
సరోజిన్యాదికాంతాలికిన్, గృతకృత్యుం డని
వేడ్క నన్నుపవే శ్రీసూ... 106

శా. ఈమీఁదన్ భవదీయభూరిదయ నే సెంతే
సుఖశ్రేణిచే, నామోదించి నిరామయప్రకృతి నై
హర్షించుచున్ బాపచిం,తాముక్తింగని ముక్తి
కాంత మదిలో స్తంభింప నీపాదముల్, వేమా
రెంచి భజించుచున్ దిరిగెదన్ శ్రీసూ... 107

శ్రీసూర్యనారాయణశతకము సంపూర్ణము.

# పీ ఠి క.

ఈశతకము రచించినది కొమర్రాజు వేంకటశివుఁడని గ్రంథాంతమునఁగలపద్యమువలనఁ దెలియుచున్నది. ఈ వేంకటశివునివ్యవహారనామము వెంకటప్పయ్య యనియు కృష్ణామండలములోని పెనుకంచిప్రోలువాస్తవ్యుఁడనియు ఆంధ్ర వాఙ్మయమునకు జీవకళల బ్రసాదించిన - కొమర్రాజు వేంకటలక్ష్మణరావు, ఎం.ఏ, గారికీకవి జనకుఁడనియుఁ దెలియుచున్నది.

వేంకటశివుఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు.లింగధారిమతములోనివాఁడు. ఉద్భటారాధ్యవంశపరంపరలోని యారాధ్యు లీకవిగురుకుటుంబములోనివారు. ఈకవి మునగాలసంస్థానప్రభుత్వము గావించి యిప్పటిమునగాలప్రభువులగు శ్రీనాయని వేంకటరంగారావు బహద్దరువారిని దత్తులుగాఁ దీసికొనిన లచ్చమ్మారావుగారివద్ద మంత్రిగానుండి చిరకాలము రాజకీయవ్యవహారములలోఁ దాలుగొనెను. ఈకవి మఱి కొన్ని శతకములు జ్యోతిషగ్రంథములు రచించినటుల శతకకవులచరిత్రము పేర్కొనుచున్నది గాని యాపుస్తకములనామములే తెలియవచ్చుటలేదు. అందులకుఁ బ్రయత్నించి కృషిచేయవలసియున్నది.

ఈశతకమునఁ బేర్కొనఁబడిన రాజలింగస్వామి రేపాలలోని యర్చాదైవతము. రేపాల మునగాల

సంస్థానములో మునగాలకు ఐదుమైళ్ళదూరములో నున్నది. విచారింప నాయూర రామలింగస్వామిదేవళము గలదని తెలిసినది. కవి వీరశైవుఁడై నకతన రామశబ్దసహితముగ లింగశబ్దము నుచ్చరింపనొల్లక రాజలింగమని పేర్కొనినటులఁ దోఁచుచున్నది. మతావేశపరవశు లిటులఁ జేయుటలో నించుకేనియు వింతలేదు.

ప్రకృతశతకము నూటయిరువదియేడు సీసపద్యములతో నిండియున్నది. శతకకవిత ధారాశోభితమై సులభసాధ్యమగు భాషలో మృదుమధురముగా నున్నది. అందందు వ్యాకరణదోషములు గూడఁ గలవు. వెంకటశివుఁడు మతావేశము గలవాఁడగుటచే నీశతకమున శివునికంటె దైవము లేడనియు నితరదైవతములు శివభక్తులనియు నీశ్వరశబ్దవాచ్యుఁడగు శివుఁడే నిఖిలదేవస్తుత్యుఁడనియు భస్మము రుద్రాక్షలు బ్రాహ్మణుఁడు ధరించితీరవలెననియుఁ గొన్ని పద్యములలో బోధించెను. మఱికొన్ని పద్యములలో స్కాందాదిపురాణములనుండి విషయసంగ్రహము గావించి శివపరేశ్వరత్వము పలుమాఱు స్థాపింప యత్నించెను. గంగ విష్ణుపదోద్భవయనుసంశయము, బ్రహ్మతలఖండించుటచే శివునకు బ్రహ్మహత్య వచ్చినదనువిషయము శివుఁడు మోహి

నిని జూచి యపభ్రంశముగ వర్తించెనునంశము భస్మాసురకథ సహజమతాభిమానము నాధారపఱచి కొని ఖండించినాఁడు. శివునకు నీశ్వరత్వమారోపించుటయే కర్తవ్యముగాఁ బెట్టుకొని యీకవి పలు తావుల నితరదైవతదూషణము బ్రాహ్మశాఖలలోఁ జేరినయితరులనింద విరివిగాఁ గావించియున్నాఁడు.

పరమతనిందాగర్భితముగ శ్రీగిరిమల్లేశ, వీరభద్రశతకాదులు రచించిన కొమఱ్ఱాజు రామలింగకవి యీవేంకటశివునకుఁ బినతండ్రి యగుటచేఁ గాఁబోలు అన్యదైవదూషణమునఁ దండ్రినటులుండుమనుచున్నాఁడు. మొత్తముమీఁద నీరాజలింగశతకమును వీరశైవమతసిద్ధాంతబోధకమని చెప్పవచ్చును. ఇందు బసవేశ్వర, సోమనాథ, మల్లికార్జునాది వీరశైవులు నెలకొల్పిన సంప్రదాయములు లక్ష్యమునందుంచి వ్రాయఁబడినపద్యములు పెక్కులు గలవు. శైవమతప్రతికూలుగు కొందఱు పురాణములలో శివునకుఁ గలయీశ్వరత్వము లోపింపఁజేయుటకుఁ గొన్నికల్పితకథలుఁ జేర్చిరనియు భాగవతమునఁ బోతరాజుసైతము విష్ణుమతాభిమానవశమునఁ గొన్ని శివప్రాముఖ్యముఁ దెలుపుకథలు లోపించెనని యీక్రిందిపద్యములోఁ దనయభిప్రాయము దెలిపియున్నాఁడు.

సీ. భాగవతంబునఁ బాత్రుఁడై కవి
వాస్తవంబులు కొన్ని వదలినాఁడు

... ... ... ...

దక్షాధ్వరమునకు దనుజారి వచ్చిన
లేదని చెప్పెను

... ... ... ...

శ్రుతియుఁ బలుకుట పోతన చూడఁడేమొ. (చూ. ౧.౨.౨)

ఇటులె మతావేశములగు సంశములకు నితరమతనిందలకుఁ దార్కాణలు కాంచనగును. కేవలమతధర్మములు తెలుపుశతకకదంబములో నీశతక మొకటియైయున్నది. చిరకాలముక్రింద నీశతకము తప్పుల తడికగా ముద్రింపఁబడి యుంటచేఁ గవిభావానుసారముగఁ గొంచెము సవరించి శుద్ధప్రతి సిద్ధపఱచి యీశతకము ప్రచురించితిమి.

ఈశతకకర్త రమారమి 40సంవత్సరముల క్రిందట లింగైక్యము నొందెను. శైవమతోద్బోధకమగు అన్యవాదకోలాహల మంత్రప్రాభవముగా నీశతకము లేకున్నను ఇందలిపద్యములు సుబోధకములై మతావేశమున కనుగుణముగ నుద్రేకకరములుగానున్నవి. ఈకవి యితరగ్రంథములకై ఆంధ్రులు యత్నించిన నీశైవమతగ్రంథమండలికిఁ దోడ్పడినటు లగును.

నందిగామ, } [illegible] శిష్టు భాషాసేవకులు,
1-1-26 } శేషాద్రిరమణకవులు, శతావధానులు.

ఓమ్.

కొమర్రాజు వేంకటశివకవిప్రణీత

# రేపాల రాజలింగశతకము

---

సీ. శ్రీగిరీశ్వర నీదుసేవ ముక్తికిఁ ద్రోవ
నీనామ మఘవార్ధి నిల్పునావ
సిరులిచ్చు చెలిపొందుఁ జేసెఁగా నీఠావ
త్రిపురవాసులఁ ద్రుంచు తెలివి తేవ
మునిపుత్త్రుమొఱ విని చనితివా దయఁ గావ
మామనువలగొట్టు మాటలావ
చలిమలసుత నేలఁగలవాఁడవే నీవ
వేల్పులు జాలిరే విషము ద్రావ
గీ. సకలసురలందు బ్రాహ్మణజాతివీవ
చావుపుట్టుక లేకట్టిసామి గావ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ
రాజితశుభాంగ రేపాలరాజలింగ. 1

సీ. నీవు బట్టినవిల్లు నేటైనబల్ గట్టు
పసమీఱు మీవారి బుసలగొట్టు
నీజటాజూటంబు నిల్వ గంగకుఁబట్టు
నలిమేను పార్వతికైనదెట్టు
నీరథచక్రముల్ నిలువకరుగు రట్టు
నీముఃఖంబున కగ్ని నీటిబొట్టు

నీగళచ్ఛాయకు నీగును చలినట్టు
    విను నీనివాసంబు వెండిదట్టు
గీ. మట్టుమీఱిననీచర్యలెట్టు కట్టు
పఱచి వాక్రువ్వఁగను బల్లపడుటదెట్టు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 2

సీ. చలిమలసుత నీకు వలసినపెన్‌రాణి
    ముసలియెద్దే మీకు మిసిమి ఘోణి
ఆకాశమే మీకుహాశ్చర్యమఁగువేణి
    చాలదు మీకథల్ జదువ వాణి
అంబరంబయ్యె మీ కఖిలదిశాశ్రేణి
    పరమేశ మీకయ్యె శరధితూణి
భక్తసంరక్షణాస్పదమగు మీపాణి
    తలఁప మీపిన్నాలు బలుపరాణి
గీ. లీల గణియింప వేదము లేనిరాణి
మీకరంబుననున్న దే మేలియైణి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...3

సీ. నాసలికన్నాశకు బుసబుసమనునిల్లు
    కన్నెవాడినార్పుపై గంగబల్లు
సగముజేసెఁగదయ్య సత్తి నిన్‌బల్ పెల్లు
    తలకెక్క మరుగాలు తగనిగొల్లు
వంచితే వంగక దెంచినఁ దెగువిల్లు
    గండిగా వలపటిబండికల్లు

పెద్దకొంఘరునకెట్లు పెండ్లిగానిదిగుల్లు
దండిపాములపొత్తు గుండెఝల్లు
గీ. ఇట్టిగృహభార మహహ మీకెట్టు జెల్లు
చున్నదో కద జేరు మాయున్నయిల్లు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 4

సీ. కల్పవృక్షము గొప్పకలముగాఁదగె నోయి
యంబుధిజలము లేనయ్య † శాయి
భూమిఖండములె సంపుటముగాఁ బడె నోయి
వనజసంభవురాణి వ్రాయుటాయి
మీచరిత్రంబులు మించినవామ్నాయి
సంపూర్తి లిఖియింపఁ జాలదోయి
ఇతరులు లేఖనకెత్తుదురే చేయి
శక్త్యనుగుణనుతుల్ జేయమాయి
గీ. ఇవియు ఘనముగ శుభముల నిమ్ముభాయి
బ్రోవవలె గాక దయబేర్మి భావయాయి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...5

సీ. బసవపురాణంబు బండితచారిత్ర
యనుభవసారంబు నఖిలశ్రుతుల
సహితచతుర్వేదసారంబు సోమేశ
భాష్యసద్గ్రంథముల్ సవ్యరీతి

---

† శాయి=సిరా.

రచనాధికారి వై రయమొప్ప పరవాద
భీకరుండనఁగను బృథివిలోన
రుద్రుఁడయ్యు బ్రతాపరుద్రునిసభ విష్ణు
వాదుల నోడించి వారికెల్ల
గీ. శైవదీక్షలొసంగిన శంకరుండు
పాల్కురికిసోమునకు నేను బ్రణుతిఁ జేతు
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...6

సీ. బసవాద్యసంఖ్యాత్యభ_క్తులఁ గొనియాడి
విఘ్నేశ్వరునిఁ జాల వినుతిఁ జేసి
వరదధీచ్యాదులఁ గరమొగి గణుతించి
నూతనశివభ_క్తనుతి యొనర్చి
నీమీఁదభ_క్తిని నేనెఱ్ఱసట్టులఁ
జెప్పఁబూనితినయ్య నీసపద్య
ములు గాన నిర్విఘ్నముగ జేయఁగా వీరి
కర్తలు తప్పులు గలిగియున్న
గీ. బరసవేది యయస్థితిభర్మమైన
పగిది మత్కావ్య మిల శ్రేష్ఠమగునుగాక
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...7

సీ. శంకర పరమేశ శాశ్వత సర్వేశ
కాలకాలాంతక గరళకంఠ
చంద్రశేఖర భీమశాంకరీహృదయేశ
శర్వ మహాదేవ శరనిభాంగ

ఫాలనేత్ర గిరీశ పంచాక్షరీరూప
భవహార పురహార భక్తవరద
గంగాధర సురేశ కంజాక్షసన్నుత
భుజగభూషణ దీనపోష సోమ
గీ. యనుచుఁ బఠియించువారికి ఘనతమీఱ
మోక్షసత్రంబు లేసినదీక్షనీదె
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...8
సీ. వేల్పులందఱిలోన విప్రుండ వీవని
సకలవేదంబులు చాటుచుండు
కమలాక్షునుతు నీదుకంటను సమయింప
బ్రతికింపఁగలిగెనే బాలు నతఁడు
కమలాసనునితల ఖండించితివిగదా
మొలపించుకొనుశక్తి గలదె తనకు
గరళము భక్షించుతరి పంచియిమ్మని
సరివేల్పు లీకొనఁజాలి రెవరు
గీ. పశుపతివి నీవు సురలంతపశువులగుట
కివియె సాక్ష్యంబులగునయ్య భువనములకు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...9
సీ. సర్వేశ త్రిపురముల్ సాధించుపనికైన
సాధనంబులు వ్యర్థసాధనములు
ఫాలానలకరాళలీలలచే రిపుల్
ప్రగ్గికాలిరి ధర బొగ్గులగుచు

రథము గుఱ్ఱంబులు రథసారథియు ముల్కి
నుండియైనది కార్య మొండు లేదు
అధికారము లోనంగు కథఁజూడ వారల
మన్నించువిధముగా నెన్నఁదగును
గీ. దేవదేవ మహాదేవ దివిజరాజ
నాయకుండ వీవె యంతరుల నేమి చెప్ప
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత. 10
సీ. విధి కపాలంబును వింతగాఁ బేరులై
చాల మీయురమున వ్రేలుచుంట
మీనకూర్మవరాహమానవహరివామ
నం బని నైదుజన్మంబులందు
శౌరిని శిక్షించి శరణన్న రక్షించి
కొమ్ముకర్పరయురు గోమరుపాంక్తి
మును చర్మకోలెమ్ముదృష్టమౌగు ర్తులు
గాఁగ మీరుధరింపఁ గలిగియుంటఁ
గీ. జావు పుట్టుక లేనట్టిస్వామి వగుట
కివియె సాక్ష్యంబులై లేవె భువనములకు
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. గ్రామాధికారిని గని యాశ్రయించిన
దేశవివాదలు దీర్పఁగలఁడె
దేశాధికారిని దినమాశ్రయించిన
లోకవాదము దీర్పు జోకఁగలఁడె

లోకాధికారిని నీకు మ్రొక్కెదనన్న
సర్వేశుపగిది యెఱాలఁగలఁడె
తమతమయధికారతారతమ్యంబులఁ
గొలఁదిగా ఫలమీయఁగలరుగాక
గీ. పశుపతిత్వముగల మీకుఁబలెను పశువు
లైనసుర లోపఁగలరె నెద్దానికైన
భావభవభంగ గౌరివ్యాత్తపద్మభృంగ, రాజిత ...
సీ. బాదరాయణి తాను వారణాసీస్థుల
శపియింపఁదలఁచిన చంద్రమౌళి
కోపించి పొమ్మన్నఁ గ్రోధియై ప్రతికాశి
కట్టినఁ జెడియె నా కాలమందె
పద్మపురాణంబు బల్కెనాఁ డొకకొంత
వ్యాసకాశీఫలవ్యాప్తినొందె
నని స్కాందమునఁ గన్నదదియుఁ గాదనిరేని
వైష్ణవులైనను వ్యాసకాశి
గీ. లోనఁ జావంగఁగోరరు మానుషంబె
హరియట వ్యాసుఁడనఁగను హర్షపడరొ
భావభవభంగ గౌరివ్యాత్తపద్మభృంగ, రాజిత ...18
సీ. హరవృషమధ్యంబునందుండి వ్యాసులు
భుజములెత్తి ప్రమాణపూర్వకముగ
నారాయణునకన్న వేఱెదైవములేఁడు
ముక్తాతికినియను మూర్ఖమతిని

నెత్తిన బాహువు లెత్తినట్లుగ వాక్కు-
స్తంభనంబైనచో ధైర్యమెడలి
ప్రార్థింప హరివచ్చి పరమేశ్వరుఁడు తన
కర్తగాఁ జెప్పినకారణమున
గీ. విశ్వనాథుని గొనియాడి విగతభయుడుఁ
డయ్యె ననిజెప్పె స్కాందంబు నమితముగను
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 14
సీ. దారుకావనఋషుల్ దైవంబు లేఁ డని
గర్వించినను వారిగర్వమణఁప
హరిభార్యగా మీరు నామునిపల్లెకు
వచ్చి నిర్వస్త్రులై వారిమనముఁ
లుభయులు దొంగిల నోర్వక ఘర్షించి
వ్యర్థప్రయత్నులై వారు బ్రహ్మ
కడకేగిచెప్పినఁ జెడితిరి వారలు
హరిహరులనవిని యంతవచ్చి
గీ. శౌరిపీఠంబు లింగంబు మీరుగాఁగఁ
దలఁచి లింగార్చనలుజేసి ధన్యులైరి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పద్మనాభుండును బద్మజుండునుగూడ
ఘర్షించుకొన వారికలఁతఁదీర్ప
దేజోమయంబైన దివ్యరూపంబునఁ
దోఁచితి రదిచూచి తోయజాతుఁ

డరిగె పదముగన శిరముజూడఁగ బ్రహ్మ
నడచెను గనలేక వెడలివచ్చి
నిజకరిస్తె విష్ణు నిన్ను మెప్పించెను
నిజములాడక విధినిందితుండు
గీ. నయ్యె భువిఁ బూజలేకుండ నయ్యె మొగలి
రేకు మీపూజ కర్హంబుగాకపోయె
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. గతజన్మమున మిమ్ము మతిఁదలంపమి తప్పు
తప్పునియీజన్మ తనకుఁజెప్పు
నిప్పుడు మిముఁ గొల్వ నెఱుఁగిటి నిదిముప్పు
ముందుజన్మంబున మొదలెముప్పు
పుట్టుటలేకున్నఁ బూజలే దదితప్పు
తప్పులుమూఁడు నాతలన నొప్పు
తప్పులొప్పులుగాఁగ దయసేయుటే మెప్పు
భక్తసంరక్షణాస్పదుఁడ వెప్పు
గీ. డఖిలలోకేశ సర్వేశ యఘువినాశ
నీటనెత్తుము పాల నేనేటనొత్తు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. లూతయేవేదంబు లూతగాఁజదివెను
శాస్త్రముల్ భుజగ మేచాయజూచె
గజరాజు యేవిద్య గష్టతనేర్చెను
ఎలుక తా నేమంత్ర మెంతజేసె

కాటకోటం బెట్టికవితఁ జెప్పఁగఁజాలె
గోడగూచి యేనీతిఁ బోడమి పెరిగె
నిమ్మవ్వ యేపాటిసొమ్ము నీ కిడెనయ్య
సాంఖ్యతొండఁడు యోగసరణిఁ గనెనె
గీ. శాస్త్ర ముఖ్యంబు లివి భక్తకారణముగఁ
దలఁప మీకృప మోక్షంబు గలిగెఁగాని
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఘనమృకండజుపైనిఁ గల్గినప్రేమయు
గన్నప్పయందలి గౌరవంబు
బసవేశ్వరునియందుఁ బ్రకటమౌ మీదయ
చెన్నబస్వనిమీఁదఁ బన్ను కరుణ
పాల్కురికిసోమేశుపైఁ బడ్డదృష్టియుఁ
జేరమరాయుపైఁ జెలఁగుకృపయు
మలహాణకవిపయి మన్ననగరికాల
చోళరాయనిపైని దాల్చుజాలి
గీ. గూడనామీఁదనుంచు మేజాడనైన
నేఁడు మీపాదములు విడనాడఁజాల
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఫక్కియందును రెండుచక్కనిబొల్లివి
శూలచక్రము లొక్కజాలుగలవి
గొల్లవ్రేతల మానికుంజరసతులను
జెఱిపినా రిద్దఱు శిశువాకట

ఆలిపై యాండ్లను నార్జించుపనికిని
    నుభయలచిత్తంబు లొక్కరీతి
సురలరక్షింపను నరభోజనులఁ జంపఁ
    బూనినా రిరువురిపూన్కిసరియె
గీ. చావుపుట్టుక గలిగినసామిశౌరి
చావుపుట్టుక లేనట్టిసామివీవు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పంచాక్షరీమంత్రపఠనంబు పఠనంబు
    పరమేశునందలిభక్తి భక్తి
శివునిబూజించెడిచేతులు చేతులు
    కరకంఠునకు మ్రొక్కుశిరము శిరము
శ్రీగిరీశ్వరుఁజేర్చుచిత్తంబు చిత్తంబు
    శ్రీగిరిజాధీశుసేవ సేవ
భవుభక్తవరులది భజనంబు భజనంబు
    వామదేవునుతించువాక్కు వాక్కు
గీ. అనుచుఁ దెలియక కొందఱు నఘము లితర
మార్గములఁబోయి పుట్టుచు మడియుచుంద్రు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఇక్షుఖండంబున కెన్నివంకరలున్న
    దానిమాధుర్యంబు దరుగనట్లు
గంగోదకంబులు గలుషంబులైయున్న
    జలమహాత్త్వం బేమితలఁగనట్లు

గోవుపొదుగున నెన్ని గోమారులుండిన
క్షీరంబులకు రుచి చెడనియట్లు
బాలుని పవ్యక్తభాషలై యుండిన
జననిజనకుముద్దు ప్రగ్గనట్లు
గీ. మత్కవిత్వంబునను తగ్గుమాటలున్న
భక్తిరసమధురంబు లోపంబుగాదు
...భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. దీర్ఘాయువులు లేవు స్థిరమతులా లేవు
లేవు శాస్త్రజ్ఞానభాగవతులు
దుశ్చరిత్రలుపోవు దొంగనీతులుపోవు
పోదు కామక్రోధపుంజ మెపుడు
యాగంబులా లేవు త్యాగంబులా లేవు
లేదు సత్సంగతి లేశమైన
పాపంబులాలావు వాపోకలాలావు
లావుకు జన సేవ లతువిధుల
గీ. కలియుగంబిది యీరీతి ఘటనపడిరె
హా మహాదేవయన బ్రోవవా మహేశ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. అఱువదివేలేండ్లు నాయువు తండ్రికిఁ
బదియు నొక్కటివేలు ప్రతికిఁ బట్టి
ముగురుభార్యలతోడఁ దగసుఖించెను దండ్రి
కొడుకు పత్నికుఁడై కుతలమేలె

తండ్రిస్వర్గముకేగి దనుజాలమర్దించె
భూమిలో దశముఖు బొడిచె గొడుకు
ఆదియుగములయందె యాయాయితరముల
తారతమ్యత యెంతొ తక్కువయ్యె
గీ. నాయురర్థబలంబులు నంతకంత
కవనిఁ దగ్గుట కాశ్చర్య మరయఁ లేదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. వాలినిఁ జాటుగాఁ గూలనేసినదాన
నెఱుకవ్రేటున కారి యెగురవలసె
బలినంటఁగట్టినపాపంబునకు రాముఁ
డరిపాశబద్ధుఁడై యడలవలసె
కురురాజకొడుకులఁ గూల్చినయఘమున
హరికులక్షయుఁడౌట జరుగవలసె
మునిపత్నిహత్యకై మురవైరి జగతిలోఁ
బుట్టుచు బెరుగుచు గిట్టవలసె
గీ. నంతవారికిఁ గృతకర్మ మనుభవంబు
గలిగె నింకెవ్వరికిఁ దప్పఁగలదు కర్మ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. శ్రీకృష్ణుభార్య లంచితగుణ లెనమండ్రు
భర్తపోయినమీఁద బ్రతికి రకట?
గోవిందుపిమ్మట గోపికలందఱు
బోయలకవగూడఁ బోయి రకట?

శ్రీహరిచేఁ గర్మదేయఁ బ్రాప్తము లేక
జనుఁ దేర్పఁ డిల్లఁగావలసె నకట ?
పాండవుల్ శౌరికి బంధులు భక్తులై
కడు దుఃఖముల్ గాంచి రకట ?
గీ. అంతవారికిఁ గృతకర్మ మనుభవంబు
గలిగె నింకెవ్వరికిఁ దప్పఁగలదు కర్మ
ఫలభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. అవిముక్తయుండైన నష్టాంగుఁడుగాను
కర్మచే వ్యాధులు [illegible]
భృంగను [illegible] రాముండు [illegible]
సీతావియోగముఁ జెందవలసె
ననుజుఁడు [illegible] బద్ధుండు
[illegible] కాఁగవలసె
గౌతముభార్యను గామించి సురరాజు
తనువెల్ల యోనులై మనఁగవలసె
గీ. అంతవారికిఁ గృతకర్మ మనుభవంబు
గలిగె నింకెవ్వరికిఁ దప్పఁగలదు కర్మ
ఫలభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బ్రాహ్మణ్యమునకుఁ దగు భస్మధారణయును
భస్మోపనిషదర్థమునకుఁ గనరొ
వ్యాసవాల్మీకులు వారి గ్రంథంబులు
భసితమాహాత్మ్యంబుఁ బలుకుచుండఁగ

రో॥ యాగమంబులు ధాయాద భస్మము
గొనియాడుచుండుట మనసు రాదా
వేదముల్ స్మృతులును వివిధంబుల భస్మ
ధారణ ముఖ్యము గాదొ రి వినరొ

గీ. జగతి విప్రులు కొందఱు నిగమ మెఱిగి
భస్మ ధరియింప రట్టిదౌర్భాగ్యగుణము
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజశే...

సీ. ముఖబాహుజాలకును సుఖము త్రిపుండ్రంబు
వైశ్యుల కగుజామి వర్తులంబు
నర్ధచంద్రునిరీతి పార్శ్వంబు సాలక
జాతి యితరులకెల్ల ఖాతి యూర్ధ్వ
పుండ్ర మంచని భస్మ బూయు విధంబులు
బహుగ్రంథములయందుఁ బలుకఁబడియె
నన్యజాతులకైన నాయూర్ధ్వపుండ్రంబు
భస్మచే ననిగదా పథముగలిగె

గీ. జగతి విప్రులు కొందఱు నిగమ మెఱిగి
భస్మ ధరియింప రట్టిదౌర్భాగ్యగుణము
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజశే...

సీ. ఉపనీతుఁడగు వేళ విపరీతమె వరా
భువి నాందిముఖవిప్రభోజనంబు
భస్మధారణ గొంచి పంచశిఖల్ [illegible]
దండంబు ధరియించ [illegible]

మంత్రోపదేశంబు మఱి యగ్ని ముఖమున
గడ చేయునవి దీని క్రమముఁ జూడ
రుద్రచిహ్నలఁ జేసి రూఢిగా ద్విజుఁ డయ్యెఁ
గానిచో బ్రాహ్మడుగాఁ డతండు
గీ. జగతి విప్రులు గొందఱు నిగమ మెఱిఁగి
భస్మ ధరియింప రెట్టిదౌర్భాగ్యగుణమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఉపనయనాగ్నియం దుండుభస్మముఁ దాల్ప
కుండిన సిద్ధిలేకుండు నగ్ని
వైశ్యదేవాగ్నిలోపల నుండుభస్మంబు
ధరియింపకుండినఁ జెడును కర్మ
ప్రేతకార్యములందుఁ బెట్టంగవలె భస్మ
బెట్టకుండినప్రేత తిట్టఁగలఁడు
క్రతుకర్త యగువాఁడు క్రమముగా భస్మంబు
దాల్పఁడేనియు సేయఁదగఁ డతండు
గీ. జగతి విప్రులు గొందఱు నిగమ మెఱిఁగి
భస్మ ధరియింప రెట్టిదౌర్భాగ్యగుణమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...81
సీ. వాల్మీకి కుంభజ వాసిష్ఠ గౌతమ
వ్యాస పరాశర వామదేవ
పర్వత దూర్వాస భరత మార్కండేయ
కణ్వ దధీచ్యాదిఘనమునులును

విధి విష్ణు రవి చంద్ర బుధ బృహస్పతి శచీ
పతి ముఖులగునట్టిపరమసురలు
బలి బాణ రావణ బహుళేంద్ర తారక
శూర పద్మాసుర సోమ హారులు
గీ. భస్మ ధరియించి రని గ్రంథబహుళమున్న
వినియు దెలియరు కొందఱీ వెట్టియేమొ
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. భస్మనిషేవణ భస్మధూళనములు
భస్మధారణమనఁ బరగుమూఁడు
విధులలో స్నానంబు వెనుకజన్మాఘముల్
మొదలంట జెడుటకు ముఖ్యమగును
తనుగుణంబులదోషతతి నణంగింపఁగాఁ
జాలు నుద్ధూళనసంజ్ఞక్రియయు
వేధదుర్లేఖలు వెడలింప మోక్షంబు
లొసఁగ ధారణకును బొసఁగుశక్తి
గీ. భస్మమునుగూర్చి దగుగ్రంథబహుళమున్న
వినియుఁ దెలియరు కొంద ఱీవెట్టియేమొ
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ,రాజిత...
సీ. భూతభేతాళముల్ పారిబుచ్చఁగలశక్తి
బ్రహ్మరాక్షసులను బట్టుధాక
శాకినీగ్రహములఁ గనిరన్నఁగలఠీవి
మోహినీగ్రహముల ముంచునాహా

హీనవైష్ణవు లెల్లఁ జేరరానిమహత్తు
జైనబౌద్ధులఁద్రుంపఁ జాలుగుణము
శాకినుల్ ఢాకినుల్ జడిసెడి రౌద్రంబు
శివభక్తులకు సిరుల్ సేయుగరిమ
గీ. భస్మమునకే కాక యొంటి కీపగిదిగలదె
వినియు దెలియరు కొంద ఱీవెఱ్ఱియేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. తపసియై వనమునకుఁ దర్లిపొయ్యెవేళ
దాశరథియు భస్మధారియయ్యె
మోక్షార్థియై శైవదీక్షఁగొన్నప్పుడు
దాశరథియు భస్మధారియయ్యె
రామలింగము నిల్పఁ గామించినప్పుడు
దాశరథియు భస్మధారియయ్యె
అశ్వమేధముఁ జేయునవసరంబందున
దాశరథియు భస్మధారియయ్యె
గీ. వ్యాసవాల్మీకకావ్యముల్ వసుధలేవె
చూచియుఁ దెలియఁజాలరీచోద్యమేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 85
సీ. భస్మంబు ధరియింపఁ బాపముల్ విడిపోవు
భస్మంబు సిరులీను పరసవేది
భస్మంబు రోగార్తిభంజనకరమగు
భస్మంబు వైరులపట్టుఁ జెఱుచు

 

భస్మంబు త్రైలోక్యపద మబ్బఁగాఁజేయు
భస్మంబు సుగుణముల్ బాదుగొల్పు
భస్మంబు సుజ్ఞానపదముఁ జూపఁగఁజాలు
భస్మంబు మోక్షమన్ ఫల మొసంగు
గీ. సనుచు మొఱలిడు వేదంబు లధికముగను
వినియుఁ దెలియరు కొంద ఱీవెట్టియేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...36
సీ. జలమిశ్రితసుభస్మ మిలను బూయఁగవలెఁ
గాలత్రయంబున ఘనగృహస్థు
తక్కినయాశ్రమతతిసతుల్ బొడి భస్మ
ధరియింపవలె శ్రుతిధర్మ మిదియ
శాస్త్రోక్తమగు విరజాభస్మముఖ్యంబు
హార్షమౌ వైశ్యదేవాజ్యజంబు
గాకున్న శ్రోత్రియాగార హోమాగ్నిదౌ
భూతియు ధరియింప నీతియనుచు
గీ. శ్రుతులు స్మృతులును జెప్పుటఁ జూచి యెఱిఁగి
భస్మధరియింపఁ డొల్ల రీపాపమేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...37
సీ. భస్మధారణవిధి పరిమితిఁజెప్పెదఁ
బంచశిఖల్ వక్త్రబాహుమూల
ములను భ్రూమధ్యమంబునఁ దగునాసికా
మూలంబు ద్వికర్ణమూలములను

యురమున స్తనముల నుదరమందున నాభి
జాను పృష్ఠంబున జంఘలందు
రక్షకోటిరకూబరశ్రోణిగళముల
భుజయుగ్మమున గరమూలములను
గీ. భావములమధ్య నూరువు పాదములను
ముప్పదాఱుగుస్థానముల్ ముఖ్యమగును
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత....
సీ. నియతి రుద్రాక్షోపనిషదర్థములు విని
రుద్రస్వరూపిగా రూఢిగలిగి
యామ్నాయములయందు నాగమంబులయందు
రుద్రాక్షధారణ భద్రమనుచు
సకలవిధుల జెప్పె శాంభవి మొదలైన
శక్తిసంఘము మహానిసముదయంబు
దేవదానవకోటి భావశుద్ధినిదాల్చి
నారుగా రుద్రాక్షపేరు లభవ
గీ. తొలమి రుద్రాక్షధారణ గలుగునరుని
భక్తిగను ప్రెల్లన్నను మోక్షపదవిగల్లు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పదునాల్గుముఖములు పదునాల్గుభేదముల్
పదినల్వు రధిపతుల్ పదియు నాల్గు
విని తూగపద్ధతుల్ తమువున ధరియించు
విధులు పెంపొందింతు విశదముగను...

ముదమొప్పఁగా నేకముఖముఖ్యమైయుండు
నదరుగా దొరకును నచటనచట
నూర్ధ్వమధోముఖయుక్తిని గనవలె
నూర్ధ్వముఖంబైన నొప్పియుండు
గీ. ధన్యమైయుండు రుద్రాక్షధారణంబు
నిగమమంత్రోక్తి బూజింపఁ దగినదగును
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. సకలపాపంబులు సమయింపఁగాఁజాలు
ధరణిలో రుద్రాక్షధారణంబు
సతతంబు కాశివాసముచేయుఫలమిచ్చు
ధరణిలో రుద్రాక్షధారణంబు
నిరతంబు శ్రీశైలనిలయపుణ్యముకొద్ది
ధరణిలో రుద్రాక్షధారణంబు
పరగ శివజ్ఞానపరునిగావించును
ధరణిలో రుద్రాక్షధారణంబు
గీ. రుద్రరూపంబుగా మది రూఢిగల్గి
తనువునందున రుద్రాక్షఁ దాల్పవలయు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. శంకర మీయక్షజాతంబులగుటను
రుద్రాక్షనామంబు రూఢియయ్యె
సంసారదుఃఖముల్ సంహారింపంగను
రుద్రాక్షనామంబు రూఢియయ్యె

దుష్టులదుఃఖించి తొలఁగునట్లుగఁ జేయు
రుద్రాక్షనామంబు రూఢియయ్యె
భవులకు మోక్షసంప్రాప్తిఁ గూర్చుటఁజేసి
రుద్రాక్షనామంబు రూఢియయ్యె
గీ. జగతి రుద్రాక్షతో సరిచేయఁదగిన
పూసలే లేవు కల వన్న దోసమయ్య
భావభవభంగ గౌరివాల్లభ్యశృంగ, రాజిత...
సీ. శంకర దేవేశ జ్వలన పద్మాసన
కాలాగ్ని రుద్రుండు కార్తికేయుఁ
డన వాసుకియు వినాయక భైరవుఁడు శౌరి
యీశాన భాస్కరుఁ డిలమి స్కంద
హరుఁడను పదినల్వు రధిపతుల్ రుద్రాక్ష
లకు నేకముఖ మొదల్ ప్రకటముగను
శ్రీగలరుద్రాక్ష లాగమంబులయందుఁ
గొనియాడఁదగినవి నీకులతలమందు
గీ. శాస్త్రసమ్మతి రుద్రాక్షసరులు దాల్ప
వలయు మోక్షంబునే వాంఛవలయువారు
భావభవభంగ గౌరివాల్లభ్యశృంగ, రాజిత...
సీ. శిఖను నొక్కటియును శిరమున ముప్పది
రెండు మూర్ధ్నిని నమాలఱిన్నుగాను
ముప్పదాఱును కర్ణముల నాఱుఁ గంఠంబు
నందు ద్వాత్రింశతి నమరవక్త్ర ద్రా

మున నైదుశతములు ఘనబాహువులకును
బదియాఱు బదియాఱు బదియు రెండు
బది రెండుగరముల బరగ నష్టోత్తర
శతమతాను జపమాల హితవుమీఱ
గీ. రెండునూఱుల ముప్పదినుండు మెండు
వరకిరీటంబు నీరీతి వలయుఁ దాల్ప
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. శిఖ నేకముఖియును శిరమున ద్వాదశ
ముఖియు నేకాదశముఖియు మూర్ధ
మునకు శ్రుతులపంచముఖి సప్తముఖి దశ
ముఖి షష్ఠముఖి యష్టముఖియుఁ గంఠ
మునకు నురోదేశమునకుఁ జతుర్ముఖి
తగు బాహువులఁ ద్రయోదశముఖియును
ద్వాదశముఖి మణిబంధనంబుకుఁ జతు
ర్దశముఖి జపమాల తనువహించు
గీ. నన్ని ముఖముల రుద్రాక్షులగు కిరీట
మునకు నని తెల్పుకొనరయ్య ముదముమీఱ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కాయశోషణ జేసి కష్టమందుటకంటె
పంచాక్షరీమంత్రపఠన మేలు
కాశిగయాదులు గలయదిరుగుటకంటె
పంచాక్షరీమంత్రపఠన మేలు

పవనబంధనఁ జేసి బాధలొందుటకంటె
పంచాక్షరీమంత్రపఠన మేలు
సాంఖ్యయోగాదులజాడఁ దోఁపుటకంటె
పంచాక్షరీమంత్రపఠన మేలు
గీ. పాపము హరించు ఘనమోక్షపదవినిచ్చు
పరమపంచాక్షరీమంత్రపఠన మిచ్చు
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత... 46

సీ. ధర యజుర్వేదమధ్యతారహారములోన
పంచాక్షరం బనుపతకమలరు
ప్రథమద్వితీయముల్ ప్రకృతియుఁ బిమ్మట
రెండును బురుషుఁడు నుండి కొడువ
సంయోగమగు శివశక్తియుక్తము మంత్ర
ములకెల్ల జననిగాఁ దలఁచవలయు
గురుమూర్తిదయచేర్మిఁ గొని న్యాసధ్యానాది
కములతో జపియింపఁగలదు ముక్తి
గీ. గాన నీమంత్రరాజంబుఁ గాంచి సేయు
వారె మీకాదు రిక వేలుగారు వారు
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...

సీ. పంచాక్షరీమంత్రపఠనవేదియు నచ్చు
నిను వేఁడుకొననేల నీలకంఠ
ఘనతపంచాక్షరీ కల్పకం బిచ్చుండి
నిను వేఁడుకొననేల నీలకంఠ

చిత్రపంచాక్షరీ చింతామణియు గూడ
నినువేడుకొనవేల నీలకంఠ
భవ్యపంచాక్షరీ పారిజాతంబబ్బ
నినువేడుకొనవేల నీలకంఠ
గీ. నిన్ను నన్నుగఁజేయఁగా నేర్చినట్టి
మంత్రరాజంబు దొరకింది మాకుఁకేమి
భావభవభంగ గౌరివ్యాత్పద్మభృంగ, రాజిత...
సీ. మహితపంచాక్షరీ మహిమయుఁ దెలుపంగ
వాణిపతికైన వశముగాదు
మహితపంచాక్షరీమహిమయుఁ దెలుపంగఁ
బలుకుఁజేడియకైనఁ దెలియఁబడదు
మహితపంచాక్షరీమహిమయుఁ దెలుపంగఁ
జిలువఱేఁడైనను బలుకలేఁడు
మహితపంచాక్షరీమహిమయుఁ దెలుపంగ
జంభారికైనను శక్తిలేదు
గీ. గాన పంచాక్షరీమంత్రఘనతఁ దెలుప
మంత్రరూపుండవగునీవు మాకుఁగలవు
భావభవభంగ గౌరివ్యాత్పద్మభృంగ, రాజిత...
సీ. పంచాక్షరీమంత్రపఠనఁ జేసినయంత
బ్రహ్మహత్యాదులు బాయఁగలవు
పంచాక్షరీమంత్రపఠనఁ జేసినయంత
నుపపాతకము లవి యుండఁబోవు

పంచాక్షరీమంత్రపఠనం జేసినయంత
సంసారదుఃఖముల్ సడలఁగలవు
పంచాక్షరీమంత్రపఠనం జేసినయంత
మాతృగర్భావస్థ మఱుగిపోవు
గీ. తల్లి దాతయు నేతయు దండ్రియగుచు
భుక్తిముక్తులు దయసేయుమూల మిదియెఁ
..భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కుంభసంభవువల్లఁ గొనియు పంచాక్షరి
దశరథరాముండు తా జపించె
దూర్వాసుదయ నేర్చి తొల్లి పంచాక్షరి
శౌరియు రాముఁడు జపితులైరి
తండ్రియు దయసేయ తపసియై పరశురా
ముఁడును పంచాక్షరి నుడివెఁగాదె
వరదధీచ్యాదులు గరము పంచాక్షరీ
మంత్రంబు జపియించి మహిమగనిరి
గీ. మంత్రసంతతి కిది మూలమంత్రమయ్యె
నిహపరసుఖంబు లిచ్చుట కిదియె త్రోవ
..భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...61
సీ. పంచాక్షరీ యనుబలువైననావచే
దరిలేనిదుఃఖాబ్ధి దాటవచ్చు
పంచాక్షరీయను ప్రబలమహాక్షురికచే
ఘోయని భవలతల్ గోయవచ్చు

పంచాక్షరీ యనుభానుదీప్తులవల్ల
నిరయమ స్తకమును నణుకవచ్చు
పంచాక్షరీ యనుబహుళవహ్నిచే
ఘనజవనాటవిఁ గాల్పవచ్చు
గీ. మోక్షలక్ష్మిప్రదాయకదీక్షితంబు
మహిని పంచాక్షరియె యన్యమంత్రమేల
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ప్రణవయుక్తంబుగాఁ బంచాక్షరిమంత్ర
పఠనంబు దగునయ్య బ్రాహ్మణులకు
నితరవర్ణంబుల కెల్లసుందరులకుఁ
బ్రణవహీనంబుగాఁ బఠన మేలు
అష్టాదశావర్తి నక్షరలక్షగా
జపియింప సిద్ధినిఁ జెందవలయు
ప్రతిపునశ్చరణకు బ్రాహ్మణభోజనా
ద్యఖిలవిధులుజేయ సుఖముగలుగు
గీ. మోక్ష మఱచేతిదై యుండు దీక్ష లేక
చేసినను మీఱె పాపముల్ చెడుట నిజము
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. గతజన్మసుకృతసత్కారణంబునఁ జేసి
గురుఁడు పంచాక్షరిగరిమ నొసఁగు
గతజన్మసుకృతసత్కారణంబునఁ జేసి
పంచాక్షరీమంత్రపఠనగల్గు

గతజన్మసుకృతసత్కారణంబునఁ జేసి
పంచాక్షరిని సిద్ధిఁ బడయనగును
గతజన్మసుకృతసత్కారణంబునఁ జేసి
పంచాక్షరియె మోక్షపదముఁ జూపు
గీ. దుష్కృతుల కిది గల్గుట దుర్ఘటంబు
సుకృతమతులకు దొరకుట సులభమగును
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పంచాక్షరీమంత్రఫలమె కా క్రీడికిఁ
బాశుపతాస్త్రంబు బడయనగుట
పంచాక్షరీమంత్రఫలమె కా చక్రికి
ద్రౌణియస్త్రజ్వాలఁ దప్పనిడుట
పంచాక్షరీమంత్రఫలమె కా రాముండు
దశముఖుఁ దెగటార్చు దశను గనుట
పంచాక్షరీమంత్రఫలమె మార్కండేయుఁ
డవనిదీర్ఘాయుష్య మమరనుంట
గీ. భారతము శివగీతలు భాగవతము
స్కాందమాదిగ గ్రంథముల్ సాక్షిగలవు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. శైవపంచాక్షరీజపమును ముఖ్యంబు
విపులమంత్రోద్ధారవిధియు వినుఁడు
మొదల నకారంబు ముందు మకారంబు
పిదప శికారంబు గద వివరింప

వాకారము యకారమై ఖరి లిఖియింప
పంచాక్షరంబులై ప్రబలుచుండు
ప్రణవంబుతోఁగూడి భవ్యషడక్షరి
యగునని షణ్ముఖుం డధికప్రేమ
గీ. మున్నుఁజెప్పెను గొందఱు మూర్ఖులగుచు
విప్రు లుపదేశమంద రివింతయేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బ్రాహ్మణజనములు భక్తితోడను లింగ
మును మేనదాల్పుట ముఖ్యమనుచు
వేదాగమంబులు నాదారకను బల్కు
చున్నవిభక్తిచే విన్నఁజాలు
విష్ణ్వాదిసురలును వేత్తలౌమునులును
మణిదారుమృచ్ఛిలామయములైన
లింగముల్ ధరియించి రంగుగాఁ బూజలు
చేయుట వ్యాసులు చెప్పినారు
గీ. ధరను గొందఱు దనులింగధారణంబు
గాకపోవుట వారిదుష్కర్మగాక
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ధర యిష్టలింగంబుఁదగు స్థూలమునకును
సూక్ష్మమునకునౌను శుభము ప్రాణ
లింగంబు మూఁడవయంగమౌకారణ
మున భావలింగంబు ముదమువిూఱ

అంగమందున లింగ మమరుచున్నట్టివాఁ
డనువర్తనుండైన యమునివరుఁడె
అంగమందున లింగ మమరియుండనివాఁడు
వరసోమయాజైనఁ బరమఖలుఁడె
గీ. నసెడియర్థంబు స్కాందంబునందు గలదు
వినరు చదువరు కొంద ఱీవింతయేమొ
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత ...
సీ. తనువులు మూఁటను దగినవస్త్రంబుల
మూఁడులింగంబుల ముడిచికట్టి
ఇష్టంబు ప్రాణమం దింపుగా లగియించి
భారమందునఁ జేర్చి పరిణమించి
తనయందు లింగంబు దాను లింగమునందుఁ
జొచ్చి లోవెలుపల నిచ్చ మఱచి
లింగంబు తానయై లింగవర్తనుఁడైన
లింగైక్యసమరసలీనుఁ డగును
గీ. నట్టిపురుషుని సాంగత్య మతనిసేవ
గలుగు మీకృపగలిగినఘనులకెల్ల
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. అద్వైతసిద్ధైరనాతని ఘటవర్త
నములు ద్వైతంబులై యమరుచుండు
గాని స్థూలాంగంబు గలయంతమట్టుకు
స్థూలలింగంబందుఁ దొలఁగకుండ

ధరియించి పూజింప ధర్మమైయుండును
స్థాలంబు లింగికై శుద్ధిఁ గనదు
కొదువరెంటను నీశుఁ గూర్చితియని చెప్పి
బొదలాది దేవుని బుట్టలందు
గీ. దాచి పూజింపఁదగదు సద్వైతు లిట్లు
సేయ దేవార్చనలు సిద్ధిఁ జెంద వెపుడు
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...

సీ. ద్వైతుఁడై యుండ నద్వైతుఁడైయుండను
దనువర్తనలకును దలఁగనపుడు
తనదైవమెప్పుడు దన కవినాభావ
సంబంధిగా నుంచఁజాలవలయు
నట్లుసేయక సందులందు శెల్ఫులయందు
నుంచి పిల్లలపూజ కుంచి వచ్చి
నామని చెప్పుట నగుబాటుగా కిది
శ్రేష్ఠవర్తనమని చెప్పఁదగదు
గీ. దేవుఁ డెవఁ డైనసరె స్థాలదేహమందుఁ
జేర్చి విడనీక కొల్చుట శ్రేష్ఠమగును
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...

సీ. శివుని ప్రసాదంబు శ్రేష్ఠంబుగాదని
భుజియింపఁ గొందఱు [illegible] సరు
వారుడు [illegible] నైవేద్య మర్పంబుగాదని
[illegible]

జ్ఞానహీనం బిది సత్యవాక్యముగాదు
శివునిపై వేద్యంబు శిరము మొదలు
పాదయుగ్మముదాఁక భక్తితోఁ బూసియు
భుజియించెఁ గృష్ణుండు పూర్వమందు
గీ. ననుచు శ్రీభాగవతమున వినఁగఁ జెప్పె
నిందు మనువారలే బుద్ధిమాంద్యు లకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...64
సీ. పిత్రార్పితాన్నంబుఁ బ్రియ మొప్ప భోక్తలు
బ్రాహ్మణాహుతులు చేయఁ బనికివచ్చు
ధర పితామహుకూడు ధన్యులౌ భోక్తలు
బ్రాహ్మణాహుతులు జేయఁ బనికివచ్చు
ప్రపితామహాన్నంబు భవ్యులౌ భోక్తలు
బ్రాహ్మణాహుతులు జేయఁ బనికివచ్చు
విష్ణ్వర్పితాన్నంబు వేత్తలౌ భోక్తలు
బ్రాహ్మణాహుతులు జేయఁ బనికివచ్చు
గీ. గాని శర్వప్రసాదంబుగాదు గానఁగ
ననెడిదుష్టులమాటలు వినఁగఁదగదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత....
సీ. శ్రాద్ధకాలంబున శ్రద్ధతోఁ బెట్టెడు
పిండత్రయంబుచేఁ బ్రేత లంత
సుగతిగందు రటన్న సూత్రంబు లున్నవి
మధ్యపిండము పుత్రహేతువు దథ్యము

నాపిండ మాకర్త కర్ధాంగి యగుసతి
సేవింపవలె నని చెప్పె శ్రుతియుఁ
దత్ప్రసాదము గొన్న తరుణియు సంతాన
వంతురాలగు నని వార్తగలదు
గీ. శివప్రసాదంబుగొనఁగ నిషిద్ధమెట్లు
భక్తిహీనులవాదముల్ పాటిగావు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత..

సీ. పంచభూతంబులు బరమేశ్వరప్రసాద
మైయుండె వ్యతిరిక్త మైనదెద్ది
అష్టమూర్తులు భవునంగసంభవులైరి
హరప్రసాదులెగాక యన్యులెవరు
చరచరాస్పదమైనజగములో శ్రీకంఠు
వరప్రసాదముగానివస్తువెద్ది
విష్ణు విధాతాది వేల్పులు శివభక్త
పరులుగా కున్నట్టివార లెవరు
గీ. భవప్రసాదమహాత్వంబు భాగవతము
శైవస్కాందాదిగ్రంథముల్ చాటుచుండు
...భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. హరునకు శివభక్తు లర్పించుభూషలు
ఛత్రచామరములు సకలవాహ
నంబులు హారముల్ నానావిధంబుల
వస్తువుల్ నైవేద్యవాసన లవి

యివి యనర్హంబులో నెవ్వరుగొనరాదు
గొనినచో నరకాబ్ధిఁ గూలఁగలరు
శివభక్తులైయుండి శివునిఁబూజించుచు
శివుప్రసాదము దినఁ జెల్లకున్న
గీ. పత్త్రపుష్పఫలంబులు పక్వములును
హరునివేదనభక్తి కనర్హమగునె
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఏమంత్రన్యాసాదు లామంత్రమునకును
దగవనిచెప్పినఁ దథ్యమగునె
యజ్ఞపురోడాశమాయాజులకుఁగూడఁ
దగదనిచెప్పినఁ దథ్యమగునె
పితృశేషమును గర్త ప్రీతిభుజింపంగఁ
దగదనిచెప్పినఁ దథ్యమగునె
శివునిబ్రసాదంబు శివభక్తులకుఁగూడఁ
దగదనిచెప్పినఁ దథ్యమగునె
గీ. యొప్పవచ్చునె యీమాట దప్పుగాక
భస్మరుద్రాక్షధారులౌవారు లధమ
గతికిఁ బోఁగోరి నిందించుకథకుఁ జొరిరి, భావ.
సీ. బిల్వవృక్షముఁజూచి ప్రీతితోమ్రొక్కిన
నరునకు దోషముల్ నశ్యమగును
బిల్వవృక్షంబును బ్రేమతోఁ బూజించు
మనుజుండు సురలకు మాన్యుఁడగును

బిల్వవృక్షము వేసి పెంచినపుణ్యుండు
 హరగణంబులయందు నధికుఁడగును
బిల్వబిల్వమటంచుఁ బ్రేమచే స్మరియించు
 వారిపాతకములు వారితములు
గీ. నని పురాణంబులందున్నఁ గనరు వినరు
కొందఱజ్ఞులు నిది యెట్టిచందమొకొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కాశికాపురమందుఁ గాలభైరవుకన్న
 మకరమందుఁ బ్రయాగమాధవులను
గాంచిన మాంగల్యగౌరిదర్శనమైన
 సేతువుకేగిన శేషగిరియుఁ
బొడగన్నఁ గేదారమున గంగఁ ద్రావినఁ
 గోటియజ్ఞము లొకమాటు సేయఁ
గలిగిన నొకలక్షకన్యల దానంబు
 సేయనబ్బినఁ బుణ్యసిద్ధియంత
గీ. నేకబిల్వార్చనంబున నిత్తునను చుఁ
బాదరాయణి మొదలైనవార లనిరి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బహుశాస్త్రమిని బిల్వపత్త్రంబుతో నిన్ను
 నర్చింపఁ బాతకహరణమగును
శివరాత్రిరోజున భవ నీస్మరణతోడ
 బిల్వార్చనము సేత ప్రీతికరము

లక్షబిల్వార్చన దక్షులై చేసిన
వారన మీరన వేఱులేదు
ప్రతిసోమవారంబు భక్తితో బిల్వంబు
చేఁ బూజసేయ విశేషమగును
గీ. నేకబిల్వమహాత్వ మమేకముగను
బాదరాయణిమొదలైనవార లనిరి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బిల్వవృక్షముక్రిందఁ బ్రేమతో వైశాఖ
కార్తికంబుల భక్తిగలిగి యొక్క
విప్రున కెవ్వరువిందుఁజేసిన కోటి
బ్రాహ్మణభోజనఫలము గల్గు
మారేడుతరుమూలమహిని లింగార్చన
నొకరోజుజేసిన సకలకాల
ములను లింగార్చన సలిపినవాఁడుగా
ఫలమబ్బు సందేహపడితి వలదు
గీ. సత్యమిది సత్యమిదియును సత్యమనుచు
బాదరాయణిమొదలైనవార లనిరి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. మారేడుదళములు నూరిలో లేకున్న
తత్కాష్ఠఫలములు దగునుబూజ
కవియు దొరకమియైన నావృక్షమూలముం
దమరిన మృత్తికనైనఁ గ్రమము

నది యసంభవమైన నస్యపత్రంబులు
మారేడుపత్రిగా మానసమున
భావించి పూజింపఁ బాపముల్ విడి పుణ్య
ఫలమిచ్చు సంశయఫణితివలదు
గీ. సత్యమిది సత్యమిదియును సత్యమనుచు
బాదరాయణి మొదలైనవార లనిరి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. భృగుపత్ని నన్యాయముగఁ జంపినందున
శపియించె భృగుముని శౌరి నపుడు
నదికారణముగాఁగ నాహరి తావచ్చి
పుడమిపై పదిమార్లు బుట్టవలసెఁ
బుట్టుట గిట్టుట పురహరుగొల్చుట
భాగవతము జెప్పఁబడినదయ్యె
మితిమించి పలుమారు కుతలమందునఁ జక్రి
జననమందికథల్ చాలఁగలవు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద తెలకొ మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. జలచరంబులలోన శ్రావ్యముగాఁబోలు
మత్స్యమై జన్మించె మాధవుండు
వేదంబులు హరించువిద్వేషుఁ బొరివుచ్చి
తెచ్చి శ్రుతులు వేధ కిచ్చినాఁడు

మత్స్యకేశ్వరుఁ దనుమారారి నతిభక్తి
భువిని ప్రతిష్ఠించి పూజచేసె
మత్స్యపురాణంబు మన్నించి విని మత్స్య
లంకకుఁజని చూడ శంకదక్కు.
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద తేలకో మిమ్ముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. రెండవజన్మకు దండిదికాఁబోలు
తాఁజేలునయ్యె నాదైత్యవైరి
దైత్యులు సురలును దర్పునంభోరాశి
మునుఁగు తిప్పకు వీఁపు మోపినాఁడు
తూర్పుసంద్రముపొంత నోర్పుతోఁ గూర్మేశు
నిల్పి సద్భక్తుఁడై కొలిచినాఁడు
కూర్మపురాణంబుఁ గూర్మితోఁ జదివినఁ
గూరేశుఁజూచినఁ గునుకవిడును
గీ. ఆదివిష్ణువు శివభక్తుః డగుట నిజము
కొంద తేలకో మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత....
సీ. అడవిమృగములలో వడిగలదని హరి
ఘనవరాహంబుగాఁ గలిగినాఁడు
ఇదియు మూఁడవజన్మ మిందు హిరణ్యాక్షుఁ
జంపి జగతి మేలు నింపినాఁడు

శ్రీవరాహేశ్వరు శ్రీగిరిపై నిల్పి
మించినభక్తి సేవించినాఁడు
ధర వరాహపురాణతాత్పర్యమును వరా
హేశుఁ జూచియునైన నెఱుఁగవచ్చు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱేలకొ మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ప్రహ్లాదుకొఱకు స్తంభంబున నరసింహ
రూపుగా జన్మించి శ్రీపతియును
ప్రహ్లాదుతండ్రిని బట్టి గోళ్లనుజీరి
పరలోకగతునిగాఁ బంపినాఁడు
శేషాచలంబున శ్రీనృసింహేశుని
స్థాపించి పూజలు సలిపినాఁడు
బాదరాయణిపల్కు భవ్యస్కాందము నృసిం
హేశ్వరంబునుజూడ నిపుడుగలవు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱేలకొ మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. లచ్చిపెనిమిటి గొప్పబిచ్చమెత్తుటకునై
అదితికి సుతుఁడుగా నవతరించి
బలిని యాచించియు బలిని బంధించియుఁ
బలిరాజ్య మింద్రునిపరము జేసి

వామనేశ్వరు హిమవంతంబుపై నిల్పి
యర్చించె భక్తితో నహరహంబు
వామనేశ్వరుఁడును వ్యాసగ్రంథంబులు
నేఁడును సాక్ష్యమై నిలచియుండె
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద తెలకో మిముఁ గొల్వకుండు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. నూనసాయకుతండ్రి శుభముహూర్తంబునఁ
బరశురాముం డన ప్రభవమొంది
తరిమి రాజుల నెల్ల తరతరంబులవారి
నిరువది యొక్కమా రేరి చంపఁ
బరశురామేశ్వరం బనఁ బెక్కుచోటుల
శివుని బ్రతిష్ఠించి చేసెఁ బూజ
నతఁడుగొల్చినపురవరునివాసంబులు
జగములోఁ గనుఁగొనఁ జాలఁగలవు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద తెలకో మిముఁ గొల్వకుండు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. దశరథరాజుకు తనయుఁడై శ్రీవిష్ణు
రామనామంబున రహిఁ జెలంగె
వానరసేనతో వారధిబంధించి
దశకంఠకంఠబృందములుఁ ద్రెంచె

శివదీక్షితుండునై శివగీతలు గ్రహించి
పరశివజ్ఞానియై ప్రబలె నిలను
సేతువుదగ్గఱ శ్రీరామలింగేశు
నిలిపి యంతశ్శుద్ధి గొలిచినాఁడు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱేలకొ మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కమలాక్షునంశనే గలిగెను యదువంశ
వార్ధిచంద్రుఁడు హలపాణియనఁగ
దుష్టదానవులను దులిచివేసి యనేక
శిష్టసంరక్షణఁ జేసినాఁడు
విద్యార్థియై పోయి విశ్వేశు పురిలోన
సాందీపుకడఁ దానుఁ జదివినాఁడు
తనపేర లింగంబుఁ దగ వారణాసిలో
స్థాపించి పూజలు సల్పినాఁడు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. వసుదేవసుతుఁడునై వాసుదేవుండన
జన్మించె శ్రీవిష్ణు జగతిలోన
శివునిప్రసాదంబు స్థిరమతి భోగించి
దూర్వాసుకృపఁ గాంచె శోభితముఁ

దలిప్రయాసమునోర్చి మతినిల్పి హరుఁగూర్చి
తపమాచరించుట ధన్యుఁడయ్యె
చక్రంబుగలిగె నవక్రపరాక్రమ
శీలియై వైరులఁ దూలఁబుచ్చె
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కృష్ణుండు కాశిలోఁ గృష్ణేశలింగంబు
నిలిపినాఁ డిప్పుడు గలదు చూడఁ
జంద్రజూటునికృప జాంబవతీదేవి
సాంబునిగనినది సకలమెఱుఁగుఁ
బార్థివలింగంబు పార్థకృష్ణులు పూజఁ
జేయుట వ్యాసులు చెప్పినాఁడు
నరునితోఁ గైలాసనగరంబునకుఁ గృష్ణుఁ
డేఁగి మీకును మ్రొక్కు టాగడంబె
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పూర్వకాలంబునఁ బురుషోత్తముఁడు వచ్చి
పురహరుఁగని మ్రొక్కి పరమతత్త్వ
విధిఁ దెల్పుమనికోర విశ్వేశ్వరుఁడు శైవ
దీక్షితుగాఁజేసి తేజమెసఁగ

పరమగుహ్యం బగుపరతత్త్వమును జెప్ప
నవియు నీశ్వరగీత లనఁగ వెలసెఁ
గూర్మపురాణంబుఁ గోరి చూచిన నందు
నమరు నీశ్వరగీత లఘహరంబు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత....
సీ. కరకంజముఁ బూజింపఁ గమలసహస్రంబు
నిత్యంబు హరికిని నియతమందు
నొక్కనాఁ డొక్కటి లెక్కకుఁ దక్కినఁ
దననేత్రకమలంబు దానవారి
శివునకు నర్పించి శివుని మెప్పించియుఁ
గమలాక్షుఁ డనుపేరుఁ గాంచినాఁడు
ధర మహిమ్నాదులు దత్కథ నేఁటికిఁ
దెలుపుచున్నవిగదా పలుకులేల
గీ. నాదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద తెలియక మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...87
సీ. శ్రీహరియంశను శ్రీపరాశరసూనుఁ
డుదయించి కాశిలో నుండుటయును
విశ్వేశుఁ బూజించి వేదవిభాగంబు
సేయుచో హరుసురి సేయుటయును

దన గ్రంథములయందు తక్కినసురలంత
శివభక్తులని యొప్పి చెప్పుటయును
గొప్పసాక్ష్యం బది కొదువయేమున్నది
పలుమారు తర్కింపఁ బనియుఁ గలదె
గీ. ఆదివిష్ణువు శివుభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు మిముఁ గొల్వకుంద రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. జైనవంశమునందు జన్మించి మాపతి
బుద్ధనాముఁ డనఁ బ్రసిద్ధుఁ డయ్యె
భువనేశ్వరంబున బుద్ధేశ్వరునిఁ గొల్చి
శివభక్తులకు నెల్ల శ్రేష్ఠుఁడయ్యె
బుద్ధేశ్వరప్రసాదభుక్తిలేక యతండు
నేఁడును భుజియింపఁబోఁడు నుండి
శ్రీజగన్నాథంబు సేవింపఁబోయిన
భువనేశ్వరముఁ జూడఁ బోకపోరు
గీ. ఆదివిష్ణువు శివుభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు మిముఁ గొల్వకుంద రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కల్కిజన్మము ముందుగాఁ గలదందురు
గతకల్యుగంబులఁ గల్కివేష
మునురె శ్రీశునకని యనియె గ్రంథంబులు
నాతండు శివభక్తుఁ డగును జగతి

గల్కేశ్వరంబులు గలవు పెన్నానది
తీరమందున మున్ను సారసాక్షుఁ
డారూపమునఁ గొల్చినట్టివె నైయుండు
లేకున్న నా పేరు గాకయుండు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు నిముఁ గొల్వకుండు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. దతుజమూర్తికి ధర్మునకునుబుట్టి
నరుఁడు నారాయణనామములను
బదరీవనంబునఁ బశుపతికై ఘోర
తప మాచరించిరి దనుజవైరి
యంశలువీరలు హరుకృపాకలితులై
ధర్మవిరోధులదండనంబు
సేయఁజాలిరి వీరిచరిత భారతమందు
భాగవతమునందుఁ బలికినారు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు నిముఁ గొల్వకుండు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పాండురంగంబనఁ బ్రబలమైనస్థలంబు
పడమటిసీమలోపలను గలదు
విఠ్ఠలఁ బేరుతో విష్ణు వచ్చటనుండు
నాశ్రితరక్షణాయత్తుఁ డగుచు

శివదీక్షితుండైన శ్రేష్ఠత్వమునఁజేసి
విశ్వలేశ్వరుఁడయ్యె విస్ఫుటముగ
శిరమున లింగంబు ధరియించియున్నాఁడు
వలదన నెవ్వరివశముగాదు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు మిముఁ గొల్వకుండు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బ్రహ్మప్రతిష్ఠలు బ్రహ్మేశ్వరంబులు
ఘనముగా భూమిపైఁ గలవు గలవు
ఇంద్రప్రతిష్ఠలు నింద్రేశ్వరంబులు
ఘనముగా భూమిపైఁ గలవు గలవు
వరుణప్రతిష్ఠలు వరుణేశ్వరంబులు
ఘనముగా భూమిపైఁ గలవు గలవు
సూర్యప్రతిష్ఠలు సూర్యేశ్వరంబులు
ఘనముగా భూమిపైఁ గలవు గలవు
గీ. అట్టివారలు శివభక్తు లగుట నెఱిఁగి
కొంద ఱధములు మిముఁ గొల్వకుండు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. తమపేరు శివునితో దంటించి లింగముల్
స్థాపించి రమరులు దనుజవరులు
భోగులు గరుడులు భూమీశ్వరులు మునుల్
యక్షగంధర్వులు యతులు శక్తి

సంఘంబు సిద్ధులు స్థావరంబులు భూమి
క్షేత్రాళివిచయ మీపృథివిలోన
నాయాస్థలంబుల నాయావిలింగముల్
గనుగొన్నఁ గన్నులకఱ్వుదీఱ
గీ. వీరలందఱు శివభక్తిపారమతులు
శివునిఁ గొల్వక కొందఱు చెడు టదేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. అదితినందనుఁడైన యావామనునిపాద
కమలమందున గంగ గలిగె నదియు
విష్ణుపద్భవయన వెలసినయాగంగ
హరుఁడు జటాజూటమందు భక్తి
దాల్చినాఁ డనియెటిదబ్బఱమాటను
వినరాదు దోషంబు విస్తరించు
గంగపుట్టుక వేలు గంగాధరుండౌట
కారణం బది వేఱుగలదు మొదలఁ
గీ. పూర్వపక్షంబు చెప్పెదఁ బొందుగాను
వెనుక వినుపింతు సిద్ధాంతవివరమెల్ల
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. మునిశాపవృతమైన మురవైరిజన్మముల్
బదివిధంబులు నందు బంచమంబు
వామనంబగు గంగ వామనుపదమున
బుట్టక పూర్వమేపుట్టె జలము

గతకాలమున గంగగనుపడకుండిన
జగమువర్తన మెట్లు జరుగఁబడును
మత్స్యకూర్మంబులమాట నేమనవలె
నీరులే కవి యెట్లు నిలువఁగలిగెఁ
గీ. గాన జలములు బూర్వమే కలవటంచు
నొప్పుకొనవలె లే దింకఁ దప్పుకొనఁగ
... భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బలి వామనునిపాదపద్మముల్ గడుగంగ
జలము లెక్కడనుండి సంభవించె
వటునిపాద బ్రహ్మ యెటులఁ బ్రక్షాళించెఁ
దనవద్ద నుదకంబుఁ దాచకున్న
వామనుండే ముందొ వార్ధిమథనమె ముందొ
కూర్మావతార విరాగుఁడుతుఁ దెల్పు
బలిని జన్మంబులోపలఁగదా యాచించె
జన్మమెట్టుల సాగె జలములేక
గీ. కాన జలములు బూర్వమే కలవటంచు
నొప్పుకొనవలె లే దింకఁ దప్పుకొనఁగ
... భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బలికొఱకై పుట్టుపని తనపనిగాని
కలదె గంగోద్భవకారణంబు
బలియింటికినిబోవుపని తనపనిగాని
కలదె గంగోద్భవకారణంబు

వారలుద్రావిరి వామనుపదముకుఁ
బ్రక్షాళనము కెట్లు పనికివచ్చె
హరి వామనుండైన నా కాలమెన్నఁడు
బంచభూతంబులప్రభవ మెపుడు
గీ. నాలుగవతత్త్వ మిది వటుకాలునోకి
పావనంబయ్యె ననుటిది బాడిగాదు
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఆది కనాదియౌ నా కాలమునఁగదా
గంగ నాదలఁదాల్చెఁ గాలకంఠుఁ
డదితిగర్భంబున హరిబుట్టి యింద్రుని
తమ్ముఁడై నదినంబు దలఁచిచూడ
ధర భగీరథరాజు తనవారికొఱకునై
భాగీరథిని దెచ్చుపర్వమెన్నఁ
గాలభేదంబులు గనుపించె భాగీర
థీజన్మకాలంబె దేవదేవ
గీ. నకును గంగాధరత్వంబు ప్రకటమనుట
నేర కనుమాటలేగాని నిజముగావు
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఆకాశవీధికి హరిపాదమనకును
విష్ణుపాదంబని వెలయుపేరు
శౌరికిఁ గప్పకుఁ జెలఁగి సింహాంబుకు
హరి యనుపే రొక్కటగును జగతి

హరి కప్పంగాఁ బోవఁ డాకాశవీధియు
హరిపాదమని చెప్ప నలవిగాదు
ఆకాశముననుండి నవనికి దిగుగంగ
కను విష్ణుపద్భవ యనఁగఁ జెల్లు
గాక హరికిని గంగ కలుగలేదెన్నఁడు
గలిగినదనుమాట కల్ల కల్ల
గీ. బ్రహ్మ నడిగిన నీ రిలఁబడిరొ నదియె
విష్ణుపది యనునదియునై వెలసెనేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. భాగీరథినిజూచి భక్తితో నర్పింప
శుద్ధుఁడౌననుట ప్రసిద్ధిగలదు
భాగీరథికిఁబోయి భక్తిస్నానముఁ జేయ
శుద్ధుఁడౌ ననుట ప్రసిద్ధిగలదు
భాగీరథీజలపానంబుఁ జేసిన
శుద్ధుఁడౌ ననుట ప్రసిద్ధిగలదు
భాగీరథినిగని ప్రస్తుతి జేసిన
శుద్ధుఁడౌ ననుట ప్రసిద్ధిగలదు
గీ. పరమభాగీరథికి హరిపాదమనను
సిద్ధిగల దను శాస్త్రప్రసిద్ధి లేదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. భాగీరథినిజొచ్చి ప్రాణంబువిడిచిన
శుద్ధుఁడౌననుట ప్రసిద్ధిగలదు

భాగీరథిని శల్యపాతంబుఁగల్పిన
శుద్ధుఁడౌనసుట ప్రసిద్ధిగలదు
భాగీరథినిఁ బిండపతనంబుగల్గిన
శుద్ధుఁడౌనసుట ప్రసిద్ధిగలదు
భాగీరథినిఁ దిలల్ బట్టి తర్పణమేర్చు
శుద్ధుఁడౌనసుట ప్రసిద్ధిగలదు
గీ. పరగ భాగీరథికి హరిపాదమునను
సిద్ధిగల దనుశాస్త్రప్రసిద్ధి లేదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. సరయువులోఁబడి చనియెఁగా రాముండు
తనపాదపూతయై తగియెనేమొ
వార్ధిలో హరిబడి వరదనువచ్చుట
తనపాదపూతయై తగియెనేమొ
పరశురామునితండ్రి పరభుక్క్రియలకుఁ
దనపాదపూతయై తగియెనేమొ
దివ్యతిరుపతులందు దేవార్చనములకుఁ
దనపాదపూతయై తగియెనేమొ
గీ. గంగచే హరి పూతుఁడౌ కతలుగలవు
గంగ శౌరిపదంబునఁ గలుగుటెట్లు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఆదికాలంబున నంబిక హరినేత్ర
కమలములఁ మూసిన కావునైరి

ఫాలనేత్రము విప్ప ప్రళయాగ్ని జగములఁ
బర్విన హిమసుత భయమునంది
కనులమూతయు మాని కరములు దివియఁగా
నానందజలములు నంగుళములఁ
బదియుఁజాఱెను నవి పరగ నాపస్తత్వ
సంబంధు లీరీతి సంభవించి
సీ. గంగ జగములు ముంపఁగ నంగజారి
సురలు వేఁడిన నిడె జటాజూటమందు
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కమలాసనుఁడు మది గర్వించి మించినఁ
దలద్రుంచిన [illegible] తలయుఁబోయి
నాల్గుమోములతోడ నా విధాతయు బ్రహ్మ
మేరమీఱక తాను మెలఁగుచుండె
బ్రహ్మను వలఁగొట్ట బ్రహ్మహత్యయు శివు
నంటినదని శాస్త్రములందు రకట
బ్రహ్మ చావని దెట్లు బ్రహ్మహత్య ఘటించుఁ
జచ్చిన మఱిగదా వచ్చుహత్య
గీ. యనుచుఁ దెలియంగఁజాల రాయంగహీన
తయును మృతియౌనె పరికింపఁదగదె దీని
... భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. గంగలోఁబడి ద్విజుల్ గాలంబుఁ జేసిన
గంగకు హత్యయు గలుగదయ్యె

నగ్నిలో విప్రులు నాహుతులైనను
నగ్నికి హత్యయు నంటదయ్యె
పడమటిగాడ్పుకు బ్రాహ్మణుల్ జచ్చిన
గాలికి హత్యయు గలుగదయ్యె
భూమిగ్రుంగిన గొప్పభూసురుల్ మడసిన
భూమికి హత్యయుం బొందదయ్యె
గీ. గాని వాణీశు నొకతల గత్తిరింప
నెట్లుదవిలెనొ హత్య యీనీతియెట్లొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. ధరదినప్రళయము జరిగినప్పుడు విప్ర
సంఘమరణము లెన్ని జరుగలేదు
బ్రహ్మప్రళయమునందు బాడబుల్ బహుమంది
ప్రాణహింసను బొందఁబడఁగలేదొ
విష్ణులయంబున వేదవేత్తలు చాల
జీవముల్ విడుచుటఁ జెల్లలేదొ
ప్రళయకర్తృత్వము బరమేశునకుఁదక్క
నొరులకు లేదన్నయుక్తి వినరొ
గీ. యెప్పుడును హత్యజెందక తప్పుసేయు
విధిని దండింప హత్యను విధులుగలవొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. కండకావరమున గర్వించి నిందించు
నట్టిదక్షుని తలఁగొట్టినపుడు

మీరిచ్చువరమున మీశిరంబునఁ దన
కరముబెట్టెదనన్న బలుగుఁజూపి
వైకుంఠమునకేగ వైకుంఠుఁ డాశత్రుఁ
బరిమార్చినను మీరు బ్రతికినార
లని భాగవతమున ఘనమనిజెప్పెను
సత్యమిది యనినమ్మఁజాలినట్టి
గీ. యితరసాక్ష్యంబులా లేవు నిందుకైనఁ
బూర్వపక్షంబు లిత్తు నపూర్వఫణితి
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. మృత్యుంజయత్వంబు నిత్యత్వకాలాంత
కత్వంబు మీకును గలదటంచు
వేదాగమంబులు వినుపించుచున్నవి
యనృతంబులనగను నలవిగాదు
పుట్టుకగలవారు గిట్టకదప్పదు
పుట్టుటలేనిచోఁ గిట్టుటెట్లు
కోరిన నిచ్చిన మారక నిశ్చయు
లగువారి కుపయోగ మగునుగాక
గీ. వృకున కిచ్చినవరమున నకట మీకు
భయముగల దన తగుహేతుపథము లేదు
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. వరము వేఁడు వృకుండు వానిశిరంబును
వానికరస్పర్శవలన బ్రక్క

లగునట్లు కోరెడు నడుగక యిచ్చుట
పొసగదు యీమాటపొందిలేదు
వానిశరణ్యపలనవె వానికి
మృతిగల్గె ననుమాట సతముగాదు
పొసగింపుకథ గాన పసలేనిరీతులు
గలుగ నుడివెనందు దలఁపవచ్చు
గీ. వీరభద్రునికథవలె వేదమందు
వృకునిచరితంబు నిజమైనప్రకటపడదె
భావభవభంగ గౌరివ్యాత్తపద్మ భృంగ, రాజిత..
సీ. ధరలోన నే దేవుఁ దలఁచి జపించిన
వచ్చి ప్రత్యక్షమై వారిమనవి
యంతర్హితముగను ...
యంతర్హితుం డగునట్టి శక్తి
గలవాని కేటికి వలసెఁ బరాజితుం
డగుటకు వృకునకుఁ దగనొసంగు
వరముఁ బరీక్షింప వైకుంఠమునకును
వచ్చిన వైకుంఠవాసుఁ డడలి
గీ. తలఁప దయఁజేసి వృకుఁజంపఁ గలుగుశక్తి
నతనికిచ్చితి రని చెప్పవగును గాక
భావభవభంగ గౌరివ్యాత్తపద్మ భృంగ, రాజిత...
సీ. శాస్త్రప్రకృతమైన శ్రమలనుభవించుట
ప్రబలవైరులగని పారిచనుట

శంకరుగృపచేత జయములనొందుట
గర్వించి శిషులగనుట మనుట
భాగవతమున హరిపాటులు బలుమాఱు
గనుజెప్పకయె మాన తనకు వల్ల
లేక బోవుటనుండి యాకవిహృదయంబు
క్షోభించి తన కిదేలాభ మనుచుఁ
గీ. బూని బదులుగ వృకకథ లేనిదొకటి
జేర్చియుండిన నిజమని చెప్పరాదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. మింటిపురములమూటి మంటగలిపిననీదు
కంటిసెగల్ వృకుఁ గాల్పఁదగవె
పలుమాఱు బ్రహ్మాండవిలయాగ్నులౌ నీదు
కంటిసెగల్ వృకుఁ గాల్పఁదగవె
పుష్పబాణుని మేను బూదిఁజేసిననీదు
కంటిసెగల్ వృకుఁ గాల్పఁదగవె
వృకునకు వరమీయ వృకుఁడు ని■బాధింప
నొరులు నివారింప నుండిరంట
గీ. నమ్మఁగా రాదు నిజమైనకమ్మవిల్తు
దండ్రి మీకును భార్యయౌతటిని గలుగు
ప్రేమచే దక్కువకు నోర్చి కామివగుచుఁ
గీర్తిపరుఁ జేయ నారీతిఁ గెరలితేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. శూరపద్మునకంటె శూరుండుగాఁ జెప్పఁ
దగదు వృకాసుర జగతిలోన
సింహవక్త్రునకన్న శ్రేష్ఠుండుగాఁ జెప్పఁ
దగదు వృకాసుర జగతిలోనఁ
దారకాసురుకంటె దండివాఁడని చెప్పఁ
దగదు వృకాసుర జగతిలోన
వృకునకు వరమీయ వృకుఁడు నిను బాధింప
నౌరులు నివారింపఁ జరితయగుట

గీ. నమ్మఁగారాదు నిజమైనకమ్మవిల్తు
దండ్రి మీకును భార్యయాతరిని గలుగ
ప్రేమచేఁ దక్కువకు నోర్చి కామినగుచు
గీర్తిపరుఁ జేయ నారీతిఁ గొరలితేము
భావభవభంగ గౌరిహృత్పద్మ భృంగ, రాజిత...

సీ. అష్టమూర్తులు భవుసంగసంభవమని
వేదముల్ బలుకుట వినియు వినియు
బద్మసంభవునకుఁ బరమేశ్వరుఁడె పుత్త్రుఁ
డని చెప్పెదరు కొంద అధమమతులు
విధిసూనుఁ డను పేరు విశ్వేశ్వరునకును
నమర నిఘంటులలో నమరవలదె
నగచాపుని సహస్రనామంబులందైన
స్రష్టజుఁడను పేరు జరుగకుండె

గీ. శ్రుతుల నీవార్త వినరాదు సతముగాని
వాదములు సేయవలదన్న వారువినరు, భావ...

సీ. స్రష్టముఖంబున సాక్షాత్కరించిన
జనకత్వ మతని కేసరణిగలదు
స్తంభమందు నృసింహసంభవం బయ్యెఁగా
స్తంభంబుహరికిని దంష్ట్రియగునె
స్తంభంబునకు శౌరి తనయుఁడంచన బల్క
వచ్చునె యీమాట మెచ్చఁదగునె
యిట్టిలత్యంబులు గట్టిగాఁ బరికింప
కున్న లాభం బేమియున్న దిందు

గీ. ధాత యతిభక్తి మిమ్ముఁగూర్చి తపసియైన
నతనిముఖమందుఁ బ్రత్యక్ష మైతిరంట, భావ...

సీ. వసుదేవనందను వాసుదేవుండని
పిలచినట్లుగ మిమ్ముఁ బిల్వఁకుండ్రె
యదితిసూనుని నింద్రు ననుజన్ముఁడాయని
పిలచినట్లుగ మిమ్ముఁ బిల్వఁకుండ్రె
పద్మమం దుదయింపఁ బద్మజుఁడాయని
పిలిచినట్లుగ మిమ్ముఁ బిల్వఁకుండ్రె
దశరథపుత్రుని దాశరథీయని
పిలచినట్లుగ మిమ్ముఁబిల్వఁకుండ్రె

గీ. ధాతకును మీరుపుట్టుట తథ్యమేని
నిజమె లింగక యనుట దుర్నీతిగాక, భావ...

సీ. భాగవతంబునఁ బాశికుండై కవి
వాస్తవంబులు గొన్ని వదలినాఁడు
పెక్కుశేటికి లెక్కఁబెట్ట వ్యర్థపుశ్రమ
నొక్కటి నుడివెదఁ జక్కఁగనుఁడు
దత్తాత్ర్యంబుకు దనుజారివచ్చిన
లేదనిచెప్పను గాదు నిజము
వేదమం దీకథ విరళమైయున్నది
వేగమై వీరుండు విష్ణుశిరము
గీ. వెఱచి యాహవనీయాగ్ని వేసె ననుచు
శ్రుతియుబలుకఁబోతనచూడఁడేమొ, భావ...
సీ. పద్మాక్షుఁ డొకతరి పద్మాక్షియై సుధా
భాగనిర్ణయమునకు బారపడెను
విష్ణుప్రకృతి భగవిధము రూపంబని
వేదాగమార్థంబుల వినఁగవచ్చు
శివుడు పురుషుండని చెప్పెను శ్రుతులన్ని
ప్రకృతియుఁ బురుషులు భావశుద్ధి
గన నభేదులు భేదగతులునై తోఁతురు
మాన్యమోహినికిని మగఁడవీవ
గీ. కాన నిన్నభిలషించిన గలిగెఁ గొడుకు
కూఁతురా మోహినికివారు గుఱుతుగార, భావ.
సీ. మోహినీదేవికి మొదటిబిడ్డండయ్యె
భైరవుం డతఁడెల్ల భువనములకుఁ

ముద్దుకూఁతురుగదా మోహినికిని శా_స్త
కువలయేక్షణ లెల్ల కోవెలలకు
నధికారులై యుంట యందరెఱిఁగినపని
కాదన లేదన గలుగ నెవరు
ఆయన్న చెల్లెండ్రు హరిరాణి నే వావి
పిలువంగ వలయునో పలుకరెవరు
గీ. విష్ణు శివునకు భార్యయై వెలసెనని యు
ధర మహిమ్నంబు జెప్పుటనరులువినరొ,భావ...
సీ. భృంగాఖ్యుఁ డనెడువాఁ డంగనయైసంతుఁ
గనుట భారతమందు గలుగలేదొ
యిళుఁ డింతియై గురు నిందుపుత్త్రునిగూడి
సంతతిగను టదిసతముగాదొ
వీర లిట్లగుటకుఁ గోరిరె యాదిమ
దంపతుల్ జేసినదారిగాదొ
తన ప్రకృతులై యున్న దనుజారి నారీతి
స్త్రీనిజేయ సుఖంపఁ జేతగాదె
గీ. మోహినియు శివునిమాయలో ముంచెనసుడు
విష్ణువాదులు జెప్పుట వట్టిగాక, భావ...
సీ. శ్రీయుద్భటారాధ్య శేఖరుం డగువీర
భద్రాఖ్యగురుకరభవ్యశిరుడ
గురులింగజంగమచరణసేవానంద
శైవ్రూఢ సంప్రాప్తషట్స్థలుండ

దేశికానుగ్రహాదివ్యలింగాంగైక్య
సంధానసమరసంపదుఁడను
త్రివిధప్రసాదానుభవయోగసుఖకర
విమలహృత్కర్ణికావికసనుఁడను
గీ. భువి శొంఠిరాజు వేంకటశివుఁడనంగ
వెలసి రచియించితిని బ్రోవవలయు దయను, భావ. 126

సీ. మత్కావ్యకన్యను మనువాడవలెనని
తలఁచితి వీకన్న ధన్యులెవరు
సురలంత తక్కువతరము కులములయందు
భుజగభూషా నీవె భూసురుఁడవు
సిరికి నీకన్నను శ్రేష్ఠులెవ్వరు వెండి
బంగారుకొండలపతివి గావె
శాశ్వతుల్ గారయ్య సకలవేల్పులు శ్రుతి
సిద్ధంబుగాను శాశ్వతుఁడవీవె
గీ. కనుక నిచ్చితి మత్కృతికన్యనిపుడు
గొనియు సల్లాప సౌఖ్యంబు లనుభవింపు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ
రాజితశుభాంగ రేపాలరాజలింగ. 127

రేపాలరాజలింగశతకము
సంపూర్ణము.

---

# పీఠిక.

ఈశతకమును రచించినది దిట్టకవిరామచంద్రకవి. ఇతఁడు కాశ్యపసగోత్రుఁడు. రంగారాయచరిత్రమువ్రాసిన నారాయణకవికుమారుఁడు.

రఘుతిలకశతకము కందపద్యములలోఁ గడుమనోహరముగా వ్రాయఁబడినది. కవి నిరర్గళధారాశోభితుఁడగుటచే భక్తిరసము గురియునటులఁ జక్కనిపోకడలతో శతకముఁ బూర్తిచేసియున్నాఁడు. ఒకపద్యమును జదివితిమేని శతకమంతయుఁ బూర్తిచేయనిది తోఁచనంత సరసముగా నీశతకము వ్రాయఁబడినది. ఇందలిపద్యములయందు శ్రీరాముని దివ్యలీలలు సజీవముగాఁ జిత్రితములై యుంటచే ముముక్షువుల కియ్యది ముఖ్యముగాఁ బఠనార్హముగా నున్నది.

ఈకవిజీవితము విపులముగా మహిషాసురమర్దని శతకములో నుంటవలననిచట నుదాహరింపక మానితిమి. రామాయణమునందలి ముఖ్యాంశములు శ్రీరామునిదయాశాంతాతిమానుషలీలల నుద్బోధించునంశము లొక్కటొక్కటి యొక్కొక్కపద్యమున మనోహరముగాఁ గూర్పఁబడియున్నందున

ఖద్యములన్నియు భక్తులకు సంతోషకరములనుటకు సందియ మించుకేనియుఁ గలుగదు.

శతకమకుటము చక్కనిగమనికతోనుంటవలనను బద్యమును దదనుగుణముగా ధారాశోభితమైయుం టవలనను శతకవాఙ్మయమున కిదియొకవిశేష మని చెప్పనగును. ఈయమూల్యాముద్రితశతకము మే మెత్తులుత ప్రచురింపఁగలుగుట మాయదృష్టము.

ఈశతకమాతృక మాకొసంగి గ్రంథముద్రణము నకు సానుభూతిఁ జూపిన శతకకర్తవంశీయులగు మ-రా-రా-శ్రీ, దిట్టకవి సుందరరామయ్యశర్మ పాక యాజిగారి యెడఁ గృతజ్ఞులము.

నందిగామ. } ఇట్లు,
1-1-25 } శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

దిట్టకవి రామచంద్రకవికృత

# రఘుతిలకశతకము.



క. శ్రీరామా యనినప్పుడు
కోరిక ఫలియించె. మాకుఁ గోసలతనయా
దారక మార్తాండకులో
ద్ధారక రఘుతిలక నిటలతటనటదలకా. 1

క. నానాఁటికి నానోటికి
తేనై చెఱకై యనంటి తెలుఁగై వెలుఁగై
యానందమొసఁగు నీయభి, ధానము... 2

క. నాతల్లి జానకీసతి
నాతండ్రివి నీవు మీకు నందనుఁడను న
న్నే తెఱఁగునఁ బ్రోచెదొ సం, త్రాతవు... 3

క. ఎల్లజగంబుల కాదిమ
వల్లభుఁడవు పోషకుఁడవు వర్ణించెద ని
న్నుల్లము రంజిల్లఁ గుభృ, త్తల్లజ... 4

క. తీండ్రించు మొదటి వెలుఁగని
యం ద్రార్యులు నిన్ను మినుకులట్టులఁ బలుకఁగ
గుండ్రాతి నాతిఁ జేసిన, తండ్రీ... 5

క. కలుషాజవంజవార్ణవ
ములు దాఁటఁగ నిఁక నుపాయములు దొరుకవు నీ
విల సన్నుతిదక్కఁగ నిను, దలఁతుక... 6

క. ధరణిం బురణింపఁగ నీ
కరణిం గరుణించుదొరలు గలరె? గుణమణీ
భరణీ దురితమహార్ణవ, తరణీ రఘు... 7

క. పాటించి నిన్నె కొలిచెద
హాటకగర్భాండకల్పనానూనమహా
నాటకవిశిఖవిపాటిత, తాటక... 8

క. శశిధరవిధిముఖులకుఁ బ్రా
యశముగ నీయశము పొగడనగునే? యుగప
ద్దశవిశిఖగళితదశగళ, దశగళ... 9

క. దండము భవదంఘ్రులకు న
జాండసహస్రాద్భుతప్రదాయకపటుదోః
ఖండీకృతభీమధను, ర్దండా... 10

క. గర్గాదివినుత బ్రోవవె
భర్గసమాదగ్రరూపభార్గవఘటిత
స్వర్గపథమథనవిలస, స్మార్గణ... 11

క. ఈహా భవన్నుతియొడ నా
కాహావసమయప్రకల్పితానూనజగ
న్మోహనరూపహనూమ, ద్వ్యాహన... 12

క. వర్ణింతు నీగుణంబు లు
దీర్ణమహోముక్తి కామధేనుసమూధః
పూర్ణపయఃపుషితాశ్రిత, తర్ణక... 13

క. కల్యాణమతివిగద కా
సల్యాసద్గర్భజలధిశశధర నీని
స్తుల్యచరిత్రము త్రిజగ, త్కల్యము... 14

క. అజ్ఞానలవముపోకని
ప్రజ్ఞావిభవంబు నాదుభావంబున కీ
వాజ్ఞాపింపవె పాలిత, తదజ్ఞా... 15

క. స్వామీ యేమనిపొగడుదు
నీమహిమ లనంతములు మనీషకుహితమై
కామించితి నీయడుగుం, దామర... 16

క. 'రామా' యనువర్ణద్వయి
లో మఱిపాపములం దోలు లోనికిచొరకుం
డా 'మా' కవాటమగు శుభ, ధామా... 17

క. నీయంతప్రభువు కలుగుట
కే యుపమలనోఁచిరో సుమీ జగతిం ద్రే
తాయుగమర్త్యులు హితఫల, దాయక... 18

క. నాయయ్య నీవు జానకి
నాయమ సౌమిత్రి నాచినయ్య కుశలవుల్
మాయన్నలు నీవాడఁగ, దా యిఁక... 19

క. సంసారరిరంసాపరి
పాంసుజలము విడిచి మోక్షఫలసుధ దెలుపన్
హంసము తారకమంత్రో, త్తంసము... 20

క. పేర్చినకృపచే నను నీ
కూర్చినసేవకులలోనఁ గొండొకనిగ నే
ర్పర్చవె నీకథ లీచెవిఁ, దార్చితి... 21

క. ఏనోము నోఁచినను నీ
మానితపాదాబ్జభజన మదినోఁచవలెన్
లేనియెడ విడునె కర్మవి, తానము... 22

క. ఆసించితి భవదర్చా
భాసురభాగ్యానుభవము భావంబున నేఁ
జేసినతప మెట్టిదో నీ, దాసుఁడ... 23

క. పరులకు నేఁగా నిక నై
న్నొరు తెవ్వరు గడనసేయ రోపికచే నీ
పరసి భరియింపవలె నా, దరణన్.... 24

క. సరసిజభవునకు దుర్లభ
మరయఁ గ్రియాధర్మములకునైన నశక్యం
బిరవుగ నినుబొగడఁగ నా, తరమా... 25

క. వెలయ రసజ్ఞకు రుచిగాఁ
జెలఁగును నీనామభజనఁ జేసెద నోహో
నిలచి మెలంగవె యిఁక నా, తలఁపున... 26

క. ఏతపమువనో నీని
ర్హేతుకసంజాయమానకృపవలననో నీ
ఖ్యాతిమదిగలిగె నోశివ, తాతీ రఘు... 27

క. ఓపరమపురుష శుభమయ
ప్రాపయి రక్షించునీదుపదభజనాని
క్షేపము నామదిలోపలఁ, దాపితి... 28

క. అన్యునిగాఁ జూడకు నను
మాన్యునిగావించి బ్రోవుమా పరహితసౌ
జన్య మొనగూర్చి కరుణా, ధన్యా... 29

క. మునుపటితనువున నిను గొ
ల్వనిదోసముచే జనింపవలసె నిపుడు గొ
ల్చినవాఁడనైతి నీకృపఁ, దనువుము... 30

క. మునుజేసిననేరము మ్రొ
క్కిన మఱతువు ధనము లర్థి కిడి మఱతువు న
న్నును నట్ల మఱువవము నీ, తనయుఁడ... 31

క. వినయవివేకము లెఱుఁగని
మనుజాధము నన్నుఁగరుణ మన్నింపవె రా
దనుజాంతక రామాదశరథ, తనయా... 32

క. దండితదృప్యద్రిపువే
దండాదండధరు దరిమి దయచే నను నీ
దండకుఁజేర్పవె ధృతకో, దండా... 33

క. నేర్పున నోర్పున సిరు లొన
గూర్పఁగ దరిఁజేర్ప నీవగుణనిధివి యశం
బేర్పడ సుందరతాశత, దర్పక... 41

క. బంధురకరుణాపూరధు
రంధరుఁడని నమ్మినాఁడరా నాయెడలం
దంధనము చేయకు సుహృ, ద్బాంధవ... 42

క. నేమమున నిన్నుఁ గొల్చితి
పామరుఁడను గరుణఁజేసి పాలింపవె యిం
కేమర నీయడుగుం దెలి, తామర... 43

క. బంధురతరైహికాంధుగ
తాంధుం దరిఁజేర్పవే దయారసవల్లిం
బంధించి తిగిచి వేయకు, దంధన... 44

క. మెఱువు సురోహిత మిరుగడ
దొరసిన ఘనమనమహీజతో లక్ష్మణుతోఁ
బెరయ్యునినుఁ జూచుటెపుడో, తతి యిఁక...

క. సరిగలరె శూరు లిఁక నీ
కరయంగాఁ బరశురామునంతటిజోదుం
దురమున వెఱపించితి వి, ద్ధరణీ... 46

క. కరుణింపవలయు నే నీ
వరసుతుఁడను నెనరుగూర్పవలెఁ దండ్రివి నీ
వరయ ననుఁ గన్నతల్లియె, ధరణిజ.... 47

క. నెఱి బ్రత్యక్షుండై వసు
వెలుపల మనిపలికి కరుణ వెదజల్లి కరం
బిరిసిన దురితంబుల విడఁ, దఱుమవె... 48

క. తీఱదయా ధీర దయా
సారము వెదజల్లి నన్ను సాకఁ గయున్నఁ
వారక భవకలుషం బఘ, తారక... 49

క. ఆదుకొనవైతి విదివఱ
కాదిమదైవాగ్రయాయి యాలంకోరీ
యాదోధిమధ్యసేతూ, త్పాదన... 50

క. ఓయయ్య రాఁగదవె నా
చాయకు ఫలదానవిహితతోబరిసద్యః
శ్రేయస్కర నిశ్శ్రేయస, దాయక... 51

క. ఇప్పటికి నీదుహృదయం
బప్పా నాయెడలఁ గరుగదా యెంగద న
న్నెప్పుడు బ్రోచెదవో దయ, తప్పక... 52

క. నాయెడల నీకు దయరా
దా యేఁగదా పరమనియమతాపసనిచయ
శ్రేయోభూయోజయసం, ధాయక... 53

క. ఇంకను దయరాదా నీ
కింకరుడెస హితవిశేషకృతకోపాలని
శ్శంకానుక్రోశనిశా, తంకక... 54

క. కొఱగానిబుద్ధి నెఱిఁగి
యెఱుఁగక నేజేయునట్టిహీనపుఁబనులన్
పెరిగినదురితలతల్ తెగఁ, దఱుఁగవె... 55

క. ఎన్నిదురాశలఁ బొరలినఁ
బున్నెము రానేర దాదిపురుషుని నిను బు
ద్ధి న్నిలిపినాఁడ విజయో, త్పన్నా... 56

క. తనలేమి యొరులకలిమికి
జనుఁడు వెతంగుడుచుఁ బూర్వజన్మంబునఁ జే
సినఫలమెంతో యంతియ, తనగతి... 57

క. ఖలమతులనైన సిరులన్
బొలుపొందిన పుణ్యులండ్రు పుణ్యులనైనన్
గలుగనిచోఁ జులుకనఁగాఁ, దలఁతురు... 58

క. స్నిగ్ధభవత్పద భజనా
దుగ్ధరసం బెఱుఁగనేరుతురె మోహార్ఝురి
దిగ్ధులు సంసారానల, దగ్ధులు... 59

క. ఉడుత యొకఁ డిసుము సేతువు
నిడినంతనఁ గరుణ జేసి యేలితివఁట యీ
యెడ నాయెడఁ గృపసేయుట, తడవా... 60

క. శరణన్న యంతమాత్రనె
పరికించి విభీషణునకు బహుంతరవిభవ
స్థిరసుఖ మొసఁగినయఖిలో, త్తరుఁడవు... 61

క. పగఁజేసిన కాకాసురుఁ
దెగఁజూడక ప్రోచినట్టిదేవర వని నిన్
బొగడిన నను బ్రోవమి యిది, తగునా... 62

క. ఖగము లొకరెండుబోరఁగఁ
దగవును బాలించి వానిదరిఁ జేర్చిననీ
యగణితకరుణావృతికే, తగనో... 63

క. బాఁపఁడు గొట్టినశునకము
వాపోవుచు మొఱలుబెట్ట వాత్సల్యముచేఁ
బాపితివి నివిరి మానస, తాపము... 64

క. వాలంపగములతాకునఁ
దూలి సముద్రుండు వేఁడఁ దోడని వానిన్
లాలించితి వహహా నీ, తాలిమి... 65

క. బవరమునఁ బడినకోఁతులఁ
బవనజుచే మందులొసఁగి బ్రతికించిన మే
టివి యల్పమె నీకరుణా, ద్రవిణము... 66

క. తపమొకశూద్రుఁడుచేసిన
నెపమున విప్రసుతుఁ డీల్గ నెఱి జీవితుఁగాఁ
గృపఁజేసితి వతులశుభ, స్థపదా... 67

క. నీటన్ ఱాల్దేలుట విపి
నాటులు భటులౌట గలుగునా భువి మున్నే
నాటన్ గాదువా మఱినీ, ధాటికి... 68

క. నిరతిన్ నీకృపగల్గినఁ
దిరముగనికిమాత్రమైన దృఢవృద్ధి కిలన్
గుఱినీపుష్టితోటజవట, తరుతలి... 69

క. కలుములు లేములు జనులకుఁ
గలలోపలివార్తలట్ల కపటంబగు నిం
దలఁచుట చెడనిపదార్థము, తలకొన... 70

క. అమితంబగుసంసార
భ్రమనొందక నిన్ను నమ్మి భావించినయీ
క్రమమునవె పునర్జనిసి, ద్ధముగద... 71

క. కరుణింపవయ్య నన్నే
సరసిజభవశంకరాది సకలనిలింపో
త్కరపరమహారసుమహా, తరళా... 72

క. మీనమవై సోమకు నం
భోనిధి బోర్లించి వేదములు నలువకు నిం
పూన నొసంగినసుగుణని, ధానివి... 73

క. కూర్మతచే గిరిజలనిధి
యూర్మికలం దేల్చి యమృతమొసఁగి సురాళిం
గూర్మిం బ్రోచినయూనృత, ధర్మివి... 74

క. వారాహరూపమున నమ
రారిహిరణ్యాక్షుఁ దునిమి యవనివిషాణో
ద్ధారతఁ జేసినజగదా, ధారక... 75

క. నరసింహామూర్తిఁ గైకొని
పరుషాత్ము హిరణ్యకశిపుఁ బ్రహ్లాదునకై
పరిమార్చితివి భవాంబుధి, తరణివి... 76

క. వామనుఁడవగుచుఁ ద్రొక్కితి
మోమోటము లేక బలిని మూఁడడుగు లిలన్
గామించి మనిపితివి సు, త్రామున్... 77

క. అతులపరశ్వథధారన్
గృతవీర్యతనూజుఁ దునిమి కృతయుగమున నొ
ప్పితివి భృగూద్వహ రామా, ధృతిచే... 78

క. కలన భృగురాము విలుగొను
బలిమిన్ నీ రెండుమహిమ లేకంబగుటన్
గల కళలోఁ గలిపికొనన్, దలఁచుట... 79

క. ద్వాపరమున సుజనులకుం
బ్రాపై యదుకులమునందు బలరాముఁడవై
దీపించితి వనితాఖిల, తాపస... 80

క. ఉద్దవిడి బయటిపల్లెల
ముద్దియలం గుట్టుచెఱిచి పాలతిండిగమిన్
సద్దడఁతు వింక బుద్ధతఁ, దద్దయు... 81

క. వారింతువు మ్లేచ్ఛుల నిక
ధీరతచేఁ దామ్రపర్ణి తీరంబున నీ
వారయఁ గల్కితనూ, ధారత... 82

క. కొంచక మోహినివై మఱి
వంచించితి వసురవరుల వడి సురలకునై
నించితి వమృతము సుగుణా, దంచిత... 83

క. త్రిపురములు గూల్చునప్పుడు
త్రిపురారికిఁ గొండవింటదివ్యాస్త్రమవై
నిపుణత నెఱపితివి పరం, తపుఁడవు... 84

క. అమరాసురయుద్ధమహిన్
గొమరున జీవాతుఁజెసము గ్రోలితివి మహో
త్తమగతి వైకుంఠంబునఁ, దమకళ... 85

క. నిపుణత నీవేగద జగ
దపకారుల సగరసుతుల నందఱఁ బొలియన్
శపియించిన కపిలుం డను, తపసివి... 86

క. భారతపంచమవేదమ
పారచనన్ నీతిమార్గ మలవరచినయా
పారాశర్యుఁడ వీవెక,దారహి... 87

క. ఇప్పటికి నేనుజేసిన
తప్పులకు మితంబులేదు తాలిమిచే నా
తప్పులు సహియింపుము దయ, తప్పక... 88

క. నాకోర్కె నెవఁడు తీర్చును
నీకొమరుఁడనైతి నింక నెనరుంచవలెన్
శ్రీకరరవివంశాబ్ధిను, ధాకర... 89

క. ఆసించితి నీకరుణకు
దోసిలి యొగ్గితి భవాబ్ధి తొలఁగితి వెతలన్
బాసితి కుశలుఁడనైతిన్, దాసున్... 90

క. జాల్ముఁడ నిన్నుఁదలంపన్
బ్రాల్మాలితి నిన్న నేఁడు బలికెద నీకుఁ ద
ప్పాల్మఱచి కరుణసేయుము, తాల్మిన్... 91

క. ఇల దశరథతనయుఁడవై
యొలమిం బదకొండు వేలయేం డ్లుండుటయున్
మెలఁగుచు భక్తులఁబ్రోవన్, దలఁచుట రఘు...

క. రామా రవివంశాంబుధి
సోమా సుగుణైకధామ శుభకరనామా
శ్రీమహితవిభవజితను, శ్రీరామా... 93

క. రాజీవబాంధవాయుత
తేజోనిక్షేప యప్రతీపసురూపా
రాజితకారుణ్యసము, ద్భ్రాజిత... 94

క. విశ్వామిత్రమఖాహిత
విశ్వపలాశితూల విశ్రుతపటలీ
శశ్వద్ధూనన నవపృష, దశ్వ... 95

క. ఆసారసత్కృపామృత
కాసార! గుణాంతరంగకమనీయగుణా
వ్యాసంగవిముక్తజనసం, త్రాసద... 96

క. గహనాటసైన్యసేవిత
గుహనామకిరాతవినుత గుణధుర్యవహా
కుహనాసురవంశవనీ, దహనా... 97

క. ప్రాచేతసకవికవితా
వ్యాచిక్రంసాభిరామ హార్షితహృదయా
యాచకకాంతఫలసం, ధాచణ.... 98

క. మా మవ తవ దాసోహం
కామితఫలద ప్రభావకరుణాసింధో
త్వామేవ నహి శరణ్యం, ధామగ... 99

క. శ్రీమద్భ్రామశుభప్రద
నామక త్వా మంతరేణ నహి శరణం మే
మా ముద్ధర భద్రాచల, ధామా... 100

క. ప్రాచుర్యసమధికమునీ
షాచణ దిట్టకవిరామచంద్రునిశతకం
బాచరణ సేయనగు భ
ద్రాచలరఘుతిలక నిటలతటనటదలకా. 101

రఘుతిలకశతకము

సంపూర్ణము.

---

# పీ ఠి క

ఈశతకగ్రంథకర్త దిట్టకవిరామచంద్రకవి. ఇతఁడు వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడువారి యాస్థానకవిగఁ జిరకాల మమరావతిలో నివసించెను. అమరావతిలోని యమరేశ్వరాలయమునందలి మహిషాసురమర్దనినిగూర్చి యీశతకమును గవి రచించెనని వంశీయులు చెప్పుచున్నారు. ఈకవి శకుంతలాపరిణయము, సేతుమాహాత్మ్యము, రామకథాసారము రచించిన దిట్టకవిపాపరాజుగారి మనుమఁడు. రంగారాయచరిత్రమువ్రాసిన నారాయణకవిపుత్త్రుఁడు. ఈరామచంద్రకవి నిగ్రహానుగ్రహసమర్థుఁడు, ధూర్తుఁడు. ఇతనికవిత నిరర్గళధారాశోభితమై మనోజ్ఞముగా నుండును. ఇంతవఱ కీకవిగ్రంథములలో నీక్రిందివి మాత్రము లభించినవి:

1. ఉద్దండరాయశతకము
2. రఘుతిలకశతకము
3. రాజగోపాలశతకము
4. మహిషాసురమర్దనిశతకము
5. హేలావతిదండకము
6. ప్రబంధములోని కృత్యాదివాసిరెడ్డివారి వంశచరిత్రము.

హేలావతిదండకము రెండవభోగినీ దండకమువలె మున్నది. రచనయుఁ గవితయు ధారయు హృదయంగమముగానున్నది. కృత్యాదియే ప్రబంధమునకు ముందుభాగమో నిరూపింప వీలు కాదయ్యెను. రామచంద్రకవి సత్కారము జరుగనిచోటులఁ దిట్టు కవిత నుపయోగించి బెదిరించి బహూకృతు లందిన గడుసరి. ఈయననుగూర్చి యనేక విచిత్రకథలు వాడుకలో నున్నవి. కవి తనప్రగల్భము నొకచోట నిటులఁ జెప్పుకొనియున్నాఁడు.—

క. దిట్టకవి రామచంద్రుఁడు
దిట్టిన బ్రాహ్మణ్యమైనఁ బగులు దీవించిన యా
చెట్టైనఁ జిగురుఁ బెట్టును
గట్టిగఁ దొల్లింటిభీమకవి కాఁబోలుక్.

ఈకవిచాటు పద్యములు సమకాలికులనుగూర్చిన ప్రశంసాపద్యములుగూడ మాకుఁ గొన్నిలభించి యున్నవానిని వరుసగాఁ బ్రచురించెదము. రామచంద్రకవి నివాసము కృష్ణామండలము నందిగామతాలూకాలోని గొట్టుముక్కల. కాశ్యప గోత్రము. కవికాలము గ్రహించుటకు గ్రంథాధారము లంతగా లభింపలేదు. కవివంశీయులవద్దనుండి వ్రాయించి

తెప్పించినసనదు కొంతవఱ కాధారము కాఁగలదని యిట నుదాహరింతుము.

"శ్రీమత్సకల గుణసంపన్నులయ్ని శ్రీమహామేరుసమానధీరులయిన దేవరాజు వెంకటాచలంకు నారయ్యగారు దండం స్న ౧౧౭౯ ఫసలి॥ మ॥ పెదముద్దాలి॥ వ॥ పుయ్యూరు తాలూకు దిట్టకవి రామచంద్రుఁడిగారి మాన్యము హా॥ సా॥ పంట్లకు సాలాబాదుచొప్పున సర్వేదుంబాలా శెలవు యిచ్చినాము. మహాన్నులు కమామిషు చేయించొకొని కొంచ్చుపోనియ్యవలెను. వికృతినా॥ సం॥ జ్యేష్ఠ శు ౨ నారయ్యవ్రాలు"

ఇది నూజవీటిసంస్థానోద్యోగి కవిమాన్యము ఫలసాయము విషయములో ఠాణేదారునకు వ్రాసిన యాజ్ఞాపత్రము. ఇట్టివె ఫసలి ౧౧౮౮, ౧౧౮౯, ౧౧౭౦ లోనివిగూడ కవివంశీయులవద్ద మేము చూచి యున్నారము. ఇపుడు 1334-వ ఫసలీ కావున మనకు లభించినవానిలో మొదటి యాజ్ఞాపత్రము ఫసలి 1168 సం. సనదు ఇప్పటి 166 సంవత్సరముల క్రిందఁ బుట్టియుండును. కవి యప్పటికి 20 సంవత్సరములవాఁడైనచో కవిజన్మకాలము క్రీ. శ. 1731 ప్రాంతములయం దైయుండును.

కవిగ్రంథరచనకాలము సమకాలికులను జీవిత మునుగూర్చి ప్రత్యేకించి వ్రాయనున్నారముగావున నిందు విరమించితిమి.

ఈశతకమునందలి భావములు సరళముగ హృదయంగమముగ నున్నవి. ధారయు నిరర్గళముగ నున్నది. ఇట్టి యుత్తమశతకము కవివంశీయులగు విజయరామశాస్త్రులవారు తాళపత్త్రగ్రంథములనుండి చిరకాలముక్రిందట నెత్తివ్రాసిరి. అందుఁ గొన్ని స్ఖాలిత్యము లుంటచేఁ గవ్యభిప్రాయానుగుణముగ సవరించి శుద్ధప్రతి నేర్పఱచితిమి.

ఈకవికృత గ్రంథములన్నియు ముద్రణమునకు నొసంగి శుద్ధప్రతి పీఠికవ్రాయుటకు మాకవకాశము కల్పించిన కవివంశీయులగు దిట్టకవి సుందరరామయ్య శర్మ పాకయాజిగారును, శతకసంపుటములలో నీయమూల్యగ్రంథములఁ జేర్చిన శ్రీవావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారును ఆంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులు.

నందిగామ.
20-4-25

ఇట్లు భాషాసేవకులు
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీరస్తు.

దిట్టకవి రామచంద్రకవిప్రణీత

# మహిషాసురమర్ధనిశతకము.

---

ఉ. శ్రీవనితాసరస్వతులు చిత్తమెలర్పఁగఁ గ్రేవల
భవ, ద్భావమెఱింగి సేవనెఱప సురపంక్తి
భజింప లోకముల్, వావిరి నేలు నీకు నను
వారము మ్రొక్కెదు హృద్యపద్యగ, ద్యావళి
నామతించి మహిషాసురమర్దని పుణ్యవర్ధనీ. 1

ఉ. ఔనని యాజగజ్జనకుఁడైన మహేశునకంట
లెస్సగాఁ, బూని సమస్తలోకములు పోషణ
జేసెడి తల్లివౌకదా, జానుగ నన్ను షణ్ముఖుని
చాడ్పున మన్ననసేయవమ్మ నీ, కానతి సేతునమ్మ
మహిషా... 2

ఉ. తారకపర్వతాగ్రపరితఃపరిపుష్పితసత్కదంబకాం
తారసభాంతరస్థలసుధాకర రత్నమృగేంద్రపీఠి
పైఁ, జేరి జగంబు లేలుశశిశేఖరగేహిని వైన
నిన్నుఁ జె, న్నార భజింతునమ్మ మహిషా... 3

చ. అమరులు నీకుసైన్యతతు లాగముముల్ స్తుతిపంది
పాఠకుల్, రమ చెలికత్తె శారదచిరంటి సురా
లయముఖ్య సర్వలో, కములకు నీవ యీశ్వరివి

కావున మ్రొక్కెద నీపదాబ్జదా, స్యము దయ
సేయుమమ్మ మహిషా... 4

చ. శుభములొసంగ సత్కరుణఁజూడ నెఱకెవ్వరు
నీకెచెల్లు వి, శ్వభరిత యోకదంబ వనవాసిని
యోసువికాసినీ నిజం, బభినుతిజేతు నీపదము
లాత్మదలంచి యహర్నిశంబు నా, కభయ మొసంగు
మమ్మ మహిషా... 5

చ. అకలుషవృత్తి నీకగొలుచునంతనె యెంతటి
వానికైన న, మ్మికజనియించి కష్టముశమించి ఫలిం
పకయున్నె మేలుమేల్, ప్రకటసుఖంబు కంబుసు
గళాబగళా యఖిలాండకోటినా, యకివిగదమ్మ
మహిషా... 6

చ. నిమిషముమాత్ర మింతె మది నిన్నుఁదలంచిన
వాని కెన్నఁడుఁ, శ్రమజనియింపఁ దెన్నఁడు
సుఖంబుగ సన్మణిపీఠి నిల్పి తా, నమితసువర్ణపుష్ప
ముల నర్చనఁజేసెడు పుణ్యమూర్తిభా, గ్యము
తరమా నుతింప మహిషా... 7

ఉ. నీసరివేల్పులేవె మఱినిన్ను దినమ్మినవాని కెన్నఁడుఁ,
మీసరిపోవ దెన్నఁడును విశ్రుతసంపద యోకదం
బసం, వాసిని యోమదంబ ననువారము నీకరు
ణారసంబుఁ జే, రాస యొనర్చినాఁడ మహిషా...

చ. దమికుల మర్చకావళి కదంబవనంబు నివాసమిందు
ఖం, డము తలపువ్వు భూషణ మనంతుఁడు చేతు
లకుం ద్రిశూలచ, క్రములును బ్రహ్మదండభిదు
రంబులుసాధనముల్ మహోగ్రసిం, హముగద
వాహనంబు మహిషా... 9

ఉ. ఆసరసీజనేత్ర హారహాటకగర్భుల కెన్నరానినీ,
వాసిదలంచిచూడఁగ నవాఙ్మతి మానసగోచరం
బగుణ, నీసరిమేటి నీవెకద నీలోకలక్ష్మి మె చండ
ముండభం, డాసురఖండనాప్తి మహిషా... 10

చ. శరణని వేఁడినాఁడ ననుసాదు మటంచుఁ దలంచి
నాఁడ నీ, వరతనయుండనౌట ననువారము
నెమ్మది నమ్మినాఁడ నుం, దరకరుణాకటాక్షకలితా
లలితాలలితారిగర్భసం, హరవికటాట్టహాసమహి
షా... 11

ఉ. ఎక్కడవాఁడవీ వనక యించుక నీకరుణారసంబు
నా, దిక్కునఁ బాదుకొల్పి ప్రణిధిస్థితిగైకొని
రిక్కలోవిడం, ద్రొక్కవె యిక్కడో యములు?
మ్రొక్కెద మ్రొక్కెదఁ బెక్కుమారు లో,
యక్క భరింపవమ్మ మహిషా... 12

ఉ. జన్యత నాయెడంగలదు సత్యముగా జననీప్రభా
వస్యా,జన్యము నీవుదాల్పు మిఁక సంశయమేటికి

నీకృపాప్తిచే, ధన్యుఁడనైతి నీమృదుపదంబులు
నమ్మినవాఁడనైతినీ, కన్యుఁడఁగానునుమ్ము మహిషా.

ఉ. ఎల్లిదమేల యమ్మ కృపయేర్పడ మార్పడఁ జూడ
నట్టినా, తల్లివి నీవెగాన బహుధా భవదంఘ్రుల
నాశ్రయించె నా, యుల్లము నెల్ల వేలువుల
నొల్లక వేల్లితపుల్లమల్లికా, హల్లకనీలవేణి
మహిషా... 14

ఉ. ఎవ్వనిపట్ల నీకరుణ యించుకగల్గునో వానికి
న్నైతా, నివ్వటిలుఁ సిరుల్ యశమునిందు
కృతార్థతగల్గు శాత్రవుల్, దవ్వగుచుండ్రు సత్య
ముగదాయిది కావున నిన్నెగొల్తునో, యవ్వ
నిరంతరంబు మహిషా... 15

ఉ. పొందుగ స్తన్యపానపరిపూరితుఁడై గుహుఁడు
బ్బి ముందఱన్, జిందులుద్రొక్కుఁ దన్ముఖశశింగని
ముద్దొనరించి మానసా, నందముతోడఁ గన్గొ
నెడినాఁటిదయాదృతి నాపయిన్ విని, వ్వంద
మొనర్పవమ్మ మహిషా... 16

ఉ. అమ్మలయమ్మ నీ వలరుటమ్ములవాఁ డగువాని ద్రె
ల్చురో, సమ్మలరారు వెండిమలసామికి నేలిక
సానివమ్మ నా, యమ్మగునీవు భక్తజనతావనమో
మలరాచపట్టినా, యమ్మవు నీవెసుమ్ము మహి...

ఉ నీమహనీయసత్కరుణ నిర్మలమౌగద నీప్రభావ
ముల్, స్థేమమెల్లర్ప సేవకవిధేయములౌగద
ప్రోవు మింక నన్నిఁక చేసి యోలలిత యోభ్ర
మరాంబిక యోభవాని యో, హైమవతీమదంబ
మహిషా.... 18

ఉ. మానుగ నీవు నీశ్వరుఁడు మత్పితృదేవతలైనఁ
జాలు మీ, కేను తనూభవుండనయి యింపుగ
మీకరుణామృతంబు నే, బూనెడివాఁడు కెమ్మ
నుచుఁ బోరానరించి గ్రహింతునమ్మ మీ, కానతి
సేతునమ్మ మహిషా... 19

ఉ. దక్షత నన్నపూర్ణయును ధన్యయశంబువహించి
కాశిలో, భక్షణ సేయుఁ దం చమృతపాయస
మాశనువారికెల్లఁ బ్రత్యక్షముగా నొసంగు
చుఁ బ్రియంబున లోకను లేలు శ్రీవిశాలాక్షివి
నీవెసుమ్ము మహిషా... 20

ఉ. పోలఁ గపాలమాలికలు బూని విభూతిధరించి
మించి శ్రీశైలమునందు శంకరునిసన్నిధిఁ బెన్ని
ధివోలె లోకముల్, పాలనసేతు వీవు ప్రతిభ
భ్రమరాంబ యనం దనర్చి యో, శైలబిలార్చి
తాంఘ్రి మహిషా... 21

ఉ. తోరపుహేలచేఁ గనకదుర్గయనఁ బెజవాడ

లోపలఁ, జారుసువర్ణమూర్తివయి శైలతలం
బున నిల్చి కార్యని, ర్ధారణధర్మమర్మకు వరంబు
లొసంగినతల్లి నిన్నుఁ జె, న్నార భజింతునమ్మ
మహిషా... 22

చ. చలమున లంకలోపలను శాంకరినావిలసిల్లి రక్క
సుల్, గొలువ సమస్తలోకములఁ గూరిమినేలు
దువమ్మ చిన్నివె, న్నెలదొరపూవుపెన్నె ఱుల
నెక్కొనుతల్లి తనూలతాజితా, త్యలఘుసువర్ణ
వల్లి మహిషా... 23

ఉ. తాళదళైకకర్ణికలు దాలిచి వేసలి చందమా
మయుఁ, వ్యాళకలాపముల్ చిఱుతవన్నియ
చీరెలు భూతిరేఖలుఁ, జాల నలంకరించు
కొని చక్కనిబొబ్బమెకంబునెక్కి వా,హ్యాళి
యొనర్చుతల్లి మహిషా... 24

చ. అమృతపయోధితీరమున నంచితకాంచనరత్నవీ
థిపై, నమరులుగొల్వ బిల్వవనమందు సురద్రుమ
మూలసీమ సంభ్రమమెసఁగఁ వసించి గరిమఁ
జగమేలుచున్న నిన్ను ని,త్యము భజియింతు
నమ్మ మహిషా... 25

ఉ. కోమలనీలవర్ణపటగుప్తనితంబిని వై సువర్ణ రే
ఖామహనీయతాళదళకర్ణికనింపుదలిర్పఁబూని సో

ద్ధామధృతిన్ జగత్త్రయము ధన్యత నేలెడుతల్లి
నీవెకా, శ్యామలనాఁదలిర్చి మహిషా... 26

ఉ. సంకుమదాభిచర్చితకుచద్వయ యోరమణీయర
త్నాతా,టంకని యోనిశాకరవిడంబనకృన్ముఖబింబ
యోమహే, శాంకవిభూషణాంగి భవదర్థకు
నం గరుణించుపట్ల ని,ట్లంకిలి సేయుటేల మహి...

ఉ. లాలితరత్నవీణ నుపలాలనఁ జేయుచు మందహా
సయు,క్తాలపనైకగీతముల నర్మిలిఁ బాడుచు శంభు
సన్నిధిన్, జాలవిలాసమొప్ప సురసంజలరంజిల
నాట్యకేళిచే, హాళిదనర్చుతల్లి మహిషా... 28

ఉ. స్వాదురసాప్తిగీతములు సల్పెడువేళ విలాసవై
ఖరిన్, మేదుర నీపపుష్పపరిమిశ్రితచందనపుష్ప
మాలికల్, మోదముచే ధరించి నయముం
బ్రియముం బ్రకటించి శంభుచే, నాదృతిఁగాంచు
తల్లి మహిషా... 29

ఉ. ఆతతసత్కృపాప్తి ననునాదృతి సేయఁగదమ్మ శే
ఖరీ, భూత సుధాంశుబింబ పరిభూషితచూళిక
వైనశ్రీజగ,న్మాతవు నీవు శంభుఁడనుమాపితవేద
ములట్లపల్కు నా,హా తలిదండ్రులందు మహి...

ఉ. కామమహీపతిస్ఫురితకార్ముకదావవిరా...
భ్రూ మహనీయవల్లికకుఁ బుష్పమున...

రోచనా, ద్దామలలామ మాన్యమునఁ దాల్చినసీ
మహనీయమూర్తినే, నామతి సేతునమ్మమహి...

ఉ. మంజులఫాలికాకలిత మౌక్తిక కాంతులసంతతుల్
నెఱా,రంజిలుగండభాగముల వ్రాసినకస్తురి గ్రాలు
తేంట్లమై, తం జిగిమైనతంత్రినినదంబునగీతము
..లుగ్గడించునీ, కంజలి సేతునమ్మ మహిషా... 32

ఉ. తావల మొప్ప వల్లకిని దంత్రులగోటను మీటు
నప్పు డెం,తో వెస గర్ణభూషణము లుయ్యాల
లూఁగఁ గ్రమక్రమంబునన్, గేవలమాధురీమ
హితగీతులఁ బ్రీతుని జేతు వీశ్వరున్, పావని
శుద్ధిగూర్చి మహిషా... 33

ఉ. దివ్యసురాపదోచ్ఛలిత దీర్ఘదృగంచలమైనమో
మునన్, నవ్యములైన మోదకకణంబులు దోఁచె
ననం దనర్చి సం,భావ్యము లైనముత్తెము
లభాసిలు ముంగరగల్గుతల్లి నీ, వవ్యయమూర్తి
వమ్మ మహిషా... 34

చ. నలువున మందమందమగునవ్వున ముమ్మరమైన
మోమునన్, సలలితమౌక్తికాప్తిదగు సద్రద
పాళికిఁ బాటలచ్ఛద,చ్ఛలనతఁ దాల్చి వీడియపుఁ
జాయల వాతెఱసొంపు పెంపునిం,పలరెడుతల్లి
వీవ మహిషా... 35

ఉ. ఆకమనీయదివ్యనవయౌవన చంద్రకళోదయంబు
చేఁ, బ్రాకటలీలయన్ జలధిపైఁ గొనఁ దత్పరిదృశ్య
కంబు బి,బ్బోకవదాత్మకంధరము బొల్పెసలారఁ
దనర్చుతల్లి నీ,యాకృతిసంస్మరింతు మహిషా...

చ. విలసితరత్నముద్రికలు వ్రేళ్లధరింపఁ దదీయదీధి
తుల్,దలకొని సాంధ్యరాగములధర్మముఁ దాలి
చి కెంజిగుళ్లలీ,లలనఖపం క్తికిం జిలుగులత్తుకగాఁ
గళలుబ్బుతల్లి న, న్నలరఁగఁ జేయవమ్మ మహి
షా... 87

ఉ. మేదురరూపయౌవనసమృద్ధియనం దనరారువా
ర్ధికిన్, తోఁదపుఁబూఁతగల్గు చనుగుత్తులప్రేగునన్
దూఁగుకొనుపై, ఖేదములొతరుల్ తరళవీఁచులు
గా విలసిల్లుతల్లి న,న్నాదుకొనంగదమ్మ మహి
షా... 88

చ. పరగ గభీరనాభి యనుబావికిఁ గ్రేవఁ దనర్చు
నాచుక్రొం, బొరయననొప్పు నాయుదరభూషణ
మైవిలసిల్లుసత్కటీ,నిరుపమసూత్రనిక్వణన నిర్జిత
మారగుణార్భటీ మనో, హరనిధి వైనతల్లి
మహిషా... 89

చ. చెలువుగఁ బద్మరాగములు చెక్కినచక్కని మేఖ
లన్ సము,జ్జ్వలమగుశ్రోణిచేఁ గనకశైలనితంబ

ము ధిక్కరించి పిక్కలచెలువంబుచే మరునికా
హళకాండధుల౯ హసించుదో,హలత౯గలట్టితల్లి
మహిషా... 40

చ. వికసిత కింశుకప్రసవవిశ్రుత తామ్రపటాభిగుప్తస
క్థిక మృదుభావలక్ష్మిపరికీర్తిత కుంకుమపంకలిప్త
హా, స్తికకరలక్ష్మిఁ గేర శివదేవుని గేహిని వైనలో
కనా,యకివిగదమ్మ యమ్మ మహిషా... 41

చ. జయజయ దేవతామణివిశాలసమంచితపీఠవా
సినీ,జయజయ గంధసారఘనసారసుధారసమంజు
భాషిణీ,జయజయ శంకరార్ధతనుసంగవిలాసిని భా
స్వరాస్వరో, హయముఖసన్నుతాంగి మహి
షా... 42

చ. జయ జనయిత్రి శోభనవిశాలసుగాత్రి తుషారన
చ్ఛిలో, చ్ఛ్రియవరపుత్రి నిత్యజలజప్రసవాంచిత
నేత్రి సత్కృపా, నయరసపాత్రి నిన్నిఁక ననారే
తముం భజియింతు నన్ను న,వ్యాయదయఁ జూడ
వమ్మ మహిషా... 43

ఉ. ఆదర మొప్ప శంకరుని యర్ధశరీరము నాశ్రయిం
చి భా,గ్యోదయలీల మాధవునిసోదరివన్న ప్రసిద్ధి
గాంచి యష్టాదశపీఠముల్ భువి ప్రసన్నత నెక్కి
జగంబు లేలు న,వ్యోదిమశక్తివా మహిషా...

ఉ. సోదరి వంబుజాక్షునకు శూలికి నేలికసాని వమ్మ
వౌ,వేదికి ముద్దుకోడలవు విష్ణుపతి ప్రియమాత
వెన్నఁ,గా నీదయచేఁగదా నిఖిలనిర్జరకోటులకుం
జయంబు న, న్నాదృతిసేయవమ్మ మహిషా...45

ఉ. తోరమెలర్పఁగాఁ గనకదుర్గయనన్ బురుహూ
తికాంబనా, నారయ జోగులాంబ భ్రమరాంబ
యనన్ మొదలైనలీల లిం,పార వహించి కాంచి
మొదలైనపురంబులనిల్చి విన్నవం,బారని ప్రోతు
వమ్మ మహిషా... 46

చ. ఘనముగఁ గాశికాపురిని గాంచిన నుజ్జయినిం కి
బురాపురం, బున బెజవాడలోనఁ బరిపూర్ణకృపా
రసపుణ్యమూర్తివై, జననుతకీర్తిచే నిలుచుచా
ద్పున నాహృదయంబునందు నీ, వనయము నిల్వ
వమ్మ మహిషా... 47

ఉ. వారిబలప్రభావమున హైమవతీ బగళాముఖీ
ప్రచం, డారుణభైరవీ ప్రముఖనామములన్ నవ
కోటిరూపముల్, ధీరతఁ దాల్చి ముఖ్యముగ దీ
కొని లోకము లేలునట్టి కా, మారివధూటివీవు
మహిషా... 48

చ. అకలుషపారిజాతనగ మల్లిక మొల్లలునాగవల్లి
నా, ముకరముగాఁగ శంభుని విశుద్ధశిరము

ణవినిద్రము భక్తజనావనక్రియా, యామదయా
భిరామ మహిషా... 53

చ. ఇభముఖకార్తికేయులను నిద్దఱు పుత్త్రుల నిమ్ము
టన్ భవత్ప్రభవుఁడ లాఁతిగాఁ దలఁపఁ బాడి
యె తల్లిని గావునన్ సదా, విభవము వేఁడినాఁ
డఁ గనువిచ్చి కనుంగొనిరో మ్మటంచు నా, యభి
మత మీయరమ్మ మహిషా... 54

ఉ. వేదపురాణశాస్త్రములు వేయుముఖంబుల విన్
భజించు న, వ్వేది యెఱుంగఁజాలఁ దతివిశ్రుత
మైనభవత్ప్రసాద మా, పాదన మాచరింతువు
కృపారసదృష్టిని గారవించి యిం, ద్రాదులకున్
శుభంబు మహిషా... 55

ఉ. లోక మనేకలీలల విలోభము లేక భరింతు వా
శ్రితో, త్సేకశుభంబు నీకరుణచేత ఫలించుచు
నుండు దేవతా, నీకము నీకుటుంబ మిదినిక్కము
నిన్ను భజించుపట్ల న, వ్యాకులబుద్ధినిమ్ము మ...

చ. సురలకు జీవకఱ్ఱవు త్రిశుద్ధిగ మానిజనాళికిన్
సుధా, సరసివి దీనపోషణవిచారము నీకుస్వభావ
సిద్ధమై, పరగినచిహ్నమౌఁగద ప్రసన్నవు నీవనిన
మ్మినాఁడ నన్నరసి భరింపవమ్మ మహిషా.... 57

ఉ. ముప్పదిమూఁడుకోట్లసురముఖ్యులు మానులు చేరి

రిం,పారఁగ నీవయేడ్గడ మహార్షులకెల్ల నిరంతరం
బు నీ,హారకుభృత్కుమారి మహిషా... 62

ఉ. బంధురతారహారచయభాసితకంధర మోహమదం
బ యో,సింధురయాన యోషమణివిశేషకలాప
లసద్భుజాగ్ర యో,గంధిలపుష్పదామ పరికల్పిత
కైశిక యస్మదీయభా,వాంధత మాన్పవమ్మ మ
హిషా... 63

ఉ. దేవకుటుంబినీమణులు దిక్పతికాంతలు మ్రొక్కి
చెక్కులన్,వావిరివ్రాయుపత్రికలవశ్యము సస్య
మటన్నశంకచే, భావనసేయు నిర్జగలపాదనఖేం
దువులొప్పుతల్లి ర,మ్మా వనటల్ సళింప మహి...

చ. హరిహయముఖ్యదిక్పతు లహర్నిశ మానతి
సేయఁ దన్మనో, హరమకుటాగ్రవజ్రఘృణు
లర్ఘ్యము పాద్యము గంధ మక్షతల్, నెరివిరు
లందుఁ జాలఁ గరుణింతువు నమ్మినవారిపట్ల నీ,క
రమరలేదు సుమ్ము మహిషా... 65

చ. మహతివహించి నారదుఁడు మంధరమధ్యమతార
కంబులన్, బహుళములైనగీతములు బాడఁగ
నచ్చరలాడఁగా శుభా,వహముగ నోలగంబమరి
వత్సలతం జగమేలుతల్లి ని, న్నహరహముం
భజింతు మహిషా... 66

చ. వినుతముకుందకుందముఖవేష్టితవై యమరీభుజం
గణో,ఘన విరువంకలంగొలువ భైరవసేవితవై
తనర్చి హెూ,చ్చినకృప సింహపీఠికవసించి జగత్త్ర
యమేలుతల్లి నిన్నుమదినముఁ భజింతు మ...

చ. వరుసదలిర్ప తారకులు వామ మొదల్ గలశ
క్తులుఁ సము,ద్ధురగతి సప్తమాతృకలు తుంబు
రునారదముఖ్యులుఁ భవ,చ్చరణము లాశ్ర
యింప నవిశంబుఁ గుతూహలలీలచే మనో,హా
రత వహించుతల్లి మహిషా... 68

చ. సకలవచోవిశారదము చంచుకళాజితబంధుజీవకిం
శుకము శుకంబు పాణిపయి శోభిలి చాటువులు
గ్గడింపఁ దన,త్సవిచిత్రవాక్యమాధురికి భావము
నఁ ముదమందుతల్లి ని,న్నకలుషభక్తిఁ గొల్తు
మహిషా... 69

ఉ. కారణమిావమాతు మమగావు మటంచు ముందలం
చినంతనే, ఘోరరణస్థలిఁ దనుజకోటులగీటణం
గించి మించునీ,శూరత యేమిచెప్ప బలసూదన
ముఖ్యుల నిర్వహించి చె,న్నారఁగఁ జేసినావు
మహిషా... 70

ఉ. ఊర్జితసంపదల్ ప్రియమున్నాండ నొసంగి దయా
రసైకస,మ్మార్జన మాచరించి నను మన్నన జేయు

గదమ్మ సర్వథా, వర్జితకల్మషుండనయి వర్థిలఁజేయఁ
గదమ్మ సాత్వికో, పార్జితకీర్తులిమ్మ మహిషా...71

చ. అమర భవత్పదాబ్జముల కానతులై నుతిసేయు
వారికిన్, సముచితధర్మసంగ్రహణసత్వవిచారప
రోపకారకా, ర్యముల యెడాట మందు ననయం
బు జయంబులెగాని యంతరా, యము లివిలేవు
సుమ్ము మహిషా... 72

ఉ. ఎంతని సన్నుతింతు నిఁక నేగతి నీపదపల్లవంబు
లఁర్చింతు భవత్కృపారసవిశేషము లేగతిఁ గాం
తు జాడ్య మిం, తింతనరాదు నామది కవాసవా
నంబు వహించుభారకం, బంతయు నీదె సుమ్ము
మహిషా... 73

ఉ. మందుఁడ భావిదర్శనసమర్థుఁడఁగాను భవత్ప్రభా
వముల్, పొందుగ సంస్మరించుటకు బుద్ధిదలిర్పదు
జ్ఞానహీనుఁడన్, నందనుపట్ల తల్లి కొక నాఁడును
నేరము లగ్గమౌనె నా, యందును నట్ల నీవు
మహిషా.... 74

చ. ఖలులకు వేయుసంఖ్యలముఖంబులు వేయుభుజా
యుతం బసం, ఖ్యలుకరవాలముల్ గలుగఁగన్పడు
చుందువు శిష్టకోటిచూ, డ్కుల కమృతస్వరూప
ము కడుం బ్రకటింతువు సత్కృపన్ ద్విధా, యు
లరెడుతల్లి వీవు మహిషా... 75

నించి మించి ప్రాయశముగఁ గాళిదాసుని మ
హాకవిగా నొనరించినట్టినీ, యశము నుతింతుసమ్మ
మహిషా... 80

ఉ. నీరధులేదు నొక్కటిగ నిండినయంతటికన్న మి
న్నయై, పారములేని నీకరుణఁ బ్రస్తుతిఁజేయఁడ
రంబె యెరిక్కి, సౌరగణాహిజాలమనుజవ్రజసం
చితసంపదాగమ, ద్వారమునీసమర్చుమహిషా...

ఉ. చిత్రవిచిత్రవైఖరులఁ జేకొని భక్తుల నావరించి
సర్వత్ర మహాత్ముధీత్వఫలవైభవకార్యవిశుద్ధు
లిచ్చుసా, విత్రియు నాసరస్వతియుఁ బృథ్వియుఁ
వైష్ణవియుఁ భవాని గా, యత్రియునాఁగ నీవె
మహిషా... 82

ఉ. అంబుధిసప్తకంబు బలమై జలముబ్బి జగద్వినాశ
మై,నం బరికించి కంధరమునఁ బ్రియుఁ గైకొని
వారణాసి శూలంబుననుద్ధరించి ప్రబలస్థితికాశ్య
తవైన శ్రీప్రసూనాంబవు నీవు కావె మహిషా...

ఉ. ఏమొడఁ జూచినం గలదె యింకొకప్రాపకమర్థికో
టికిఁ, బాయక తల్లివై సకలభాగ్యము లిచ్చిన నీ
వె యీవలెక్, శ్రేయములైన నీవె కులశీలవిశే
షములైననీవె దీర్ఘాయువులైననీవె మహిషా...

ఉ. కొండలపిండుదండిదొరకూతురి వై కరివేల్పు

తోడువై, తిండికిమెండుచేదుగలతెల్లనిసామికి
గేస్తురాలవై, దండిగ నాలుగైదుమెయిదాలుపు
కోటులసీటుబూని బ్రహ్మాండములేలుతల్లి మహి
షా.... 85

ఉ. ఎంచి తలఁక మెలంగుచెదలేటిని గొంచక మంచు
కొండపై, డించి తపంబుసల్పెడికడిందివిగావున
నీకు సాముమేఁక,బంచెదు వేల్పుడెందమనుపా
లకుళంబున నోలలాడురా, యంచవు సుమ్మునీవు
మహిషా... 86

ఉ. గంగయొడఁక విరాళి యధికంబగునీతని కంచు
నెంచి స,ర్వాంగములఁక సువర్ణనలినాచితిజూపి
మరల్ తరంగలీ,లం గనుపట్ట శూలికిఁ జలంబొ
నరింతువు నీ వగణ్యపు,ణ్యాంగనవాగదమ్మ మహిం
షా... 87

ఉ. ఉల్లమెలర్ప నిన్గొలుచుచుండెడివుణ్యులపట్ల నె
వ్వారే,ప్రల్లదులై శతత్వమునఁ బాపపుఁబల్కులు
పల్కుచుండ్రొ యా,కల్లరులఁక వధించుటకుఁ గ
న్నెఱ సేయకమాన విజ్జగం,బల్లలనాడునట్లు మహిం
షా... 88

ఉ. సన్నుతిసేయఁగాఁదరమె చక్కని కాటుకకంటి
చూడ్కి య, త్యున్నతమై కురంగము సముజ్జ్వ

లతం బ్రకటింపుచుండఁగాఁ, బున్నమచందమా
మవలెఁ బొల్చి పయోజముల\u0c15్ హసించునీ,య
న్నవనెమ్మొగంబు మహిషా... 89

చ. ఘనమగుమీనరూపమునఁ గన్నులుకూర్మతచేఁ
బ్రపాదముల్, తనరుమృగేంద్రవృత్తి నవలగ్న
మునెన్నిన నెన్నునేమొ య,వ్వనజదళాక్షుఁ డొ
క్కరుఁడు వారల కన్యులకెన్ననానె నీ, యనుప
మసౌష్ఠవంబు మహిషా... 90

చ. ప్రకటితవజ్రరేఖగలపాదతలంబునఁ గాసరాసు
రం,గకవికళ్ళృంగముల్ నురుముగాఁ దునుమా
డుచుఁ ద్రొక్కిపట్టిపా,యక మృగరాజునెక్కి
కొలువై యలరారెడినిన్నుఁ బూజసే, యక
యుఁకమాన నుమ్ము మహిషా... 91

చ. హలకులిశాంకచిహ్నితము లంచితవర్తులశుద్ధపా
ర్ష్ణికం, బులు ఘనవిద్రుమోపమసముజ్జ్వలగుల్ఫ
ము లభ్రతారకా,కలితనఖాంకురంబు లభిగణ్య
ములైనభవత్పదంబు లిం, పలర భజింతునమ్మ మ
హిషా... 92

ఉ. దభ్రత యింతలేక సతతంబుభజింతు భవత్పదాబ్జ
ముల్, శుభ్రకళాకలాపపరిశోభితహాస్యముఖా
రవింద యో,విభ్రమహావభావరసవేల్లితసంభ్రమ

శాంభవాత్మ యో, యభ్రసమావలగ్న మహి
షా... 93

ఉ. ఆతతవేదశాస్త్రమహిమాన్వితులై విలసిల్లుకుం
భభూ, గౌతమముఖ్యులేప్పుడుపఁగానరు నీవిల
వత్పరిశావ మ, జ్ఞాతను నేను గాంచఁగలనా
దయచేసి కృతార్థుఁజేయు వి, ఖ్యాతికి నీవనుమ్ము
మహిషా... 94

ఉ. నీమహిమంబు లెన్నుటకు నీరజసంభవుఁడైన నఁ
బూనలేఁ, డే మనుజుండ సత్యగుణహీనుఁడ దీ
నుఁడఁ బూననేర్తునే, మామకసాపరాధవిధి మా
న్పుటకెల్లను నీదెభార మో, హైమవతీమదంబ
మహిషా... 95

ఉ. అక్కమలాసనాదులకు నైనఁ బరీక్ష యొనర్పరా
ని నీ, వెక్కడ నీయశోజలధి యెక్కడఁ దత్తద
గాధశోధనం, బెక్కడ నాకు నెంచఁబడు టెక్క
డ యిట్టు నశక్యసాహసం, బక్కజమౌఁగదమ్మ
మహిషా... 96

చ. హరిహయశాఖలేఖని మహాంబుధి కజ్జలపాత్ర
భూతలాం, బరములు సంపుటస్థలులు పంకజసంభ
వహా త్రివక్త్రలే, ఖరివారిదళర్వఁ డట్లయినఁగాని
లిఖింపఁదరంబె నీమహో, హరగుణజాలసంఖ్య మ
హిషా... 97

చ. నిరతము నీకథామృతము నిశ్చలతన్ భజియింపఁ
గంటి నీ, చరణసరోరుహాంబులకు సాగిలిమ్రొ
క్కులిడంగఁగంటి నీ, పరమదయారసప్లుతికిఁ బా
త్రుఁడనైతి నిఁకేమిశంక నా, కరయఫలించెఁ గో
ర్కి మహిషా... 98

చ. నిను వినుతింతునందు నొకనిక్కువుమిక్కిలిసత్కృ
విక్రమం,బునఁ బనిపూనినాఁడఁ జలమూని విపీ
లికకొండఁదాల్పఁబూ,నినగతిగాదె యింతటికి నీ
కృప భక్తులపై సుధారసా,యనమునిజంబుయుష్మ
మహిషా... 99

ఉ. వారిజసంభవాద్యమరవర్గ మనర్గళలీల నీకథల్
ధీరత నాగమార్థఫణితిన్ నిరతంబు గృతుల్ ర
చింపఁగా, నే రచియించునల్పకృతి నీకిది గణ్య
మె యైనఁగాని నీ, కారయ తుల్యబుద్ధి మహి
షా... 100

ఉ. శ్రీరమణీవిశేషగుణచిహ్నితవీవుభవత్కృపా త్తిచే
ధీరుఁడ కశ్యపాన్వయుఁడ దిట్టకవీంద్రుఁడ రామ
చంద్రుఁడన్, గారవమొప్ప వృత్తశతకంబురచిం
చితి దీని సన్మణీ, హారముగా గ్రహింపు మహి
షాసురమర్దని పుణ్యవర్ధనీ. 101

మహిషాసురమర్దనిశతకము సంపూర్ణము.

---

# పీఠిక.

సుప్రసిద్ధుఁడు డిట్టకవినారాయణకవి కీశతకకర్త యగురామచంద్రకవి కుమారుఁడు. ఈకవి సమగ్రజీవితము మహిషాసురమర్దనిశతకమునఁ జేర్చియున్నారము గాన నిందు దిఙ్మాత్రముగా నుదాహరించుచున్నారము. ఈ రామచంద్రకవికవిత నిర్దుష్టముగా నిరర్గళధారాశోభితమై మనోహరముగానుండును. ఇతనిగ్రంథము లింతవఱకు మాకీక్రిందనుదాహరించినవి మాత్రము లభించియున్నవి. ఇంకను బ్రయత్నించినచోఁ గొన్నిగ్రంథములు లభింపనచ్చునను నాసగలదు. 1.మహిషాసురమర్దనిశతకము, 2.గోట్టుముక్కులరాజగోపాలశతకము, 3.ఉద్దండరాయశతకము, 4.రఘుతిలకశతకము, 5. వాసిరెడ్డివారిచరిత్రము, 6. హేలావతిదండకము, 7. చాటుపద్యములు.

రామచంద్రకవి చిరకాలము వాసిరెడ్డివారిసంస్థానమునందు వేంకటాద్రినాయఁడువారి శాస్థానకవియై యుభయభాషాపండితుఁ డని పేరుగాంచెను. ఇతనిచాటుపద్యములఁ బట్టిచూడఁ గాలక్రమమున నాకాలమునఁ బేరుపడియున్న వెలమసంస్థానము లన్నింటిని జేరి ధనార్థియై రాజాశ్రయముతోఁ గాలముగడిపినటుల ద్యోతకము కాగలదు.

ఉద్దండరాయశతక కర్తయగు డిట్టకవిరామచంద్రకవి యిప్పటికినూరుసంవత్సరములక్రిందట నుండి యుండును. ఇంతవఱ కీకవిగ్రంథములుగాని సుప్రసి

ద్ధమగునామముగాని యాంధ్రలోకము ఎఱుంగ కుంట పరితాపకరము.

రామచంద్రకవి నూజవీటిప్రభువుల సంస్థానము లోనిదగు మద్దాలి కేఁగి యటఁ గలయుద్దండరాయస్వామినిగూర్చి యీశతకము ను రచించెను. శతకమునందు భక్తిరసము ప్రధానస్థానమునొందియున్నది. శతకమంతయు జకారప్రాసముతోనున్నప్రాసస్థానములలోఁ గవివెదకికొనక క్రొత్తపదములను సందర్భశుద్ధిగా సమకూర్చి తనకవితాప్రాగల్భ్యము వెల్లడించియున్నాఁడు. ఈశతకమునందలి పద్యభావములుగూడ మనోహరభక్తజనహృదయాకర్షణముగానున్నవి. ఈకవి సాహిత్యమందేగాక యద్వైతమతసిద్ధాంతములందుఁ గూడ జితశ్రముఁడని యీశతకమునందలిపద్యములు చెప్పుచున్నవి.

మాకుఁ బూర్వతాళపత్రగ్రంథమును బట్టి వ్రాయఁబడినవ్రాతప్రతి జీర్ణమయ్యమైనది లభించినది. ఇంక నుపేక్షించిన నీప్రతిగూడ నదృశ్యమగునేమో యని ప్రత్యంతరసహాయము లేకున్నను ఎటులో శుద్ధప్రతి నొకవిధముగా సిద్ధపఱచి ముద్రణమునకు నొసంగఁగలిగితిమి. ద్వితీయముద్రణమున శతకమును సర్వవిధముల సంస్కరింపవలెనని యున్నది.

నందిగామ. } ఇట్లు భాషాసేవకులు,
5-2-25 } శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

దిట్టకవి రామచంద్రకవికృత

# ఉద్దండరాయశతకము.



మ. అజకాంతన్ భజియించి భాగవతులం బ్రార్థించి
డెందంబునన్, గజవక్త్రుం బ్రణుతించి తొంటిక
వులం గైవారముల్ చేసి ప్రేమ జొహా
ర్జోహా రటంచు సాగిలిమొదన్ మద్దాలి యుద్దం
డరా, య! జయ శ్రీసువిధేయ! భక్తజనగేయా!
నిత్యభాగ్యోదయా. 1

మ. త్రిజగత్పూజ్యము లైననీపదము లర్థిన్ సేవ
గావింతు నిన్, భజియింతున్ నిరతంబు మ్రొ
క్కుదు మదిన్ భావించి కీర్తింతు సామజసంర
క్షక విశ్వాకారక హరి మద్దాలి... 2

మ. భుజముల్ ఫాల మురంబు చేతులు పదంబుల్
భూమి మోయంగ సాగి జలూకాగతిచే
బ్రణామశతముల్ గిలింతు గైకొమ్ము ప్రేమ
జెలంగన్ భవదీయదాసుఁడఁ జుమీ మద్దాలి...

మ. వ్రజకాంతాహృదయేశ సన్మునిజనవ్రాతాత్మసం
వేశ నీడజరాజధ్వజపోషితేంద్రజనిరూఢప్రా
భవోపేత ధర్మజరాజ్యప్రతిపాదనాత్మయుత
శ్రీమద్దాలి... 4

మ. సజలాంభోధరతుల్య నైల్యకలనాచంచత్తనూ
ధామ శౌర్యజితామర్త్యవిరోధిభూమ విధిము
ఖ్యాదిత్యనక్షత్రసోమ జటివ్రాతనుతైకనామ
వహామాం మద్దాలి... 5

మ. భజనీయైకమహాచిదంబర పదాంభస్సిక్తహే
మాద్రి ధన్విజటాడంబర కాంచనాంబర సదావి
శ్వంభరా గోపనా మజయానాహృదయాబ్జబం
భర నమో మద్దాలి... 6

మ. అజగవ్యర్చిత మానిచర్చిత సమస్తాదిత్యసంప్రా
ర్థితా సుజనారాధిత తత్త్వబోధిత ముముక్షు
స్తుత్యశోభా పులోమజిదశ్మప్రభ యుగ్రసేన
సులభా మద్దాలి... 7

మ. ద్విజరాజాంబుజమిత్రనేత్ర సకలాధిష్ఠానహృ
త్పాత్ర వారిజసంభూతనిజాగ్రపుత్ర కరుణా
బృందిష్ఠచారిత్ర వ్యోమజటాజూట సదాత్మ
విచిత్ర నృహరీ మద్దాలి... 8

మ. రజనీవల్లభభానునేత్ర త్రిజగద్రానిష్ఠచారిత్ర

నీ, రజనీ గేహైకకళత్ర భవ్యగుణపాత్రా నన్ని
కనీ నీచక, ర్మజడత్వంబులం బాపి ప్రోవంగదె శ్రీ
మద్దాలి... 9

మ. ద్విజరాజధ్వజ దివ్యవందిత సహాదేదీప్యమానా
త్మ దేవ జగన్నాథ ముకుంద మాధవ హరి
వందారుమందార సమ్మంజనుని నిన్ను దయామ
యాత్ముండవయా మద్దాలి... 10

మ. గజరాడ్రక్షక నాకుఁగన్పడవె నేగన్గొందు నీపా
దపంకజముల్ నీవదనారవిందమును నీక
న్దమ్ములుం గామహో, మజయంతాదుల గేరుచ
క్కదనముని మద్దాలి... 11

మ. రజతక్ష్మాధరగేహసాయక భవద్రాజత్ప్రభా
వంబు లంకజముల్ ద్రౌపదియార్తిచే సరసి
జాక్షా యన్నమాత్రానఁ బ్రేమజిగుల్లోత్తంగ
మానము న్నిలిపితో మద్దాలి... 12

మ. అజహాత్ప్రాభవ తెల్పవే స్మృతి యవిద్యారూ
పపుంజీనువా, లుజ్జారం దృష్టికి నంతరంబిడదు
తల్లోపంబు లేకున్న భీ, మజరాయుః గ్రథనంబుజీవు
సకగుణ మద్దాలి... 13

మ. విజయక్షేమదనీదయంగద జయావిర్భూతిసంసా
రప, భుజపంకేజాంబుధు లింకిపోవుటకు నీసంసేవ

పేరింటి గ్రీష్మజగత్ప్రాణము కారణంబుగద
శ్రీమద్దాలి... 14

మ. వ్రజముల్ దాసుస ముజ్జగించి నినుఁ జీరం
దారిగల్పింపవే, రుజకాధారము పూతిగంధల
హారిరూఢంబు జంత్రంపుబో, మృజుమీదేహ
ము దీనినమ్మఁదగునే మద్దాలి... 15

మ. అజరుద్రాదులు నిన్నుఁగొల్తురమరుల్ ప్రార్థిం
తురేప్రొద్దు నెల్లజగంబుల్ సృజియించుకర్తవు
దయాలంకారచిత్తుండ వాత్మజతుల్యంబుగనన్ను
బ్రోవుము కృపన్ మద్దాలి... 16

మ. వృజినంబుల్ హరియించి నన్నెపుడు సంప్రాప్తా
త్ముఁ గావించి నిన్, భజియింపన్ మలిబుట్టఁజేసి
కృపచేఁ బాలింపవే చందమామ జిగిం జేకొని
కల్వమొగ్గవలె శ్రీమద్దాలి... 17

మ. త్యజియింతున్ భవబంధముల్ మనములో
నర్చింతు నీపాదముల్, విజయంబందుదు మోక్ష
లక్ష్మీవలనన్ వేమాఱు సంగ్రామకర్మ జరాసంధ
మదాపహారి నృహరి మద్దాలి... 18

మ. గజఘోటీ ముఖసంపదల్ సతములా కా వీశరీ
రంబులే, నిజముల్ వ్యర్థములంచు రోసి మును
మున్నే యైహికాగమ్యకా, మ్యజిగీషన్ భజి
యించి కాంచవలె నిన్ మద్దాలి... 19

మ. సృజియింపన్ సృజియించి మేలొసఁగ నిర్జింపం
బ్రజామానసాం,బుజవాంఛల్ సఫలం బొనర్ప
విఫలంబుం జేయనీవేని కా,మజగద్వ్యాపారకమూల
క_ర్తవు భళీ మద్దాలి... 20

మ. సుజనత్వంబరి దేహిమత్తుఁడయి సంక్షోభింపఁగా
నేల ని,త్యజుగుప్సాస్పదమాజవంజవసుఖం బా
హాభవద్దివ్యనా, మజపం బేమర కాత్మ నిల్పవలె
శ్రీమద్దాలి... 21

మ. యజనామ్నాయతపోజపవ్రతము లత్యంతంబు
వర్ధిల్లభూ,వ్రజ కానంద మమందమై పరగి సంప
త్పారిజాతంపుఁగొ,మ్మ జిగుర్పం గరుణించు క_ర్తవు
గదా మద్దాలి.... 22

మ. గజ మే దేశికునొద్ద శిక్షఁగనె సాకల్యంబుగాఁ
గుబ్జ యే, ద్విజు నాచార్యునిగాఁగఁ జేకొనె భవ
ద్దివ్యామృతప్రాయ నా,మజపప్రాప్తిః సాత్వికంబె
గురువా మద్దాలి... 23

మ. అజనుఃశ్లాఘ్యసుఖంబు గైకొనెద భూయస్స్వా
యదానందనం, దజనీసత్వగుణస్ఫురత్స్ఫటికర
త్నంబందు మతూర్పార్వక, ర్మజపారోచులలోఁ
గొనంగదవె శ్రీమద్దాలి... 24

మ. ధ్వజమై వాహనమై పతంగపతిగొల్వన్ బిల్వ

రాసెజ్జయం,దు జరీపుట్టముగట్టి కొల్లాసంగి
తోడ్తో చెంగటం గల్మికొ,మ్మ జత్తైనిల్వ జగం
బులేలుదువు శ్రీమద్దాలి... 25

మ. యజమానత్వమెుసంగి జ్ఞానశిఖియం దత్యంతము
త్కృల్బిషం, బజరూపంబుగ వేల్వఁ జేయవె
త్వదీయాంఘ్రిద్వయీభక్తిసో,మజలంబాని పవి
త్రమూర్తినగుదుఁ మద్దాలి... 26

మ. వ్యజనచ్ఛత్రముఖోపచారకలన వ్యాపారులై
భక్తి వి,శ్వజనుల్ గొల్తురు నిన్ సహేంద్రసు
సురల్ స్వర్గంబునందుఁ బులో,మజతో నింద్రు
నివోలె నుర్వీరపయిఁ మద్దాలి... 27

మ. ఇజగుంజెంది కుచేలుఁ డర్థియయి నిన్వీక్షింప నే
తేరఁ ద,ద్ద్విజవర్యుఁ ఫలితార్థుజేసితివి నిన్దే
హీయనన్ నీశుభా,త్మజతుప్రాయముగాఁ గడం
గుటరుదే మద్దాలి... 28

మ. నిజమాయన్ విధి వేగలంపఁ గలఁడే యింద్రా
త్మతన్ నీవు వే,సృజనల్ చేసితి వెల్లవత్సముల
నిన్ శీలింపఁగాలేక బ్ర,హ్మ జితప్రాభవుఁడయ్యె
మత్తుఁడగుచుఁ మద్దాలి... 29

మ. అజమిళుం డొకవిప్రదాసియెడ రత్యాసక్తుఁ
డై కాలమెం,తజనంగాఁ దుది మోక్షమిచ్చితివి

రోనారాయణాయంచు నాత్మజునిం జీరినదాన
బ్రీతమతివై మద్దాలి... 80

మ. విజనంబైనమహాటవిన్ శబరి యావిర్భూతస
ద్భక్తిచే, భుజియింపన్ ఫలమీయ దానికిడవే
పుణ్యంబు శ్రీరామునా, మజనాధీశ్వరరూపధే
యమున మున్ మద్దాలి... 81

మ. నిజదాసావనసాభిమానుఁడవయా నీ వాజిలో
సోమద, త్తజు కేలూడిచి సాత్యకిన్ మనిపి తత్యం
తంబు సోలింపు సా, మ్మజనింపంబడియున్న వేళ
కృపచే మద్దాలి... 82

మ. భుజదర్పంబున ద్రౌణిసుప్తవధకై బూనంగ
నీవెన్ని భూ, భుజులట్లుండఁ దోలంగఁ దెచ్చితివి
నిన్ బూజించువారౌట ధర్మజభీమార్జున మద్ర
సూనులఁ గృపన్ మద్దాలి... 83

మ. ఋజుతత్త్వం బరినిన్ వాసిం ముఖులు నాభృశ్యాత్ము
గాఁ గొల్తువౌ, రజకుం దూడుట మల్లురీల్గుట
మదారంభంబుచే డాసి స్వామజముం ద్రుంగుట
కంసమూలముగదా మద్దాలి... 84

మ. కుజనుల్ నిన్ను భజింపలేక తమకోర్కుల్ వేరు
గా గేరికే, రిజవుంబల్కులు బల్కుచుం జెడుదు
రుర్విన్ నారకావాసభీ,మజలూకావృతదేవాఁ
డై పరమునన్ మద్దాలి... 85

మ. రజతస్వర్ణముఖాఖిలార్థకృతగర్వగ్రస్తులై మత్తు
లై, బౌజుఁగుల్ నిన్ భజియింపలేక తనువుల్
బోవన్ దమం బాత్మఁ గ్రమ్మ జముం జేరుదు
రెన్ని జన్మములకున్ మద్దాలి... 36

మ. అజరాధీశ్వరుఁ డైననీకు పరిచర్యల్ సేయఁ బ్రా
ల్మాలినం, బిజుగొట్టెన్ దుదిముట్టఁ డజ్ఞానకుఁ
దదివ్యజ్ఞానహీనంపురి, మ్మజెడన్ నిన్ భజియింతు
రాషధమిఁకన్ మద్దాలి... 37

మ. అజనాషాఢకమండలుల్ గమిచి ధర్మాయత్తులై
గౌతమీ, త్రిజగత్కారముఖాఖిలర్షులు నినున్
బ్రేతింపఁగా లేరు ధర్మజిఘాంసుల్ దరిముట్టుటె
ట్టులో యిఁకన్ మద్దాలి... 38

మ. కుజముల్ రాజసతామసంబులు త్వదంఘ్రిల్
గూర్చు మన్మానసాంబుజమే బల్లోలు; పునర్భవైల
బిలతుగ్మోతుంబు తద్వ్రతుయుగ్మజయత్వంబు
వహించి సల్పఁగదె శ్రీమద్దాలి... 39

మ. గుజుగుంట్లం గడతేర్పలేని వెడకోర్కల్
గోగుటల్ వట్టిభే, షజముల్ పీటనశింప దక్షత
భవత్సం సేవసిద్ధింపుజా, ల్మజనశ్రేణికతత్ జ్ఞ తాము
యమరున్ మద్దాలి... 40

స. అజరస్థాపితకల్పకంబవయి కుయ్యాల్యలింపవే సా

యధో,త్పజ నిన్నే నెదనమ్మినాఁడ నీక మత్కాలు
ష్యముల్ బాఱంజి,మ్మ జుగుప్సల్ బెడబాప
కర్తవు జుమీ మద్దాలి... 41

మ. గజవక్త్రుండు భుజంగమాధిపతి గంగాద్వీపినీభ
ర్తనీ,రజసంజాతుఁడు భారతీసతియు నీప్రాంచ
త్కథల్ బ్రేమసా, మజటాగానములన్ భజింతు
రెవుడున్ మద్దాలి... 42

మ. యజురాదిశ్రుతులెల్ల నిన్ బొగడు నాహాయంద్రు
నీకీర్తి క,య్యజుడున్ భారతి నీదు తారకము
జిహ్వాగ్రంబులన్ మేనకా,త్మజయున్ శంభుఁడు
దాల్చి పొంగుదురు శ్రీమద్దాలి.... 43

మ. విజితత్వంబున నొంద దీషణదవావిర్భూతి
యో పెంచాచతు, ర్భుజ తచ్ఛాంతికి తావకీనకరు
ణాపూరంపుఁబాలేటిచె, మ్మజుమీ నమ్మినవారి
కొంబుద మీఁకన్ మద్దాలి... 44

మ. గిరిగాడెట్టులో యట్లజీవుఁడును దద్దేహంబె దే
హంబు త,ద్విజ మాలోపల జ్యోతినుంచుకొని
యుద్దీపించునట్లే యజి,ష్మాజగజ్జ్యోతినినిన్నుఁ గాం
చవలె లో మద్దాలి... 45

మ. గజగండస్థలివోలె నెమ్మన మశక్యంబైన దుర్వాం
ఛ వే,రిజిలందూ లెడుదీని మానప్రభవదంఘ్రిసర్వద్ధి

మూలైకసీ, మజవాకృష్టికి నందనీయఁగదె శ్రీ
మద్దాలి.... 46

మ. గజపుష్పాంచితదివ్యదామములతోఁ గల్యాణచే
లంబుతో, భుజకీర్తుల్ మొదలైనసొమ్ముగమితోఁ
బొల్పారునీలంపుబొ,మ్మజిగిన్ గన్పడవయ్య మ్రొ
క్కులిడెదన్ మద్దాలి... 47

మ. స్వజనుంగా గరుణించి నీస్మృతుల కస్మన్మాధచే
తఃపశు, వ్రజముంజేసి యొసంగవే యిపుడు
ప్రత్యక్షుంబు తాపత్రయో, న్మజెడన్ త్వత్పదదర్శ
నాప్తి మనెదన్ మద్దాలి... 48

మ. అజపుత్రాదిమునుల్ భవన్మహిమ మేకాంతం
బుగాఁ గాన నో, టజముల్ జేరి జపించి కాన రతి
దౌష్ట్యప్రక్రియాలబ్ధవా, న్మజడీభూతుఁడ నేను
గాంచఁగలనా? మద్దాలి... 49

మ. అజరద్వీపినిగన్న పాదకమలంబాసించితిన్ జూప
వే, రజనీనాయక సోదరీరమణ యోరాజీవపత్రా
క్ష న, మ్మజుమీా దృశ్యము నళ్యమైహికమునన్
మద్దాలి... 50

మ. అజకంఠస్తనమై పరోపకృతిసేయన్ లేని మద్దేహ
య,ష్టిజనింపన్ ఫలమేమి దీనినిఁ గవిన్ సేవింపఁ
గైకొమ్ము జన్మజుగుప్సం బెడబాసిసార్థకముగన్
మద్దాలి... 51

మ. రజనింబోలె నవిద్య నెమ్మదికి నిద్రంగూర్చు
విద్యాసమృద్ధి జగచ్చక్షుఁడవోలె తెల్వినిడుఁ
దద్విజ్ఞానప్రాన్యత్రియా, మజనంజేయవె తెల్విఁ
గైకొనియెదన్ మద్దాలి.... 52

మ. విజిఘుత్సుత్వము నద్ధురాప్తిభవ ముద్వీతంబుగా
నూతనాం, బుజసౌందర్యము లైననీదుపదముల్
బూజింతుఁ గారుణ్యభూ, నిజలాసారము నాప
యిన్ గురియవే మద్దాలి... 53

మ. అజ నీదర్శనమబ్బు టెప్పుడో యనేహాస్రోతమం
తంతడోం,కి జరంగెన్ గనుపట్టు నిప్పుడయినన్
గీర్తించి మైనిండభ, ర్మజలం బుబ్బ ప్రనింప మ్రొ
క్కులిడెదన్ మద్దాలి... 54

మ. సుజనుంగాఁ గరుణించి నామదికి సంశుద్ధిం బ్ర
సాదించి లో, కజనన్యాశ్రయవత్సవత్సకటా
కారాసురద్వాదశా, త్మజరక్షింపవె మోక్షదాత
వయి శ్రీమద్దాలి... 55

మ. ప్రజిహాపల్లికి పాంథుఁ దోరసిలు తేవన్ గర్వికిన్
నీవుగా,వు జగత్పూర్ణుఁడవయ్యు సాధుగుణభ
వ్యుం బ్రోతు వజ్ఞానధూ, మజగర్వాంధుఁడ నెట్లు
బ్రోచెదవో నన్ మద్దాలి... 56

మ. అజశృంగీకితవార్క ముష్టిఫలవాంఛాయోగ్య

సంసారమహా, ధ్వజదుర్వాంఛలుమాన్పి యొ
క్కయెడ వేడ్కంబోలె నీదివ్యనా, మజపం
బూనగ బుద్ధినియ్యగదె శ్రీమద్దాలి... 57

మ. గుజుగుంటైంతయుదీరవైహికపుసంకోచంబుచేతం
గజీ,బిజిగా చింతలె పుట్టసాగనింకనిక వేర్పాం
టకె ట్టిట్టిచ, ద్మజుగుప్సం బెడబాపి సాదంగదె
శ్రీమద్దాలి.... 58

మ. గజబంధి న్వ్యపమానమై యిహ మసౌఖ్యప్రాప్తి
నొందింప సా, గె జుగుప్సంబడంజాల నింకభవదం
ఘ్రిద్వంద్వసేవానికా, మజగన్మోహనబుద్ధి నాకొ
సంగవే శ్రీమద్దాలి... 59

మ. భుజమధ్యంబున లచ్చి పార్శ్వయుగళిక్ భూ
మీళ లుప్పొంగ భ, క్తజనుల్ గొల్వంగ నోల
గంబమరునిక్ గన్గొందుం గన్నార ఫో,మజటా
జూటనుతాత్మ కన్పడంగదే మద్దాలి... 60

మ. గజమె ట్లట్లుగనేను కర్మఫలనక్రగ్రస్తతక్ బొం
ది యా, ధిజబాధంబడియున్నవాండం గరుణాధీ
నుండవై భావిజ,న్మజుగుప్సాతదవస్థం బాపంగదె
శ్రీమద్దాలి... 61

మ. మృజమున్మున్నుగశుద్ధిదేలిచెద సామీ యోమిం
కక్ నీమహా, భజనాగాంగఝరీరసంబొసంగవే

బల్మాఱుసత్కల్మషా, త్మజపత్పాళనమాచరించు
టకునై మద్దాలి... 62

మ. భజమానత్వదుపా_స్తిమగ్నమతినై భాసిలినట్లుగా
సదా, భజనత్వంబొనఁగూర్పవయ్య సుమనోబం
హిష్ఠ సద్భక్తివ, ర్మజధైర్యంబున ధిక్కరించెద
యముగా మద్దాలి... 63

మ. విజితాయాసముగాఁగఁ బంచతయు నిర్వేధాప్తి
గా జీవనంబు జగద్వందితయుష్మదంఘ్రిభజనా
పూర్ణంబుగా నిర్మలా, త్మజటివ్రాతనుతాత్మ నా
కొసఁగవే మద్దాలి... 64

మ. గిజిగిల్లాడెడిదీనతఁ బరులకై కేల్సాచుటకాని
నీకు జతైమ్రొక్కదు దీనికిత్తిరిపెపుంగోరాట
ముగఁ వేరి పా, మజిలాయించుటమాన్పు మ్రొ
క్కులిడెదఁ మద్దాలి... 65

మ. విలసత్క్షీరరసానుభూతివలె నీవిఖ్యాతివర్ణింప
నిం, పులెలంగఁ దయచేసి నిల్పఁగదె నాబుద్ధిం
జిదానందధా,మ జగత్సన్నుతనామ శాశ్వత
తమా మద్దాలి... 66

మ. భజనాభావుఁడనాట నతిగతుగా భావింతువే
మో సమ, స్తజగద్భర్తవు నీకు ద్వేషిగలఁడా సర్వం
బు నీసృష్టియా,త్మజుఁగాఁగై కొనకున్న దిక్కుగల
దా మద్దాలి... 67

మ. కుజనాఖ్యాకుఁడ నేను నీవు సదను క్రోశప్రభావుం
డ వింక జడత్వం బెడలించి నాకునిధివై కన్పట్టి
ప్రొక్రుష్టకర్మజనుంగాఁ గరుణింపకున్నఁ గలదా
మద్దాలి... 68

మ. అజఘన్యత్వదుపాస్తినాకొసఁగవేయాత్మేశభూవ
హ్నివాయు జలాకాశగుణాన్వితంబయిన యీ
యుచ్ఛిష్టదేహంబుకర్మజమే నిత్యము భక్తిని
త్యథనమే మద్దాలి... 69

మ. నిజమొప్పారఁగ నాదుకందొవకు నానెయ్యంబు
వేరింటనొప్పుజకోరంబునకుణ్ మదీయహృదయం
భోరాశికిణ్ జందమా, మజామీ నీపదపద్మదర్శ
నమిఁకణ్ మద్దాలి... 70

మ. భజనీయాత్మక నావిశుద్ధి వివరింపం బుద్ధి స
న్నాసిరీతిజామీ నిన్ను నెఱుంగఁదోఁచునెడఁ
గీర్తింతుణ్ సదా వేడుబాల్మజనుండణ్ ద్వద
నుజ్ఞమెట్టులో యిఁకణ్ మద్దాలి... 71

మ. వ్రజముల్ గూడుక గోపగోపికల నిర్వ్యాచ్యైక
భక్తిణ్ బలానుజ నీసేవలొనర్పు భాగ్యముక
కెన్నోనోఁచిరో జన్మజన్మజఘన్యత్వము బాసి
భాసిలుటకై మద్దాలి... 72

మ. కుజరూపంబుల నేమినోచెనొకొనీకుం గానలోను

న్నియా, భుజపత్ర ద్రుపు లారసాలతరు లావున్నా
గముల్ వీచియు, మ్మజనం జల్లని సేవ సేయుట
టనునై మద్దాలి... 73

మ. ప్రజలె ట్లట్లుగ నీవు గోపికలు బెంపన్ సొంపు
గై కొంటకే, భజనల్ జేసినపుణ్యమో గృహావనీ
ప్రాంచజ్జపాకుంద హా, మజయాజాతిలవంగలుం
గములనున్ మద్దాలి... 74

మ. వ్రజడింభచ్ఛటఁగూడి నీవడవిత్రో వంబోవుచో
దర్భగు, ల్బజముల్ నీపదపద్మముల్ తమపయిం
బర్వం బవిత్రస్వనా, మజగత్సార్థములౌట కేను
కృతమో మద్దాలి... 75

మ. గజనిమ్మల్ సురపొన్నలుం బనసలుం గస్తూరు
లున్ మున్నుగాఁ, గుజముల్ గాన; సవల్లవీక
భవదంఘ్రుల్ దోహదాచారథ, ర్మజసంభావనఁ
గాంచనోచుట హాహా మద్దాలి... 76

మ. రజనీచారుఁడు సీతఁ గొంచు జన తద్రక్షః పతిన్
దాఁకి వీఁక జటాయుః ఖగమిాళ్లై నీకొఱకుఁ
దత్కాయంబు సంగ్రామక, ర్మజితంబౌటను నెంత
పుణ్యఫలమో మద్దాలి... 77

మ. నిజవిత్తంబులు సార్థకంబులుగ నిన్ సేవించి
యర్పించి యిం, పుజనింపన్ జరియించుపుణ్య

లకుఁ దత్పుణ్యంబు నీ రెత్తుని, మ్మజిగుల్లొత్తిఫలిం
చునట్టులుగదా మద్దాలి... 78

మ. వ్రజముఖ్యుం డొకఁ డేకతంబ తనకున్ వాలా
యమై నెమ్మనం, బు జెలంగం బొలిగద్దనెక్కిన
దొరా బోసేతురమ్మన్న యా,మజ తైరాభుజియిం
పవత్తువఁట శ్రీమద్దాలి... 79

మ. భజనాభావమతిన్ మదాంధులయి సంపన్మోహ
బుద్ధిం గిజా,గిజ నెన్నాళ్లను దన్నుకున్నఁగలదే
క్షేమంబు సంసారశ,ర్మజనశ్రేణుల కూర్థ్వసిద్ధి
వలనన్ మద్దాలి... 80

మ. అజరాస్థానవిలాసినీ రతిసుఖవ్యాపాదనవ్యక్తవి,
శ్వజిదాదుల్ భవదంఘ్రిభక్తివలె మోక్షశ్రీద
ముల్ గావు నో,మజనున్ నీపదసేవ సువ్రత
ముగా మద్దాలి... 81

మ. యజనంబుల్ పదివేలుచేసిన యనిశ్చైర్యం ద్రాశ్ర
యంబింతెకా,ని జనిన్ మాన్పెడులోకమబ్బదు
తదున్మేషంబు నిన్ గొల్వబ్రే,నుఁ జిగుర్కొన్న
యనంతరంబునఁగదా మద్దాలి... 82

మ. ద్విజుఁడైనం బ్లవుఁడైనఁగాని వినుగీర్తింపం బ్రపు
ణ్యాత్ముఁడౌ, కుజనత్వంబున మత్తుఁడై సిరులు పె
క్కుల్ గల్గి కానుంభరో,మజముల్ గట్టినపుణ్యా
మూర్తియగునే మద్దాలి... 83

మ. ఖజకాదండమెఱుంగునే మృదులశాకస్థాయిరైయుండి వే
ల్లజలిక్తాదిరుచుల్ నుపూయకున కేలాకల్లు సద్బుద్ధిసా
మ్యజనుశ్రేణులపొందునంతమనిన మద్దాలి... 84

మ. భుజియింపన్ నవనీతమై యమృతమై పూదేనెయై నారికే
రజలంబై గుడమై రుచించుమృదుహారంబైన నీరామనా
మజపం బెంతటియోగ్యభోగ్యఫలమో మద్దాలి... 85

మ. ఋజుబుద్ధిన్ విను సంస్మరింపఁగలుగున్ శ్రీశైలకాశీనివా
స జగన్నాథ గయాప్రయాగసువిశేషంబుల్ మహాదానధ
ర్మజపాధ్వాగ్య తపోవ్రతైకఫలముల్ మద్దాలి... 86

మ. త్రిజగద్భర్తయ దేవసేవ్యుఁడు మనోధిష్ఠుండగణ్యార్థదా
యి జితక్రోధుఁడు నీవలెం గలుగునే యింకొక్కనాథుండు క
ర్మజకాలుష్యము బాయ నిన్నె గొలుతున్ మద్దాలి... 87

మ. అజునిం బొక్కిట గన్న వేలుపవు నీయందాపదుద్ధారకా
ఖ్యజగద్గేయముగాఁ బ్రసిద్ధమగు నీకన్నం గృపాశాలి
ప్రేమజెలంగం భరియించువట్లగును శ్రీమద్దాలి... 88

మ. అజహాద్దంభవిజృంభమాణవిపులాజాండంబుదీపై

కరూపజ తేజంబున వెల్గఁజేసెడు భవద్భావంబు
వర్ణింపఁ బ్రహ్మజుఁడైనఁ భవుఁడైన నోపఁగ
లఁడా మద్దాలి... 89

మ. భజనీయైకనిగాఢహుంకృతులు సంభావించి వం
దారువాగ్మిజనశ్రేణికి విద్యలిత్తువు హయగ్రీవా
కృతిఁ నీవు సా, మజచర్మాంబరపూజితాంఘ్రి
యుగళా మద్దాలి... 90

మ. విజయుఁ భీమునివెంటదోడ్కొని రణోర్విఁ
భీము చేతఁ గిరి, వ్రజనాథుం బొలియించి చేసితి
వి నిర్వ్యాజార్థసంసిద్ధి ధర్మజునింగూర్చితు యు
ష్మ్యమాణునిగ శ్రీమద్దాలి... 91

మ. అజరద్భావసుఖోదయాప్తి తనసామ్మైనప్పుడే ని
న్నుపం, చజనుండెంచవలెఁ దదారభటి ప్రాస్వం
బైన యుద్ధామభీ, మజరాభారము తోఁచనీయ
దు సుమీ మద్దాలి... 92

మ. త్రిజగంబుల్ భరియించి ప్రోతు వెపుడుఁ
దేవావళుల్ మెచ్చ నం, డజనుఃకూర్మ వరాహ
సింహ వటుగా ట్సంతౌనజిద్రామ రా, మజిన
శ్రీకలికిస్వరూపములచే మద్దాలి... 93

మ. త్యజియింతుఁ జనినీకృపారసము చేతఁ భీతతం
బాసి దీ, నజనాధారక నిఁ భజించు నెడలఁ

నాబుద్ధికిఁ దోఁతయా, మఱమఁదత్వము నొం
దనియ్యకుము శ్రీమద్దాలి... 94

మ. ధ్వజినీసంగ్రహ మెంత యున్న బహువిత్తంబు
న్న దివ్యాశుగ,వ్రజమున్నఁ దనవెంటరాదు య
మునోర్వఁ రాదు నీదివ్యనా, మజపం బిచ్చినదా
న సర్వసుఖమే మద్దాలి... 95

మ. భుజగాధీశశయాన యానవిజితాంభోజాత శ్రీ
మద్గదా, గ్రజ మన్నామకతర్ణకంబలర నీకారు
ణ్యపుంబాల గు,మ్మజడిందేల్పవె కామధేనువువ
లెఁ మద్దాలి... 96

మ. ఇజుగుంగూర్చి శరీరయాత్రకయి భూభృత్తీర
ముల్ జేరి చాల జుగుప్సంబడి యుష్మదీయచర
ణాలానంబునం జిత్తసా,మజ మిన్నాళ్లకు నేఁడు
కట్టుబడె శ్రీమద్దాలి... 97

మ. ప్రజనశ్రీ వహియించె మత్సుకృతసంపత్కామ
ధేనూత్తమం, బు జనింపంబడు నీకృపార్భకము
తన్మూలైకనిర్వాణధా, మజసౌఖ్యామృతసిద్ధి నా
కుఁగోదువా మద్దాలి... 98

మ. రజముంబోలె విధూతమై యఘము బాలిశ
సన్మనుండై జనుం,డు జరాత్వం బరుదెంచి జీర్ణ

మతి తోడ్తో రాక మున్నే ప్రణా, మజపస్తోత్రము
లం భజింపవలె నిఁక మద్దాలి... 99

మ. వజరాల్ దీరిచి పేరుగూర్చుగతికై వారంపుపద్యం
బుల, కక్కజ మొప్పఁగ సృజియింపనయ్యె నివిగో
గైకొమ్ము కారుణ్యథా, మజాహారుల్ పచరించు
వేలకొలందుల్ మద్దాలి... 100

మ. ప్రజమై యొప్ప వరింపు మత్కవిత యోసర్వేశ
యోదైవత, ల్లజ సంభావనసేతు నీపదము లీలా
భక్తిపేరింటికమ్మ, జవాదిం దులకించుపాద్య
విధిచే మద్దాలి... 101

మ. ద్విజరాడ్వాహన నేను దిట్టకవిసూతిఁ గశ్యప
ర్షీంద్రగో, త్రజుఁడఁ నామము రామచంద్రుఁడు
భవద్దాసుండ నాయందుఁబ్రే,మఁజిగుర్పఁ శతకం
బు గైకొనుము శ్రీమద్దాలి యుద్దండరా,య!
జయ శ్రీసువిధేయ ! భక్తజనగేయా ! నిత్య
భాగ్యోదయా!. 102

ఉద్దండరాయశతకము సంపూర్ణము.

శ్రీ ర స్తు.

దిట్టకవి రామచంద్రకవికృత

# గొట్టుముక్కల

# రాజగోపాలశతకము.



శా. శ్రీభద్రస్థితులాశ్రితావళుల కక్షీణానుకంపన్
సదా,లాభప్రాప్తులుగా నొనర్చు నజులీలామో
హనాకారమ,యాభీరున్ నినుఁగూర్చి మ్రొ
క్కుదు ననల్పాకల్పతల్పాయిత, క్ష్మాభృత్పన్నగ
గొట్టుముక్కలపురాకా రాజగోపాలకా. 1

శా. హేలాసమ్మిళితత్రిమూర్తిరు[illegible]యా హేరం
బుఁ బ్రార్థించుచున్, గాళీదాసమయూరమాఘు
ముఖులం గైవారముల్ చేసి నిన్, బాలాయం
బుగఁ బూజసేతుఁ గవనవ్యాపారవిస్తారవా,గ్జా
లాబ్జంబుల గొట్టుముక్కలపురాకా రాజగోపా
లకా. 2

శా. చక్రీ చక్రిశయాన; యాననజితాంచత్పూర్ణతా
రాపతీ, నక్రగ్రస్తగజేంద్రరక్షణమతీ! నానాప్ర

పంచాకృతీ, శక్రాశ్మద్యుతిసాగరైకవసతీ సన్మౌని
హృత్పుండరీ, కక్రీడాగతి గోట్టు... 3

శా. అకలంకాశ్రితసౌఖ్యదాయక సమస్తాజాండభాం
డాధినా,యక! యంభోజదళాయతాంబక!విమూ
ఢావేద్యమాయావిడం, బక! సాధువ్రజతాపకృ
త్ప్రబలదృప్యద్దైత్యకాండైకత, శిక్ష సద్రక్షక
గోట్టు... 4

మ. వరనాభీజనితాదిశిల్పక! ప్రభావప్రాభవానల్పకా!
తరితానంతమనోవికల్పక ! యశోదానందకృత్క
ల్పకా, స్థిరసంకల్పక! వేదజల్పక! మహాశేషాహి
రాట్తల్పకా, కరుణాకల్పక గోట్టు... 5

మ.పరమాభీరక! భవ్యభారక! మహాబ్రహ్మాండభాండ
స్థలో, దరనిస్తారక! విశ్వకారక! యశోదాదా
రకా! వేదభూ, ధరసంచారక! సద్విచారక!
సముద్యద్భక్తమందారకా,కరుణాధారక గో...

మ. అజరుద్రాదులు నిన్నెఱుంగుటకు నింతైనన్
సమర్థింపలే,రు జగత్పూర్ణుఁడ వన్నిరూపములు
నీరూపంబులైయుండు నిన్, భజనం బ్రీణితు
సేయ నావశమె నాభాగ్యంబు నీచిత్త మో,
గజరాడ్రక్షక గోట్టు... 7

మ. అసమప్రౌఢి సితాసితద్యుతుల నెయ్యంబారగా

రామకృష్ణసమాఖ్యాయుతులై జనించి యదువం
శస్వామిలో మిమ్ముఁ బ్రద్యసమృద్ధిఁ భజియింతు
దంభహారిరూపారంభ! సంపుష్టరాష్ట్రసనాథార్భక
గోట్టు... 8

మ. సురలానందము నొంద నందునకుఁ జక్షుఃప్రీతి
గా; గోపమంద్రిరసీమఁ పసికందువై వెలయు
మీదివ్యామృతాకారవి, స్ఫురణఁ గన్గొన
నేమినోఁచిరో మహాశూద్రీమణుల్ చింతలే,
క రమానాయక గోట్టు... 9

శా. సారోద్ధారపునూనెలంటి, పునుగుం జవ్వాది
మైనూన్చిపన్నీ రాపై జలకంబొనర్చి కృపనెంతో
గోపికల్ మిమ్ముఁ గన్నారం గాంచుట కెంతభా
గ్యమొకో నందాభీరమాయానరాకారభ్రామిక
గోట్టు... 10

మ. అమరఁ మిమ్మొకపుత్త్రమాత్రులని నెయ్యంబార
నూహించి చిత్రముగాఁ బుత్త్రమహాత్మ్యవం
బులు యశోదానందు లానందభావముతోఁ
జేయుట జన్మజన్మకృత సేవానిష్ఠలౌటంగదాకమ
లాకాముక గోట్టు... 11

మ. జగదీశానులు రామకృష్ణులు చికీర్షాభవ్యలంచుం
బ్రియంబుగ వాక్రుచ్చుచు మీకు నామకర

ణంబుల్ సేయు తన్నంద భా,గ్యగురుత్వంబు భజిం
పశక్యమె కర్ణాగ్రాంచద్ధనుశ్శంఖచ,క్రగదానందక
గొట్టు... 12

శా. సారప్రౌఢిమ పూతనాస్తనగుళుచ్ఛంబుల్ వడిం
బీల్చి; తద్ఘోరాకారము రూపుమాపినసమగ్రున్
నిన్ను సేవింతు; విస్ఫారత్తారకనామకర్ణఫలక
భ్రాజిష్ణు జిహ్వాగ్రవ,ద్గౌరీత్ర్యంబక గొట్టు... 13

శా. హంసల్ జోడుగఁ గూడియాడుగతి నందాగా
రసీమన్ వ్రజో,త్తంసుల్ మెచ్చఁగ వాసుదేవయు
గళత్వవ్యక్తిఁ జిట్టాడుమీ, సంసద్బాల్యవిలాస
ముల్ గనుట కుత్సాహించెదన్ జూపవే, కంస
ధ్వంసక గొట్టు... 14

మ. నిరతిన్ మించిన కాకపక్షములతో నిండారువేన
ణ్వతీ, వరజాంబూనదచంద్రహారములతో వర్ధి
ష్ణువై నందగో, పురవీథిం జెలఁగాడుమీచిఱుత
రూపుల్ చూపరావే;సుదా,కరుణావార్షిక గొట్టు.

మ. అలరన్ సువ్రతమెంతజేసిరో వసంతారామసీ
మన్ జిగు,ళ్లలిన్ మేసెడుబాలకోకిలలయట్లుంబ
ల్కు మీతొక్కుఁబ,ల్కులు చెన్నారఁగ వీను
లన్ వినుటకుం గోపాంగనారత్నముల్, ఖల
దుర్ధర్షక గొట్టు... 16

శా. భావంబందు మిముం స్వవర్ణికులుగాఁ బాటించి గోపాంగనల్, తీవిం బొత్తులనారగించుచు సమష్టిం సేవగావించుత, త్కైవల్యంబు నుతింపశక్యమె సుహృత్సంరక్షణారంభ దీ, క్షావిస్తారక గోట్టు... 17

శా. భాగ్గైమించినపాలువెన్న పెరుగుల్ పైమీఁగడల్ గోపక, న్యాగారంబులు సొచ్చి మెక్కుచును శౌర్యప్రౌఢిఁ గ్రీడించుమీ, నైగారంబు నుతింపనాకు వశమా నా ధూయమానాభ్రగ, ర్వాగుర్వాంఘ్రికగోట్టు... 18

శా. ఏమీ యీనవనీతచౌర్యమని త ల్లిం తేవిమర్శింపన, మ్మా! మన్నింపుమటంచు చూపవె విముక్తాస్యుండవై లోజగత్, స్తోమంబెల్లఁ దనూఘనాఘనతటిద్రూపీ భవత్కాంచన, క్షౌమోద్దామక గోట్టు... 19

శా. చాలం నీపయిచోరవార్తవిని యిచ్చం నీపదాంభోజముల్, ఆలంగట్టెను దల్లియందు తలిదండ్రుల్ నీకునుంగల్గియుం, డ్రా? లీలామయచిత్స్వరూపివట క్రీడానాట్యరంగస్థల, త్కాళీయాహీక గోట్టు... 20

శా. ప్రీతిం మద్దు లులూఖలానియతి నుక్షిం

గూల్చి తదృత్యుసం, జాతద్వంద్వవిముక్తిఁ జేసి
తివి నీసామర్థ్య మార్త్యావన, ఖ్యాతిస్ఫీతము చక్ర
భానుపరిధూతామర్త్యవిద్వేషిసం, ఘాతధ్వాం
తక గొట్టు... 21

మ. గరిమం గోవులు గోపబాలకులు చొక్కంబొంబా
లంబొసిరుల్, బురణింపఁగా వనికేఁగుచోఁ దారత
నంబుఁగా దప్పదాయెఁగా నిజం, బరయఁగా గొల్లఁ
డవై ననాఁడును హిరణ్యాక్షుకుయార్థైకనూ,కర
తాభూమిక గొట్టుముక్కల... 22

శా. ధీరప్రౌఢి భజింతు నాయెదుట నెంతేమాధురీ
సాధురీ, తీరావంబగు పిల్లగ్రోలు ముకుము త్తెం
బొ దలం బింభ మిం, పారఁగా గన్పడవయ్య సా
ధుజనతాపాగ్నిచ్ఛటాటోపకృ, త్కారుణ్యోద
క గొట్టు... 23

మ. మురళీనాదవినోదమాధురికి సమ్మూర్ఛావిధిం
జొక్కుచుఁగా, గరమొప్పారెడు ధేనుకోటియెడ
నీకారుణ్యపూరం బభం, గురతఁగా మించునితాం
తకుంతల మిళద్గోపాదధూళీసము, త్కరపిష్టాత
క గొట్టుముక్కల... 24

శా. కుంజాగారములందు గోపవనితల్ గోపాలకుల్
మీారలుఁగా, బుంజంబై వసియించి చల్దికబళం

బుల్ ప్రేమనన్యోన్యహా, స్త్రాంజల్యంతరభుక్తికై
కొనుట లయ్యావేడ్కకౌనా శర, త్కాంజాతాం
బక గొట్టు... 25

మ. పవిత్రుల్యంబగు పాదసంహతి తృణావర్తుం బ
కుఁ వత్సదా, నవునిం ఘోటకధేనుకాదిఖలు
లఁ మర్దించి నందాదివ,ల్లవులం బ్రీతులసేయునీ
గుణకథల్ వర్ణింతు హైరణ్యరాం, కవదివ్యాం
శుక గొట్టుముక్కల... 26

మ. అమరఁ లేఁగల బ్రహ్మ వంచనముసేయఁ వాని
నన్నింటి నం, దముగాఁ గల్పనసేసి నీవు నలువఁ
వంచించి తం ద్రాదిదై, వము నీవేకద యీశ్వరీ
త్రితయిలోవక్షుస్థలాలానభా, క్కమలాధేనుక
గొట్టు... 27

మ. తిరమై గోగణమొక్కనాఁడు వనవీథిం మేఁత
లాడంగ భీ,కరదావాగ్నులు జుట్టుకున్న సుధ
వేడ్కం గ్రోలుచందాన బం,ధురదావాగ్నులు
గ్రోలి గోవులను తద్గోపాలురఁ బ్రోచితా, గరు
డారోహక గొట్టు... 28

శా. నాకౌకస్సమమైన విప్రతతి నానాయాగముల్
సేయ నీ, వాకొన్నట్లుగఁజేసి తత్సతులు మృష్టా
న్నంబొసంగఁ శుభో, త్సేకం బెల్ల నొసంగినాఁ

డవఁట నీచిత్తం బమూల్యంబు లో, కైకత్రాణక
గోట్టు... 29

మ. మనుతం గోపకు లింద్రయాగ మొనరింపన్ వారి
వారించి శై, లమవై పూజలుగాంచి గోగణము
నెల్లన్ బ్రోవవా! కాలవ,ర్షము రాకుండ నగేంద్ర
మెత్తి సురలార్వన్ భక్తసంరక్షణ, క్రమసంచా
రక గోట్టు... 30

మ. క్రమ మొప్పారఁగ గోపకన్యకలు వస్త్రంబుల్
విసర్జించి య, య్యమునన్ నీరములాడ మ్రుచ్చి
లి తదీయక్షౌమముల్ గొంచుభూ, జముపైఁ బ్రాఁ
కితివందు గోగణపరిక్షా ప్రక్రియాజాగరూ, క మ
హావాంశిక గోట్టు... 31

మ. నిబిడాపీతమరందతుందిలమిళిందీగీతరీతిన్ నెరా,
సొబఁగా నీమురళీరవామృతము లెచ్చోఁ విన్న
గోపీ స్తన, స్తబకంబుల్ పులకింపుచుండు శిఖి
పింఛాలాంఛితాళి ప్రభా, కబరీభారక గోట్టు...

శా. ఎంచన్ శక్యమె నీవిమర్శపసి నెందే మేఁతలాశిం
చుచోఁ, బంచాస్యంబులకైనఁ గాని తలఁజూపన్
రామి గావింతువో, ప్రాంచద్గోనిచయాభివర్త
నగతిప్రౌఢిన్ స్వనద్ఘంటికా, కాంచీదామక
గోట్టు... 33

శా. ఉత్కంఠతఁ వ్రజసుందరుల్ మనములోనూహించ వాంఛల్ సదా, సత్కారించుచుఁ దృప్తిసేతు వట యెంచఁగ శక్యమే! నీసము, దృత్కారుణ్యము బాణదైత్యబహుబాహాఖండనోద్దండరం, గత్కాంఠీవక గొట్టు... 84

మ. వలపుల్ నిల్పఁగలేము నీవుకృపమద్వర్యాంఛ వామంచుల్, లలుగల్పించెడిగోపకామినులనెల్లంగాఁగిటంజేర్చి యి, చ్చలుబూరింతువు క్రీడసల్పి; రతికాంతాలోలగోపాంగనా, కలితస్నేహాక గొట్టు... 85

మ. అమరుల్ తాపసు లాగమాంతనిబిడేహాఁ గానలేనట్టినిఁ, రమణుల్ గాంచుట కెట్లునోఁచిరో మహారణ్యంబుశోధించి సం, భ్రమ మొప్పఁ వినుతిక్రియాముఖరరుద్రాదిత్యగంధర్వయ, క్షమహారాజిక గొట్టు... 86

శా. శ్రీరంజిల్లఁగ నీవు నీపియుఁద నారీరత్న మారీతివిస్తారస్నిలసువర్ణ మాల్యవిధి రాసక్రీడ లాడించుమీ, తారుణ్యంబు మదిఁ భజింతు వ్రజకాంతానేత్రనీలోత్పల, గ్లౌరూపాత్మక గొట్టు... 87

శా. ఆవిర్భూతధృతిఁ సుదర్శనసమాఖ్యాహీంద్రమే తెంచి నం, దావాసంబునఁ జొచ్చి నందుని మహాశాద్ధత్యంబుచే మ్రింగ నెం, తోవేగంబున

దానిజంపి కృప నందుంబ్రోవవా మందర,గ్రావో
ద్ధారక గోట్టు... 38

మ. అమరం గంసనియుక్తఘోటకము శక్రేంద్రా రాతి
జాతిక్ సువి,క్రమమొప్పార వధించి పుచ్చు
టిది నీకర్తవ్యభారంపుఁజం, దమెకా! దుర్జనఖండ
నార్థపరిలుంఠతూత్సావనాపూర్వరం, గమహానాటక
గోట్టు... 39

మ. తనకుక్ మోక్షసుఖంబునిచ్చుటకు నుద్దామ
స్థితిక్ వేడితె, మ్మనిపంపించినమాడ్కి నీకడకు
నొయ్యక్ క్రూరుఁడైయుండి స,జ్జను నక్రూరుని
బంపె కంసుఁడు సదాసంచారయోగ్యత్రయీ,ఘు
నశృంగాటక గోట్టు... 40

మ. ధ్రువభక్తిక్ వినుదోఁడుకొంచుఁజనియక్రూరుండు
కాళిందియం, దవగాహంబొనరించి తజ్జలమునం
దమ్మేటిమీాలీల లు,త్సవమొప్పారఁగఁ గాంచె
ఫాలఫలకాబ్జాతభ్రమచ్చంచరీ, కవినీలాలక
గోట్టు... 41

శా. దభ్రావేతగుణైకతత్త్వమగు నుద్యద్దివ్యతేజంబె
యీా, విభ్రాజిష్ణులు రామకృష్ణులన ద్వైవిధ్యం
బునక్ బోల్చుమీా, సౌభ్రాత్రంబు భజింతు నెమ్మ
ది సుధాసంధానసంతృప్తలే,ఖభ్రూసంగతగోట్టు.

మ. తమకంబొప్ప తిరస్కరించురజకుం దండించి; మే
లైనవస్త్రములెల్లఁ దరియించినావు మధురా
ద్వారంబునఁ నీవెకా,సముఁడా సాంబనిమిత్త
హస్తినగరీసర్వంసహోత్పాటనో, గ్రమహాసా
లిక గొట్టు... 43

మ. జిగిరంజిల్లుసువర్ణభూషణములిచ్చెఁ బాయకుం
డింపుసొం,పుగఁ బూదండ లొసంగె నర్మిలి
సుదాముం డుజ్జ్వలద్గంధచ,ర్చఁ గడుంకూరిచెఁ
గుబ్జ మీకుఁ బరమార్థజ్ఞానసంపత్తిచే, ఖగరా
డ్ఘోటక గొట్టు... 44

మ. నరసింహాకృతి దానవద్విపకళానాశంబు గావిం
చునీ, బిరుదస్ఫూర్తికి లక్ష్యమౌకువలయాపీడా
దులే? ముష్టికా, సురచాణూరకఠోరదుర్భర శిర
స్థానాళ్ళనిర్ఘాతభీ,కరసంగ్రామక గొట్టు... 45

శా. దృగ్లోభత్వమొసర్చె నీమృదులమూర్తిస్ఫూర్తి
సంపత్తి ని, త్యగ్లానిఁ హరియించె నీగుణకథా
తత్త్వంబు; నీమాధురీ,వాగ్లీలల్ వినసొంపులయ్యె
మధురావాసప్రజాశ్రేణికిఁ, కగ్లాపంబక గొట్టు.

మ. అనుమానింపక మేనమామయని మోహంబింత
యుఁ లేక తా, మునుముఁ ముష్టికముఖ్యమల్ల
పతనంబుల్ విన్నవాఁడౌట యీ,సున గర్జిల్లెడి

సాధుసజ్జనజిఘాంసుఁ గంసు నిర్జింపవా, కనకత్రా
మక్ష గొట్టు... 47

శా. తాళంబుల్ ధరియించి నారదుఁడు గీతంబుల్
పఠించెన్ శతో, ద్వేలప్రౌఢిమ నాడి రచ్చరలు
దోగ్యవీథిన్ బ్రవర్షంబులై, రాలెం బుష్పాలు
కంసహింసనసుఖప్రంబందు రాథాస్మృగా, తూలీలా
దిక గొట్టు... 48

శా. కారాగారమునందు నున్న జనవర్గంబుం గటాక్షిం
చి వి,స్ఫారత్ప్రౌఢిమ నుగ్రసేనునకు రాజ్యప్రా
ప్తిగావించి దో,స్సారశ్రీమధురన్వసించితివి చం
చచ్చంద్రికాకారశ్రృం, గారస్మేరక గొట్టు... 49

మ. అమరుల్ మానివరుల్ సమస్తనృపతుల్ హ
ర్షింప సంభారక, త్వముచే యాదవసింహులై
మధురలో వర్ధిష్ణులై నిత్యసం, భ్రమముల్ గాం
చుమిముఁ భజింతు మదిలో బ్రహ్మాదిగీర్వాణ
లో,కమహాపూర్వక గొట్టు... 50

మ. పరమామోదధురీణబుద్ధి వసుదేవప్రార్థనం జేసి
స,ద్గురుఁడౌ గర్గమహామునీశ్వరుఁడు కోర్కుల్ నిం
డి దైవార సు,స్థిరతన్ మిమ్ముపవిత్రవంతులుగఁ
జేసెన్ దానసద్యశ్శుభం,కర విజ్ఞానిక గొట్టు...

మ. ప్రవణన్ సర్వజగద్గురుత్వకలనన్ బాటిల్లు

మీకుఁ మహోత్సవమొప్పారఁగ విద్యలెల్ల
గరపెఁ సాందీపుఁ డాచార్యధర్మవిశేషంబున
నెంతవింత గిరిశబ్రహ్మాదిదైవప్రతీక్ష్యవిరాడ్రూ
పక గొట్టు... 52

మ. అణుమాత్రంబున దక్షిణార్థమని నిన్ బ్రార్థింపఁ ద
త్సూను మా, రణమైపోయినవానిఁదెచ్చి గురు
నారాధించునీకార్యమై, పుణి వర్ణింపఁగ నీప్రసి
ద్ధికి నెవ్వాపాందార వందారుర, క్షణతాత్పర్య
క గొట్టు... 53

శా. భావంబందు విరోధవహ్ని దహియింపన్ వచ్చి
పల్మాఱు రోషావేశంబునఁ దారసించిన జరాసం
ధున్ బరాభూతనా, నావైదగ్ధ్యనిజేసినావు వ్ర
జకాంతానిత్యకారుణ్యలే,ఖావాత్సల్యక గొట్టు.

మ. గుణహీనుండయి తారసించుయవనుం గొంపో
యి యున్మీలితే, క్షణుఁడౌ నమ్ముచికుందుచేత న
తనిం జంపించి తదూర్జ్వవర, ప్రణతుల్ గైకొని
ప్రీతినొందిననిన్ బ్రార్థింతు సన్మానిర,క్షణ దా
క్షిణ్యక గొట్టు... 55

శా. నీపాండిత్యము లెక్కసేయ తరమే నిర్మించినా
వౌ మహాకూపారంబున ద్వారకాపురము లో
ర్కల్మిఁ దత్సంస్మృతిం, బాపౌఘుంబు తొలంగు

టంత సకలబ్రహ్మాండనిర్మాణదీ, క్షాపారస్త్వక
గొట్టు... 56

మ. సరసీజాసనునాజ్ఞ నాత్మతనయుఁ సౌదామినీవి
గ్రహుఁ, వరకన్యామణి నిచ్చెరైవతుఁడనర్ఘా
చీనజఁ రేవతిఁ, నిరతిఁ శీరికి నిత్యనామభజ
నానితోప్యపకారప్రియం, కరవైమానిక గొట్టు.

మ. కృపణుఁ జైద్యునిదోలి తద్విహితురుక్మిం జాల
భంగించి శౌ, ర్యపటుత్వంబునఁదెచ్చి రాక్షసవి
వాహస్ఫూర్తిచే రుక్మిణిఁ, విపులప్రేమవరించి
నాఁడవు శుభాప్తిఁ గోపికాచిత్తనై, కపరా
స్కంధిక గొట్టు... 58

మ. అభయుఁ శ్రీసతులాట రుక్మిణియు సత్యాజాంబ
వత్యర్కజా, తరుణుల్ లక్ష్మణయుఁ సుదంతయు
సుభద్రామిత్రవిందల్ శుభ,స్థిరతఁ నీసతులైరి
ఘోషనిలయశ్రీరాజ్యధారాదిత, స్ఫురతాధూ
ర్తక గొట్టు... 59

మ. త్రిజగద్బాధకు నుగ్రదైత్యు నరకుం దీవ్రాజిరం
గంబులో, ధ్వజినీయుక్తముగాఁగఁ ద్రుళ్లడఁచి
తద్బంధీకృతానేకభూ,భుజకన్యామణులఁ వరించి
తివి సంపూర్ణానురక్తిఁ గదా, గ్రజదైత్యాం
తక గొట్టు... 60

మ. పదియార్వేవురుగోపకన్యకలునుఁ భార్యాష్టకం
బుఁ శుభాభ్యుదయంబొప్పఁగఁ బుత్రపౌత్రనిచ
యంబుఁగల్గు తత్తత్ప్రియ, ప్రదసంసారివి నిత్య
భక్తి నిరతవ్యాసాంబరీషాదిభ, క్తదయాకారక
గొట్టు... 61

మ. అనయంబుఁ నిను పారిజాతకుసుమం బర్థింప
మేలందుఁ జ, య్యన నింద్రాదుల గెల్చి తెచ్చితివి
సత్యావాంఛితార్థంబునం, దనమందారము వల్ల
వీనిచయచేతఃపంజరాంతర్మిళ, ద్ఘనకేళీశుకగొ
ట్టు... 62

మ. ప్రసభప్రాఢిప్రసేనుజంపెనని సత్రాజిత్తు నీయరిదు
నిం,దన మర్థించినఁ దచ్ఛమంతకనిమిత్తంబేగి యు
గ్రాజిలో, వెసభల్లూకపతింజయించి మణినీవేయి
చ్చితౌ భక్తము, ఖ్యసమాసాధ్యక గొట్టు...63

మ. సముదంచద్గతి నీవు పాండుసుతపక్షంబైన కారు
ణ్యసం, భ్రమ మేపారఁగ హాస్తినాపురముఁ జేరం
బోవు నెయ్యంవుఁజం,దనువర్ణింపఁ దరంబె! సాము
జపరిత్రాణార్థచక్రప్రశి, క్షమహావక్రక గొట్టు.

మ. ఖచరాధీశ్వరుఁ దోలి ఖాండవవనగ్రాసంబు గాం
డీవిచే, శుచికిఁ దచ్ఛుచిచేత గాండివధనుస్తూ
ణీరముల్ క్రీడికిఁ, బ్రదురంబొప్ప నొసంగఁజే

సినవినుకా బ్రార్థింతు నంభోరుహా, క్షచిదానందక
గొట్టు... 65

మ. అనిలో బాణుని శోణిపట్టణమునం దబ్జాక్షుఁ
డీశుం జ, యించెనటం ద్రాతఁడెనీవు నీవెయతఁ
డత్తునైకసువ్యక్తు లొ,య్యన మిాలోపల పో
చ్చుతగ్గులనికద్దా! సాధుసత్కార్య ద,క్ష నృహా
ర్యక్షక గొట్టు... 66

మ. త్రిజగత్కంటకు బాణదైత్యు ననిలోఁదీవ్రంబు
గాఁ దాఁకిత,ద్భుజముల్ద్రెంచి యుషాసమేతు
ననిరుద్ధుందెచ్చి యొప్పారునికా, భజియింతుకా
బదపద్మసంజనితశుంభద్వాహినీదిగ్ధభ, ర్గజటా
వాటిక గొట్టు... 67

మ. సరటాకారము మానిశాపకలనకా సంప్రాప్తమైనం
బరం, పరశోషిల్లుచు నికా భజింప నృగునిం బా
లింపవా! కూపగ,హ్వరముంబాపి కృతార్థుజేసి
భళిరే! యార్తార్తపీడానిరా, కరణవ్యాపక
గొట్టు... 68

మ. ఎవరైనకా మిమునిందజేసిన జయంబెట్లొందుఁ
దా! రాజనం,చు వెసకా మిమ్ముహసించి రుక్మియు
మిముకా సోల్లుంఠనంబాడి య,ద్వివిదుండుకా
నశియింపరే హలధరోద్వృత్తికా సురారాతి
శుష్కవనీపావక గొట్టు... 69

మ. యమునం దా వసియించుబోటి కిలవ్రయ్యాల్ చేసి
రప్పింపఁడే, రమణన్ రాముఁడు లాంగలాగ్ర
మున మీరాజత్ప్రభావంబు లయ్యామరశ్రేణు
లకైన నెన్నవశమా నా! సంగరాభంగశార్ఙ్గమ
హాకార్ముక గొట్టు... 70

మ. నిమిషార్ధంబున సూతునైమిశమునన్ నిర్జించినన్
శౌనకాదిమునుల్ వేగహలాయుధుం డతనినెం
తేజీవితుంజేసె లోకము లెన్నఁగ నిబిడానురాగ
మున రంగద్రుక్మిణీదత్తహృత్కమలారాత్రిక
గొట్టు... 71

మ. కురురాజన్యుఁడు భీతినొందఁ హాల మత్యుగ్రం
బుగన్ సాచి తత్పురి యొడ్డేర్పడ గడ్డ యెత్తె
బలభద్రుం డండ్రు; మీశౌర్యవై ఖరి మీకే తగు
గాక యొక్కరికనా కౌంతేయ సద్భోగభాగ్య
రమాస్థాపక గొట్టు... 72

మ. అరిభావంబుననైనఁగాని నిను నిత్యంబాత్మఁ
జింతించినన్, బరమానందపదంబు సంభవిలు
కార్పణ్యంబుచేఁ బౌండ్రకుం,డరినై నిన్నె భజిం
చి ముక్తిఁగనె దేహాంతంబునన్ గాలపుష్కర
ముక్తేచక గొట్టు... 73

మ. గరిమన్ నిన్ను బరీక్షసేయ భవదాగారంబులన్

జేరి నిర్జరమౌనీంద్రుఁడు మోసపోయెను భవ
ద్రాఘిష్ఠమాయాసముత్కరపాథోనిధియందుఁ
గూలి దరిజెందఁ లేక సాధుప్రియంకరసంకల్పక
గోట్టు... 74

శా. రంగద్ధర్మజరాజసూయమఖసంరక్షాప్తికై భీము
చేతం గర్వాంధుజరాసుతుం గెడపి తద్ద్రవ్యం
బుసాధించి ప్రీతిం గౌంతేయుల దన్పినాఁడవు
భళీ దివ్యాంగవల్లీమిళద్గాంగేయాంశుక
గోట్టు... 75

మ. పటిమన్ ధర్మజుచేతఁ బూజఁగొనునిన్ భర్జించి
చైద్యుండు దుర్ఘటముల్ బల్కిన తచ్ఛిరంబు
సభవారల్ మెచ్చ చక్రాహతిన్, ఘటికామాత్ర
ములోన ద్రుంచితివి నక్రగ్రస్తఖిన్నేభసంకటని
ర్మోచక గోట్టు... 76

మ. అమృతాంధఃపథగామి సౌంభకపురస్థాఖిలసా
ల్వాదులన్, సమదాటోపులద్రుంపవే సుజనతా
సంరక్షణార్థంబు చక్రము సారించి సురావనార్థ
బహుధాకర్తవ్యుడై తేయసంఘమ్మృగాఖేటక గో
ట్టు... 77

మ. చెలువొప్పారఁగ నీకుఁజేరెఁ డటుకుల్ చిక్రోడ
భక్తిక్రియాకలనన్ దెచ్చి కుచేలుఁ డర్పణమొ

సంగన్ వాని కీనేర్చితా, పాలుపొందన్ గృపచే
సమస్తవిభవంబుల్ దేవకీగర్భశశం, ఖలసన్మార్తిక
గొట్టు... 78

మ. స్ఫుటసద్భక్తియుతాత్మః ద్వైనబహుళాశ్వన్
నిత్యసత్యవ్రతో,ద్భటురాజర్షినిగాంచిపూజగొని
తద్భావంబునన్ నీవు పర్యటనంబందితివార సన్ము
నిమనీషారామ నిస్ఫూర్తిసం, ఘటనావైచిత్రిక
గొట్టు... 79

మ. అకలంకస్థితి తల్లి వేడిన వరం బాలించి పాతా
ళలో, కకృతావాసులతన్మృతార్భకుల వేడ్కన్
దెచ్చుసద్యఃకృపా,ర్థికులన్ మిమ్ముభజింతు పార్థ
శుభకృద్దీశారహాస్యప్రసం,గకళాబోధక గొట్టు.

మ. శుహానామతానితవచ్చి యాదవులగ్రైకోకన్ సుభ
ద్రన్ మహా,మహుండై చేకొని పోవునర్జునుని
సన్మానించు నీసౌహృదం,బహహా! యెన్నదగం
బెహంసడిభకానోన్యశ్న తాంహేతువి,ర్గహస్య
జ్ఞాయిక గొట్టు... 81

మ. అబలాగర్భము గావబూని యది గాయన్
లేమికిన్ రోసిబా,డబుడెగ్గాడిన మాన్పి తత్సుతు
లజాడల్ జూపి సత్కీర్తినొం, దబడెన్ పార్థుఁడు
నీసహాయపటిమన్ దైత్యఘ్నతోదృష్టవి, క్లబ
బృందారక గొట్టు... 82

మ. కపివంశాగ్రణి యైనవాయుజునితో గర్వించి
గాండీవి మో,సపడన్ గ్రీడికి బాగొసంగ హను
మన్ సాధించి పార్థధ్వజా,ధిపుఁగా వించితి వత్సు
యచ్ఛదసమృద్ధిద్రౌపదీమానభం,గపరి త్రాణక
గొట్టు... 83

మ. దవమున్ బోలె మహర్షిభిక్షయని రాఁ దచ్ఛాం
తికై ద్రవ్యమున్, లవమాత్రార్పిత శాకపారణ
మువల్లన్ సేయవా తృప్తి! మే,ల్గవయం బ్రాణుల
కెల్ల భండనకళాఖండీభవద్దంతవ,క్త్రవిదూరాదిక
గొట్టు... 84

మ. కురురాజన్యుఁడు వాసవాత్మజుఁడు కోర్కుల్
మీఱఁగా నిన్ను సం, గరసాహాయ్యము వేఁడ
రాజునకు వేడ్కన్ సేనలంబంపి నీ, వరయన్
సారథివైతి వర్జునున కత్యంతాప్తిచేఁ గోటిభా,
స్కరతేజస్విక గొట్టు... 85

మ. అమరం గౌరవకోటికెల్ల పటుశౌర్యప్రౌఢిమన్
విశ్వరూ,పముజూపించుచు విందుసూతజుఁ డోన
ద్వన్ భోక్తవై రాయబా, రమువాటించిననిన్
భజింతు హితసంసారార్థలీలాధృతాం, గమ్ము
పాలాకిక గొట్టు... 86

మ. అసమప్రౌఢిమ సైంధవుం గెడప దీక్షాయత్తుఁ డైన

ట్టియిం,ద్రసుతుం బ్రీణితుసేయఁ దజ్జయనిమిత్త
వ్యాప్తికై యవ్విభా, వసునిం గప్పితి వెంతవింత!
భజనాపారీణతద్ జ్ఞాపవ,ర్గసుఖప్రాపక గొట్టు...

మ. అమరం గర్ణుని నాగపాశమును ద్రౌణ్యాభీలది
వ్యాస్త్రముఁ, సముదంచద్ధృతరాష్ట్రజృంభణ
ము గాంధారీవిచారాగ్నియుఁ, గ్రమయత్నం
బులమాన్పి పాండవుల వేడ్కంబ్రోచినావార
భ,క్తమనోరంజక గొట్టు... 88

మ. విలసద్భవ్యభవత్తనూభవులకుఁ విద్యాగురుల్
మూఁడుకో, టులపై నెన్బదివేలమందియట తో
డ్తో వారికిఁ సంఖ్యసం, ధిలగాఁ బుత్త్రకు లెన్ని
యర్బుదములో నీకగ్రపుత్రీభవ, త్కులహంసా
శ్వక గొట్టు... 89

మ. ఉరుశౌర్యాఢ్యుఁడు రుక్మిణీసతికిఁ బ్రద్యుమ్నుం
డు నమ్మేటికిఁ, వరపుత్త్రుం డనిరుద్ధుఁ డాఘనున
కావజ్రాభిధానాంకుఁ డీ, సరణిఁ వంశసమృద్ధిగ
ల్గిన మహాసంసారి వౌరౌర సా, గరజామాతృక
గొట్టు... 90

శా. నీజాగ్రత్ స్థితి సాధురక్షణకళానిత్యంబు నీలీల
నా, నాజంతుప్రజజన్మపోషణలయానందంబు నీ
మాయ భా, షాజాన్యాదిదురాసదంబు యదు
వంశక్షీరవారాశిరా, కాజైవాతృక గొట్టు...

శా. ఆభీలాసురవంచితుం డయినబ్రహ్మన్ వేదవి
ద్యాఢ్యున,శ్లాఘామోదితుఁ జేయునీకు ఝషలీలా
మూర్తికిన్ దీనర, క్షాభారంబు వహించు టెంత
పని; హస్తన్యస్తగోవర్ధన, క్ష్మాభృత్కందుక
గొట్టు... 92

మ. రుచిరప్రేమ గుచేలు నుద్ధవుని సక్రూరున్ బరీ
క్షిత్తు న,మ్ముచికుందుం గరుణించినట్లు పరమా
త్మున్ గాంచనాంచన్మహా, విచయున్ నిన్ను భజిం
తు నెమ్మదిని లక్ష్మీనిత్యభోగానురా, గచిరంభా
వుక గొట్టు... 93

మ. అలబృందావనవీథి ధేనువుల నెయ్యంబారఁ
బాలించువే, ళల నీ వందొకగోవుగన్పడిన వెళ్లం
దోలితో నేను న,ట్టుల నజ్ఞానిని నన్నుబ్రోవు మిఁ
కఁదోడ్తో భక్తరక్షాసమా,కలితారంభక గొట్టు.

శా. తోరంబైనమదీయభాగ్య మది యెంతో కాని మ
జ్జిహ్వాకున్, సారస్యంబుగఁ గ్రోలఁగాఁగలిగె
యుష్మన్నామచింతాసుధా, పూరం బాప్తతచేఁ
బ్రథాననగరద్యూభలోకవైకుంఠశ్రీం, గారద్వా
రక గొట్టు... 95

శా. సంప్రీతిన్ నినుసంస్మరించెదను మత్స్వాంతం
బులో నిల్వవే!, సుప్రజ్ఞానిధులైనభక్తులమదిన్

ప్రాంపాప్పఁగా నీవు ని,త్యాప్రామాణ్యవిధిక్షవసిం
తువని యం ద్రంగీకృతాచత్పిశం, గప్రావారక
గొట్టు... 96

శా. నీసౌందర్యగుణంబు లెంతు మదిలో నిన్నే
నుతింతుక్ నెఱా, నీసంకీర్తనలాచరింతునను నీని
త్యానుకంపాసుధా, కాసారంబునఁ దేల్పు మిం
క కమలాగండస్థలీపత్రరే, ఖాసంలేఖక గొట్టు...

శా. వాలాయంబుగ నిన్నె కొల్తు నినుఁ గైవారంబు
గావింతు నీ, లీలల్ వర్ణనసేతు నీదుకథ లాలిం
తుక్ భవత్సత్కృపా, ప్రాలేయప్లుతుఁ జేయవే
నను రమారామామణీపాదలా, క్షాలిప్తాంబక
గొట్టు... 98

మ. నవనీతాత్ముఁడ వీవు నేగృపణుఁడక్ నన్నేల న
శ్రద్ధసే, యవిచారింపకుఁ బ్రేమ నిల్పుము కరం
బర్థింతుఁ గైకొమ్ము మ, త్కవితారామము శౌన
కాదిమునిబృందసాంద్వాంతమాకందవృ, క్షవిరాజత్పి
క గొట్టు... 99

శా. శ్రీమన్మూర్తివి నీవు నిక్కదలఁతు నీచే సంపదల్
గాంతు నీ, కైమోడ్పుల్ పచరింతు నీవలనమో
క్షప్రాప్తిసాధింతు నీ, కామోదంబుగఁ గూర్తు
నామనసు నీయందే సుమీ సత్యరే, ఖామాహా
త్మ్యక గొట్టు... 100

శా. శ్రీమత్కాశ్యపగోత్రదిట్టకవివంశీయాధ్యుఁడన్
రామచంద్రామాత్యాంకుఁడ నీకథల్ శతకప
ద్యారూఢివాక్రుచ్చితిన్, స్వామీ యీశతకం
బు గైకొనుము నీసామర్థ్య మత్యంతమౌ, గావు
తోఁ బ్రేమక గొట్టు... 101

మ. పరగం గ్రిందటిజన్మజన్మముల నిన్ బ్రార్థింప
లేనైతి వి, న్నరరూపంబునఁ గొల్వఁగంటి నిటతో
నాక శ్చబ్సస్మృక్తి ను,స్థిరమై యర్జునసాహసార్థభగ
వద్గీతాగహాస్యప్రియం, కరవాచాలక గొట్టుము
క్కలపురా కా రాజగోపాలకా. 102

గొట్టుముక్కల రాజగోపాలశతకము
సంపూర్ణము.

---

# పీఠిక.

ఈశతకము రచించినకవి దిట్టకవి రామయోగి దీక్షితులు. ఇతఁడు కాశ్యపగోత్రుఁడు. నందిగామ తాలూకా గొట్టుముక్కలనివాసి. చిరకాల మీకవి నూజవీటిలో నారయప్పారావు బహద్దరువారి యాస్థానమునందుఁ బౌరాణికుఁడుగ నున్నటులఁ గవివంశీయులు చెప్పుచున్నారు. ఇక్కవి రంగారాయచరిత్రము రచించిన నారాయణకవిమనుమఁడు. ఈయన తండ్రి సుందరరామసూరి. తాత యాదవరాయకవి. జనకపితామహులప్రతిభావిశేషములు తెలియవు.

రామయోగికవి సంస్కృతమున నసాధారణపండితుఁడు. ఒకమాటీకవి తమప్రభువర్యునితోఁ గాంచీనగరమునకేగి యటనున్నమహాపండితులతో వ్యాకరణశాస్త్రమునఁ జాలదినములు వివదించి విజయమంది బ్రహ్మరథము పీతాంబరసత్కృతి నూటపదియాఱురూపాయలు సభాసత్కారము సేలువులు బహూకృతిపొంది గృహాభిముఖుఁ డాయెనట. నాఁడుమొదలు నేఁటివఱకుఁ గాంచీనగరవాసులు

ఆంధ్రులు విద్యావాదములలో గడుసరులనియు నెవరిచే జయింపఁబడని కాంచీనగరపండితుల నాంధ్ర నియోగి జయించెననియుఁ జెప్పుకొనుచుందు రని కవి వంశీయులు చెప్పుచున్నారు. వ్యాకరణశాస్త్రపారంగతుఁడును పండితోత్తముఁడు నగురామయోగి రచించిన యీ శతక ప్రశస్తినిగూర్చి ప్రత్యేకముగా మేము చెప్పవలసిన దేమియు లేదు. ఇక్కవి సంస్కృతమునఁ బెక్కుగ్రంథములకు వ్యాఖ్యానములు మతవిషయికఖండనగ్రంథములు రచించెను. కవి తన యుత్తరవయస్సులోఁ దనగ్రంథసముదాయముతో మచిలీపురమునందు నివాస మేర్పఱచికొనెను. ఉప్పెనవచ్చుటచేఁ గవివ్రాసిన గ్రంథములన్నియుఁ జరాస్తియంతయు సముద్రార్పితమైనదనియు నెటులో దైవవశమున రుక్మిణీపతిశతకముమాత్రము బైటపడినదనియుఁ గవివంశీయు లెంచింగించిరి. మాకులభించినరుక్మిణీపతిశతకమాతృక కొండపల్లి పీచుకాగితములపై అగురుసిరాతో వ్రాయఁబడియుండెను. పుస్తకము ఒకటి రెండుమాఱులు సముద్రస్నానము గావించినటులె యుండెను. కొన్నిచోటుల వర్ణములు పద్యపాదములు చెరిగిపోయెను. కావుననే

పూర్వగ్రంథములన్నింటికిఁ బ్రత్యంతరములు వ్రాసి నలేఖకులు దీనిని ముట్టుకొనరైరి. ఇఁక నుపేక్షించిన యెడల నీపుస్తక మదృశ్యమగునేమో యని శ్రమ చేసి యథాశక్తిని శుద్ధప్రతిని సిద్ధపఱచి ముద్రణ మున కొసంగఁగలిగితిమి.

ఈకవివ్రాసిన రెండుశ్లోకము లొకజీర్ణపత్రము మీఁదనుండఁగ యథారూపముగ వ్రాసితిమి. ఈశ్లో కద్వయమువలన నీకవి సంస్కృతకవితానైపుణ్యము బోధకాఁగలదు.

శ్లో. మేఘుస్స్వనీరదఘనాఘనతా ప్రసిద్ధి
స్సంపశ్య కేవలఘనం సరదం ప్రసిద్ధం
శ్రీనారయప్రభువరం సరదం ప్రసిద్ధం
సంపశ్య కేవలఘనం ముఖవర్ణ భేదీ
మోఘూభవ త్యనుప మోహి సరాజవర్యః.

శ్లో. విరాజతే లోకవిరాజిరాజతా
విభాకరే సంస్థితి మేతిహంసతా
సరాజహంస స్సమదీపిసర్వదా
సదాఖ్యయా నాగయ భూపవర్యః.

ఈకవి కాంధ్రకవితయం దంతనైపుణ్యములేదు. కాని సుప్రసిద్ధకవి వంశజుఁడును పండితోత్తముఁడు

నగుటచే నీశతకమును రామయోగి మనోజ్ఞముగ వ్రాసియున్నాఁడు. చిరకాలమునుండి మూలఁబడి యున్నయీశతకము శుద్ధప్రతి వ్రాసికొనుట కిచ్చి ముద్రణమున కవకాశము కల్పించినఁ గవితమ్ముని కుమారు లగుదిట్టకవి సుందరరామయ్య శర్మపాకయాజి గారిని బ్రశంసించుట ధర్మము.

కవి రమారమి యేఁబది సంవత్సరములపై కాలమున నూజవీటిలో మరణించెను.

•

నందిగామ.
1-4-25

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

దిట్టకవి రామయోగిప్రణీత

# రుక్మిణీపతిశతకము.

---

ఉ. శ్రీకర సారవాగమృతశీకర చారుకలాకరాస్యచా
మీకరచేల భీకర సమీకరమాకర వారిజాత
మై,త్రీకర పాదపల్లవసుధీనుతమానిత దీనమా
నవా,నీక రథాంగబంధురజనీకరలోచన రుక్మిణీ
పతీ. 1

చ. జలధరనీలగాత్ర దనుజవ్రజకంఠఖనిత్ర కల్యవా
గలఘుసుపర్వరాణ్ణుతియుతాత్మవిచిత్ర చరిత్ర
వర్తులా,కలితకళత్ర పాపలతికాశితదాత్ర పతత్రి
నేతృప,త్త్ర లలితవక్త్ర సంకుమదరాజితచిత్రక
రుక్మిణీపతీ 2

ఉ. బాల నిశాకరాకలితఫాల దయాసువిశాలలో
లనీ,లాలకజాల గైరికసమంచితచేల తమాల
భూమిజా,తాలలితాంగజాలపవయాన భవస్తుత
శీల దేవతా,పాల విరోధికాల శిశుపాలవిపా
లక రుక్మిణీపతీ. 3

ఉ. దండితవైరితండహిమధామ సమంచితతుండవా
జిర్యాట్కాండ విశాలకుండలయుగద్యుతిమండిత
గండసుత్తవే,దండపిచండ సద్మగతదండక పాతక
సంతమిశ్రమా,ర్తండ నమస్క్రియాపరసుధాశ
నిమండల రుక్మిణీపతీ. 4

ఉ. భూసురవారతోష పరిపూర్ణసుధాసమభాష
దేవతా,గోసముదాయపోష జితఘోరతరాద్భు
తదోష భూషణో,ద్భాసితవేష దాసజనపంక
జపూష చతుర్ముఖాదిశ,స్తాసమసన్మనీష విబుధా
హితశోషణ రుక్మిణీపతీ. 5

ఉ. అంగజరూపసన్నుతసితాంగ విహంగతురంగ స
త్కృపా,పాంగరథాంగసంగ పరిపాలితదేవకదంబ
మాఏసా,రంగతమఃపతంగ కలుషాంగద భంగర
థాంగభీతిమ, త్సంగరరంగఖండితనిశాకరపుంగవ
రుక్మిణీపతీ. 6

ఉ. దేవ మహానుభావ ఖనదీధరసన్నుతభావ దైత్యవి
ద్రావ భయానకౌఘగదదావ సమంచితభూరి
కంకణా, రావ ముఖాంబుజాతవిసరన్నయ
భావ కరాంగుళీధృత,గ్రావ దయాకటాక్షపరిర
క్షితసేవక రుక్మిణీపతీ. 7

ఉ. రక్షితనాగభాసురపరాగ భయంకరశౌర్యవేగ

సం, శిక్షితదైత్యపూగ మునిసేవితపాదపరాగ
సత్కటా, క్షుక్షుణయోగ యోగబలఖండితకిల్బి
షరోగ రాగర, క్తక్షపణానురాగ కృతదైవత
భోగక రుక్మిణీపతీ. 8

ఉ. రాజిత తేజ గుప్తగజ రాజమనోజ్ఞకళామనోజసా,
మ్రాజబిడౌజ వక్త్రసదృశాంబుజ రాజనికారిలోచ
నాం,భోజ దయాకటాక్షపరిపోషితగోపసమాజ
భక్తగో, భూజ గృహీతసర్వజనపూజ గదాగ్రజ
రుక్మిణీపతీ. 9

ఉ. కోమలనీలదేహ మునికుంజరనిర్మలచిత్తగేహ పు
త్రామితమోహ భక్తనివహాపదుషర్బుధవారివా
హ ఘో, రామరవైరిదావ విశదాననవాహవి
పూరితవ్రజ,స్తోమలసత్సమీహ నతశోకతమోప
హ రుక్మిణీపతీ. 10

చ. చతురవచఃకలాప మణిచారుకలాప మనోజరూ
ప స, స్తుతిపరమేరుచాప పరిశోధితదారుణపాప
గోప దు, ర్మతిదురవాప ఘోరరిపురాడ్గతిగర్వ
విలోప శాపసం, హృతమునితాప భక్తజనహృ
త్కమలాతపరుక్మిణీపతీ. 11

ఉ. పాతకకాననవ్రజనిపాతసుహేతి వినాశితామ
రా, రాతి మనోహరాకృతివిరాజితనాథవిచింతన

ప్రణ, త్రాతతభీతి వర్ధితపదాబ్జయుగా శ్రితమాన
వౌఘస,ద్భాతి ముఖాంబుజాతపరిభూతనిశాపతి
రుక్మిణీపతీ. 12

ఉ. విశ్వనివాస విశ్వకర విశ్వవిదూరక విశ్వవంద్య
మో, శాశ్వత విశ్వరూప భవశాసననిర్మలనిర్వి
కార లో, కేశ్వర దేవదేవ నిను నెంతటివాఁడ
నుతింప నోపత, త్ర్యశ్వపురాణపూరుష చిదాత్మ
నిరంజన రుక్మిణీపతీ. 13

ఉ. బంగరుచేలగప్పి సదపాంగవిలోకనలీలనొప్పి న
వ్యాంగదముఖ్యభూషణసమంచితవేషముతోడఁ
గూడి సా,రంగమునందుఁ బూనిననయంబున నా
కు భవత్పదాంబురు, ట్సంగతి నీయఁగోరెదను
సారసలోచన రుక్మిణీపతీ. 14

ఉ. దండము గోపయోషవతకదంబకుచస్థలపత్రలేఖనా
ఖండచమత్క్రియాంచితనఖక్షతచందిరఖండలా
లిత, (?)త్కాండజలోచనావృతసకాశసుదేశలస
త్కవేల సత్తాండవవర్తి నేత్రయుగతామర
సాంఘ్రిక రుక్మిణీపతీ. 15

చ. దరదరవిందలోచన సుధారసభాసురహాసమో
ధరా,ధరధర దారితారి జనతారక తారపటీరహీ
రకుం, దరసమరాళగౌర యశతామరసోదర

భక్తసాదరా, ఖరకరచారుతేజ భవకాననపావ
క రుక్మిణీపతీ. 16

ఉ. తమ్ముల కెమ్మెచే మలినదమ్మగు నెమ్మొగముల్ గర
మ్మును భ, వ్యమ్మగుసొమ్ము కెంజిగురుటమ్ముల వేలుపు
టమ్మకుల్ నివా, సమ్మగుటొమ్ము నెమ్మిపురిసమ్మిళి
తంబగు వేణికుందదం, తమ్ములు గల్గుదేవ మిము
దల్చెద నెమ్మది రుక్మిణీపతీ. 17

ఉ. పాతకతూలసంహతికిఁ బావకకీల నిరంతరంబు కం
జాతభవాప్తబంధుపునిశాకరకోటికిఁ జిత్తభీకరం
బాతతభూతసంతతుల కానగణింపఁగ నీదునామమ
హా, రా!తలఁపంగ రక్తకజరాజితపాదక రుక్మిణీ
పతీ. 18

ఉ వందనమాచరింతు సురవందితసుందరపాద దేవకీ
నందన భక్తచందన సనందముఖస్తుత మామనో
కజేం, దిందిర మందహాసమునఁ దీరగు తావకవక్త్ర
కంజ మిం, పొందఁగఁజూపు మీకనులనొప్పుగఁ
జూచెద రుక్మిణీపతీ. 19

ఉ. సంచితపుణ్యరాశి యగుచంద్రనిభానన నీవుగల్గఁ
గాఁ, గొంచెపుదేవతాతతులఁ గొల్తురు ధీబల
హీనతల్ బయో, దంచితగాంగసైకతమునందు
జలార్థము ద్రవ్వులీల స, త్కాంచననూపురోల్లసి
త కమ్రపదాంబుజ రుక్మిణీపతీ. 20

ఉ. భక్తచకోరజాలపరిపాలనచంద్ర ధురావహాంబు
లై, దిక్తటసంచరద్ద్రుముల దీప్తములౌ భవదీ
యపాదసు, వ్యక్తనఖాంకురంబు లనయంబును
మామకచిత్తవీథి సం, సక్తతనొందఁజేయఁగదె
సారసలోచన రుక్మిణీపతీ. 21

ఉ. నందునియందు నార్ద్రుపదనందినియందు యశో
దయందు నా,మందలయందు మానిజనమండల
మందును భీష్మునందు నే,చందమునన్ గనంబ
డెనో చక్కనిమీకరుణాకటాక్ష మా,చందము
నన్ను వైచ్ఛికము సల్పుము నీ వికరుక్మిణీపతీ.

ఉ. శంకరమిత్ర నీచరణసారస మాత్మనిరంతరంబు
ని,శ్శంకఁ దలంచువారల కసాధ్యమొకించుక లేద
టంచు నే,భాంకరణంబు మీఱఁగ శుభంకరభేరి
గజంబునెక్కి యా,తంకము లేక సాటెదను దార
గుణాకర రుక్మిణీపతీ. 23

ఉ. కోరితి మీపదాంబుజము కూరిమిచేఁ బరదేవ
తాతతిన్,జేర నదెట్లటన్న; మదసిక్తమత్తంగజగం
డమండలీ, చారుతరస్థితింబరగుషట్పద మొందును
గాక యుజ్జ్వల,త్సైరిభమొందునే వికచసారస
వాసన రుక్మిణీపతీ. 24

ఉ. మిమ్ముల నమ్ముకొంటి నిటమీఁద మఱెవ్వరి వేఁడ

నంటి మిా, తమ్ముల గేరునెమ్మొగ ముదంచితరీతిని
జూపుమంటి నా, సొమ్మును నీవయంటి మధుసూద
న నన్గరుణింపుమంటి నా, నెమ్మది మిాపదాబ్జముల
నిల్పుమటంటిని జానకీపతీ. 25

చ. గజపతిఁ బ్రోచినాఁడవని కామినికోర్కులొసంగి
తంచు స, ద్విజునిగుచేలునేలితనివించు భవచ్ఛర
ణంబు వేఁడితిన్, భజనముజేయువారలఁ గృపా
వ,తిఁ బ్రోచెడితంత్రి పాతక, వ్రజములడంచి బ్రో
వఁగదె పంకజలోచన రుక్మిణీపతీ. 26

ఉ. చల్లడమున్ జెఱంగు నిరుచక్కిఁ జెలంగెడుఘట్టి
జాళువా, పిల్లనగ్రోవి ముత్యముల పేరును మేల్మొ
లనూలు మించులన్, గల్లయొనర్చు కుందనపు
ఖండువయొప్పఁ గళిందజాతటిన్, సల్లలితప్రచా
రములు సల్పినదేవర రుక్మిణీపతీ. 27

చ. పరమపవిత్రతావక సుపాదసరోజపరాగరాజి
సం, వరణధురీణతామహిమ భాసిలు గోపకుమా
రపేటికా, స్ఫురదురుభాగ్యరేఖల సమున్నతిఁ
బెంపునుతింపశక్యమే?, హరిహయహేమగర్భుని
టలాక్షులకైనను జానకీపతీ. 28

ఉ. పంకజనేత్ర మిాపతితపావననామ సుధారసంబు
ని, శ్శంకత నానుసత్పురుషసంతతి కెంతపనుల్ పరే

తర్యాట్కింకరచక్రవాళకముగీటడఁగించుటమో
క్షలక్ష్మిచే, సంకలితత్వమొందుటయు సారసలో
చన రుక్మిణీపతీ. 29

ఉ. శక్ర విరించి శంభునుతి చక్రవిరాజిత భూరి
భూష నిర్వక్రపరాక్రమక్రమ నివారిత వైరి
భవల్ల సత్కరో, పక్రమణప్రభావము గృపా
మతి మాకు నొసంగుమయ్య యో, నక్రవినాశ
సంతుషితనాగకులాధిప రుక్మిణీపతీ. 30

ఉ. నెమ్మది నమ్ముకొంటి శయనీకృతశేషఫణామణి
ప్రభా,సమ్మిళితాత్మదేహరుచిచక్రవిడంబితగోత్ర
భిద్ధనుస్సమ్మహితాంబువాహ విలసద్ద్యుతితావక
దివ్యపాదపద్మములు భ_క్తమానవుల దాపుడు
సొమ్ములు రుక్మిణీపతీ. 31

ఉ. దండము దేవదేవ హరి దండము కుండలదీ_ప్తిసమ్మి
ళద్గండ మహాత్మ యోవికచకాండజలోచన
యోముకుంద యో,దండితరాక్షసప్రకరదండము
దండము దండమయ్య యో,కుండలితల్ప మంజు
రుచి కోమలవిగ్రహ రుక్మిణీపతీ. 32

ఉ. నీరధిలోన భూరితరనిర్మలనై జరుగావళుల్ మహా
చారుత మీఱఁజొచ్చి ఘనసారసమేత మదో
త్కటత్రయీ, చోరక సోమకాసురనిషూదన

తన్ దోలుపల్కు లోలిమై, వారిజగర్భు నందిడిన
వారిచరాత్మక రుక్మిణీపతీ. 83

ఉ. కవ్వముగాఁగ మందరనగంబు భుజంగమరాజు
రజ్జుగా, నివ్వటిలం బయోదధి ననేకసురాసుర
కోటి మొత్తమై, క్రొవ్వునఁ ద్రచ్చుచుం; బినపఁ
గొందలమందఁగ నద్రి కూర్మతన్, నివ్వెఱఁ
గొందఁ దాల్చి కరుణించితి వారల రుక్మిణీపతీ.

ఉ. భీకరసూకరాత్మకత బిట్టదరంగ నజాండభాండ
ముల్, వీఁక ధరిత్రిఁజుట్టి యతివీరు హిరణ్యని
లోచనున్ మహోద్రేకముతో విఘాతమొన
రించి విషాణమునందు నీధరన్, జోకయొనర్చి
పూని మునుచొప్పుననుంచితి రుక్మిణీపతీ. 85

చ. పటపటలీనఁ గంబమున బల్విడి వెల్వడి శాతహే
తిను, తకుటనఖరాగ్రఘాతకల ఘాతకశిప్వరివిగ్ర
హాంత్రసంఘటితశిరోధివై విబుధకంటకనూతిని
బ్రోచితీవెకా, పటునరసింహరూపత నుపర్వులుమె
చ్చఁగ రుక్మిణీపతీ. 86

ఉ. వేదపురాణశాస్త్రముఖవిద్య నమేయత దేవతావ
నా, పాదనమంచు వామనత బాగుగఁబూని పద
త్రయంబు స, మ్మోదముతోడ దైత్యకులము
ఖ్యబలీంద్రుని వేఁడి లోకము, త్యాదరణంబునన్
బలికి నర్పణజేసితి రుక్మిణీపతీ. 87

చ. పరువడి రాజసంఘములఁబట్టి కఠోరకుఠారధార
తోఁ, నిరువదియొక్కమాఱువధియించి భయంక
రతత్తనూత్కరోఁ, త్వరదురురక్తపూరదివిషన్న
దిఁ బైతృకతర్పణంబు నిం, పరయఁగఁజేసి భార్గ
వతభాసిలితౌగద రుక్మిణీపతీ. 38

ఉ. దేవతలుబ్బఁగాఁ బిత్రునిదేశమునన్ బవనజం
తుసంతతోఁ, గ్రావనికేఁగి యందనుచరాయితవా
యుసుతుండవై లసద్రావణకుంభకర్ణముఖరాక్ష
సవీరవినాశనంబు సద్భావతఁజేసి రాఘవతభాసిలి
తౌగద రుక్మిణీపతీ. 39

చ. హాలహాతిచేఁ గళిందతనయాపరిభేదనమాచరించి
దోఁ, ర్బలమలరంగ దుష్టమతి బాలిశధేనుకము
ష్టికాసురా, విలయమొనర్చి లోకములవిశ్రుతిఁ
జెందినయోగ్రసాధనా, కలితకరుండవై బలతఁ
గాంచినదేవర రుక్మిణీపతీ. 40

ఉ. సుందరరూపలౌ త్రిపురసుందరులన్ వరియించి
బౌద్ధతన్, బొంకి రయంబునన్ ద్రిపురపూర్వసు
పర్వులఁ జంపునప్పుడౌ, చందురుదాల్చు దేవరకుఁ
జాపశరాసనసాధనంబు లౌ, నందముమీఱఁగా
ననినౌనర్చితివౌగద రుక్మిణీపతీ. 41

చ. తురగమునెక్కి ఘోరతరదుష్కృతసాంద్రమలీ

మనంబునా, తరతమతావిహీనభువి దార్క్కని చే
త నసిఁ ధరించి స,త్వరతఁ దురుష్కసంతతిహతం
బొనరించి బుధావనంబు చే,బరగినకల్కి రూపము
న భాసిలుదేవర రుక్మిణీపతీ. 42

ఉ. మీఱుమనోజుమేనిపస మీఱుసొబంగులతీఱు
ము త్తెఫుం, బెరుసదీడితవ్యమగుపేరు మతంగజ
చారుయానముఁ, దూరు నొయారినెన్నడ; వి
ధుఁ రుచిగేరుమొగంబు సొరునుఁ, వారిజ
జాదిరతుఁగలవారుగదా హరి రుక్మిణీపతీ. 43

ఉ. వాసవుఁ డల్క మీఱి జడివాన మహాశనిసంయు
తంబుగాఁ, జేసిన గోపకుల్ భయముఁ జెంది
పరుంగునునొందఁ గందుకా, భ్యాసకలీలఁ గేల
గిరివర్యముబూని సమ స్తబంధుతఁ, వేసటఁదీర్చి
కాచితివి వేగ జనార్దన రుక్మిణీపతీ. 44

ఉ. ఘోరదరిద్రతాభరవిఘూర్ణితమానసుఁడౌ కుచే
లుఁ డా, దారివచింపఁగా భవదుదంచితపాదస
రోజచింతనా, గౌరవమొప్పఁగాచి పిటకంబులు
చేరెడుదెచ్చినఁ మహేంద్రోరుపరార్థసంపదల
నొందఁగఁజేసితి రుక్మిణీపతీ 45

ఉ. వేణునినాదవిశ్రుతిని వ్రేతలమానసముల్ హరిం
చి యా, జాణలఁ జిత్తభూపరవశత్వయుతాత్మ

లఁ జేయుచుఁ గా విని, ద్రాణమనోజకేళికల రంజిలఁ
జేసిన మీకథాసుధఁ గా, మానసపాత్రమందు
నియమంబుగ నానెద రుక్మిణీపతీ. 46

ఉ. ముద్దియ లెల్ల మొత్తుకొని బుద్ధులు సెప్ప యశోద
కోట ని, న్నొద్దికమీఁదఁ గట్ట మదినోడక వేఁగొ
ని తెచ్చి దానిబ, ల్మద్దుల రెంటిమధ్యను నమర్చి య
గల్చిన వేల్పుపెద్ద నీ, సుద్దుల నెన్న రద్దు లజశూలి
మహేశులు రుక్మిణీపతీ. 47

ఉ. నమ్మను నెమ్మనంబున ననాథజనావన నిన్ను మిన్న నే
నిమ్మహి నన్యదైవముల నెన్న నమందమరందబిందు
జా, లమ్మున నొప్పు నవ్యకమలంబున సమ్మద మొందు
తుమ్మెదల్, క్రమ్ముకొనంగ నేర్చునె వికర్తనమం
దున రుక్మిణీపతీ. 48

చ. కరమున పాదపద్మము ముఖంబునఁ జేర్చి పయఃప
యోధిని, ర్భరరమణీయలీల వటపత్రముపై శయ
నించి యోగమా, ర్గరతిని సర్వలోకతతిరక్షణ
మందున జాగరూకతం, బరగిన దేవదేవ నను బా
గుగ నేలుము రుక్మిణీపతీ. 49

ఉ. ద్రోణసుతప్రయుక్తఖరరోపము చే హాతినొంది
కుంది ని, ప్రాణకుఁడై జనన్యుదరసంగతుఁ డా
యభిమన్యుసూతి ని, ర్వాణఫలప్రదాత యదువర్ధ

న కృష్ణ ముకుంద యన్యనిక్, జాణతనంబునన్
వినుతిసల్పినఁ గాచితి రుక్మిణీపతీ. 50

ఉ. వ్రేతలచేలముల్ మిగుల వేడుకమ్రుచ్చిలి తెచ్చి
వారి న, త్యాతతమానభంగమున నానతశీర్షలఁ
జేయుచున్ మనో, జాతనికేతనంబులకుఁ జాటు
గనుంచ కపాలమందునన్, జేతులుమోడ్ప వస్త్ర
ములు శీఘ్రత నిచ్చితి రుక్మిణీపతీ. 51

ఉ. చిన్నతనంబునన్ విసవుచేపునఁ బాలనొసంగు
పూతనన్, మన్నిగొనంగఁ జేసితివి మద్దులఁగూల్చి
తి బండిసాకునన్, భిన్నముగాఁగఁదన్నితి వభీ
రుత నీచరితంబు నెన్నఁగాఁ, బన్నగభూషణుండ
యినఁ బొల్పడనేర్చునె రుక్మిణీపతీ. 52

ఉ. కొన్నిదినంబులజ్ఞతను గొన్నిదినంబులు శైశవం
బునన్, గొన్నిదినంబులంగనల కూరిమినిన్ మఱి
కొంతకాల మ,త్యున్నతచింతచే వగలనొందుచు
నుందురుగాక నెన్నఁగా, నెన్నఁడు మీపదాబ్జ
ముల నెన్నరు మూర్ఖులు రుక్మిణీపతీ. 53

ఉ. నీవె ధనంబు బంధుఁడవునీవె సఖుండవునీవె తల్లి
యున్, నీవె గురుండు దాతయునునీవె శరణ్యుఁ
డవంచు నెమ్మదిన్, దేవరవారిపాదములు దిక్క
నినమ్మితి నింకనైన నన్, గావుము దేవదేవ హరి
కంజవిలోచన రుక్మిణీపతీ. 54

ఉ. బంధువు లేమిచేయుదురు భార్యయుఁదల్లియుఁదం
డ్రియైననుఁ, బంధురసత్కృపామతి శుభంబు
మ తేమియొనర్తు నుగ్రసీ, రంధ్రపరేతరాట్కృ
తదురాపదలొంద భవత్పదాబ్జసం, బంధ మెతక్కు
వన్యసదుపాయముగల్గునె రుక్మిణీపతీ. 55

ఉ. పాణితలంబునందు మృదుభవ్యనినాదతరంగయు
క్తమౌ, వేణువు వేణియందుఁ బరివీతములైనమ
హాశిఖండముల్, నాణెపుముక్కుముత్తెముగనం
బడ నందునిమందయందునన్, జాణతనంబుమీ
ఱ రతిసల్పినదేవర రుక్మిణీపతీ. 56

ఉ. కందసమానగాత్ర పరకందఖనిత్ర మునీశకీరమా
కంద మురారి శౌరి హరి కందళితప్రథితార్ద్రి
భావుక, స్కందకుమారగీతయశకందర రక్షిత
గోసమూహ మా, కందము జూపు మీవ్రజ
లకందఱకున్ గతి రుక్మిణీపతీ. 57

ఉ. పంకజపత్రవారివిధి పారదభంగి నిరంతరంబు
నా, తంకయుతంబునై వగలఁదాల్చుశరీర మని
త్యమం చెదన్, గొంకక మీపదస్మృతిని గోరిన
వారలకున్ బరేతరా, ట్కింకరభీతిఁ జెందరఁట
కృష్ణ మురాంతక రుక్మిణీపతీ. 58

ఉ. ఏమితపంబుచేసెనొ కరీశుఁడు నందుఁడు పూర్వ

జన్మమం, దేమిమహావ్రతంబు జనులెంచఁగఁజేసె
నా గోపకౌఘ మే, మేమి యొనర్చెనో యవి
యు నెన్నికఁజేయ విరించిశంభుసు, త్రాము లశ
క్యమే హారిణతామరసేక్షణ రుక్మిణీపతీ. 59

ఉ. శ్రీస్తనభూరిభూమిధరసీమల నండలనుండి సర్వ
లో, కస్తవనీయవైభవముగాంచి ఘనత్వనిరూ
ఢినొందు కృ, ష్ణస్తనయిత్ను తల్లజమనన్ సుఖజీ
వనమొందఁజేయు మో,కౌస్తుభరత్న జంభరిపుకా
ర్ముకశోభిత రుక్మిణీపతీ. 60

ఉ. మాధవ శౌరి శార్ఙ్గి వనమాలి మురారి మనో
జ్ఞహారిని, ర్బాధవిహారి చక్రి హరి భావుకశీలి ఘ
నాభమూర్తి పృథ్వీధరధారి పత్రిపతివీతి సుధీర
చితామితస్తుత, స్వాదుతరాకృతీ విబుధజాలకృ
తానతి రుక్మిణీపతీ. 61

ఉ. కొంకక కృష్ణకృష్ణ యనుకోరికతున్ మతిబుట్టున
ట్లుగా, శంక యొకింత లేక మురశాసన! మీపదప
ద్మ మాత్మలో, నంకముగాఁగఁజేయ నిసితాంగ
తురంగుని దూరుచుందు!న, న్నింక భవత్పదసాద
మున నేలుము దేవర రుక్మిణీపతీ. 62

ఉ. బాలత నాయశోదచనుబాలు రయంబున నాను
చున్ విలో,లాలకజాలమాంద్యమున కందముల్

సఁగ నూపసత్త్రజం, బాలముతోడ నందునినివా
సము ముంగిట నాడుచుండుగో,పాలకవేషధా
రివగు బ్రహ్మమువీవపు రుక్మిణీపతీ. 63

ఉ. ఏకమతిన్ భవత్స్మరణ మెప్పుడు జేయక యంత
మందునన్, బైకొని కాలకింకరులు బాధలు పెట్టెడి
కాలమబ్బినన్, శోకమునొందినన్ గలదె చోర
తబూని తుదిన్ నిబద్ధు:డై, కాకలనొందనేమిటికిఁ
గంజవిలోచన రుక్మిణీపతీ. 64

ఉ. బంధురసత్కృపామతిని బంకజలోచన మీపదా
బ్జసం,బంధిని జేసి నన్నితరబంధములన్ విడఁజేయు
మయ్య! యీ,దంధనమేలనయ్య!ఫలదాయక!నా
యక నీవెదిక్కయో, కంధరనీలవర్ణ ననుగావుము
వేగమె రుక్మిణీపతీ. 65

ఉ. ఆడుచు గోపకామినులయంబరముల్ మఱపించి
తెచ్చి బల్, పోఁడిమిమీఱఁగా గుబురుపొన్న
లనెక్కిన దేవదేవ నన్, వేడుకమీఱఁగా నెపుడు
వీడకనేలుము పూర్ణతారకా, రాడమలాస్య
కృష్ణ యదురాజశిఖామణి రుక్మిణీపతీ.

ఉ. అన్యులవేఁడఁ దావకపదాబ్జమె మాకిఁకఁ దోడు
నీడఁగా, ధన్యతనొందువాఁడ మిముదల్చుమహా
త్ములవీడ దుష్టరా,జన్యులఁ జూడఁ గామ్యముల

సౌఖ్యపుజాడలంగూడ నన్నున, ద్ధన్యులకాపదం
బునిధి దాటంగనోడవు రుక్మిణీపతీ.	67

ఉ. వేసటంజెంది వేసములు వేయివిధంబులుగా నొన
ర్చుచుణ్, వీసముడబ్బుచొప్పునను విత్తములట్టు
గడించినణ్ దుదిణ్, గాసును వెంటరాంగలదె
కాండజనేత్ర గణించినణ్ భవ, ద్భాసురపాద
భక్తి వసువారముదక్కవ రుక్మిణీపతీ.	68

చ. పిలిచినం బల్కవేమిటను బేదలపాలిటిదైవరా
య నిణ్, గొలచెద నింకనైన ననుగూరిమినే
లుము నేలవేసియుణ్, బలుచందనంబునీకు విదె
పాల్పడకుండునె లోకమందునణ్, బలుచల మేల
నాపయిని పంకజలోచన రుక్మిణీపతీ	69

ఉ. సుందరఫాలమందిడిన చొక్కపుంగస్తురిచుక్క
యందు నం,దందు నుయాలలూగుచు సమంచిత
కాంతిని రావిరేక చె,న్నొందంగ నందమందిరము
నొద్ద నమందముగా యశోదనా,నందముంజెందం
జేయు యదునాయక కేశవ రుక్మిణీపతీ.	70

ఉ. ఆసలంజెంది విత్తముల నన్యులకీయక యంత్యమం
దునణ్, గాసునుజెందలేక నరకంబులనొంది తపిం
చుచుంద్రునీ,దాసులునై నిరంతరపదద్వయభక్తిం
జెలంగువారికిణ్, వేసటలేల చెందుయదువీరశి
ఖామణి రుక్మిణీపతీ	71

ఉ. భూతికి ధాతవై స్థితివిభుత్వమునొందఁగ నచ్యు
తుండవై, ఘాతమునొంద శూలివయి గణ్యత
నొందుసమస్తరూపునిన్,మాతరమానుతింపనిను
మాధవనీపదపంకజద్వయిం,జేతులు మోడ్చి నింక
నను జేకొని కావుము రుక్మిణీపతీ. 72

చ. పరువులుగోరి విత్తములపాలిటి యాసలనొంది
మోహాసం, వరణము చేత చిక్కుపడువ్యర్థపునాదు
మదిన్ భవత్పదస్మరణముచే నిరంతరము సద్గతి
నొందఁగఁజేయుమయ్య యో,సురవరమానిజాతన
తశోభితపద్యుగ రుక్మిణీపతీ. 73

చ. క్రతుశతముల్ మనోహరముగా నొనరించిన
సంతతంబు సు, వ్రతములొనర్చినన్ సురతరంగిణి
గాహన మాచరించినన్, గొతుకక మీపదంబు
లను గొల్చుటకున్ సమమానె యెన్నఁగా, నత
సురమానిజాల నినునమ్మితి నెమ్మది రుక్మిణీపతీ.

చ. సరసిజనేత్ర మీకథలు సైపక దుర్మతికర్ణవీథి
దు, స్తరతరఘంటికారవము సల్పినరాక్షసవీరు
మున్ను సత్కరుణదలిర్పనేలితివి కారుణికోత్తమ
పావకీనసత్స్మరణ మొనర్చువారలను సాకుట
కష్టమె రుక్మిణీపతీ. 75

ఉ. అష్టమిరోహిణీభమున నంచితలీలల రోహిణీసు
ద,త్యష్టమగర్భమందున రయంబమరన్ జనియిం

చి లోకసం,తుష్టిగ దుష్టకంసు ననిదున్మి యపక్ర
పరాక్రమంబునన్,శిష్టజనావనం బెలమిఁ జేసినదే
వర రుక్మిణీపతీ. 76

ఉ. ధీరదయాసరిద్వర సుధీరచిత్తవమానిచిత్తకా,
సారసితాంగ చారుతరసారసలోచన భక్తవా
రమం,దారధరాధరోద్ధరణ తారకరాడన పేశలన
శ్రీయా,పారగతాస్యమండలశుభంకర కేశవ రు.

ఉ. మీచరణంబులన్ మదిని మేలొదవన్ బచరించు
వాని కు,గ్రావద లేలచెందును బుధావన లోకని
లోచనార్చిసం, దీపన మొంచఁ,జీఁకటులతిత్వరితం
బునఁ గాక నిల్చునే, పాపవిదూర కృష్ణ హరి
పంకజలోచన రుక్మిణీపతీ. 78

ఉ. పాపము నొందువేళఁ బరిపంథిభయంబగు వేళ
భూరిఘో,రాపదలబ్బువేళ వికచాంబుజలోచన
నీవు భక్తవత్సల, తాపములన్ మరల్చి నిరతం
బవనంబొనరింతువందురో,తాపసచిత్తగేహాయది
తథ్యము సేయవె రుక్మిణీపతీ. 79

ఉ. ప్రాణభయంబుచేనయినఁ బాపసమాగమచింత
నైన ని,స్త్రాణముచేతనైన సుకృతప్రతిపత్తిని
నైన సద్విని, ద్రాణమనంబుచే మిము నిరంతర
మెవ్వఁడు సంస్మరించు నా,త్రాణ భవత్పదాబ్జము
లచక్కి వసింపఁడె రుక్మిణీపతీ. 80

ఉ. మిమ్ములఁ గొల్చి నమ్మి మనుమేటి భవాభియుతా
త్ముఁడైన గ, ర్మములఁ జెందఁ డెట్లన నమ్మంచనిష
త్పరసంస్థమైననుం, గుమ్మరపుర్వు పంకమునఁ గుం
దునె నెమ్మది నెంచిచూడఁగా, నిమ్మహి దేవదేవ
రజనీశవిలోచన రుక్మిణీపతీ. 81

ఉ. దీనశరణ్య కృష్ణ నతదేవముకుంద మహానుభావ
దు,ర్దానవగర్వసంహార మదావశరక్షకయంచు మి
మ్ములఁ గా, మానసమందు వేఁడిన నమందదయామ
తితోడ ద్రౌపదిఁ గా, మానముగాచి దుర్దశల మా
న్పితివౌగద రుక్మిణీపతీ. 82

ఉ. నిత్యనిరాదిమధ్యలయ నిర్గుణవిశ్వనివాసవేదసం,
స్తుత్యదయాప్రభావభవతూలధనంజయ సత్వభూ
తసం, భూత్యురువర్తనాంతకరభూతపతిప్రము
ఖావిచింత్య యో, ప్రత్యయరూప నిర్మల నిరం
జన మాధవ రుక్మిణీపతీ. 83

చ. కరమనురక్తి మీచరణకంజము లాత్మదలంచు
వారికిఁ గా, సురుచిరమోక్షసంపదలు చొప్పడుటేమి
విచిత్రమౌ భవ,చ్చిరతరవైరభావమును జెందియుఁ
జైద్యముఖావనీపతుల్, పరమపదంబు గైకొనరె
పంకజలోచన రుక్మిణీపతీ. 84

ఉ. దండము కృష్ణ నీకు యమదండన మింకిటఁ జేరనీకు
నీ, దండమె రక్షరేకు హరిదాసుని నన్ విడఁబో

కు మోహత, త్కాండచయాపరాకు భవశానసం
స్థితి బల్చి కాకు వే, దండమురీతి నాకీక ముదం
బొనరింపుము రుక్మిణీపతీ. 85

ఉ. చక్రముఖామరుల్ వినుతిసల్పఁగ నట్టియపార
సత్క్రియఁ, జక్రముఁజేతఁబూని రభసంబున
నక్రము సంహరించి సిస్వక్రవికాస ముప్పతిల
వారణనాథునిఁగాచుసత్కృపా, పక్రమ దేవ
దేవ హరి పంకజలోచన రుక్మిణీపతీ. 86

ఉ. శారద మేఘపార్వణనిశాకరపారదశారదానిలా
హారతుషారకుందశరహారశతారకతారతారమా
రారివరామరేభరజతాద్రిపటీరసమానకీర్తిసంపూ
రిత దిగ్విభాగసురపూజిత కేశవ రుక్మిణీపతీ. 87

ఉ. ఓయదునాథ కృష్ణపురుహూతముఖామరవంద్య
చక్రి నా, రాయణ వేదవేద్య కరిరక్షణ కేశవ శౌరి
ఘోరదైత్యసమూహభంజన సుధీనుతమా
ధవ దేవదేవ పద్మాయతనేత్ర హాటకసమంచి
తశాటిక రుక్మిణీపతీ. 88

ఉ. దాసచకోరచంద్రహరితామరసేక్షణ భూరివా
సఘో, దానవవారసంహార దయాకర కేశవ
చిన్మయాత్మ కం, జాసన పాకశాసనముఖామరవం
ద్య నిరంజన స్వభూ, భాసురరూపచక్ర మురభం
జన శ్రీధర రుక్మిణీపతీ. 89

ఉ. బోటులతోడ నాటపరిపూర్ణవికాసముతోడ నా
డుచుఁ, జాటునకేగి కన్నుఁగవఁ జక్కఁగఁగీటుచు
మాటిమాటికిన్, నీటుదలిర్ప గోపరమణీమణి
పంక్తుల వెన్నదొంగవై, బూటకమొంద దేవ
హరిపుణ్యపురాతన రుక్మిణీపతీ. 90

ఉ. మానవిన్ మదింగొనుము మామతసంస్తుతశీ
ల పూర్ణిమా, మారుచిరాస్య శౌరి హరి మామ
నసప్రదదానలోల హే, మామలచేల కృష్ణ
యసమామహితప్రథితప్రభావ మే, మా! మిము
సన్నుతింపఁగను; మామకదైవము రుక్మిణీపతీ. 91

ఉ. హార మనోజ్ఞసంవిదుపహార మదాంధసురారివా
ర సంహార సమస్తహేయపరిహార విరించిపు
లోమజేశ మా, హారమణాశ్వసన్నుతవిహార
సుశోభితవత్సభాగ నీ, హారమయూఖవక్త్రహరి
యంచితనామక రుక్మిణీపతీ. 92

చ. పరుసముసోకి లోహము సువర్ణతఁ జెందునటుల్
భవత్కథా,విరచితమైనపద్యమది విశ్రుతమూఢజ
నోక్తమైనసున్, సురుచిరమై చెలంగి పరిశుద్ధసు
వర్ణతఁ బొందకుండునే?, పరువడి వించిన న్ వి
కచపంకజలోచన రుక్మిణీపతీ. 93

చ. పరమమునీంద్రవంద్యమురభంజన కృష్ణ హరీ ము
కుంద మం,దరధర దీనరక్షక సుధారసభాషణ

చంపకోత్పలా, ప్రరుచిరమాధురీభరితభాషిత
భాసితసూనమాలికా, విరచిత పూజగైకొనుము
వేగ జనార్దన రుక్మిణీపతీ. 94

ఉ. కొందఱు నిర్గుణుండనుచుఁ గొంద ఱమేయగు
ణుండవంచు ని, న్నందురు సందు నిందు ననయం
బును నిశ్చితబుద్ధిలేనివా,మ్మందఱయోగ్యమార్గము
ల నందఁగఁజేసి భవత్కృపాయులిక్, మందతఁ
బాపి బ్రోవుమ రమాధిప కేశవ రుక్మిణీపతీ. 95

ఉ. మాయనుగూడి లోక మనమాయనవైఖరిఁగూర్చి
యబ్బయ, మ్మాయనుమాయనున్ వచనమా
యన యాయనయున్ మొదల్గర,మ్మాయను నాది
గాఁగఁబదమంజరియున్ నిఖిలార్థజాతమున్,మా
యనె పెంచి యంతయును మాయఁగఁజేసినదేవ
నీపయిన్,మాయనురక్తి నేర్పరుపుమా యని వేఁ
డెద రుక్మిణీపతీ. 96

ఉ. ఏమని యేర్పరింతు మదినేమనిపాడుదు యుష్మదీ
యమా, యామహిమంబుఁ గన్గొనఁగ నంబుజజ
న్మశచీపతీశము, ఖ్యామరరాజికేని యు నగమ్యా
ము విస్తృతఘోరపాతక,స్తోమ మడంచి నన్ను
దయఁజూడుము కేశవ రుక్మిణీపతీ 97

ఉ. కృష్ణ ముకుంద శౌరి హరి కేశవ మాధవ వా
సుదేవ చం, ద్రోష్ణకరాంబకప్రకలితోరువిచిత్రచరి

త్ర భూరిరా, జిష్ణువిహార నందసుత సేవకరక్షక
దేవదేవ ప, త్కృష్ణ సుమంగళాంగ హరి గీష్పతి
సన్నుత రుక్మిణీపతీ. 98

ఉ. గోపకగోపికాజనము గోపదరీతిభవాబ్ధి దాఁటఁగా
నోపికతో భజించుభువనోద్భవశోభనపాదయు
గ్మముకా, బాప తమఃపతంగదశపాల్పడ మామక
మానసంబునన్, జూపఁగదయ్య యోభువనసుం
దరరూపక రుక్మిణీపతీ. 99

ఉ. యోగములెన్మిదింట నవయోగము చెందఁగనీక
చక్రసం, యోగఫణీంద్రమస్తకము నూర్ధ్వముఁ
జేసి ఫణాసుధాప్తిచే, నూగఁగనీనిదేహముల
నొప్పమునీంద్రులచిత్తవీథులన్, రాగిలుపాదప
ద్మము శిరంబునఁ జేర్పుము రుక్మిణీపతీ. 100

ఉ. యాదవరాయ భక్తవరయాదవరాయసుపాత్రుఁ
డన్ దయా, శ్రీదగుణాభిరామజనశేఖరసుందర
నారిపుత్రుఁడన్, మీదయరామయోగియను మే
లగునామముగన్న నేనుమీ, మీఁదగ చించుపద్య
ముల మేలుగనందుము రుక్మిణీపతీ. 101

రుక్మిణీపతిశతకము సంపూర్ణము.



# పీఠిక

ఈశతకము రచించినకవి శిష్టు సర్వశాస్త్రి. ఈయన సర్వకామదాదిమహాప్రబంధములు వ్రాసిన షడ్దర్శనీపారగులగు శ్రీశిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి కుమారుఁడు. వాసిష్ఠగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు. కాసలనాటి వైదికబ్రాహ్మణుఁడు.

శ్రీశిష్టు కృష్ణమూర్తికవి సంస్కృతాంధ్రములయందు బహుగ్రంథములను రచించి యాకాలమున సుప్రసిద్ధములై యున్న మాడుగుల, శ్రీకాళహస్తి, పిఠాపురము, కిర్లంపూడి లోనగు సంస్థానములయం దమితగౌరవసత్కారముల నంది యనన్యసాధ్యమగు ప్రజ్ఞావిశేషముచే దిగ్గజమువలె విజృంభించి చరించినటులు దెలియవచ్చుచున్నది. ప్రకృతశతకకర్తయు కృష్ణమూర్తిశాస్త్రిగారిపుత్రుఁడు నగు నీసర్వశాస్త్రిగారు తండ్రియంత లోకవిఖ్యాతవిద్వాంసులు కాకపోయినను ఉభయభాషలలో సరసమగు సాహిత్యము, అవధాననైపుణ్యము, గ్రంథరచనాప్రతిభ కలవారై కొంతకాలము కాళహస్తిసంస్థానాధీశ్వరులగు శ్రీదామెర వేంకటపతిరాజున్యుని యాస్థానమునం దాదరసత్కారముల నొందుచు నుండెను.

ఈజ్ఞానప్రసూనాంబికశతకము కాళహస్తివారియా స్థానములో నున్నపుడు రచింపఁబడినదియే.

సర్వశాస్త్రి తనతండ్రిగారు గతించిన రెండుసంవత్సరములకు అనఁగా క్రీ॥ శ॥ 1872 సంవత్సరమున గీర్తిశేషుఁడయ్యెను. ఈయనవ్రాసిన పుస్తకములలో జనాదరణపాత్రమైనది యమరుక ఆంధ్రీకరణము. ఇది చిరకాలముక్రింద ముద్రితమైనది. ఇపుడుప్రతులు సైతము లభించుటలేదు. జ్ఞానప్రసూనాంబికాశతకము నిర్దుష్టముగ ధారాశోభితముగ నున్నది. కవి యుభయభాషలలో నిరంకుశుఁడనుట కిందలిపద్యములే తార్కాణములుకాగలవు. తెలుగుభాషలో నిట్టి సర్వాంగసుందరములగు శతకములు చాల యరుదుగా నున్నవనుట సత్యదూరముకాదు. ఈశతకమును జక్కసంస్కరించి యీభక్తిరసశతకసంపుటమున కలంకారప్రాయముగఁ జేర్చితిమి.

ఇట్లు,

చెన్నపురి. 26-1-1926 } వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీరస్తు.

శ్రీ శిష్టు సర్వశాస్త్రికవిరచిత

# జ్ఞానప్రసూనాంబికాశతకము.

---

శా. శ్రీమద్దామరవేంకటక్షితిపతి క్షేమంకరప్రక్రి
యో, ద్దామాత్మీయదయారసప్రసరసిద్ధ్యన్మంజు
లాపాంగవీ, క్షామందస్మితసుందరాస్యమెలమి
న్గన్పట్టఁ బ్రత్యక్షమై, సామంజస్యమెసంగఁబ్రోవు
ము ననున్ జ్ఞానప్రసూనాంబికా. 1

శా. శ్రీమాన్యం బగుకాళహస్తినగరీపీఠంబున న్సజ్జ
న, క్షేమప్రక్రియఁ గూర్చుచు న్సకలశక్తిస్తోమ
ముల్గొల్వఁగా,లై వమాన్యస్థితినున్న నిన్విడిచి నే
నన్యాశ్రయం బొల్ల నట్, సామాన్యంబుగఁ
జూడకమ్మ పుడమిన్ జ్ఞాన... 2

మ. దిగధీశు ల్నినుఁ గొల్చి రక్కసులఁ బ్రోదిం దో
లి యాత్మప్రథా,నగతిం గాంచి సమస్తభాగ్యము
ల సన్మానంబులం బొంది రె, న్నఁగ వేమాట లిఁకే
ల యెంతయును నానావాంఛితార్థాప్తికై, జగతీ
సంతతి నిన్భజించుచునుగడా జ్ఞాన... 3

మ. పరమానందముతోడ నిన్ను మదిలో భావించి సేవించి స, ద్వరము ల్గాంచి యగస్త్యముఖ్యులహాహా వారాశ్యుపస్పర్శన, స్ఫురణాదిం బ్రథఁ జెంది రీవు గరుణం జూడంగ దుస్సాధదు, స్తర దుష్ప్రాపము లేలగల్గు జగతిన్ జ్ఞాన... 4

మ. ధరణిం గల్గినగొప్పగొప్పపదము ల్తత్తద్విశేషంబులుం, బరికింప న్మదిఁ దోఁచె నేటికి నిను న్భావించి సేవింప నే, పురుషార్థంబును గల్గు నంచును మనస్స్ఫూర్తి న్వచింతు న్సదా, పరమాధాయక సత్కటాక్షకలితా జ్ఞాన... 5

మ. తరమే నీమహిమంబు లెన్నఁగ నసద్భావంబు లేకుండ న, ప్పరమామ్నాయము లాఱునుం గవి తలంప న్దుస్తరప్రక్రియన్, దిరమై మించుపథంబునం దగు నశీతిన్యాసము ల్సేయుభా, స్వర మంత్రజ్ఞులఁ బ్రోచితీవ కదవే జ్ఞాన... 6

మ. కలుము ల్నిత్యము లంచు నమ్మిమదిలో గర్వించి యుద్ధారుణోం, గలమూఢాత్ములు నిన్నుఁ గొందఱు గనంగారాక నీసేవలం, దొలఁగింపం దలపోసి దుర్గతులపాలౌదుం జెందువారేకదా, జలజాత ప్రతిమానమానసకళా జ్ఞాన... 7

మ. అకలంకంబగు నీదుసేవకయి మాన్యానూనమా

ణిక్యమౌక్తికపంకేరుహరాగ విద్రుమముఖాగ్రి
మోజ్జ్వలద్రత్నయుక్తకరాంభోరుహపాత్రికా
కలన నిత్యంబు న్నినుం గొల్వరా, సకలామర్త్య
సతీతతిం దనుపవే జ్ఞాన... 8

మ. చెలువ ల్మిన్నొకసారి చేరి యొలమి న్సేవింప
సౌభాగ్యముం, దెలివి న్సంతతి నిత్యసంపదయుఁ
బాతివ్రత్యముం గల్గఁజేసి లసద్దివ్యదయాకటా
క్షముల వాసిం గూర్తు వంతంతకుఁ, జలజాతా
సనముఖ్యాదైవతసుతా! జ్ఞాన... 9

శా. ధైర్యశ్రీ మది నూలఁగొల్పి సతతోద్యద్భక్తి
యుక్తిజ్ఞనా, శ్చర్యప్రక్రమ మొప్ప మెప్పుగను
బూజాప్రక్రియం గాంచి యైశ్వర్యప్రాప్తి
మదంబుఁ జెందక సదాసక్తి న్సముద్యత్తప,
శ్చర్యం బూనినవానిఁ బ్రోతువుగదా జ్ఞానప్రసూ
నాంబికా. 10

మ. లలితంబై తగునీమహామహిమ వాలాయంబు
వర్ణింపఁగాఁ, గలనా నేనని యూరకుండ కిపు
డీకావ్యంబు సేయంగ నిమ్ముల నేనెంచితి నీభ
రం బడరు పెంపుం జెంది యిందీవర,స్థలనాపాద
నలోచనద్వయకళా జ్ఞాన... 11

మ. చకితాత్మీయజనాంతరంగ భయసంసర్గాపనోదక్రి

యా, ధికమందస్మిత సుందరాస్య హిమరుగ్దీప్తిప్ర
సారాంచిత, ప్రకటానర్గళసుప్రభావవిలసద్భవ్యా
కృతిశ్రీయుతా, సకలామర్త్యచయావనక్రమ
హితా జ్ఞాన... 12

మ. జయలక్ష్మీకరమైననీమహిమచే సంప్రాప్యము ల్సం
పదల్, భయము ల్దూరము లౌనటంచు మదిలో
భావించి నీసద్దయా, శ్రయముం గాంచి ప్రియా
ర్థము ల్గను టవశ్యం బేరికిం జూడ భా, చయని
ర్ధూతనభోంబుభృత్పటలికా జ్ఞాన... 13

శా. అత్యాలస్యముఁ జెంది నీభజనమం దాసక్తి
యింతైన సద్వృత్తానందము గల్గఁ జెంద కెపుడు
న్సత్సంగతిం గాంచకే, నిత్యం బంచును సంస్మృతిం
దలఁచి మానిత్వంబుతో నుంటి నా, సత్యా
దిత్యనుతా దయ వ్దనుపుమా జ్ఞాన... 14

మ. కలరా నీసరివేల్పు లీజగతిలోఁ గల్యాణకల్యా
త్మతన్, వెలయింపం దగువా రటంచు సరిగా
విజ్ఞానముం జెంది నే, వలనొప్ప న్భవదీయపాద
యుగళీవర్తిష్ణుధీవృత్తి నై, చలనం బందక యుంటిఁ
బ్రోవఁగదవే జ్ఞాన.... 15

శా. మార్గంబు ల్పదివేలు లోకమున సన్మాన్యస్థితిం
జెందఁ ద, ద్దుర్గాధ్వప్రతిపత్తిమాని విగళద్దోషా

లినై మించి స,ద్వర్గస్తుత్యతఁ గన్న నీభజన సల్పం
బూనితి న్నిత్యముల్, స్వర్గాధ్యక్షసుతాంఘ్రి
ప్రోవఁగవవే జ్ఞాన... 16

మ. స్థిరకీ_ర్తి న్వెలయంగఁ జేయు నియతశ్రేయోని
వాసిత్వముం, బరగంజేయు సువర్ణరత్నముఖసం
పల్లిలలం గూర్చు దు,_స్తరదుఃఖంబులఁ బాఱఁ
దోలి మతి సంతానాప్తసౌఖ్యంబులుల్, సరవి
న్నించుచు మించు నీభజనమో జ్ఞాన... 17

శా. చిత్తాయ_త్తను లైనకోరుకుల వాసిం గూర్చి
భక్తాళికిం, వత్తాద్భృగ్విభవంబుఁ జేర్చి రిపుల
న్దండింపఁగా నేర్చి దు,ర్వృ_త్తంబు ల్దొలఁగింపఁ
జేర్చి ఘనసంవిన్మార్గము న్దాల్చి నీ,స_త్తం బెల్లను
నేసి ప్రోవఁగదవే జ్ఞాన... 18

శా. జంబాలంబును బోనిపాపముల నోజందాఁకకుం
డంగ దూ,రంబై పోవఁగఁజేయ మెట్టునెడఁ
దీర్ఘంబై తగం జేయ శా,పంబు న్నవ్యస్థితియుఁ
దక్షిణంబునవె చూప న్నీదు శ్రీచక్రరా,జం
బర్చించు మహాత్ముఁ డోవునుగదా జ్ఞాన... 19

మ. ననవిల్తుం గనుమంటలో మిడుతకూనంబోలె
మండింపఁ జూ,చిన జేజేగమి గచ్చువిచ్చయి కడ
ల్వేరంగఁ జెంత న్వసిం,చిన నీవంతనవంతలోఁ

గోనక వాసిం బూచిరామేన నిచ్చనఱ న్స్వాత్తితి
నిన్నుతింపఁ దరమే జ్ఞాన... 20

మ. అలశ్రీపట్టనసీమలో బహుళసాలాంతస్థలోద్యా
నపంక్తులలో మందమరుత్కిశోరకసముద్ధూతా
గ్రకాదంబవాటీలలిం గేళిక సల్పు నిన్నుఁ గని
పాటింపంగ రాలేమి నిచ్చలు నిం దెల్లరు
గొల్వవచ్చిరిగదా! జ్ఞాన... 21

శా. చింతారత్నగృహాంతరశ్రమున వాసి న్స్విష్టావి
ష్ట్వాదిమంచాంతస్థాయినివై జగంబులఁ సము
ద్యల్లీల రక్షింప నట్లంతం బొందఁగఁ జేయ నీవా
కటైవే యాధారశక్త్యాత్మతన్, సాంతత్యంబున
నున్నదానవుగదా జ్ఞాన... 22

మ. మనసా చంచలమింద్రియప్రతతి దుర్మార్గప్రవృ
త్తంబు నిత్యనిరాబాధత మించు నీపదసపర్యం
జేయుపర్యాయ మెట్లు నయం బంది గ్రహించు
వాఁడ నమరాలోకాభినంద్యప్రభాం, చనవ
త్కాంచనరత్నభూషణయుతా జ్ఞాన... 23

మ. చలువ ల్లల్గడఁ జిల్కుగట్టునకు నెంచం గూఁతు
రైమించు నీ,వెలమి న్భత్తుల యుత్తలంబులను
మాయింప న్సమస్తావనీ, తలవందోర్జ్జ్వలభోగ
భాగ్యముల నందంజేయు మేల్చూపులం,జలువ
ల్లల్లఁగఁజేయు టబ్బుర మొకో జ్ఞాన.... 24

శా. కైలాసాచలసీమసంగతలసత్కల్పద్రుమాకల్ప నీ
పాళీపాళివిహారకృన్మధుకరీ వ్యాహారవీణాకళా
లోలీభూతవితంద్రమంద్రరవవల్లోలంబ కేళీవనీ
జాలాక్రీడితకౌతుకాంచితమతీ జ్ఞాన... 25

మ. సరళంబైనమతంబుఁ జెంది నియమాసక్తాత్ములై
సంతతాంతరపూజాపరమాదరంబుఁ గనియుద్య
ద్భావుకజ్ఞానులై, స్థిరయోగంబున నిన్నెకొల్చు
సుజనుల్ శ్రేయోవిశేషాప్తిఁ హెచ్చ రమా
వాప్త నివాసులై వెలయరే జ్ఞాన... 26

శా. నీవే సిద్ధివి నీవె బుద్ధి వనుచు న్నిర్వ్యాజభక్తి
క్రియాప్రావీణ్యంబున సంతతంబు నిను సంప్రా
ర్థించు ధీరు ల్సను, స్తావన్యుత్తమసిద్ధిబుద్ధికలనా
వాప్తి న్రమావశ్యయోషావశ్యాదికలీలల న్వెల
యరే జ్ఞాన... 27

మ. నినుఁ జిత్తంబున సంస్మరించుచు నరణ్యానీసర
ణ్యంతరం, బున నైనం జనువేళ వ్యాఘ్రచయ
ముం బోత్రివ్రజంబుం దర, క్షునికాయంబును
సింహసంతతియు మ్రుచ్చు లొప్పవఁగాఁ జేసి దా,
సనితాంతోన్నతిఁ జేయు దీవ కదవే జ్ఞాన... 28

శా. పారావారము నీదశక్య మని చెప్ప న్వచ్చు
ధాత్రీధరో, ద్ధారం బౌనని యెంచవచ్చు నటులన్

ధాత్రీస్థలీరేణువుల్, తారావారము లెక్కపెట్టఁ
దగు లోఁ దర్కింప నీసత్కళా, స్ఫారశ్రీగరి
మల్ గణింపఁ దరమా జ్ఞాన... 29

మ. భవదీయాంఘ్రిసరోరుహద్వయమునం బ్రవ్యక్త
భంగి న్విహా, రవిలాసస్థితినుండి యెల్లెడల సర్వ
ప్రక్రియ ల్మాని యే, కవళం బయ్యె మదీయమ
త్యళిని నింకం బ్రోవుమమ్మా జన, స్తవనీయో
న్నతిఁ గల్గఁజేసి యెపుడుం జ్ఞాన... 30

శా. నీవే దిక్కని నీదుసన్నిధిని నే నిత్యంబు సేవార్థి
నై, భావం బన్యగతం బొనర్పక వసింపం బెంపు
దీపింప సం, భావింపం దగునమ్మ భవ్యమతి సంప
త్త్యాదుల న్నించి వాం, ఛావిశ్రాంతి నొనర్ప
నెవ్వ రిఁక శ్రీజ్ఞాన.... 31

మ. నయమార్గంబున భూప్రజం దనుపఁగా న్యాయ
క్రియాసంగతిం, బ్రియసామంత మహాప్రధాన
హృదయప్రేమాతిరేకంబు సే, య యశోలక్ష్మీ
దనర్పఁ జేయఁదగు నీయర్చల్ ప్రభుశ్రేణికు, చ్ఛ్రి
యసంధానసమేధమానకరుణా జ్ఞాన... 32

మ. వెనకయ్యన్వలచేత డాపలికయి న్వెన్కయ్య
వెన్కయ్య లా, లనలం బుజ్జవ మొప్ప నిప్రుచు
మదాలస్యంబున న్నిల్పు నీ, వెనుకై త్యామర

సుందరు ల్నిలిచి తీవిం గ న్గొనం గంటి వి, చ్చున
నుం దావృశరీతిఁ బ్రోవగదవే జ్ఞాన... 33

శా. నీనామం బొకసారి నెమ్మనమున న్నైకొ ల్పినవ్రా
జస, న్జ్ఞానంబు న్నిగమాగమో క్తిపదవీ నానార్థ
నిశ్చాయక, త్వానూనప్రతిభావిశేషమును నిత్యం
బేకదా భ క్తదుర్, జ్ఞానోచ్చాటనపాటవస్ఫుటక
థా జ్ఞాన... 34

శా. సారంబైన భవద్దయారసమున న్సాధింపఁగా
వచ్చు దు,ర్వారారాతినికాయమున్సకలసంపల్లీల
లు న్మున్నుగాఁ, జేరన్ హెచ్చఁగవచ్చు నేరికయిన
న్ శ్రీకాళహస్తీశయో, షారత్నంబ మదాబ
శాంభవినుతా జ్ఞాన.... 35

మ. ప్రసరచ్ఛీతలతావిశేషముల సంపాదించునిన్నే
లురా, త్రిసతీశాంశము నొదల న్నిలిపియుం
డెం పేదుతాపంబునన్, విసవున్నేతరి నీదుమోవి
రసము న్వేమాఱుఁ గ్రోలంగఁ దా,నసిగా విల్చె
ను సర్వలోకవినుతా జ్ఞాన... 36

శా. లీనప్రజ్ఞలకుం బ్రకృష్టధిషణాలీలావిశేషాప్తి
య, న్యూనో క్తిప్రథమానశాస్త్రపదవీప్రోజ్జృం
భమాణప్రథా, ధీనశ్లాఘ్యవదావదత్వమును
సంధిల్లుంగదా తావకా, ర్చానిష్ఠాగరిమంబు
గల్గుకతనన్ జ్ఞాన... 37

మ. నిరతి న్నీపదపద్మపూజనవిధానిష్ణాతుఁడై సంత
తం, బరసాన్యామరసేన నాదరములో నల్పం
బుగా నైనఁ జూ,న్ప రహిం జూడక యేకభక్తి
నిను లోన న్నిల్పువాఁ డీచరా, చరసంపూర్ణజ
గత్తతి న్మిగులు నో జ్ఞాన... 38

శా. పంచాస్త్రుండు త్వదీయసన్నిధిని నీభర్తం బ్రయ
త్నంబుతోఁ, బంచాస్త్రం బెదరింపఁబోయి త్రుటి
లో భస్మంబు దానయ్యె న, న్నంచే యింతలు
పుట్టె నంచు దయఁ దద్యోగంబునం గన్గొనం,
జంచద్దర్పకకోటి సించితి వవుర జ్ఞాన... 39

శా. పారావారసుతాదిలేఖసుదతీ పారంపరీగీతికా,
పారానంద పురంధ్రివర్గనియత ప్రాంచద్వివా
హాంగణో, దారామోదయుతాత్మబాంధవసతీత
త్యాశ్రితస్వాంతిక, స్ఫారాచారకృతిప్రమోద
భరితా జ్ఞాన... 40

శా. ఆసా మిక్కిలి గల్గి యున్నది మహాహంకార
మా యెందు వి, శ్వాసం బెందును లేదు పూర్ణ
ము నృశంసత్వంబు సత్యార్థవి, న్యాసం బన్నది
వాసె విట్టిజడుని త్వ న్బ్రోవఁగాఁ ద్వత్కృపా,
శ్వాసం బొక్కటిదక్క వేఱుగలదే జ్ఞాన... 41

శా. విశ్వాతీతపరాక్రమక్రమ సమస్తావిఖ్యాతనిత్య

ప్రభా, వైశ్వర్యాహమికావిశృంఖలవిహారాత్యం
తభీతద్యుష, ద్వాశ్వాస్యేతరచండఖండనదిశా
విశ్రాంతజన్యప్రథా, శశ్వద్విశ్రుతశక్తి నీవక
దవే జ్ఞాన... 42

మ. ఫల మొక్కింతయు నీనివేల్పుల భజింపన్ దాన
నేమా నటం, చెలమి న్నిన్నె సమగ్రభక్తిపథ
సాహిత్యంబుతోఁ గొల్వని, చ్చలు నన్నుం గన
కున్న నెవ్వరికిఁక శశ్వల్లీలఁ బోషింప ని, శ్చలకా
రుణ్యకటాక్షవైభవయుతా జ్ఞాన... 43

శా. శోణాంభోరుహజైత్ర పాదయుగళీశోభాకృదు
ద్యన్మణి, శ్రేణీహంసకమంజుగుంజితసమాకృష్టావ
దాతచ్ఛద, క్వాణాకర్ణనమోదమాన హృదయా
గచ్ఛద్ద్యుషత్కిన్నర, స్త్రైణాలోకనహృద్యసుం
దరగతీ జ్ఞాన... 44

మ. నునుమైచాయలు దాసనంపునన చెన్నుంబూని
మిన్నందఁ గ్రొన్ననయమ్మున్ గొని తుంటవింట
నెలమిన్నం టొప్పఁగాఁ జేసియుం, పునముల్లోకము
గెల్చు వశ్యముఖివై పొల్పొందు నిన్ గొ
ల్చెదన్, జననీ సర్వజగత్ప్రమోదజననీ జ్ఞాన...

మ. కపురంపు న్విడె మాననంబున సమగ్రస్థాలము
క్తాసరా, సుమమాలంకృతి చన్దవం గటితటి న్హాం

బట్టుఁ బుట్టంబు సన్నపు మైపూఁత భుజంబుల
న్వేలయు నున్న న్నిన్నుఁ గన్గొన్న నచ్చపుం
బ్రేమన్ గిరిశుండు వీడఁ డహహా జ్ఞాన... 46

శా. జేజేరాయని తాలచెల్వమున మైచెల్వొంద బల్వే
లుపున్, రాజాస్య ల్చెలువంకలం గొలువులోనం
గొల్వ బృందారకుల్, ర్వ్యజోద్భూతపరిస్రుతాలస
గతి స్వీణాకల న్మించి వాచాజాలాతిగవైఖరి
న్మెఱసితా జ్ఞాన... 47

మ. ఘనవృష్టి న్భువి సస్యజాతము సమగ్రప్రక్రియ
న్మొల్కలెత్తి నవోదగ్రఫలం బొసంగుగతిఁ
దద్దివ్యానుకంపాకటా, క్షనికాయంబున సర్వ
సంపద యుదర్కప్రాప్తిఁ గల్గించు దుర్జనదౌరా
త్మ్యనిరాసకారిమహిమా జ్ఞాన... 48

మ. జయశబ్దం బొనరించుచు న్దివిజు లోజ న్మంగల
న్నిల్వ దివ్యయమివ్రాతము సామగీతులనయంబు
న్వీనుల న్నింపహృద్దయక్రీఁగన్ను లనంకురింపసు
రల్ దైన్యంబు వోఁ ద్రోసి నిశ్చయసౌభా
గ్యము నింతు వీవకదవే జ్ఞాన... 49

మ. పలుమాఱు న్నిను భక్తియుక్తి భజియింపంగోరి
వేళాప్తిసీ, కొలువుం గూటముఁ జేరి తావకదృ
గంచారత్కృపాపూరసం, కలితోదా[illegible]ర్థ

కావ్యరచనాకల్యాత్ములౌ వారిలోఁ, జలనం బేద
ననున్ఘటింపఁ గదవే జ్ఞాన... 50

మ. ముదమొప్ప న్మది నిన్నుఁ జేర్చి భయసమ్మోహంబు
లొక్కుమ్మడిం, బొదలం దాఁకక పాదుకార్చన
కథాపూతాత్ములై నిత్యని,ర్మదవృత్తి న్భజియించు
వారు చెలువారం గాంతు రిష్టార్థముల్, చదువు
ల్పెక్కులు చిక్క నేమిఫలమౌ జ్ఞాన... 51

మ. సతతంబు న్దురితావహంబయిన సంసారంబునం
బుత్రమి,త్రతరుణ్యాదివిచారయోగమున నైరం
తర్యదుఃఖక్రియా, యుతుఁడై చేప్పడుకన్న
నిన్ను మదిలో నొందించి నందింపఁగా, జతనం
బైనను జాలు నంచుఁ దలఁతుఁగా జ్ఞాన.... 52

మ. క్రతువు ల్నూ ఱొనరించి యింద్రుఁడయి స్వారా
జ్యంబు పాలించి సం, భృతమందారతరుప్రసూన
శుభికాభిష్టుత్యకోటీరకో, టితచే మించి సుధర్మ
నున్నతేఁడు బల్మివిం ద్వదీయాద్భుత, క్రతుశీలుం
బురుడింపలేఁడు గదవే జ్ఞాన... 53

మ. కమలాభారతు లిర్వురు న్నుకటులం గైఁబూన
వేల్పుం గొమల్,క్రమమొప్పం గొలువంది కట్టె
దుటఁ జొక్కం బైనగీతప్రసం,గము సల్పం గొ
లువున్న నిన్నుఁగని శక్రాదు ల్భజింతు ర్గదా,
కమలారాతికళాభియాతివదనా జ్ఞాన... 54

మ. చదలాడుక్ష్మాడి ప్రింగఁగా మనమునం జర్చిం
చుచు న్మించు ధృష్టద నక్తంచరయోధవీరప్రశ
స్త్రానారదుం దాట పా,టదలిర్పం గనుఁగొఁగ
దైత్యాహతిగాటంబైన తేజంబునం,గదనప్రక్రియ
మింతు రెవ్వ రహహా జ్ఞాన... 55

మ. వికలంబై చకితాక్షమై యసురరాడ్వీరాళిప్రాసా
సిశ,క్తికటారాదిక సాధనవ్రజము భీతి న్పాఱఁ
గా వైచి నే,రక నీచేరువ వచ్చినా మనుజు
దూరం బందఁగాఁ దోలితా,సకలామర్త్యనికా
య గేయచరితా జ్ఞాన... 56

శా. పాళి న్నీకు సభక్తికంబుగను సాష్టాంగంబు
లర్పించి యా,శాలీవిశ్రుత తావకీనచరితాక్రాంత
శ్రుతి న్మించి య,నార్యాలాపంబుల మాని తావక
సమాఖ్యాపారముం జేయుచో, బాలం బేటికి
నన్నుఁ బ్రోచుటకు నై జ్ఞాన... 57

శా. నింద ల్సేయుదు రెందఱో ధరణిలో నీరోధదో
షోక్తి నా,నందం బందుదు రెందఱో సుగుణసం
తానంబు లెక్కించి యీ,చంధంబు ల్మదిఁ జేర్ప
నీదయ మదాసక్తి న్విజృంభింపఁ ద్వ,చ్ఛందం బెట్టి
దో తెల్పవమ్మ వడిగా జ్ఞాన... 58

శా. ధీరశ్రేణికి మెచ్చు సేయు కవితాస్థేమంబు నేమం

బుతో, రారాజద్గుణరాజరాజసభల న్రంజిల్ల వా
గ్వైదుషీ, పారావారులు నీకటాక్షమహిమావా
ప్తింగదాధారుణిన్, స్ఫారఖ్యాతివహింతు రెంత
యును శ్రీజ్ఞాన... 59

మ. జగతి న్నెమ్మది నెన్న మానుషము దుష్ప్రాపంబు
పై నందులోన గణింపందగు నాల్గువర్ణముల
లోనం బుట్టు టబ్రంబు పెంపగుబ్రాహ్మణ్యము
దానిలో నచట పర్యాయంబునన్ జ్ఞానయోగగు
రుత్వంబు భవత్కటాక్షమునసౌ జ్ఞాన... 60

మ. సమదానేకమతంగజావలియు నాజానేయవా
రంబు నుత్తమరథ్యాళి రథంబులు న్సమరవిద్యా
పాండితీమండితా, సమయోధావళి రత్నకాంచ
నసమంచత్పుత్రదారాదియోగను నీపూజల
భించునోజ నిజమో జ్ఞాన... 61

మ. భరమా నీకు మదర్థసంఘటనశుంభద్భావసంభూ
తసత్కరుణాపూరతరంగసంగసతతో దంచత్క
టాక్షాంచల, స్ఫురణాపాదన మేల జాల మిఁక
పెంచ్చుం బల్కు లేలా భవ, త్మ్సరణం గల్గని
దేమిగల్గుభువిలో జ్ఞాన... 62

మ. తెలియ న్రాదిల నీమహామహిమ బుద్ధింజూడ
బ్రహ్మాదిది, వ్యులకైన న్నిజమంచు నాగమపద
వ్యక్తు ల్వాంచింపంగ వీనులలో సోకియుం

గొంతవర్ణనము నేనుం జేయుదంచుం దదా,కల
నాయత్తుండ నైతి నీభరమె సూ జ్ఞాన... 63

మ. సమయం బిద్దియటంచు నే నెఱిఁగి నీసాన్నిధ్య
ముం జెంది నే,మముతో సేవ యొనర్పఁజాలఁ
గవితామార్గంబునం బ్రౌఢిమం, గ్రమ మొప్పం గని
నాఁడఁగాను జడుఁ డింక నీవేఁ డటంచు న్ననున్,
సమతం గన్గొని వేగ బ్రోవఁ గదవే జ్ఞాన... 64

మ. నలుమోము ల్గలవేల్పుఁ గన్న దొర యెన్న న్నీకుఁ
దోఁబుట్టుక, ల్వలరాతుప్కుతలంగలాఁ డొడయఁ
డేలంజాలు నీవిజ్జగ, మ్ములనానిమ్ముల నిన్నుఁగొ
ల్వఁ దలఁపుంబూనం దగు న్లోకము, త్కాలికా
మాత్ర నుతింతు నన్నుఁ గనవే జ్ఞాన... 65

శా. పొంగట్టు న్విలుదాల్పుమేన నటుయై పొల్పొం
దునిన్జూచియా, బంగారుప్పట్టపు వేల్పు రాణి యిటు
లై పల్వన్నె నవ్వెన్నుహా, త్తం గానంగదె యం
చు ముచ్చట నెడందం జెంద మేల్మినిసా,గంగా
జాణతనంబు నూనితిగదా జ్ఞాన... 66

మ. వెలయు న్నీకరుణావిశేషము సదావిఖ్యాతమై
భక్తకో, టులయం దంచుఁదలంచి యెందుఁ బొ
రపాటు న్లేక నిన్నూబజనే,య లలిం జాలను నీవె
ప్రోవఁదగవా నగ్రస్ఫురద్దాడిమీ, కళికాగుచ్ఛ
సద్వృత్తకాంతికలితా జ్ఞాన... 67

శా. ఈవేలోకముల న్సృజింప నెలమి న్బాలించ ద్రుంపన్ దిసిం
డిండింప ని, త్యావిర్భూతమహాప్రభావయుతవై
యాత్మేశుని న్సాంఖ్యలీ, లావిష్టాత్మని జేయుదం
చు నిగమవ్యాహోక్తి నేవింటిని న, న్గాంచం జాలవా
కో నమస్మునివరా జ్ఞాన... 68

శా. బంధూకప్రతిమాళికస్థల కనద్భాస్వత్క రేఖా జగ
ద్బంధూడుప్రభుకర్ణపూరయుగళీ భాస్వచ్ఛ్రతీ
సత్కృపా, బంధూరస్థితి నన్నుఁ జూచుచుఁ
గళాపాండిత్యముం బాణిక, ర్కంధూరీతిగ నేర్ప
రింపఁ గదవే జ్ఞాన... 69

మ. తెవి వాక్కింతయు లేనివాఁడని ననుం దీక్షై
చెడంజేయకు, జ్వాలమైనట్టి భవత్కటాక్ష మింక
నాపైఁ బర్వ సర్వంసహా, వలయస్థాఖిలసత్కవీం
ద్రతతిలో వర్ధిష్ణునిం జేయు ము, త్కళికావత్క
మలానుతాకృతియుతా జ్ఞాన... 70

మ. చరణాంభోజపరభక్తరక్షణపరాసక్తి న్నినుం గొ
ల్వఁగా, నరుదా సంపద లబ్రమా ముదము ల
త్యాశ్చర్యమా పుత్రపో, త్రరమావత్త్వము
చిత్రమా పరజనారబ్ధాంతరాయప్రతీ, కరణం
బంబుజగర్భసన్నుతపదా జ్ఞాన... 71

మ. ధరణి న్నిశ్చలమైన నీకరుణ నిర్దంభోదితం బైన
య, ప్పరమాహ్లాదవినోది గాంచు నియతప్రఖ్యా

తి నీతిక్రమ, స్థిరతం బ్రాజ్యసమస్తసంపదలవృద్ధిం
బుద్ధియోగోల్లస, త్సరసానందకవిత్వసంపదయు
శ్రీజ్ఞాన... 72

శా. శ్రీచక్రార్చనసేయుచు న్సతతసిప్పీమస్థిరత్వోద
య, ప్రాచుర్యప్రథమానభక్తినియతప్రజ్ఞావిశే
షం బటుల్, వాచామాధురి నీదునామపఠన
వ్యాకోచకావ్యక్రియా, సాచివ్యంబును గాం
చు మందుఁ డయినన్ జ్ఞాన... 73

మ. కలికాలం బిది దీనియం దొకఁ డనేకప్రక్రియా
యుక్తిని, శ్చలభక్తి న్నినుఁ గొల్వలేఁడు జనుఁ
డాశాయోగమా మెందుత్రో, వ లనేకంబులు
విఘ్నయోగములకుం బాటిల్లు నీభక్తిలోఁ, గలు
గంజేయఁగ నీవదిక్కు గదవే జ్ఞాన... 74

మ. అలసత్వం బధికంబు గ్రంథములు పర్యాయంబునం
జూడఁగాఁ, గలనా లెక్కకురాని వెట్లుఘునఁ జ
క్కంజేసి చూడంగ నం, దలితాత్పర్యము దుర్ల
భం బనుచుఁ గానంజాలకున్నాఁడఁ ద్వత్కాలి
తానుగ్రహ మొక్కఁడుండఁ గొఱంతా జ్ఞాన...

మ. గలు న్రేయిఁ ద్వదీయసత్కరుణకై భావించిప
సేవించెదం, దగ ని న్నిట్టిది చూచి వీఁడు మద
సుధ్యానైకతాత్పర్యని, ష్ఠగలాఁడంచు ముణిం ద

లంచి కరుణాసాంతత్యసంబంధస, జ్జగతిం బ్రోవఁ
గ రావిదేమి యకటా జ్ఞాన... 76

మ. కలి నంతంతకు ధర్మకర్మపథసంస్కారంబు మా
సె న్మహా, బలవంతంబయి కానిపించె నహావా
మాన్యావమానక్రియా, కలనల్ నీకరుణాకటా
క్షమున విక్కాలంబు దోలందగుం, జలనం బిం
తయుఁ జెందకుండ జననీ జ్ఞాన... 77

మ. ప్రియము ల్వాల్కిన నప్రియంబులని సంప్రీతి
స్వగ జైందకే, మయినం జూచుచు నీయనుగ్ర
హాముగా నాంతర్యమం దెంచుచు, స్భయ మొ
క్కింతయు లేక నిన్ను మదిలో భావింపఁగా బుద్ధిని
శ్చయ మి మ్మోజననీహితార్థజననీ జ్ఞాన... 78

మ. సరసాలాపవిలాస హాసరచనాచాతుర్యసుస్థైర్య
భా, స్వరదివ్యస్వరరీతిసంతతతవ్యాసంగదివ్యాం
గనా, పరిపాటీగణనావినోదవిలసద్భవ్యాదరో
ద్యత్మినతా, చరణాంభోజనతామరప్రజహితా
జ్ఞాన... 79

మ. స్ఫుటతారానికరస్ఫురచ్ఛుచిమణీ శోభాంక
హారావళీ, ఘటితోత్తుంగకుచద్వయోపరిలస
త్కాంజాతగాగారుణో,ద్భటకూర్పాసవిభాసమా
నకురువిందశ్రేణి కాప్రోల్లస, త్కటకాలంకృతపాద
పద్మయుగళీ జ్ఞాన... 80

మ. అగరాజాత్మజతావకీనకరుణాయత్తంబు ముల్లోక
మెం, చఁగ నీదైనమహావిభూతివశమే సర్వామ
రశ్రేణికై, నగణింపఁగ భవదీయసద్విభవ మీ
నా కెట్లు వర్ణింప నా, జగతీనిర్భరగర్భగోళకలి
తా జ్ఞాన... 81

శా. జల్పాకామరకామినీకృతకథాసారస్యలీలాకళా
నల్పోదంచితమందహాసలలిత స్వాస్యావలోకా
హిపా, కల్పాత్తేష్టసహాసికాఘటనకృత్కాదంబ
వాటీకనత్కల్పోద్యానవిహారకేళిరసికా జ్ఞాన...

శా. సర్పాధీశ్వరతల్పసోదరి జగజ్జాలాభినంద్యోక్తిమ
ద్దీర్పత్యాదినుతాత్మచాతురి త్రిలోకీసుప్రసిద్ధాం
గనా, దర్పాపాకరణాత్మసుందరి నినుఁ ధ్యా
నింతు నే నెప్పుడుం, గర్పూరాగురుకుంకుమాం
కితకుచా జ్ఞాన... 83

శా. భద్రాపాదనముఖ్యమై తనరు నీభక్తి న్సమస్తా
ర్థసం, పద్రాజిప్రద మంచు నెంచి జగతీపాలుర్
దదాయత్తులై, సద్రూఢిఁ భజియింతు రేనటు
లు గాంచం జాల సేవాస్థితిం, గద్రూజాతకలాప
కంజనయనా జ్ఞాన... 84

మ. విడువ న్నీపదసన్నుతి క్రమగతి న్వేదార్థసూక్తి
స్థితిం, గడవ న్లోకమునన్వదాన్యతతి నెక్కాలం
బు నేమైనను, దడవ న్సత్యముగాఁగఁ బల్కెదఁ

ప్రశస్తం బైననీసత్కృపం, గడువంత ల్దొలఁగింప
వమ్మ జననీ జ్ఞాన... 85

శా. చింతారత్ననివాసవాసరసికా శ్రీపుర్యుదారాసి
కాళాంతాత్తాంతరసీమసాధువసతీ శ్యామాభిరా
మద్యుతీ, సంతాపాపహృతిప్రవీణచరణా శత్రుచ్ఛి
దాకృద్రణా, స్వాంతాంతర్విలగజ్జగత్పటలికా జ్ఞాన.

మ. చెడుమార్గం బని యించుకైన మదిలోఁ జింతిం
పకే నెప్పుడుఁ, విడనాడందగు చెయ్వులన్ని
యును నువ్విళ్లూరుచుం జేసితిం, బోడగానం పదు
పారతి న్మదిని దప్పుల్జూడ కొక్కమ్మడిఁ, గడ
కంటం గని ప్రోవుమమ్మ దయతో జ్ఞాన... 87

మ. స్ఫుటమై నీకరుణారసం బెవనిపై సోఁకు న్వసుం
ధాత్రివాఁ, డటవీవీథుల శత్రుమధ్యమున నుద్య
ద్వారిపూరాంతరో, త్కటవీథీనిచయంబునం బడి
న వేగం బ్రోతువౌ నీవె ధూ, ర్జటివామాంగనివా
సభాసురతనూ జ్ఞాన... 88

మ. నవకావ్యంబు రచించి ప్రాజ్ఞులును నానావృత్త్య
లంకారరీ, తివిశేషంబుల మెచ్చువచ్చునటు లుద్దీ
పింపఁగా నర్థసం, భవసారస్యముఁ దెల్పలే రివు
డు నామాటెంత యొక్కింతనా, కవితం గైకొను
మమ్మ యెట్టులయినన్ జ్ఞాన... 89

మ. తపముం జేయుచు నీమనంబునకు సాంతత్యంబు

గా సంతసం, బెపుడుం జేయఁగఁజాల నీమనుజ
పం బెంతే నొనర్పందగం, గృపఁ బుట్టించు మృ
దూక్తి నేనెట్టుఁగ నొక్కింతైన నీవిప్పు డొక్క
పరిం జూడు మహేతుకోదితదయన్ జ్ఞాన...

మ. అమరీలోకము వేళవేళలఁ ద్వదాయత్తస్థితిన్నే
వస్ఫూర్తి మహానందముతోడఁ గొల్వయిన నీపా
దంబు లర్చించున, ట్టి మహాభాగ్యము నారదా
దులకుం బాటింపం దగుంగాక నిక్కముగా ని
న్గొలువంగఁజాల రితరుల్ జ్ఞాన... 91

మ. వశమా మాదృశులైనవారలకు నిన్ వాక్రు
చ్చి వర్ణింప నీ, యశముం బేర్కొని సంస్తుతింప
మతి నీయక్షీణకారుణ్యలే, శశతాంశం బయి
నన్లభింపక జగత్సంభావ్యసృష్టిక్రియా, శశతానం
దశతాభినంద్యచరణా జ్ఞాన... 92

మ. జయ మాతంగి! మణీవిపంచివిలసత్సప్తస్వరీసజ్ఝ
రీ, నయసంద్రావితమేరుశైలగత నానారత్నవాః
పూరసం, చయనానారుచిమద్ధునీశతసహస్రప్ర
స్తుతనవ్యక్రియా, జయ నిర్ధూతసమస్తదైవతభయా
జ్ఞాన... 93

మ. సవినోదోద్యతసంయుతాయుతకరా సత్కీర్తిస్ఫూ
రద్వీక్షణా, దివిశేషాభిమతప్రకార మృదుగీతి
స్ఫూర్తిరేఖాజవా, ధ్వనివిహారాభినయప్రపంచని

యతవ్యాపారరంభాదిలా, స్వవిలాసోన్నతిదర్శ
నాద్రుతివతీ జ్ఞాన... 94

మ. దయ యెక్కించుక నాపయి న్నిలిపి నీదాసుండ
నౌనన్ను ని, ర్భయునిం జేసి సమస్తకార్యముల
నభ్రం బైనసాఫల్య మూ,న్చి యనన్యాదృశ మైన
తెల్వి దయతో నీఁజాలు దీవే కదా, జయసన్మో
దితదేవతాపటలికా జ్ఞాన... 95

శా. పంచాస్యంబు హాయంబుగా సముదసంప్రాప్తాసు
రవ్రాతముఁ, గొంచెం బైనను జిక్కనీక దును
మం గోదండపాండిత్యలీ,లాంచత్పాణివిలాసవై
తనరు నీయబ్రంపుశక్తి స్సుమి, త్సంచారాంచిత
శక్తిసేన లెఱుఁగుఁ జ్ఞాన... 96

మ. కమలాదేశకృదాయతాక్షియుగళీ కల్యాణభూ
భృద్రుచి, క్రమనిర్మోటనపాటవోరసిజయోగ శ్రీ
సమేతావదా,తమణీహారవిరాజమానగళ మిథ్యా
మధ్యమా పూర్ణిమా, కమనీయేందువిభాసమా
నవదనా జ్ఞాన... 97

మ. కలరా వేల్పులు నీకు సాటి యనఁగాఁ గన్గొం
గ లే రేల ప, ల్కులు నీవే ననుఁ బ్రోవఁగావలె
దోసంగు ల్బాలుఁగాఁ దోలి నా, వలన స్నేరము
లున్న నీమదిని జేర్పంబోక రక్షింపుమీ, జలజా
తప్రభవాంగనాదివినుతా జ్ఞాన... 98

శా. నానాపుష్పఫలావళీసతతదానప్రోల్లసద్భవ్యసం,
తానానోకహమధ్యవీథ్యుదిత విస్తారస్ఫురచ్ఛా
ఖికా,ధీనానేకమధువ్రతీపరభృతీదివ్యశ్రవస్సౌఖ్య
ద,స్వోనోద్యానవిహారకేళిరసికా జ్ఞాన... 99

శా. సందేహం బొకయింతయేని మదిలో సంధింప
కెవ్వేళ నీ,వందాగుప్రజరక్షణక్షమదృశా వ్రాతం
బపేక్షించి య,స్పందప్రక్రియ నున్నవాఁడ మను
పఙ్భారంబు నీదేకదా,ఛందోవీథి విహారలాలస
మతీ జ్ఞాన... 100

మ. లలితాష్టాదశపీఠికాకలితలీలారూపవై జప్యకృ,
త్ఫలదానాప్రతిమప్రభావవిలసత్కారుణ్యపూరం
బు దో, ల్కలలిం దాదృశపేలలం దగు
నినుం గాంతుంగదా యింద ని, ష్కలుషంబై
తగుభక్తియుక్తి జననీ జ్ఞాన... 101

శా. శ్రేయస్సంతతధామ దామరకుల శ్రీవేంకటేం
ద్రాజ్ఞఁ బ్రజ్ఞాయత్తౌచితి సర్వశాస్త్రి యిటు లా
య్యంజేసె జ్ఞానాంబికా, గ్రియానుగ్రహలీలఁ బ
ద్యశత మీరీతిం బఠింపఙ్ జనుల్, ధీయుక్తస్థితి
నన్నివిద్యలఁ బ్రశస్తిం జెంది పెంపెక్కరే.

జ్ఞానప్రసూనాంబికశతకము సమాప్తము.

---

# పీఠిక.

ముకుందశతకము వ్రాసినకవి దూపాటి తిరుమలాచార్యులు. ఇతఁడు లోహితసగోత్రుఁడు. దూపాటికొండమాచార్యులు రంగనాయకమ్మలకు జ్యేష్ఠకుమారుఁడు. తిరుమల సింగరాచార్యగురువర్యుని శిష్యుఁడు. ఈకవి సంస్కృతాంధ్రములందుఁ దనజనకునివద్ద విద్యార్థిగ నిరర్గళపాండిత్యము నార్జించి కవితారచనమున మిగులఁ బ్రతిభ గాంచెను. ఈకవి రావిపాటి రామశతకమనుపేరుతో రామాయణకథ నంతయు సీసపద్యములు 108 లో నిమిడించి వేఱొకశతకము వ్రాసియున్నాఁడు. ముకుందశతకమునందలికవిత చిత్రముగుగమనికలతో మనోహరముగా నున్నది. ప్రతిపద్య మొకవిశేషముతోఁగూడి శ్రావ్యమగు నడకతో వీనులకు విందుగొలుపుచున్నది. కవితలో లాక్షణికవిరుద్ధములగు లోపములు గానరావు.

ఈకవి నివాసస్థానము బాపట్లకు పదిమైళ్లదూరమున సముద్రతీరమునందున్న ఓడరేవు. చిరకాలమీకవి యటనుండి వయస్సుదీరినపిదపఁ దన యెనుబదవయేఁడు పరమపదవి చేరెను. ఈకవి సోదరుఁడగు శేషాచార్యకవి ప్రౌఢకవి. ఈయన రంగధాము, నకరి

కంటి నృసింహాదిశతకములు, శకుంతల ధనంజయవి లాసాదిగేయప్రబంధములు వ్రాసినాఁడు. మూపి తామహులగు శేషాచార్యుల కీతిరుమలాచార్యకవి యగ్రజాతుఁడగుకతన మేమీకవిజీవితము నీవిధముగాఁ దెలుపఁగలిగితిమి. కవిమనుమ లిపుడు ఓఁడ రేవులో నివసించియున్నారు. ఇంక నట నేమేని పుస్తకము లుండెనేమో విచారింపవలసియున్నది.

ఈకవి గతించి యిప్పటికి ముప్పదిసంవత్సరములు దాఁటినవి. తిరుమలాచార్యుఁడు స్ఫురద్రూపి యనియు ఆజానుబాహుఁడనియు సంగీతసాహిత్యవిద్యాకుశలుఁడని మాపెద్దవాండ్రు చెప్పుచున్నారు. శతక వాఙ్మయములో నెన్నఁదగిన వానిలో నీముకుంద శతక మొకటిగ నున్నది.

నందిగామ.<br>5-2-25

ఇట్లు భాషాసేవకులు,<br>శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

దూపాటి తిరుమలాచార్యప్రణీత

# ము కుం ద శ త క ము.



## అంత్యనియమపద్యములు.

క. శ్రీకర లక్ష్మీచిత్తవ
శీకర సద్గుణజితాబ్ధిశీకర కారు
ణ్యాకర తేజోవిజితవి
భాకర దాక్షిణ్యయుక్తభావముకుందా. 1

క. బందీకృతసురబృందా
మందస్మితవిజితకుంద మహితానందా
సుందరతనుజితకందా
నందితముచికుంద నతసనంద ముకుందా. 2

క. దనుజసముదాయశిక్షా
సనకాదిమునీంద్రపక్ష సజ్జనరక్షా
వనజభవాండాధ్యక్షా
వనరుహపత్రాక్ష విపులవక్ష ముకుందా. 3

క. మానవపావనరామా
మానేషుశతాభిరామ సుగుణస్తోమా

మౌనిజనహృదయధామా
దానవజనభీమ కుసుమదామ ముకుందా. 4

క. పవనజనుతపరితోషా
కవిసముదయపోష రత్నఖచితవిభూషా
భువనమనోహరవేషా
భవజలనిధిశోష మధురభాష ముకుందా. 5

క. శతపత్త్రపత్త్రనేత్రా
శతధృతిసన్నుతచరిత్ర శశినిభవక్త్రా
శతకోటిమదనగాత్రా
శతకోటిధరారినివహజైత్ర ముకుందా. 6

క. సురుచిరకౌస్తుభహారా
శరనిధిగంభీర కామ సదృశాకారా
మురరిపువిపినకుఠారా
సురమునిమానససరోజసూర ముకుందా.

క. పరమమునిహృదయశరణా
పరిపాలితదేవవరుణ భవభయహరణా
సురుచిరరత్నాభరణా
శరణాగతభరణ కమలచరణ ముకుందా.

క. బృందారకరిపుకదనా
వందారుబుధాళిహృదయవనరుహసదనా
కుందముకుళాభరదనా
మందస్మితవదన మదనమదన ముకుందా. 9

క. సవినయవినతతనూజా
సువదనజితరాజ ధరణిసురసురభూజా
కవినుతపాదసరోజా
రవిశతశతతేజ దైవరాజ ముకుందా. 10

క. పశుపతివిదితవిలాసా
విశదాబ్జవికాస హాసవిద్యుద్వాసా
దశరథరాజోల్లాసా
దశవదననిరాస ముదితదాస ముకుందా. 11

క. కమనీయాంబుధరాంగా
కమలాహృత్కమలభృంగ ఖగపతురంగా
విమలాంతరంగ దానవ
సముదాయవిభంగ మౌనిసంగ ముకుందా. 12

క. గగనమణిసుప్రతాపా
నిగమాంతోల్లసితరూప నిత్యశ్రీపా
అగణిత సుగుణకలాపా
జగదవనధృతోగ్రరూపచాప ముకుందా.

క. అనుదినరక్షితదీనా
సనకాదిమహామునీంద్రసంఘాధీనా
కనకోజ్జ్వలపరిధానా
దనుజారణ్యానలాభిధాన ముకుందా. 14

క. ద్యుమణికరోల్లజితాంబుజ
రమణీయముఖప్రభావరాజితచంద్రా

కమలజభవముఖవర్ణిత
శమదమశాంతాదిసుగుణసాంద్ర ముకుందా. 15

ఏకసమాసపద్యములు.

క. కులిశసరోరుహకేతన
కలశరథాంగాబ్జమకరకల్పమహీభూ
హాలయవజలచరరేఖా
విలసన్మృదుపాదవినతవేద ముకుందా. 16

క. ద్రుహిణాండాంతస్థితజల
దహనపయోనిధిసమీరతారాపథభూ
గహనాద్రికమలబాంధవ
తుహినకరోల్లసితలోకతుంద ముకుందా. 17

క. పారదశారదనీరద
నారదమౌక్తికసుపర్వనగహయగజక
ర్పూరేందుకుందసుమశివ
హీరహిమసమానకీర్తిబృంద ముకుందా. 18

క. సురగరుడోరగవిద్యా
ధరరక్షోయక్షసిద్ధతపనోడుపకి
న్నరగంధర్వానిలకిం
పురుషస్తుతిపాత్రసుగుణ(?)బృంద ముకుందా. 19

క. కమలాననహైమవతీ
రమణాశుగకిన్నరాధిరాజపయోరా

డమరేంద్రకర్బురానిల
శమనాదిసుపర్వవినుతచరిత ముకుందా. 20

క. హీరాబ్జరాగమౌక్తిక
చారుమణీప్రకరతప్తజాంబూనదకే
యూరమకుటాంగుళీయక
హారాదివిభూషభూషితాంగ ముకుందా. 21

## శ్లోకరూపపద్యములు.

క. రామం రావణదనుజవి
రామం జనకాత్మజాభిరామం సుజనా
రామం వంచితభార్గవ
రామం త్వాం హృది సదాస్మరామి ముకుందా.

క. శాంతం సన్మునిహృదయని
శాంతం పద్మజభవాదిసంస్తుతిభరితా
శాంతం స్థాపితసుజనా
శాంతం త్వాం హృది సదాభజామి ముకుందా.

క. కాండావాస పిచండా
కాండోద్భవ కాండరూప ఖగసంతతిరా
ట్కాండమహాహవ సునిశిత
కాండ విదారితనిశాటకాండ ముకుందా. 24

క. గోమద్గోరుహగోయుగ
గోమర్దితదనుజజాల గోకులపాలా

గోమధ్గోనిలయార్చిత
గోమజ్జారాధితాంఘ్రిగోజ ముకుందా. 25

క. శ్రుతివిదితగతిని వైష్ణవ
మతముద్ధరణంబొనర్చి మహినొప్పిన శ్రీ
యతిపతిని మతిని సతతము
స్తుతు లతులితముగ నొనర్తు సుగుణముకుందా.

క. వరతిరుమలవంశాంబుధి
పరిపూర్ణసుధాకరుండు పరమాదార్యా
కరుఁడగు సింగరసద్గురు
విరతము సేవింతు మదిని నిల్పి ముకుందా. 27

క. అందంబై కవిహృదయా
నందంబై యొప్పునందనందనగుణస
త్కందశతమనెడు వికసిత
కుందకుసుమసరములిత్తు గొనుము ముకుందా.

దశావతారవర్ణనము.

క. శకులాకారము గైకొని
సకలామరులెన్న వేదసముదాయము సో
మకునిబరిమార్చి బ్రహ్మకుఁ
బ్రకటముగా నొసఁగలేదె పరమముకుందా. 29

క. అమరాసురు లన్యోన్యము
క్రమమున క్షీరాబ్ధితరువ గమకించుతఱి

గమఠాకృతి మందరగిరి
సమధికత వహింపలేదె సదయముకుందా. 30
క. ధరణీమండలమెల్లను
సురలద్భుతమందఁ జాఁపచుట్టినగతి దాఁ
బరగించిన హేమాక్షుని
హరియింపఁగలేదె దంష్ట్రివగుచు ముకుందా. 31
క. డింభకవిద్వేషినిగని
స్తంభమున నృసింహాలీలఁ దాల్చి తునుమ వే
అంభోరుహాసంభవభవ
జంభాంతకముఖులు వినుతిసలుప ముకుందా. 32
క. బలిదైత్యుని మూఁడడుగులు
బలిమిని భూదానమడిగి ప్రాబల్యమునన్
జలజభవాండము రెండడు
గులు గొలువవె వటుఁడవై వికుంఠ ముకుందా.
క. పరశువు గైకొని నృపులను
దురమున ముయ్యేడుసార్లు దునుమాడి యశం
బరుదుగ జగములునిండఁగఁ
బరపవె భార్గవుఁడవగుచుఁ బరమముకుందా. 34
క. దశరథునకుఁ బుత్త్రుఁడవై
దశవదనముఖోగ్రదైత్యతతి నణఁచినసీ
యశమును గొనియాడఁగ నల
దశశతవదనునకునైనఁ దరమె ముకుందా. 35

క. ముసలహలంబును గైకొని
వసుధం గలదుష్టదైత్యవర్గము నెల్లన్
గసిమసఁగఁజేసి త్రుంచవె
రసికులు కీర్తింపఁగ బలరామ ముకుందా. 36

క. కాంచి చతుర్ముఖషణ్ముఖ
పంచముఖసహస్రముఖులు భక్తిమెయిం గీ
ర్తించఁగ మెలఁగెదునినుసే
వించెద గోపాలకృష్ణవేష ముకుందా. 37

క. శుద్ధాత్ములఁ ద్రిపురాసుర
శుద్ధాంతాంగనలవ్రతము చూఱలుగొనవే
బౌద్ధావతారమున సుర
సిద్ధాదులుపొగడ భక్తసేవ్య ముకుందా. 38

క. కలికిమహారూపుఁడవై
ఖలులగుమ్లేచ్ఛులనుదునిమి కారుణ్యమునన్
గలిదోష మడఁతువొగడ
సలలితఘననీల సుగుణజాల ముకుందా. 39

క. దశరూపములను బూని త్రి
దశులు నమోనమ యటంచుఁ దద్వేళల నీ
యశమును గొనియాడఁగా దు
ర్దశలను బాపుదువుగాదె దయను ముకుందా. 40

## దశమస్కంధపూర్వోత్తరభాగ కథాసూచకపద్యములు.

క. వసుదేవుఁడు దేవకియును
వసుదేవముఖుల్ నుతింప వాత్సల్యమునన్
వసుమతి నినుబుత్త్రునిగాఁ
గుసుమాయుధరూప కనరె శౌరి ముకుందా. 41

క. నందయశోదామిథునము
నందనుఁడవటంచు నిన్ను నమ్మియుఁ బరమా
నందాబ్ధిమగ్నమై లోఁ
జెందినప్రేమాతిశయముచేత ముకుందా. 42

క. కృష్ణాష్టమియం దిలపైఁ
గృష్ణాఖ్యను జననమొంది కితవతతిని వ
ధిష్ణుఁడవై తునిమితివా
యుష్ణాంశునికాశతేజమొప్ప ముకుందా. 43

క. సుజనచకోరము లలరఁగఁ
గుజనాంభోజాతతతి ముకుళతవహింపన్
ద్విజరాజవంశశరధికి
ద్విజరాజవుకావె దివిజనినుత ముకుందా. 44

క. కలుషధ్వాంతము విరియఁగ
విలసితపుణ్యాంబుజములు వికసిల్లఁగ భూ
తలమున శ్రీకృష్ణాఖ్యను
జలజాప్తునివిధముగొనవె సదయ ముకుందా. 45

క. నీచిన్నారికరంబులు
నీచారుపదాంబుజములు నీచిఱునగవుల్
నీచక్కఁదనము పొడఁగని
వాచస్పతికైనఁ బొగడవశమె ముకుందా. 46

క. రాజిలుచు నిన్ను గోపక
రాజాస్యలు శయ్యనునిచి రాగముతోడన్
జోజోయని పాడుదురఁట
రాజీవదళాక్ష లోకరక్ష ముకుందా. 47

క. రుచిరాకారముచే విష
కుచయగురక్కసినిబట్టి కూల్చితివఁట నీ
ప్రచురప్రభావములు సుర
నిచయముగొనియాడ శరదనీల ముకుందా. 48

క. నిండిన తేజము గదురఁగ
జండోగ్రనిశాశకోపసంయుక్తుఁడవై
బండినిగూల్చితివా నీ
దండితనం బెన్న నెవరితరము ముకుందా. 49

క. సల్లలితమృదులకరపద
పల్లవములు దగుల నెలమి పాల్ద్రావుతఱిన్
ముల్లోకంబులు ముఖమునఁ
దల్లికిఁ గనఁబఱుప లేదె దయను ముకుందా. 50

క. చక్రానిలదనుజుఁడు నిను
విక్రమమునఁ గొనుచు గగనవీథిజనుతఱిన్

శక్రాదులు గొనియాడ న
వక్రతఁ గూల్చితివి భక్తవరద ముకుందా. 51

క. పలుకుల నమృతరసంబులు
చిలుకఁగఁ బాదాంబుజములఁ జిఱుగజ్జెలు ఘల్
ఘలుఘలుమని మ్రోవఁగ గం
తులువైచవె శైశవంబుదోఁప ముకుందా. 52

క. పన్నగరాజునకైనను
సన్నుతిజేయంగరానిజన్నంబుల నీ
కెన్నఁడు తృప్తియు లేదఁట
వెన్నలు మ్రుచ్చిలుట లెంతవింత ముకుందా. 53

క. వాత్సల్యముతోడను గో
వత్సములను మేపుచుండి ప్రబలతమెఱయన్
వత్సాసురుఁ దునుమవె శ్రీ
వత్సాంకితవక్ష సుజనపక్ష ముకుందా. 54

క. ఒకకొండరీతిగ భయా
నకరూపముదాల్చి తిరుగు నానాగతులం
బకదైత్యుని దునిమితివొ
సకలాశ్రితజాల దివిజసాల ముకుందా. 55

క. ఖరుఁ డఘదైత్యాధముఁ డజ
గరగతిమార్గమున నెదురుగా నిలువఁగ భీ
కరకరములఁ జీల్పవె చూ
పరు లద్భుతమొంద భక్తపాల ముకుందా. 56

క. కాళీయఫణిఫణములపై
హేలాగతి పాదచిహ్నలేర్పడ నటనల్
వాలాయముగ నొనర్పవె
జాలిం దత్సతులు నుతులు సలుప ముకుందా. 57

క. వత్సార్భకతతి నజుఁ డతి
కుత్సితమతియగుచు నొక్కగుహనిడి చన త
ద్వత్సరము తత్తదాకృతి
వత్సలతవహింపలేదె వరద ముకుందా. 58

క. నతుఁడై భయభక్తుల నా
చతురాననుఁ డప్రమేయసౌందర్యశ్రీ
యుతతావకరూపముగని
స్తుతులొనరింపంగలేదొ సొలసి ముకుందా. 59

క. యమునాజలములఁ దోఁగెడి
కమలాస్యలహాస్యమెసఁగఁ గన్గొని తచ్చే
లములఁగొని మరలనీయవె
విమలాత్మకలగుచు నిన్ను వేఁడ ముకుందా. 60

క. సురపతి కోపాన్వితుఁడై
పరుషోపలవృష్టి వ్రజముపైఁ గురియుతఱిన్
వెఱవకుఁడని గోవర్ధన
గిరియెత్తవె యొక్కలీలఁ గేల ముకుందా. 61

క. మానితయమునాతటభూ
కాననమున గోగణంబుఁ గాచుచు మురళీ

గానమొనర్పఁగ నిను వ్రజ
మానవతుల్ గోరలేదె మదిని ముకుందా. 62

క. బృందావనమున గోపక
సుందరులను రాసకేళి సొక్కించి మహా
నందమునఁ గూడియాడవె
బృందారకు లలర సుగుణబృంద ముకుందా. 63

క. ముజ్జగములు కుదురుగ బల్
బొజ్జన ధరియించునిన్నుఁ బొలుపుగ వ్రజయో
షిజ్జనము వలచె మోహాక
మజ్జనమున విటుఁడవనుచు మమత ముకుందా.

క. ఇరుగడలను గోపికలును
పరగఁగ మధ్యమున నుభయపార్శ్వంబుల నీ
వరుదుగ నిలువవె మండల
సరణిక్ రాసోత్సవంబు సలిపి ముకుందా. 65

క. ముద్దులుగులికెడుపలుకుల
వద్దికను భ్రమించి గోపవనితామణు లే
ప్రొద్దు నినుగూడుదురుగద
సద్ద్విజమునీంద్ర దేవసాల ముకుందా. 66

క. పరిపరివిధముల మెలఁగుచు
దురమున వృషశంఖధూడతురగాసురుల౯
బరిమార్చి దుష్టనిగ్రహ
మరుదుగ నొనరింపలేదె హరి ముకుందా. 67

క. వక్రాత్ముండగు కంసుం
డక్రూరునిగాంచి యోమహాత్మ చని మహా
విక్రములగు బలకృష్ణుల
నక్రూరత్వమునఁ బిలువమనఁడె ముకుందా. 68

క. వచ్చిన యక్రూరునిగని
విచ్చేసె మహాత్ముఁడనుచు వేడ్కఁ దలిర్పన్
బొచ్చెములేని సపర్యల
హెచ్చుగఁ జేసితివిగాదె యెలమి ముకుందా. 69

క. స్యందనమునఁ దోలుతను గా
ళిందీజలములను నీదులీలాకృతి గా
నందింపఁడె యక్రూరుఁడు
వందనములొనర్చి దాసవరద ముకుందా. 70

క. మధురాపట్టణసురుచిర
మధురాధర లపుడు నీదుమదనాకృతియున్
మధురాలాపంబులు బహు
విధములఁ గొనియాడలేదె వేడ్క ముకుందా.

క. కంసముఖదుష్టభూపనృ
శంసుల చక్రాదిదివ్యసాధనములచే
హంసతురగుండు మేలన
హింసింపఁగలేదె జగములెన్న ముకుందా. 72

క. జననీజనకులఁ గనుఁగొని
వినయమున నమస్కరించి విపులాహ్లాదం

బొనరించి యుగ్రసేనుని
జననాథుని జేయలేదె సదయ ముకుందా. 73

క. బృందారకగురుసముఁడగు
సాందీపునివలన వేదశాస్త్రంబుల నా
నందమున నేర్చి గురునకు
నందనునొసఁగవె భళీ! యనంగ ముకుందా. 74

క. కనికరముతోడ గోపక
వనితల నోదార్చుకొఱకు వాత్సల్యమునన్
బనుపవె యుద్ధవు వ్రజమున
కనవరతదయాంబురాశివగుచు ముకుందా. 75

## అష్టభార్యలవివాహము.

క. క్రూరులగు చైద్యముఖనృప
వీరులను నిరాకరించి విశ్వజననియౌ
శ్రీరుక్మిణీసతీమణి
నారూఢిపరిగ్రహించి తౌర ముకుందా. 76

క. జాంబూనదరుచిరాంగియుఁ
గంబుగ్రీవయు విశాలకమలాక్షియునౌ
జాంబవతిం గైకొనవే
యంబుజశరకోటిసుందరాంగ ముకుందా. 77

క. సత్రాజిత్తుఁడు తనప్రియ
పుత్త్రికయగు సత్య నెలమి పూజించుచు స

త్పాత్రుఁడవని నీకొసఁగఁడె
మిత్రత్వము జగములందు మెఱయ ముకుందా.
క. ఇందీవరలోచన నీ
లేందీవరచికురపఙ్క్తి నీళసుత సదా
నందద సద్గుణయగు కా
ళిందీసుదతిని గ్రహింపలేదె ముకుందా. 79
క. కమనీయరూపఘనవి
భ్రమసుగుణవతీలలామ పరమానందక్
రమఁబోలు మిత్రవిందను
సుమహితమతి గొనవె మహిమఁజూపి ముకుందా.
క. భగ్నంబొనర్చి నృపతుల
నగ్నిప్రభనొప్పుశౌర్యమలర శుభశ్రీ
లగ్నంబునఁ జేకొనవే
నాగ్నజితిన్ లోకపూతనామ ముకుందా. 81
క. రుద్రాదులెన్న జలచర
ముద్రితయంత్రంబుఁ దునిమి మోహనలీలన్
భద్రన్ శమదమసుగుణస
ముద్రం గైకొనవె కృష్ణమూర్తి ముకుందా. 82
క. వనరుహలోచన చంద్రా
నన సద్గుణమద్రరాజనందన యగుల
క్ష్మణ నటుగైకొంటివిగద
జననాథులుమెచ్చ దివ్యచరిత ముకుందా. 83

క. షోడశసహస్రరమణుల
వేడుకఁ బరిణయమునొంది వివిధాకృతులన్
గూడి పరమాద్భుతంబుగఁ
గ్రీడింపవె నరకదనుజు గెలిచి ముకుందా. 84

క. పతిశుశ్రూషామతులగు
సతులకు నీకుదయమైన సవినయశౌర్యా
న్వితులగు సుతులగణింపఁగ
శతధృతిశర్వులకు వశమె సదయ ముకుందా. 85

క. శిశుపాలదంతవక్త్రుల
నిశితసుదర్శనముచేత నిర్జించి వెసన్
యశము జగంబులు నిండఁగ
విశద మొనర్చితివి వేదవేద్య ముకుందా. 86

క. అటుకులు కుచేలుఁ డొసఁగఁగఁ
దటుకున భక్షించి లోకతతికందని స
త్పటుతరసంపదలొసఁగితి
వఁట నీదాసత్వమెన్న నరుదు ముకుందా. 87

క. నిను ద్రౌపది కౌరవసభ
ఘనపరిభవమొంది కృష్ణ కావుమటన్నన్
గనికరముతోడ వెలువకు
మని యక్షయపటము లొసఁగితౌర ముకుందా.

క. సతుఁడై బహుతరదైన్యా
న్వితుఁడై భూసురుఁడు నిన్ను వేఁడిన గృపమున్

మృతులైనసుతులఁ గ్రమ్మఱ
బ్రతికించి యొసంగితౌర పరమముకుందా. 89

క. శ్రుతులు నిను మాగధులు భూ
పతిఁ నెటుగీర్తింతు రటులఁ బటుతరభక్తిన్
నుతులొనరింపవె సతతము
చతురాననవినుతపాదజలజ ముకుందా. 90

## ——షోడశోపచారపూజ.——

క. ధ్యానమొనర్చెద మామక
మానసకంజాతపీఠమధ్యంబున నీ
సూనశరమృదుపదంబులు
మానసమునఁనిల్పి శ్రీరమాప ముకుందా. 91

క. ఆవాహన మొనరించెద
శ్రీవనితారమణిఁ గూడి చెలువారంగా
వేవేగరమ్ము మామక
సేవకుఁడని కనికరంబుచేత ముకుందా. 92

క. భాసురకాంచనమణిసిం
హాసన మొసఁగెదను బంకజాక్షకృపను నీ
వాసీనుఁడవై బ్రోవుము
శ్రీసతితోఁగూడి గుణధురీణ ముకుందా. 93

క. ముదమున నర్ఘ్యం బొసంగెద
సదయుఁడవై గొనుము దివిజసన్నుతచరితా

విదురముఖభక్తవరదా
మదనశరోల్లసితరూపమహిత ముకుందా. 94

క. విద్యాధరముఖసురనుతి
వేద్య కృపారసనివేశ విశ్వేశ్వర శ్రీ
విద్యోతనగై కొను మిదె
పాద్యం బొసఁగెదను భక్తపాల ముకుందా. 95

క. నాచిత్తంబుజపీఠిని
నీచక్కనివిగ్రహంబు నిల్పి నతుఁడనై
యాచమనీయం బొసఁగెద
వాచస్పతివినుతగొనుము వరద ముకుందా. 96

క. అభయప్రద జగదద్భుత
విభవసమస్తాగమాంతవేద్య రమేశా
ఇభరాజవరద గైకొను
మభిషేక మొనర్చెదను కృపాబ్ధి ముకుందా. 97

క. సీతారమణీకళత్రా
శీతాంశుఖరాంశునేత్ర చిత్రచరిత్రా
పీతాంబర మొసఁగెదఁ గొను
చేతోమోదాతిశయము చేత ముకుందా. 98

క. కందర్పసదృశవిగ్రహా
మందరసమధైర్య సంకుమదకలితశ్రీ
చందనమలఁదెదఁ గైకొను
మందముగా మానసాబ్జ మలర ముకుందా. 99

క. మొల్లల జాజులఁ బొగడల
మల్లెలఁ జేమంతిపూల మరువక తులసీ
పల్లవముల సంపెంగల
ఫుల్లాంభోజముల సేతు పూజ ముకుందా. 100

క. ధూప మొనర్చెద సర్వ
వ్యాపక పద్మాక్ష గరుడవాహన ధర్మ
స్థాపక లక్ష్మీనాయక
గోపాలస్వామి కృపను గొనుము ముకుందా.

క. శ్రీరాజనం బొనర్చెదఁ
గారుణ్యాకరరమేశ గైకొనుపారా
వార గభీరపరాత్పర
సూరిజనావనశమాదిసుగుణ ముకుందా. 102

క. క్షీరాన్నము దధ్యోదన
మారూఢిగ వడలు సుఖియ లతిరసములు నిం
పార పులిహోర పొంగలి
కూరిమి నర్పింతుఁ గృపను గొమ్ము ముకుందా.

క. ఏలాలవంగవరహిమ
వాలుకసత్క్రముకచూర్ణవర్ణితమగు తాం
బూలమొసంగెదఁ గైకొను
శ్రీలలనారమణ మృదులశీల ముకుందా. 104

క. అంగీకరించి కృపను
పొంగుచు నొసఁగెదను మంత్రపుష్పము విద్వ

త్సంగరిపుభంగ గరుడతు
రంగదయాసాంద్రాంతరంగ రంగ ముకుందా. 105

క. సీతావల్లభ వలఁగొని
ప్రీతాత్ముఁడనై నమస్కరించెదఁ గరుణో
పేతాంతరంగ మామక
పాతకము లడంచి బ్రోవు పరమ ముకుందా. 106

క. దూపాటికొండమార్యసు
ధీపుంగవునకును సుతుఁడఁ దిరుమలకవినా
దీపించినాఁడ నీకృప
నీపద్యావళి యొసర్చి తెలసి ముకుందా. 107

క. సతతము తావకనామాం
చితశతకము జదువుజనులసిరి సంతతులన్
శతవత్సరములు విభవా
న్వితులుగఁ గృపసేయవయ్య వేడ్క ముకుందా.

ముకుందశతకము సంపూర్ణము.

---

# పీఠిక.

శివశతకము వ్రాసినకవినామము తెలుపుపద్య ములు మేము ప్రత్యంతరము వ్రాసికొన్నమాతృ కలో లేవు. మాకుఁ జిక్కినప్రతి యొక్కటియే యగు టవలనను నూటయెనిమిదిపద్యములకు నందింకఁ గొన్ని కొఱంతపడియుండుటవలనను ప్రత్యంతరస హాయము లేకుంటవలనను రచయితను నిర్ణయింప వీలు లేకపోయినది. శతకకర్త పద్యములలోనివిషయ ములను బట్టిచూడ వీరశైవుఁడని తోఁచుచున్నది. చెన్నబసవఁడు, బసవేశ్వరుఁడు, శివనాగుమయ్య, నిమ్మవ్వ, ధూర్జటి, ఉద్భటారాధ్యుఁడు లోనగువీర శైవుల నీకవిస్తుతించుట యీయూహకుఁ దార్కా ణముగా నున్నది. కవి వీరశైవుఁడని నిరూపింప వీలు చిక్కినది. కవికాలమును గుఱించి ప్రయత్నింప నొకస్వల్పావకాశ మీశతకమునఁ గలదు.

ఈశతకమున రచయిత వీరశైవులగు శివభక్తుల ప్రభావముల నెన్నుచు ఆంధ్రకవులలో నగ్రేసరుఁ డగు ధూర్జటికవి నిటులఁ బ్రశంసించినాఁడు.

క. చెలిచంటిమీఁదఁ జేయిడి
చెలువొప్ప శివా యటన్న చేడియ నవ్వఁ
చలపట్టి శివుని జూపిన
చెలువుని ధూర్జటిని దలఁతుఁ జెన్నొందఁ శివా. 76

ఈపద్యములోనికథ ధూర్జటికవి కారోపించి చెప్పువాడుక కలదు. కావున నిందుచేఁ బ్రకృతశతక కర్త పదునాఱవశతాబ్ది కీవలె నున్నాఁడని స్పష్ట మగును.

ఈశతకములోని 4-5 పద్యము లించుక మార్పుగ కృష్ణశతకమునందును 10-వ పద్యము కొంచెము మార్పుగా భాగవతమునందును గలదు. మిగిలినపద్యములలో 7-వ పద్యము తెలుఁగుసమస్యలను చిన్నిపొత్తములోఁ గలదు. తెలుఁగుసమస్యలను పొత్తములోనిపద్య మిది.

క. కందర్పహరుఁడు నరుతోఁ
బందికినై పోరిపోరి పరిపూర్ణకృపన్
గ్రిందైన హరుని జూటపుఁ
జందురులో నిఱ్ఱి నేల చంగలిమే సెన్.

యోచింప సమస్యపద్యమునే శతకకర్త సంగ్రహించినటులఁ దోఁచును. ఇంతకు మిగిలినపద్యములు స్వతంత్రము లనియే యూహింపవచ్చును.

శతకములందలిపద్యములు శివలీలలు శైవులప్రభావములు తెలుపుచున్నవి. పద్యములు భావములతోనిండి మంచినడకతో నలరారుచున్నవి. ఇందు లక్షణలోపములు మాత్రము తఱచుగాఁ గానవచ్చుచున్నవి. ఇత్వ అత్వములకుఁ బ్రాయికముగ యతి గూర్పఁబడియున్నది. గణనియమముగూడఁ బాటింపనితావులు కొన్నిగలవు. జీర్ణమై ఖిలముగానున్న యీయముద్రితశైవశతకమును ముద్రణమునకుఁ బ్రత్యంతరము వ్రాసికొననవకాశము కల్పించి గ్రంథప్రచురణమునకుఁ దోడ్పడిన కో. వీరబసవయ్యగారు ప్రశంసాపాత్రులు.

ఈశతకమునందలి వీరశైవులలీలాదికములుఅన్యవాదకోలాహలములోనిపద్యము ననుకరించుచున్నవి. భక్త్యతిశయముచే ఛందోనిబంధనలు పాటింపక కవితచెప్పుటచేఁ గవి యిందుదోషములను గమ

నించియుండఁడేమో! ప్రత్యంతరము చిక్కువఱకుపే క్షించినచో నీశతకము నశించునేమో యని యథా శక్తి సవరించి ప్రచురించితిమి.

ఇట్లు భాషాసేవకులు

శేషాద్రిరమణకవులు,

శతావధానులు.

చందిగామ.
1-1-25

శ్రీ ర స్తు.

# శి వ శ త క ము.



క. శ్రీశాంకరీమనోహర
పాశాంకుశ ఖడ్గపాణి ప్రమథాధిప కీ
నాశస్తుత దురితౌఘవి
నాశాంకుశ కోర్కులిమ్ము నమ్మితిని శివా. 1

క. వేదములు నాల్గుహయములు
నాదరముగ చర్మకోల నగణితప్రణవం
బౌవేదసారథౌటకుఁ
జేవెవరికి నీకుఁదక్క జగదీశ శివా. 2

క. వలనొప్ప సూర్యచంద్రులు
నలరథచక్రములు విష్ణువంబుగ, జ్యాయై
వెలయఁగను నాదిశేషుఁడు
వెలువడునే మేరువిల్లు వినుతింతు శివా. 3

క. నీవేతల్లివి దండ్రివి
నీవేనాతోడునీడ నీవేసఖుఁడౌ
నీవేగురుఁడవు దైవము
నీవే నే నన్యు నెఱుఁగ నిజమిదియు శివా. 4

క. ఓకారుణ్యపయోనిధి
నా కాధారంబవగుము నమ్మితి నెపుడున్
నా కేలయితరచింతలు
నాకాధిప సర్వలోకనాయకుఁడ శివా. 5

క. అండజవాహన వినుతా
ఖండలముఖపూజితాంఘ్రికంజాతయుగా
చండాంశుకోటితేజా
భండనరిపుమదవిభంగ భస్మాంగశివా. 6

క. కందర్పహరుఁడు నరుతోఁ
బందికినై పోరిపోరి పరిపూర్ణకృపం
గ్రిందైన నీదుబూటక
మెందైనంగలదె నిన్ను నేమందు శివా. 7

క. పవనము వశగతిజేసియు
వివశత్వమువిడచి యాత్మవిజ్ఞానముచే
వివరించి చూపులోపల
శివకళ యొలుఁగంగవచ్చుఁ జిన్మయుఁడ శివా. 8

క. నాగేంద్రచర్మచేలా
నాగాభరణాంచితోగ్ర నవ్యశరీరా
నాగారివాహజనకా
నాగారివాహవినుత నమ్మితిని శివా. 9

క. నీపాదకమలసేవయు
నీపాదసరోజభక్తి నిరతులయొడ్డల

స్నేపారనిష్టజనదయ
నేపావనమాడు నన్ను నెనగూర్చు శివా. 10

క. బ్రహ్మతల గొట్టినాఁడవు
బ్రహ్మాండములోన నీకుఁ బ్రతియెవ్వ రికం
బ్రహ్మేంద్రామరవందిత
బ్రహ్మానందంబొసంగి బ్రతికించు శివా. 11

క. త్రివిధప్రసాదమహిమము
పవిధరునకు వశమె. పొగడ భర్గునికృపచే
భవదూరులైనవారికి
శివయోగులమహిమలన్ని సిద్ధించు శివా. 12

క. మూలము లేదు శరీరికి
మూలముగలదంచు లోకమూలముచేతన్
మూలంబగు పంచాక్షరి
మూలముగుఱ్తెఱుఁగువాఁడె ముక్తుండు శివా.

క. మార్కండేయునికొఱకై
మార్కొని లయకాలయముని మడియఁగఁదన్నం
జేర్కొని సురలు నుతింపఁగఁ
గోర్కులు సమకూర్చినట్టి గుణమణివి శివా. 14

క. కమలములు వేయిలోపలఁ
గమలమునొకటియును లేక గమలాక్షుండుం
గమలమని నేత్రకమలము
గమలక నర్చించె మిమ్ము గణుతింతు శివా. 15

క. హాలాహలమదియెంతో
హేలాగతి బెచ్చుపెరిగి యెక్కుడఁ దానై
కోలాహలంబు చేయఁగ
నేలాగున మ్రింగవచ్చు నితరులకు శివా. 16

క. మదనారి జేసిపురములు
గదనంబునఁ ద్రుంపలేక కమలజముఖ్యుల్
అదనెఱిఁగి మిమ్ము వేఁడిన
విదితంబుగ నొక్కకోలవేసితివి శివా. 17

క. కాముఁడు దనపోఁడిమితోఁ
గామింపఁగఁ జేయఁదలఁచి కామశరాళిన్
హేమించి వేసె నీపై
సామాన్యమె నిన్ను గెల్వఁజాలుటకు శివా. 18

క. ఇందీవర హితజూటా
బృందారక మౌనిబృందపూజితచరణా
కందర్పకోటిరూపా
సుందరభసితాంగవేష సుశ్లోక శివా. 19

క. అంగన కర్ధశరీరము
నంగీకారముగ నొసఁగి యానందముతోఁ
బొంగుచునుండెడివేల్పులు
రంగుగ నెవ్వరైనఁగలరె రహిమీఱ శివా. 20

క. ఒకసారి నీదునామము
వికటీకృతశ్వోతుఁడేమొ వివరించుటచేఁ

ప్రకటించుపాపసంఘము
నకటా హరియింపఁబడియె నదియేమొ శివా. 21

క. ఎంబన్న సేయుహాస్యము
నంబికి గుంటెనయునడచునడవడి నీకున్
అంబలిపై భ్రమపుట్టుట
పంబినవేడుకయు నిదియుఁ బరమాత్మ శివా. 22

క. చెల్లుబడి యెంతగలిగిన
భల్లాణుని సతిని గోరఁ బాడియె నీకున్
చెల్లరె చెల్లని దిదియును
సల్లలితులజాడగాదు సర్వజ్ఞ శివా. 23

క. పువ్వులుఱువ్విన మదనుని
జివ్వున భస్మంబుచేతురే తగవగునే
నవ్వుచు సాంఖ్యము ఱాళ్లన్
ఉవ్విన మోక్షంబొసఁగ విరుద్ధంబు శివా. 24

క. పులియేమిచేసె పుణ్యము
సలలితముగ సామజంబు సౌఖ్యంబేమో
పలుపాముపలుకుఁదోడా
చెలువలరఁగ మోక్షమెట్లు సిద్ధించు శివా. 25

క. తిన్నఁడు దిన్నఁగ నీకున్
ఎన్నికతోఁ బెట్టినట్టియెంగిలి పొలసుల్
పన్నగభూషణ రుచియే
మన్ననతో నేలినావు మమ్మేలు శివా. 26

క. పిట్టవ్వ బెట్టుపిట్టకుఁ
గట్టడిచేసికొని నీవు గావేరివెసం
గట్టిగఁ గట్టితి వందురు
కట్టడివిగదన్న నన్నుఁ గరుణించు శివా. 27

క. చిఱుతొండభక్తునింటను
బరువడి శిశుమాంసమడిగి భక్షించిననీ
మరుగెల్లఁ దెలిసివచ్చెను
నెఱుఁగుదు నీగుట్టు లేలు మిఁకనన్ను శివా. 28

క. మోకాలుమేఁకపెంటిక
శ్రీకోమలికుచము నీకు శ్రేష్ఠంబయ్యెన్
లోకాధినాథ నీదగు
నాకారము జూపునాకు నదియేమొ శివా. 29

క. కొంకక దుర్మదవృత్తిని
సంకల్పించితిని బాపసంచయమెంతో
వంకలునెన్నఁగఁ దగదీఁకఁ
బంకజభవవినుత నన్నుఁ బనిగొమ్ము శివా. 30

క. వెలిబెట్టె నొక్కభక్తుఁడు
బలుమఱు రోఁకంటిబాధ బాల్పడె నొకఁడున్
బలుబాధలేల నీకున్
జెలువుగ నన్నేలరాదె శీఘ్రముగ శివా. 31

క. తటవటలేటికి జేసెదు
కటకట మహాదేవ కోటకాటనిఘనునీకున్

ఎటువలె మునురక్షించితొ
యటువలె నన్నేలరాదె యవ్యక్తశివా. 32

క. పటుతరపాపము లన్నియు
నెటువలె భరియించువాఁడ నేమెఱుఁగ నయో
కుటిలుఁడను ఘోరకోపుఁడఁ
గటికితనంబేల నన్నుఁ గరుణించు శివా. 33

క. సంసారసంగ మంతయు
హింసాధికమంచు మదిని నెంచియు నే నీ
సంసారభ్రాంతి నుండితి
హంసాస్పదబ్రోవవయ్య యాశ్రితుఁడ శివా. 34

క. ఒల్లరె యిహసుఖచింతల
నొల్లరు పరదారధనము లొల్లరు సతులన్
ఒల్లరు పరనిందాస్తుతి
నొల్లరు నీభక్తిపరులు నుమనాథ శివా. 35

క. చేసితి పరదైవస్తుతి
జేసితిఁ బరసతులపొందుఁ జేసితి హింసల్
జేసితిని నోపినంతయుఁ
జేసినతప్పెల్లఁ గావు చిన్మూర్తి శివా. 36

క. నీకంటె నధికుఁడెవ్వఁడు
నాకంటెను మూర్ఖుఁడెవఁడు నగచాపధరా
నీకుంటినవారలలోఁ
జేకొంటిని నన్నుఁ గల్పు చిద్రూప శివా. 37

క. ఏనుఁగు నిచ్చినయప్పుడె
మానుగ నంకుశముదాఁప మర్యాదగు నే
నేనొంటి నుండఁజాలను
లోనాదును నీదుభక్తలోకులకు శివా. 38

క. పామరము విడువఁజేసియు
వేమఱు నీభక్తకోటివిమలపదంబుల్
నీమమున నాదుతలపైఁ
బ్రేమను భరియింప బుద్ధిఁ బుట్టించు శివా. 39

క. కులమొల్లరు స్థలమొల్లరు
కలుషము విడనాడి భక్తిఁ గైకొందు రిలన్
ఫలమొల్లరు బలమొల్లరు
కలుతురు నీలోన మనసుగలిసియును శివా. 40

క. లోకేశ భక్తవత్సల
చేకొను నాతప్పులెల్ల శర్వాణీధవా
కాకోదరకరకంకణ
నీకోమలరూపుఁ జూపు నిక్కముగ శివా. 41

క. ఖండేందుమౌళి కావుము
కుండలకోటీరహార కోమలదేహా
ఖండలవందిత శ్రీవర
కాండా నన్నేలకుండఁ గాదింక శివా. 42

క. పరమేశ పార్వతీపతి
వరద త్రియంబక మహేశ వాగీశనుతా

శరదభ్ర శుభ్ర దేహా
శరజన్ముని జనక కావు సత్వరము శివా. 43

క. వేదంబులు గననేరక
వేదనతోఁ బెక్కుగతుల వివరింపంగా
భేదించి నీదుతత్త్వము
ఆదిపరబ్రహ్మ పొగడ నలవగునె శివా. 44

క. శ్రీధవ వేధలకైనను
నాధీనముగాదు నీదునాద్యంతంబుల్
భేదించి యిట్టిదన నుమ
నాథా నేనెంతవాఁడ నన్నేలు శివా. 45

క. కైలాస శైలమందిర
శైలాత్మజనాథ మౌనిసేవితచరణా
శైలారివంద్య కాంచన
శైల ధనుఃపాణి నిన్ను స్మరియింతు శివా. 46

క. గోరాజవాహపూజిత
గోరాజవిరాజమానగుణరత్ననిధీ
హేరాజరాజరాజిత
హారాకోటీర శంబరాంతకుఁడ శివా. 47

క. హాలాహలలాంఛనగళ
హేలాధవదహననేత్ర యిందుకిరీటా
కోలాహలాంతకాంతక
లీలావీరావతార లీనాత్మ శివా. 48

క. శితికంఠ శూలపాణీ
ప్రతిలేరిఁక నీదుసాటిపద్మభవాదుల్
అతిదీనుఁడ నన్నేలుము
సతతము నీపాదసేవ సమకూర్చు శివా. 49

క. ఫాలాక్ష పాపనాశన
చాలా వేఁడితిని నింకఁ జలపాదితనం
బేలా నీపదభక్తుని
కేలా యిహకష్టసుఖము లీశాన శివా. 50

క. అక్షయ గురుపాపక్షయ
దక్షాధ్వరనాశ దావదవశిఖినేత్రా
యక్షేశ మిత్రమైత్రిని
రక్షింపఁగదయ్య అయ్య రహిమీఱ శివా. 51

క. నిక్షేపము నాపాలిటి
యక్షేశసఖుండు పార్వతీశుం డనుచున్
ఆక్షేపించక కొల్చెద
నీక్షణమే నన్నుఁ బ్రోవు మీశాన శివా. 52

క. శంకర పాపభయంకర
కంకాళకపాలహస్త గౌరీరమణా
ఓంకారమంత్రమయహర
హంకారవిదూర మోక్ష మర్పించు శివా. 53

క. భవదూర భర్గభయహర
పవనాశన యీశ భక్తపాలన శర్వా

భువనైకపోష పశుపతి
పవిధరవందిత మహేశ ఫాలాక్ష శివా. 54

క. కృషిఁ జేసితి బహుకాలము
వృషభధ్వజ మిమ్ముఁ గూర్చి వేమాఱు మదిన్
వృషగాదు నన్ను నేలుము
విషధర ఫణిరాజభూష వినుతింతు శివా. 55

క. విశ్వేశ విశ్వరూపక
విశ్వాత్మక వేదవేద్య వేదాంతమయా
విశ్వంబులోనివారలు
శాశ్వతముగ మిమ్ము గొల్వఁజాలుదురె శివా. 56

క. శివనామము శుభమిచ్చును
శివనామము జనులకెల్ల చెలువము లెచ్చున్
శివనామ మొసఁగు నాయువు
శివనామము మోక్షమొసఁగు సిరులిచ్చు శివా.

క. సూనశరాసనవైరీ
మానుగ నీపాదభక్తమండలి యిండ్లన్
బూనుకొని నిలువఁజేయుము
జానుగ నాజన్మఫలము సఫలంబు శివా. 58

క. ముదమున నీపదభక్తుల
సదమలపదసరసిజమ్ముల సతతము దూరే
మదనారి నాదుశిరమునఁ
గదసినపావనముగాదె కామించి శివా. 59

క. ఎన్నెన్ని జన్మములకున్
బన్నగధర నీదుభక్తిపరిపూర్ణునకున్
జెన్నొందు సేవ జేయఁగఁ
గన్నకుమారునిగ నన్నుఁ గరుణించు శివా. 60

క. నీకంటె నెవ్వరింకను
నాకంటికి నితరచింత నగపడదుగదా
నీకంటకంబుమానియు
శ్రీకంఠా నన్ను నేలు శీఘ్రముగ శివా. 61

క. పంచముఖ నిన్ను నమ్మితి
వంచనచేయక మహేశ వరద పినాకీ
అంచితముగ సాయుజ్యము
సంచితముగ నాకు నొసఁగు సర్వేశ శివా. 62

క. దారువనమునులభామల
ధీరుఁడవై కూడి యితరదేవుళ్లకునున్
మేరువవై వరమిచ్చిన
పౌరుఁడ నిన్నెన్నవశమ పరమేశ శివా. 63

క. గొడగూచిపాలు ద్రావఁగఁ
గడుపున క్షుధదీఱలేదొ కడుమోహంబో
తడబడక విసము మ్రింగిన
బడుగవు నిన్నేమనందు పరమేశ శివా. 64

క. సత్తెక్కయింటికేగియు
నత్తెను పలుమాటలాడి యావిడచేతన్

మొత్తఁబడితి వింకేమనఁ
గుత్తుకవిషమున్నవానిగొట్టుదురు శివా. 65
క. మాయ న్మాయలఁ బెట్టిన
మాయకుఁడవు నీవుగాని మదినమ్మితి నే
మాయలవాఁడనుగా నిఁక
మాయింపుము నాదుదురితమార్గములు శివా.
క. కంబళినంచును నొకరికిఁ
గంబళిగప్పుకొనివచ్చి కైలాసంబున్
శంబరవైరికి వైరీ
సంబరమున నిచ్చినట్టి సర్వజ్ఞ శివా. 67
క. హరుఁడే దైవమటంచును
నిరవొందఁగ సభలయందు నెగ్గించినయా
వరగురుని మల్లికార్జును
వరదుని నామదిని నెపుడు వర్ణింతు శివా. 68
క. లక్షాతొంబదియాఱును
నక్షయగణములనుగూడి యాబిజ్జలునిన్
శిక్షించి భక్తిజూపు స
లక్షణబసవన్నఁ గొల్తు లక్షించి శివా. 69
క. ఫాలాక్షుభక్తవితతియు
నేలాగున గోరువారు నీలాగుననే
మేలయినచీరెలిచ్చెడి
శీలున్ మడివాలుఁదలఁతుఁ జిత్తమున శివా. 70

క. అచ్చో త్తినగొత్తకునై
విచ్చలవిడి ద్రోహిఁ జంప విపులేశుసభఁ
విచ్చేసి శివునిసాక్షిగ
మెచ్చిచ్చినకిన్నరునకు మ్రొక్కుదును శివా. 71

క. బసవండిచ్చినయాసతి
పసగలభక్తుండు చెన్నబసవనితలపై
వెసనిడుకొని చెల్లించెడి
యసమానుని మదిఁదలంతు నఖిలేశ శివా. 72

క. వేదంబులు శునకముచే
వాదంబున జదువజేసి వప్పించినయా
భేదుండగు కక్కయ్యను
భేదం బెడబాసి గొల్తు బెంపొంద శివా. 73

క. కులహీనుఁ డీతఁ డన్నను
గులజులు చూడంగ వ్రేళ్లుకోసినపాలుఁ
అలిగురిసినట్టిపుణ్యుని
సలలితు శివనాగుమయ్య స్మరియింతు శివా. 74

క. కంచేదువాడవారలఁ
గొంచక కైలాసమునకుఁ గొంపోయిన ని
ర్వంచక నిమ్మవ్వను వే
వంచనలేకయె నుతింతు పరమాత్మ శివా. 75

క. చెలిచంటిమీఁదఁ జేయిడి
చెలువొప్ప శివాయటన్నఁ జేడియనవ్వఁ

జలపట్టి శివునిజూపిన
చెలువుని ధూర్జటిని దలఁతు చెన్నొంద శివా. 76

క. శ్రీచందనంబు కావడి
నేచందమునైన దెచ్చి యిదిగో ధూపం
బోచంద్రజూట కొనుమను
నీచందపుయోహియుణ్ణి నేగొల్తు శివా. 77

క. వటవృక్షభూతములకుం
బటుతరకైలాసమిచ్చి పరగినపుణ్యుం
డట నుద్భటార్యగురునిఁ
ఘుటికుని నామదిని దలఁచి గణుతింతు శివా.

క. ఘుటనాఘుటనసమర్థులు
కుటిలురసద్భావపరులు కొందఱుప్రమథుల్
పటుతరముగ లెక్కింపను
నెటులోపును శేషుఁడైన నీశాన శివా. 79

క. తోఁచినమట్టుకు వర్ణన
నేచేసితి నన్నమాట నేర్పడదుగదా
యోచించుబ్రహ్మయైనఁ
వాచకుఁ డెవఁడింక నిన్నువర్ణింతు శివా. 80

క. భసితము పాపవినాశని
భసితము పరమార్థదాయి ఫాలాక్షుకృపఁ

భసితము బెట్టిన మనుజుఁడు
శశిమౌళీ శ్రేష్ఠుఁడతఁడు చర్చింప శివా. 81

క. భూతిధరించినపుణ్యుఁడు
పాతకమెడబాసి హరునిపజ్జనెయుండుఙ్
భూతి యైశ్వర్యకరమగు
భూతేశునకైనదరమె భూతెన్న శివా. 82

క. పరమేష్ఠిఫాలమందున
నరునకుఁ జెడువ్రాఁతవ్రాయ నవిదుడిచియుఁ దాఁ
బరగశుభమిచ్చుభసితము
నరుడార మహాత్మునెన్న నలవగునె శివా. 83

క. భూతివలన భూతంబులు
భేతాళులు భీతిఁజెంద భీకరగతులఙ్
భూతేశుని ప్రియమగుటం
బాతకహాతిభూతి పరమపావనము శివా. 84

క. రుద్రాక్షమహిమ దెల్పఁగ
రుద్రునిచే నగునొ కాదొ రూఢిగ నరులుఙ్
భద్రముగఁ దాల్పవలయుఙ్
రుద్రా రుద్రా యటంచు రుద్రాక్ష శివా. 85

క. ఏకముఖి మొదలుగాఁగల
లోకములో ముఖములుండు రుద్రాక్షలకుఙ్

బాకారి బ్రహ్మహరిముఖు
లేకాకృతి వానిదాల్తు రెల్లపుడు శివా. 86

క. రుద్రాక్ష నరుఁడు దాల్చియు
రుద్రునిలోకంబునందు రూఢిగనుండుఁ
రుద్రమగు యమునిబాధలు
ఛిద్రముపై తొలఁగుఁగాక శీఘ్రముగ శివా. 87

క. పంచాక్షరి భవహరమగుఁ
బంచాక్షరిమంత్రరాజపరిపూర్ణంబౌ
పంచాక్షరిచ్చు మోక్షము
పంచాక్షరి పంచముఖుఁడు పరికింప శివా. 88

క. వేదంబునట్టనడుమ ను
పాదించుచు శివునికంటె పరుఁడున్నాఁడా
భేదింపలేఁడు పరమని
వాదించుచు నుండు నితరవర్ణములు శివా. 89

క. ఐదక్షరములుగూడఁగ
పైదై ప్రణవంబు బల్కు పరశివుమహిమల్
ఏదైన దానిసరియే
వాధింతురె దీనికితరవాదకులు శివా. 90

క. పరధనముల హరియించితిఁ
బరభామలభ్రాంతిపడితిఁ బరిపరిగతులన్

బరభక్తి కాసజెందితిఁ
బరమపరా నన్నుబ్రోవు పరమేశ శివా. 91

క. ఉదరము పోషించుటకై
సదమలమతి నిన్నుగొల్వఁజాలక చాలా
విధములను నదిరిపడితిని
మదినుంచక నన్నుబ్రోవు మదనారి శివా. 92

క. శివశంకర శివశంకర
శివశంకర యనుచు నెప్పుడు సేవింతు మదిన్
శివశంకర శివశంకర
శివశంకర బ్రోవుమయ్య శీఘ్రముగ శివా. 93

క. సిరియురమునఁ గలహరియును
బరమేష్ఠియు నీదుపాదపద్మములు తగన్
గులుతుఁ గనజాలరైరట
ఉరులింగ మహేశ భక్తయోగీశ శివా. 94

క. వరసాయుజ్య మొసంగఁగ
మఱిమఱివేఁడితిని నన్నుమన్నించుము నే
దురితాత్ముఁడ దుర్జనుఁడను
గరుణామృతదృష్టిఁజూడు కలికంఠ శివా. 95

క. మురహరుఁడు నేత్రకమలము
మురియుచు నర్పింప నీవు ముచ్చటగాఁగన్

పరచక్ర మొసఁగి బ్రోవవె
శరణాగతరక్షకుఁడవు జగదీశ శివా. 96

క. పరమాత్ముఁడవని గొలిచిన
సురపతి కైశ్వర్యమొసఁగి శుంభద్గతిచేఁ
గరుణించ లేదె దీనుఁడ
దరిజేర్పుము నీలకంఠ దయయుంచి శివా. 97

క. కరచరణాద్యవయవములు
గరము సలక్షణతనుండు కాలంబిదె నీ
స్మరణకుఁ బాత్రునిజేయవె
వరమార్కండేయుభాతి పరమేశ శివా. 98

క. మరణాంతకసమయంబున
హరహర దలఁచెదనొ లేక యటుగాదో నా
కెర విప్పుడె చెప్పఁగదే
కరకంఠా నీదురూపు గాన్పించి శివా. 99

క. ధరలో దాతలనేకులఁ
బురహర సృష్టించినావు భూతేశుఁడ నీ
సరిలేరటంచుఁ జాటెదఁ
బరమాత్మా జగమునందుఁ బ్రఖ్యాతి శివా. 100

క. చిరతరభక్తిని గొల్వఁగఁ
బరమానందమును బొంది ప్రావీణ్యతచే
నరులకు భక్తియు ముక్తియుఁ
గరుణించేదొరవు నిన్నుఁ గనుగొందు శివా.

క. సురసేవ్యుఁడ నీపదములు
కరవీరలఁ దుమ్మిమల్లికాకుసుమములన్
విరజాజిపూల కనకాం
బరపూవుల పూజజేసి గణుతింతు శివా. 102

క. పరుఁడని యెంచక నేద
బ్బఱలాడఁగలేను నీదుపదయుగ్మము నా
శిరమునఁ జేర్పుము మ్రొక్కెదఁ
బరశివ నావిన్నపంబుఁ బాలించు శివా. 103

శివశతకము సంపూర్ణము.

---

# పీఠిక.

ఈశతకమునకు మాతృక జీర్ణాతిజీర్ణమగు వ్రాత ప్రతి భువనగిరి (నిజామురాష్ట్రము)లో లభించెను. ప్రతికాగితముపైఁ జిరకాలముక్రింద వ్రాయఁబడి యుంటచేఁ గాకితములు చివికి వర్ణస్వరూపము నశించియుండెను. వ్రాఁతలోపములుమిక్కుటముగాఁ గలవు. లేఖకుఁడు భాషాపరిచయుఁడు కాకపోవు టచేఁ దెలియక కొన్నిచోటులఁ బద్యభాగములలో విడచిపెట్టెను. ఇట్టి జీర్ణాతిజీర్ణమగుప్రతి మామిత్రు లగు మక్కపాటి వేంకటరత్నకవిగారివద్దఁ గైకొని పఠింపఁ గవి గొప్పవాఁడై యుండుననియు లేఖక లోపములచే శతకప్రశస్తి మాటుపడెనని నిశ్చ యించి ప్రత్యంతరము మిగుల శ్రమమీఁద వ్రాసి తిమి. పిదప వేంకటరత్నకవిగారి సహాయముతో మాతృకానుసారముగఁ బ్రత్యంతరమును సవరించి తిమి. మూలమునందె. కొన్నిపద్యము లన్వయదు ష్టములై యుంటచేఁ గవ్యభిప్రాయము తెలియరా మిచే నటులెయుంచి సామాన్యములగు లేఖకప్ర మాదములు సవరించితిమి.

ఈశతకరచయితయెవరో యేకాలముననుండెనో కాలమేదియో యెఱుంగనగు నాధారము లిందుఁ

గానరావు. శైలిని బట్టిచూడ శతకము ప్రాచీన మనుటలో సంశయము లేదు. శతకమునందలి "నాగేంద్రాఖ్యుఁడ" ననుపద్యమువలనఁ గవి నాగసమాఖ్యుఁడని తెలియును. పదమూఁడవ శతాబ్దిలో రేచెర్లగోత్రీయుల యాస్థానమునందున్న నాగనాథుఁడే శతకకర్తయై యుండునేమో తెలియదు.

త్రయ్యంతార్థము, జియ్యాళ్వారు, శ్రీసూక్తి, ప్రపన్నులు లోనగు పదములవలన నీకవి విశిష్టాద్వైతియని తోఁచును. ఈశతకమునందలి పద్యములు శ్రావ్యముగ మనోజ్ఞముగ నున్నవి. శతకము లందు సహజముగాఁ గానవగు వ్యాకరణదోషములుగూడఁ గలవు. గాని గుణగణమునం దవి గణనీయములుగావు. ఈయుత్తమశతక మింక నుపేక్షించిన నంతరించునేమోయని యథోపలభ్యముగ సంస్కరించి యిప్పటి కీసంపుటమునఁ బ్రచురింపఁగలిగితిమి. ఈకవి నిజాము రాష్ట్రమునందలి ఓరుగల్లు ప్రాంతనివాసియై యుండును.

ఇట్లు భాషాసేవకులు
శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

నందిగామ.
1-1-25.

శ్రీ ర స్తు.

# రమాధీశ్వరశతకము.

---

శా. శ్రీ దేవీ కుచకుంభసమ్మిళిత కాశ్మీరంబు వక్షో
మణిఁ, దాఁ దాస్యంబు ఘటింప వామకరపద్మ
స్పర్శనాలింగన, స్వేదాంభోరుహదివ్యమూర్తియ
గు లక్ష్మీవిష్ణుదేవుఁ మిమ్ముఁ, వేదాంతుల్ మది
గాంచి మ్రొక్కుదురు గోవిందా రమాధీశ్వరా.

శా. క్షోణిఁ మర్త్యుఁడు మోక్షసాధ్యపదవిఁ గో
విందనామాంకని, శ్రేణిఁ గాంచుటఁ జూచి
మీనుతులు నేఁజేయంగ మైకొంటి నా, వాణీ
దేవియు మీప్రసాదగరిమఁ వాక్యంబు లంది
చ్చుచో,వీణాపుస్తకపాణియై నిలుచు గోవిందా
రమాధీశ్వరా. 2

శా. నాగేంద్రాఖ్యుఁడనోదుఁగాని ముఖముల్ నాకే
మి వేయున్నవో, భోగానంద సువర్ణధర్మగుణసం
పూర్ణప్రభావుండనో, ధీగంభీర పదప్రతిస్ఫురణ
గీర్తింతుఁ వచోరూఢి నీ,వే గీర్వాణమునీంద్ర
వంద్యపద గోవిందా రమాధీశ్వరా. 3

మ. జయనారాయణ వాసుదేవ కమలాక్షా పద్మనా
భా ధనం, జయ సన్మిత్రపవిత్రగోత్ర హరి కృష్ణా
రుక్మిణీశా సదా, ద్వయనిష్ఠాపరుఁడైనసాత్త్వికున
కున్ బ్రత్యక్షమైయుందు శ్రీ, ప్రియ నీవున్
హృదయాబ్జమధ్యమున గోవిందా రమాధీ
శ్వరా. 4

మ. నవనీతప్రియ భక్తపాలన జగన్నాథా హృషీ
కేశ కేశవ దామోదర దేవకీతనయ కంజాతాక్ష
దేవేశ మాధవ వైకుంఠనివాస భూధర ముకుం
దా భక్తచింతామణీ, వివిరాత్కేతన తేనమోఽ
స్తు హరి గోవిందా రమాధీశ్వరా. 5

శా. ఓకంజాతదళాక్ష చక్రధర సర్వోత్కృష్ట సర్వ
జ్ఞ శాం, తాకారా ఫణిరాజతల్ప పరమాత్మా
కోటికందర్పమూ, ర్తీ కళ్యాణగుణాభిరామ శర
ణార్థిన్ నన్ను రక్షింపరా, వే కంసాంతక నామ
నంబునకు గోవిందా రమాధీశ్వరా. 6

శా. శ్రోత్రానందము మిమ్ము విన్న ప్రతిమారూపం
బు వీక్షించినన్, నేత్రానందము మీకథాసరణి
వర్ణింపంగ వాక్సిద్ధి మీ, గాత్రధ్యానము చిత్త
శుద్ధి సకలాంగప్రీతి మీభక్తి యో, వృత్రారా
తినుత ప్రతాప హరి గోవిందా రమాధీశ్వరా. 7

మ. గుహునాత్మన్ శబరీనికేతనమునన్ గోవర్ధనా
ద్రిస్థలిన్, గ్రహరాజద్విజరాజబింబముల రంగ
క్షేత్రవాటిన్ మహీ,మహిళా శ్రీకుచమధ్యదే
శముల నామ్నాయాంతవీథిన్ బలెన్, విహారిం
పంగదవయ్యా నామదిని గోవిందా రమాధీ
శ్వరా. 8

శా. కొన్నంబుణ్యము మీపదోదక నిగ్గుల్ దేరు
మీమూర్తిం గ, న్గొన్నన్ బుణ్యము నామరత్న
ములు పెక్కుల్ వాని నేపాటి పే, ర్కొన్నన్
బుణ్యము మీపదార్చకులలోఁ గూర్చుండి తా
వీనులన్, విన్నం బుణ్యము మీకథాకృతులు
గోవిందా రమాధీశ్వరా. 9

శా. ఏజాతైనను నేమి మిమ్ము మదిలో నేప్రొద్దు చిం
తించి హృ, త్పూజాదీక్షితుఁడైన మానవుఁడు
పో పుణ్యాత్ముఁ డెల్లప్పుడున్, రాజీవాయతనేత్ర
మీకృపకు దూరంబైన సద్విప్రుఁడున్, వేజన్మం
బులఁ గాంచునే సుగతి గోవిందా రమాధీ
శ్వరా. 10

శా. త్రెంపంజాలుదుఁ గర్మబంధముల నాధివ్యాధుల
లం గెల్తు నే, జెంపంగొట్టెదఁ బంచభూతముల
నిర్జింతున్ మహామోహమున్, గుంపుల్ గూడిన

పాపపుంజముల నుగ్గుల్ సేతు మీాబంటునై, వెం
పన్లాడుదుఁ గాలకింకరుల గోవిందా రమా
ధీశ్వరా. 11

మ. నిఖిలామర్త్య కిరీటసంఘటిత మాణిక్యప్రదీపా
వళీ, ముఖ నీరాజ విరాజమాన సుమహోముగ్ధేం
దుసంకాశ ప, న్నగపంక్తిప్రభ చేత నాహృదయ
సంతాపంబు వారింపుమీా, వికసత్పూజ్యపదార
విందహారి గోవిందా రమాధీశ్వరా. 12

శా. కేడీలాడు మదీయపాతకములన్ గెంటించి మ
త్కర్మముల్, పీడల్ పెట్టినఁ బెట్టనీక బలిమిన్
విప్పించి నీవింక యే, జాడన్ బోవక నిల్వఁగావ
లయు నాసంకల్పసౌధాగ్రమో, వీడుంబంటు
భవత్పదంబులకు గోవిందా రమాధీశ్వరా. 13

శా. వేదాంతోపనిషత్ప్రపంచములనన్వేషించి తర్కిం
చి మీా, పాదధ్యానపరాయణాత్ములకుఁ దప్పన్
మోక్ష మెవ్వారికిన్, లేదంచున్ సకలప్రమా
ణములఁ దోల్లేసాటరే దిక్కులన్, వేదవ్యాసప
రాశరాదికులు గోవిందా రమాధీశ్వరా. 14

మ. సురభూమీారుహ నవ్యపల్లవచయస్ఫూర్తిన్ వి
డంబించి శం, కర జూటాగ్ర సరిత్సముద్భవ శర
త్కాలారుణాంభోరుహా, స్ఫురణల్ మించి ర

హించు మీపదయుగంబుఁ నామనోవీథిలో,
విరివింబొంది చరింపఁగావలయు గోవిందా ర
మాధీశ్వరా. 15

మ. అపవర్గప్రద నిర్మలస్థల మయోధ్యఁ బాసి నీరం
ధ్రపా, దపఘోరాటవి పర్ణశాలకడ సీతాదేవి
వాంఛింపఁగాఁ, గపటాకారమృగంబు వెంటఁబడి
నీఁకంబాఱు మీపాదముల్, విపులాభూషణ
ముల్ దలంచెదను గోవిందా రమాధీశ్వరా. 16

మ. మతినేఁగొల్చెద శంఖచక్ర నలినీ మత్స్యాది
రేఖావిరా, జితమై తీర్థగరిష్ఠమై శ్రుతివధూ
సీమంతసిందూర రం,జితమై దేవకిరీటకీలిత మణి
శ్రేణీ నవీనప్రభా,న్వితమై యొప్పెడి మీపదద్వ
యము గోవిందా రమాధీశ్వరా. 17

మ. రుచిరస్ఫూర్తి దలంతు నామది నుమారుద్రాబ్జ
గర్భేంద్ర వా,జ్ఛి చయాగమ్యములై నమజ్జన
సుఖాన్వీతంబులై రాధికా, కచభారప్రభవప్ర
పూజితములై కన్పట్టు బృందావనీ, విచరత్పావక
పాదపద్మములు గోవిందా రమాధీశ్వరా. 18

మ. ధ్వజ వజ్రాంకుశ శంఖచక్ర హల మత్స్యచ్ఛత్ర
కోదండ పం,కజ కల్పద్రుమ కుండలాది శుభరే
ఖాలంకృతంబై లస,ద్వ్రిజకాంతా కుచకుంకు

మాంకిత భవత్పాదద్వయం బాత్మలో, విజయ
స్ఫూర్తి చెలంగఁ గొల్తు హరి గోవిందా రమా
ధీశ్వరా. 19

శా. రంగద్వేద శిరోచితంబులు సదారాధింపఁగా
యోగిరా, డ్భృంగంబుల్ మకరందబిందువుల
సంప్రీతాత్మతఁ గ్రోలఁగా, గంగాకారణ పాద
పంకజము మోక్షశ్రీలనం జాలదే, వెంగాత్ముల్?
మదిగానలేరు హరి గోవిందా రమాధీశ్వరా.20

శా. శ్రీదైవారఁగ నామదిందలఁతు లక్ష్మీఫాలకస్తూ
రికా, స్వాదంబుల్ నరయోగిబృందహృదయ
జ్ఞానామృతస్వర్ధునీ, నాదంబుల్ నవరత్ననూపురి
తనానాథాతుశబ్దక్రియల్, వేదంబుల్ భవదీ
యపాదములు గోవిందా రమాధీశ్వరా. 21

మ. విలువల్ వేతురుగాక రత్నచయముఁ వీక్షించి
తచ్ఛాస్త్రవే, త్తలు మీపాదసరోరుహద్విత
యచింతారత్నరించోలికిఁ, బలుమాఱుఁ
మతిగట్టి పన్నగపతి బ్రహ్మేంద్రరుద్రాదులుఁ,
వెల యింతింతని తేల్పఁగాఁగలరె గోవిందా
రమాధీశ్వరా. 22

మ. అవతంసం బఖిలాగమంబుల కహల్యాశాపనిర్ము
క్తహేతువు లక్ష్మీకరలాలితంబు విబుధస్తోమా

మరానోకహంబు వియత్సింధుజనిప్రదేశము
భవత్పుణ్యాంఘ్రియుగ్మంబు నే, వివిధోపాయ
ములన్ భజింతు హరి గోవిందారమానాయకా.

శా. జ్ఞానంబొందఁగ నీవ మానసమరాళంబున్ భవ
త్పాదుక, ధ్యానానందసుధాబ్ధివీచికల నోలా
డన్ బ్రబోధించుచో, మేనుబ్బన్ బ్రమదాశ్రు
వుల్ దొరఁగ నామీఁదన్ దయల్ వారుచో,
వీనుల్ నిండును మీకథామృతము గోవిందా
రమాధీశ్వరా. 24

శా. చూడ్కుల్ తావకపాదపద్మమధుపస్తోమాభి
రామంబులై, వేడ్కన్ గ్రీడలుసల్పఁగా శమద
మావిర్భావయోగీంద్రులే,మాడ్కి న్నిన్ను
భజింతు రానిగమకామ్యజ్ఞానిగాఁ జేయవే, వీ
డ్కొందున్ భవరోగదుఃఖముల గోవిందా
రమాధీశ్వరా. 25

శా. కంబుగ్రీవము కౌస్తుభాభరణముల్ కర్ణాంతవి
శ్రాంతనేత్రంబుల్ చారులలాటమున్ వదనప
ద్మంబున్ సునాసాపుటీ, బింబోష్ఠోరుకిరీటకుండల
ములున్ బీతాంబరంబుం గదున్, వెంబై యుం
డఁగ నిల్వు నామదిని గోవిందా రమాధీశ్వరా.

శా. కోటీరాంగదకుండలప్రభల దిక్కుల్ తేజరిల్లన్

గటీ, శాటీకాంతులు క్రొమ్మెఱుంగులఁ దిరస్కారంబు గావింపఁగా, సూటిఁ నాహృదయంబులో నిలువు మోసూనాస్త్రకోదండమా, ర్వీటంకారభయప్రశాంతికర గోవిందా రమాధీశ్వరా.

శా. కౌసల్యాత్మజ రామనామమున వేడ్కల్ మీఱ వాల్మీకిహృ, త్కాసారంబున రాజహంసముగతిం గన్పట్టి రక్షించుచునీ, వ్యాసంగంబు దలంతు నోయదుకులాధ్యక్షా దయన్ జూపరా, వే సర్వేశ్వర నామంబునకు గోవిందా రమాధీశ్వరా. 28

శా. ప్రాణస్థానమునందు నెల్లపుడు నే భావించెదన్ మీాయురో, మాణిక్యంబును నాసికాభరణమున్ మందస్మితంబున్ జపా, శోణశ్రీమధురాధరంబును గనచ్ఛాబ్జనేత్రంబులున్, వేణీబంధము పింఛదామమును గోవిందా రమాధీశ్వరా. 29

శా. ఉల్లంబందుఁ దలంతుఁ బాదనలినీయుగ్మంబు మాణిక్యమున్, ఇల్లాలుం గలవక్షమున్ గటి తటీ హేమాంబరస్ఫూర్తియున్, అల్లోనేరెడుపండుచాయ తిరుమే నాదివ్యభూషావళిన్, విల్లున్ శంఖగదాసిచక్రముల గోవిందా రమాధీశ్వరా. 30

శా. అస్వర్గస్థుఁడుము క్తుఁడే నిదిరహస్యజ్ఞానసారంబు
శు,ద్ధస్వాంతోజ్జ్వలపుండరీకపురమధ్య స్వర్ణసిం
హాసనుఁ, భాస్వత్కౌస్తుభ రత్నహార తులసీ
పద్మాంకితోరస్థలుఁ, విస్వామిధ్వజు మిమ్ముఁ
గొల్తు హరి గోవిందా రమాధీశ్వరా. 31

శా. షట్కోణాక్షరమంత్రరాజనిలయుఁ జక్రాబ్జపుం
డ్రేక్షువి, భ్రాట్కోటీర లతాంతబాణమురలీ
పాశాంకుశుఁ వాహినీ, రాట్కన్యాదిసమేత
షోడశ సహస్రస్త్రీమనోనాథు ప్రావృట్కా
లాంబుదదేహు నిఁ గొలుతు గోవిందా రమా
ధీశ్వరా. 32

శా. ఇష్వంభోజగదాసిచక్రధరశ్రీ హేలాకుచద్వం
ద్వపా, రిష్యాంగోత్పలకాంచితాగ్రమదనోర్వీ
ఫల్గునస్యందనా, భీష్మారంజితహస్తనిర్మలిత వి
జ్ఞానప్రపూర్ణాంచితా, విష్వక్సేనఖగేంద్రసేవ్య
జయ గోవిందా రమాధీశ్వరా. 33

శా. ఖద్యోతప్రతిమానకౌస్తుభమువక్షంబందు రంజి
ల్లఁగా, హృద్యంబై వనమాలికావిరచితశ్రీగంధ
మింపొందఁగా, నుద్యత్కాంతులు వింతలై చెలఁ
గ నాయుల్లంబులోనుండు మీ, విద్యుత్స్మేఘస
మానభావమున గోవిందా రమాధీశ్వరా. 34

మ. అసమానాకృతి దేవకీవిమలగర్భాంభోధిచంద్రుం డవై
నా, వసుదేవాత్మతపఃఫలంబనఁగ దేవా నీవు
జన్మించుటన్, వసుధన్ బూవులసోనవానగురి
సెన్ వర్ణించి రద్దేవతా, విసరంబుల్ సురదుం
దుభుల్ మ్రొరసె గోవిందా రమాధీశ్వరా. 35

మ. బలిమిన్ బూతన మీగృహంబునకుఁ దాబాలెం
డైవచ్చి పాత్తుంలలోఁ బాపని నిన్నునెత్తికొని
వాదుల్ దాదులాడన్ హాలా, హాలపూర్ణంబగు
చన్ను నీకొసఁగి మోక్షావాప్తురాలైనచో, వెల
యన్ భక్తులు ముక్తులౌటరుదె గోవిందా రమా
ధీశ్వరా. 36

మ. రమణన్ మృత్తిక నేలతింటివి కుమారా బుద్ధి
కాదంచుఁ గ్రోధముతోడన్ మిముఁగొట్టఁబూని
నయశోదాదేవికిన్ మీముఖా, బ్జమునన్ బద్మ
భవాండపంక్తులు విభ్రాజత్ స్ఫూర్తిగావించి సా,
ధ్విమణిన్ విస్మయమందఁ జేసితివి గోవిందా రమా
ధీశ్వరా. 37

శా. విందుల్ వచ్చిరటంచు గోపతరుణుల్ వేభంగు
లన్ వచ్చి మో, విందేనెల్ వడియంగ ముద్దుగురి
యన్ వేంచేసి మాకౌఁగిటన్, విందైనాఁడవటం
చునెత్తుకొన నీవీబంధమున్ జేర్చుటల్, విందున్
భాగవతాదిశాస్త్రములగోవిందా రమాధీశ్వరా.

శా. వాదీంద్రుల్ బహుశాస్త్రకోవిదులు తత్త్వజ్ఞానభి
న్నాత్ములై, నేదేనే?మనంగనెయ్యేది ఘనోనేత్రేం
ద్రియాగమ్యమై, నీదివ్యాకృతినిల్పుపద్మజభవా
నీశంకరాద్యంతమై, వేదాదిప్రణవార్థరూపమున
గోవిందా రమాధీశ్వరా. 39

శా. జనులింపొందఁ ద్రివిక్రమాకృతి సురస్వర్లోక
పాతాళముల్, ఘనవిస్ఫూర్తినతిక్రమించి దివిష
ద్గంగానదీజహ్నుక, న్యను భోగావతి గన్న దేవ
భవదీయంబైనపాదాబ్జముల్, వినుతింతుఁ బ్ర
ణుతింతు నెంతు హరి గోవిందా రమాధీశ్వరా.

మ. ఘుటికాసిద్ధునిభంగి వెన్నఁదినఁగా గోపాంగనల్
రాచలోఁ, గిటిలోఁ జెప్పఁగఁబోయినన్ వెఱచి
మ్రొక్కే-వానిచందంబునన్, దిటమై యడ్డము
వచ్చి వింతరతులన్ దేలించి చోరత్వమున్, విట
రాజత్వము జూపినాఁడవట గోవిందా రమాధీ
శ్వరా. 41

మ. ఘనమై మీపదకాంతికాళియఫణాగ్రస్థానమా
ణిక్యదీ, ప్తిని మాయింపఁ దదీయకాంతలు మహా
భీతాత్మలై దుష్టనా, శనముంజేసితి వింకఁజాలు
బతిభిక్షాదాన మిమ్మన్న ద, ద్వినయోక్తుల్ విని
యాదరించితివి గోవిందా రమాధీశ్వరా. 42

శా. చూడారత్నకిరీటకుండలరుచుల్ శోభిల్లఁ గా
సారస్థం, క్రీడాసక్తల గోపకన్యకల నాక్షేపిం
చి తద్వస్త్రముల్, గూడా నెత్తుకపోయి తీరవి
లసత్కుంజాధిరూఢుండవై, వ్రీడాశూన్యలఁ
జేయవే సతుల గోవిందా రమాధీశ్వరా. 43

శా. క్షోణీజంబులిగిర్చె మేఁతలుడిగెన్ గోవత్ససం
ఘుంబు బ్రా, ణంబుల్ కఱఁగెన్ భుజంగములు
చంచద్భక్తినాదెన్ వ్రజ, శ్రేణీరాగరసంబు వెల్లి
విరిసెన్ శృంగారలీలాభవ, ద్వేణుధ్వానము సో
క్షినంతటనె గోవిందా రమాధీశ్వరా. 44

శా. చాణూరుం దెగటార్చి ముష్టికుని తేజంబెల్ల
మాయన్ రణ, క్షోణిం గూలఁగవైచి కంసు న
తుల క్రోధాతిరేకంబునన్, ప్రాణంబుల్ గొని యు
గ్రసేను మథురన్ బట్టంబుగట్టింపవే, వేణీమాధవ
గోపికారమణ గోవిందా రమాధీశ్వరా. 45

శా. శౌర్యాడంబరలీల కుండినపురిన్ జైద్యాదులన్
సంగర, స్థైర్యాటోపముజూపి పోదరిమి మోదం
బొప్పఁగా రుక్మిణీ, భార్యారత్నము దెచ్చుకొం
టివి భవత్ప్రఖ్యాతసౌందర్యదో, ర్వీర్యప్రాభవ
మెన్న నాతరమె గోవిందా రమాధీశ్వరా. 46

మ. యదువంశోత్తముఁడైన నిన్నుఁ గ్రతుపూజార్హుం
డుగాఁడన్న దు, ర్మదునిఁ జైద్యుని జేతిచక్ర
మునఁ దన్మస్తంబు వేర్చుంచి ద్రౌ, పదిమానం
బును గాంచి శక్రజునకుం బ్రత్యక్షమై విందవై,
విదురాక్రూరుల మెచ్చినాఁడవట గోవిందా
రమాధీశ్వరా. 47

శా. సద్యోముక్తికరంబు పావనము సంసారాబ్ధిపో
తంబు సం, పద్యోగంబు విరించిపంచముఖసంభా
వ్యంబు మంత్రోత్తమం, బద్యారాధ్యము భక్త
లోకపరమాహ్లాదంబు సౌమ్యక్రియా, విద్యా
సారము మీశుభాహ్వయము గోవిందా రమా
ధీశ్వరా. 48

శా. సుశ్రవ్యంబులు పుణ్యమూలములు వస్తుజ్ఞానసా
మర్థ్యయో,గశ్రీకారములుం సుధాసదృశముల్
కైవల్యసోపానముల్, మిశ్రంబుల్ నిగమాంత
సారములలో మీనామసంకీర్తనల్, విశ్రాంతం
బులు దివ్యదేశములు గోవిందా రమాధీశ్వరా.

శా. కత్తుల్ మోహలతావిభంజనకృతిం గైవల్య
వృత్తింపుఁ బూ,గుత్తుల్ యుక్తులు సర్వమంత్ర
ములకుం ఘోరాహితశ్రేణికిం, మిత్తుల్
భక్తులునారదాదులకుఁ దామీనామసంకీర్తనల్,

విత్తుల్ యోగిహృదాలవాలముల గోవిందా
రమాధీశ్వరా. 50

మ. సుమనస్సిద్ధరసాయనంబు ఖలరక్షోరామబాణంబు
సం,యమిచింతామణి సత్యవాగుపనిషత్ప్రా
జ్ఞేశ్వరం బాదిగా, జమృగాంకంబు రమాచ
కోరహిమతేజం బైనమీనామ మా, విమతా
హివ్రజగారుడాంబకము గోవిందా రమాధీ
శ్వరా. 51

మ. అధరీభూతసమస్తమంత్రనివహం బజ్ఞానసంసా
రవా, రిధిసంశోషణబాడబానలము వైరిగ్రావ
దంభోళిజ, న్మధునీతారణ కారణోత్తమము
మీనామంబు జంభద్విష, ద్వ్యధిరుద్రార్చితపా
దపీఠ హరి గోవిందా రమాధీశ్వరా. 52

మ. మహాపాపాత్మకుఁ డయ్యజామిళుఁడు కర్మజ్ఞాన
మోక్షక్రియా, రహితుండయ్యుఁ బ్రయాణ
వేళ సుతు నారాయన్నమాత్రక సుఖా,వహా
కైవల్యపదం బొసంగితి మనోవాక్కాయసమ్య
క్తపో,విహితాచారుల కేమొసంగుదువొ గోవిం
దా రమాధీశ్వరా. 53

మ. శివునిం బార్వతి నాపగేయుని గజశ్రేష్ఠుఁ
వశిష్ఠుఁ శుకుఁ, ధ్రువుఁ బ్రహ్లాదు బలిఁ విభీ

షణుని నక్రూరుఁ నరుఁ నారదుఁ, రవిజుఁ
శేషుని నంబరీషుని బరబ్రహ్మణ్యులం జేయవే, వివ
రింపఁ భవదీయనామరుచి గోవిందా రమా
ధీశ్వరా. 54

శా. అప్రత్యక్షకథానిరంకుశులు మాయావాదదూ
రుల్ వివేకప్రామాణ్యవచోనిరూఢులు సమీ
క్షాజ్ఞాన విద్యాధరుల్, గోప్రఖ్యాతనితాంత
కీర్తులు జితక్రోధుల్ భవచ్ఛేదకుల్, విప్రాచా
ర్యమతప్రవర్తకులు గోవిందా రమాధీశ్వరా.

శా. సప్రేమాతిశయంబుతోడ గురువిశ్వాసంబునఁ
బూర్వజన్మప్రారబ్ధములూడ్చి పుణ్యుఁడగుపో
మర్త్యుండు తన్మంత్రసేవా ప్రాబల్యము బోయ
వానిఁ గృపతో వాల్మీకిఁగాఁ జేయవే, విప్రశ్రే
ష్ఠులకెల్ల నెక్కుడుగ గోవిందా రమాధీశ్వరా.

మ. నిగమార్థజ్ఞులు నిత్యసత్యచరితుల్ నిర్మత్సరుల్
నిష్పృహుల్, సుగుణాఢ్యుల్ సురలోకపూజి
తులు సుశ్లోకుల్ సుధర్మాన్వితుల్, నగధీరుల్
నలినాప్తతేజులు సదానందాత్మకుల్ వైష్ణవుల్,
విగతక్రోధులు విష్ణుసేవకులు గోవిందా రమా
ధీశ్వరా. 57

మ. క్రతుకర్మంబుల సందడింబడరు తీర్థస్నానముల్

గోర రుగ్రతపోదాంభికవృత్తికిం జొరరు
లోకభ్రాంతిదూరుల్ మహాకృతకృత్యుల్
నిగమార్థకోవిదులు మీ శ్రీపాదనీరేరుహ,
ద్వితయధ్యానపరాయణాత్మకులు గోవిందా
రమాధీశ్వరా. 58

మ. భగవద్భక్తజనప్రముక్తమగు తత్పాత్రావశి
ష్టాన్నముల్, తగు వేడ్కఁ భుజియించి ముక్త
తనుఁడై దాసీసుతుం డీడ్యుఁడౌ పగిదిఁ నార
దుఁడైనవాఁడనిన నీభక్తిప్రభావంబు లుర్వి
గణింపం గడునద్భుతంబులగు గోవిందా రమా
ధీశ్వరా. 59

మ. పరమానందముతోడ మిమ్ము మదిలో భావించి
నిల్వంగ భూవరుఁడుం గాంచె నిమిత్తమాత్ర
ముననే వైకుంఠమన్నట్టిచోఁ, జిరకాలంబు భవ
త్పదంబులు మదిం జింతించుపుణ్యాత్మకుల్,
విరజావాహిని దాటుటేమరుదు గోవిందా
రమాధీశ్వరా. 60

శా. అగ్రత్వంబొకయింతలేక సముఁడై యత్నప్రయ
త్నంబుతో, యగ్రాహ్యంబులుమాని దేశికక
టాక్షారాధనసంపన్నుఁడై, జాగ్రత్స్వప్నసుషు
ప్తులందు మిముఁ గాంచుం గొల్చుపుణ్యుండు

ద్వా,విప్రాగ్రమణ్యుఁడు విష్ణులోకమున గోవిందా
రమాధీశ్వరా. 61

శా. బౌద్ధగ్రాహ్యకుమంత్రతంత్రముల సంపాదించి
బోధించుదు, ర్బుద్ధుల్ తెల్పినస్తోవలం జనక
సంపూర్ణాగమాంతార్థ వా,సిద్ధాంతంబు దృఢం
బుగాఁదెలిసి మీసేవానుకూలాత్ముఁడై, వృద్ధా
చారపరుండు గావలయు గోవిందా రమాధీ
శ్వరా. 62

మ. నడువంగావలె విష్ణుతీర్థములకున్ నారాయణ
బ్రహ్మముల్, దడవంగావలె మీప్రసాదము
మహాతాత్పర్యచిత్తంబుతో, నడుపంగావలె
హీనకర్మచయమున్ నానావిహారంబులన్, విడు
వంగావలె మీప్రపన్నులకు గోవిందా రమా
ధీశ్వరా. 63

శా. పాట్టాసత్యమనా ప్రసిద్ధమిదియేపో ధన్యులై
యుందురే, పుట్ట నొల్లరు చావనొల్లరు జగ
త్పూజ్యుల్ భవత్సేవకుల్, ధట్టప్రాఢకృతాంత
కింకరగదాదండానలజ్వాలచే, బెట్టంబొందక
సార్వకాలమును గోవిందా రమాధీశ్వరా. 64

శా. శ్రీరామానుజదేశికోత్తమ మహాసిద్ధాంతమార్గ
క్రియా, సారాచారవిశేషతీర్థతనుఁడై పాంతరం

బులో నెప్పుడుఁ, క్రూరత్వంబు శమింపకుండిన
వివేకుల్ చూతురాపుణ్యునిన్, వీరేమన్న పురా
తిశైత్యమది గోవిందా రమాధీశ్వరా. 65

శా. గోత్రంబొక్కటి కేలనూనితివి మీగోత్రంబు
వారందఱున్, గోత్రానేకపరాయణుండవనఁగా
గోత్రంబు వారందఱున్, చిత్రంబౌ గదయేమిచె
ప్పుదుఁ గురుక్షేత్రంబునందోత్రమున్, వేత్రంబుం
గొని తేరుదోలితివి గోవిందా రమాధీశ్వరా. 66

శా. మాయింతున్ దురితంబులన్ గురుకృపన్ మ
తీక్ష్ణరుచిచంద్రప్రభల్, గాయింతున్ భవదీయపద్య
ములుదిక్కాంతాకపోలంబులన్, వ్రాయింతున్
బరవారణాంకుశము మాదామానుజుండంచు
నే, వేయింతున్ జయభేరి లోకముల గోవిందా
రమాధీశ్వరా. 67

మ. అదలింతున్ గుటిలారిసంఘములఁ బ్రాణాంపాన
సంధానినై, కదలింతున్ నిజమూలకుండలిని
మోక్షశ్రీఫలప్రాప్తికై, బొదలింతున్ భవదీయ
మూర్తిలతికన్ బోధాలవాలంబుగా, విదలిం
తున్ బహుజన్మదుఃఖముల గోవిందా రమాధీ
శ్వరా. 68

శా. త్రెంతున్ బ్రాకృతకర్మబంధముఁ బ్రబోధింతున్

భవద్భక్తి గల్పింతుర్ మానసభద్రపీఠము సమ
ర్పింతుర్ విభూషాదు లర్పింతుర్ శ్రీగురుమం
త్రమార్గమునఁ జర్చింతుర్ మహామూర్తి సేవిం
తుర్ నీచరణాంబుజద్వయము గోవిందా రమా
ధీశ్వరా. 69

శా. ఒప్పింతుర్ నిజధర్మకర్మచయముల్ యుష్మత్ప్రి
యార్థంబుగా, రప్పింతుర్ భవదంఘ్రియుగ్మము
మనోరాజీవపీఠంబుపై, మెప్పింతుర్ మహనీయ
భాగవతులర్ మీపాదభాస్వంతుచే, విప్పింతుర్
హృదయాంధకారమును గోవిందా రమాధీ
శ్వరా. 70

శా. విఘ్నేశుండు సనత్కుమారుఁడు చతుర్వేదం
బులున్ బ్రహ్మయున్, విఘ్నేశానుజుఁడైనషణ్ము
ఖుఁడు దేవీయుక్తుఁడై వేడుకన్, విఘ్నేశున్
దగఁగన్నతండ్రి మిము మీవిఖ్యాతివర్ణింపఁగా,వి
ఘ్నంబెన్నఁడులేదు మీకృతికి గోవిందా రమా
ధీశ్వరా. 71

మ నిజరూపంబున నింతవాఁడవని వర్ణింపంగ నెం
డేల స, ర్వజగత్పూర్ణుఁడవౌట సాటుగద దూ
ర్వాగంధపుష్పాక్షతల్, గజచర్మాంబరజూటకోట
రమునన్ గాన్పించె మోకాట నా,విజయుండీశ్వ
రపూజసేయుటయు గోవిందా రమాధీశ్వరా,72

మ. ఫలితౌదుంబరశాఖిచందమున నీబ్రహ్మాండజా
లంబు లో, గలమీఁదివ్యవిభూతిజీవులను వక్కా
ణింప శక్యంబె తత్ఫలసంకీలితతన్మహీరుహామహ
త్వంబెన్నఁగా శక్యమే, విలయాగ్న్యానలకోటి
తేజహరి గోవిందా రమాధీశ్వరా. 73

శా. ఐశ్వర్యప్రదమంత్రతంత్రములు వశ్యాకర్షణో
చ్చాటనల్, విశ్వాసంబునఁజేయఁబూనక సదావి
జ్ఞానసంపూర్ణుఁడై, శశ్వన్మోక్షఫలప్రదాతయగు
నాచార్యాన్వయగ్రామణిన్, విశ్వశ్రేష్ఠునిగా
నెఱుంగవలె గోవిందా రమాధీశ్వరా. 74

శా. త్రయ్యంతార్థవిచారగవ్య భగవత్సంబంధదీ
ప్తాంగిద్రై, జియ్యాళ్వారిమహాప్రబంధనిగమశ్రీ
సూక్తినిం దేలియున్, లియ్యంబైనరుచిప్రపన్ను
లయొద్దన్ లేకున్నఁదచ్చిహ్నముల్, వెయ్యారైన
ను మీఁదుమిక్కిలివి గోవిందా రమాధీశ్వరా.

మ. అమితంబవ్యయ మాదిమూలరుచిరం బానంద
కందంబు ను, త్తమమాచార్యకటాక్షలబ్ధపరిశుద్ధ
జ్ఞానవిద్యానిధా, నము పంచోపనిషత్స్వరూప
ము ప్రపంచజ్యోతియంచున్ మిమున్, విమలా
చారధురీణులెన్నుదురుగోవిందా రమాధీశ్వరా.

శా. వింటిన్ నీభుజశక్తిదానవులదోర్వీర్యంబు మా

యింపుఁ బూ, వింటన్ లోకములెల్ల గెల్చుత్రిజ
గదీశ్వరుండు మీపట్టి పూ, వింటన్ బుట్టినప్రౌఢ
మీకరుణచే నిన్నింటికిన్ గర్తయే, వెంటన్
మీసవతన్యదైవములు గోవిందా రమాధీ
శ్వరా. 77

మ. శ్రితమంత్రాక్షరదివ్యమంగళమహాశ్రీమూర్తి వే
దార్ణవా, మృతసారోపనిషత్స్వరూపవననీరేజాత
భృంగంబు సం,భృతపాపౌఘదవానలాంబుదము
భూరిబ్రహ్మకైవల్యసం,వృతమంచున్ మిము నా
ర్యు లెన్నుదురు గోవిందా రమాధీశ్వరా. 78

మ. బడిఁగావేల్పులనెన్న నేఁటికిఁ తఁడే బ్రహ్మణ్యదైవం
బు క, వ్వడికిం జూపఁడె విశ్వరూప మని దివ్య
జ్ఞానసంపన్ను లె,ప్పుడు మీమూర్తి భజింతు
రాత్మల భవాంభోరాశిలోనుండియున్, వెడ
మాయం బెడబాసి ధైర్యమున గోవిందా రమా
ధీశ్వరా. 79

మ. పొగచుట్టుండినవహ్నిచందమున నీభూలోకపూ
ర్ణుండవై, జగదుత్పత్తికి రక్షణంబునకు శిక్షోత్ప
త్తికిం గర్తవై, పొగడన్ మించితి వెల్లలోకము
లలోఁ బుష్పంబులంగల్గుతా, విగ వెన్నంగల
నేతిచందమున గోవిందా రమాధీశ్వరా. 80

శా. వాగర్థంబులభంగిఁ బాయకజగద్వ్యాప్తుండవై ప్రాణిలోఁ,
జేగంబోలి శరీరకోశములలో జీవాత్మవై యాత్మవై, యోగంబెప్పుడు కల్గియుం
డక సముద్యోగంబునన్ ముక్తికై, వేగంబేటికి భక్తకోటికిఁక గోవిందా రమాధీశ్వరా. 81

మ. అభయంబన్న బలిన్ విభీషణు ధ్రువున్ ఆచంద్ర తారార్కమై, విభులైయుండఁగ మూఁడులో
కములకున్ వేదాంతరాయుండవౌ, ప్రభురత్నంబవుపుణ్యమూర్తివి జగద్రక్షాధురీణుండవీ,
విభవంబున్నదె యెల్లవేల్పులకు గోవిందా రమాధీశ్వరా. 82

శా. తృష్ణాదూరులు నిత్యశాంతులు బృహద్వేదాంతసారైకవ, ర్ధిష్ణుల్ సత్యతపోగరిష్ఠులు సమా
ధిజ్ఞాననిష్ఠుల్ మహా, జిష్ణుల్ వ్యాసపరాశరాదులు మదిం జింతింతు రెల్లప్పుడున్, విష్ణుబ్రహ్మశి
వాఖ్యుఁడంచు మిము గోవిందా రమాధీశ్వరా.

శా. త్రిజ్ఞామూర్తిన్ శశిఁగన్న దేవు నణుమాత్రీభూతులం జేయుమీ,ప్రాజ్ఞాహాత్మ్యముగల్గనట్టిపరమబ్ర
హ్మణ్యజీవాత్మనై, త్రిజ్ఞోహాదులఁజిక్కినాఁడ శరణార్థింజూచి రక్షింపు మీ,విజ్ఞాత్రోజ్జ్వల దేహ
భాజనుని గోవిందా రమాధీశ్వరా. 84

మ. గయకుం బోవగనేల కాశికి చనంగానేల భాగీ
రథీ, నియతస్నానముఁ జేయనేటికి మనోనేత్రం
బునం దత్త్వని,శ్చయరాద్ధాంతనిరూఢి నిన్నుఁ
గనుఁగో సర్వజ్ఞుఁడౌగాదె భూ,వియదంభోనల
వాయురూపధర గోవిందా రమాధీశ్వరా. 85

శా. రంజిల్లన్ భవదీయరూపము మనోరంగంబునం
గాంచి మీ,యంజం డాగినయోగికిం బొడము
సమ్యగ్జ్యోతిఃసంసక్తియున్, కంజాతాక్షులు దివ్య
రత్నములు బంగారంబులున్ జీరలున్, వింజా
మర్లును వాహనంబులును గోవిందా రమాధీ
శ్వరా. 86

శా. పణ్యాహారశిలోంఛవృత్తియుఁ దపోవ్యాపార
ముల్, పంచభి,క్షాన్యాయంబులు తీర్థయా
త్రలు మహాశాస్త్రార్థవాదంబులున్, సన్యాసత్వ
ము రిత్త మీచరణకంజధ్యానరూఢిన్ మనో,
విన్యాసంబునఁ గూడకున్న హరి గోవిందా రమా
ధీశ్వరా. 87

మ. ఘనకర్పూరము మెత్తినన్ బురదలోఁగన్ బూ
సినన్ భిక్షుసే,యను రాజాన్నము దెచ్చి పెట్టి
నను కూరాకే సమర్పించినన్, తనుదీవించిన
తిట్టినన్ దడయఁ డెంతన్ లక్ష్యశీలుండు తా,విని

చౌదుర్ గని గ్రుడ్డియర్ వెలయ గోవిందా
రమాధీశ్వరా. 88

శా. బోధాగ్రంథము లాదరించి చదువంబో(బోక
మిథ్యామనో, వ్యాధింజెందక నిత్యముర్ శ్రుతి
విరుంధచ్ఛాయయతా కాలునే, బాధంబొందక
మిమ్ముగొల్వవలె సద్భక్తుండు సంతోషిరయై, వేద
స్తుత్య పదారవింద హరి గోవిందా రమాధీ
శ్వరా. 89

శా. ఆధారంబు నపాన మూర్ధ్వగతి నత్యంత ప్రయ
త్నంబుతో, స్వాధిష్ఠానము మీదికిం జొనిపి
ప్రాణాపానముల్ కుంభక, ప్రాధాన్యంబున నిర్వ
హించి సుగుణబ్రహ్మానురక్తిర్ మనో, వీథిర్ మి
మ్ము భజింతు రుత్తములు గోవిందా రమాధీ
శ్వరా. 90

శా. క్రోధావేశనిరూఢమానసులుదుర్గోష్ఠిసమేతుల్
మనో, బోధాయుక్తులు సర్వవర్జితులు ప్రాపుల్
సత్వరగ్రస్తులై, సాధుప్రాణులహింసనేతురు వృ
థాసంసారమాయాపురీ, వీధీనాటక మాత్మనమ్మి
హరి గోవిందా రమాధీశ్వరా. 91

శా. అక్రూరస్థితినుండఁగాపలయు రాజాస్థానమధ్యం
బునర్, వక్రింపంబని లేదు ధర్మపదవిర్ వక్రింపఁ

గావచ్చినన్, శుక్రాచార్యులకన్నుఁబోఁజూనుపవే
సూటిం గుశాగ్రంబుచే, విక్రీతాఖిలలోకజాత
మున గోవిందా రమాధీశ్వరా. 92

శా. అభ్రప్రాయశరీరకామకృతకర్మాయత్త సంసార
శం, కుభ్రాంతాత్మకులైన వంచకులనేకుల్దవ్వంద్వ
శీలుర్ పర, శ్వభ్రాన్వేషణబుద్ధితో సమధికాశా
పాశనిర్వ్యాభధీ, విభ్రాంతుల్ మిముఁగొల్వ
నోపుదురె గోవిందా రమాధీశ్వరా. 93

శా. కొండల్ వంటికవీశ్వరుల్ శతకముల్ కోటాన
కోట్లంతకున్, మెండై నిన్నును జెప్పఁబూనిరిగ
దా మీసాటి కాదొక్కటే, వండేనేర్పులఁ బె
క్కుభంగులరుచుల్ వర్తింపవే శాకముల్, వెం
డిన్ నామన వాలకింపఁదగు గోవిందా రమాధీ
శ్వరా. 94

శా. అచ్చంబైనభవత్ప్రసాద మతిభక్త్యావేశపూ
ర్ణాత్ముఁడై, నిచ్చంగైకొని మర్త్యుఁడేమఱక నిన్నే
కీర్తనల్ చేయవా, క్రుచ్చంగాఁబనియేమి పాతక
ము లాక్రోశింపవే పోవుచో, విచ్చున్స్వర్గ విరాళి
మాన్యగతి గోవిందా రమాధీశ్వరా. 95

శా. మిన్నుల్ ముట్టిన దుగ్ధవార్ధినడుమన్ విహారుం
ట ప్రేపల్లెలో, వెన్నల్ నేతులుపాలుమ్రుచ్చిలుట
కున్ వేడ్కయ్యెనో మీకు, నోయన్నా గోపవధూ

టులంగలసి సయ్యాటంబులాడంగ నీ, విన్నా
ణంబులు విన్నఁ జోద్యములు గోవిందా రమాధీ
శ్వరా. 96

శా. ఇండ్లన్ గొపురమున్న గోపికల పాలిండ్లంటినా
వంచు రో, కండ్లన్ రోళ్లనుబాఁదినన్ వెఱపుమీ
కావంతయున్ లేక పెం,డ్లిండ్లన్ జేయనివత్సలన్
బలిమిఖర్మిన్ విప్రభావంబు లా, వేండ్లున్ మా
డలుపోలబెట్టితివా గోవిందా రమాధీశ్వరా.99

శా. రోలంగట్టిన తల్లికోలకొలఁదిన్ మ్రోదంగ చే
యెత్తినన్, రోలంబాలకఁజూచి భీతకుఁడవై రో
లుద్ధతిన్ లాగి మీ, హేలాసత్వముఁజూపి పే
ర్లపెకలన్ యిర్మద్దులన్ ధాత్రిపై, ప్రీలంగూ
ల్చితి పిన్నపాపఁడవె గోవిందా రమాధీశ్వరా.

శా. వెళ్లన్ దోలుకపోయి లేగల రణోర్విన్ మేపి
కాళిందిలో, నీళ్లంబెట్టఁగఁబోయి చల్దిగుడువన్
నీతోడిగోపార్భకుల్, వెళ్లంజూచుచుఁ గండ్లుబె
ట్టుకొని మీవెన్నెంట నేతేర ను, వ్విళ్లూరించుట
నామదిందలఁతు గోవిందా రమాధీశ్వరా. 101

శా. హస్తాబ్జంబుల వేణుదండమధురాస్వస్థంబుగావిం
చి మీ,కస్తూరీతిలకంబు లేఁజెమట దోగన్ గాన
ముల్ చేయవే, అస్తోక స్తనభారముంగదల నా

ట్యంబాడుగోపాంగనా, విస్తీర్ణాతీసరోజమిత్రుం
డవు గోవిందా రమాధీశ్వరా. 102

శా. కాళిందీతటినీనవాంబుజపరాగచ్ఛన్నబృందావనీ
కేళీ పుష్పితమాధవీమృదులతాగేహంబులన్
వల్లవీ, నాళీకాక్షుల నాదరించితి వనూనాలింగలీ
లానిశా, వేళన్ సంగమసౌఖ్యముల్ మఱపి గో
వించా రమాధీశ్వరా. 103

మ. శివుఁడున్నాఁడు పురోపకంఠమున నాచేతుల్
సహస్రంబు నే, భవపాదాంబుజభక్తులందసముం
డన్ బాణాసురాఖ్యుండ నా, నవతెవ్వాఁడని
ధిక్కరింపఁగను హస్తద్వంద్వముల్ నిక్కఁగా,
వివశుంజేయదె మీసుదర్శనముగోవిందా రమా
ధీశ్వరా. 104

శా. చంచత్కాంచనకర్ణకుండలభుజాసంస్ఫూర్తివై వే
ణువున్, కించిత్కుంచితకోమలాధరముతోఁ గీ
లించి మీటింపుచున్, కాంచీదామనిబద్ధరత్న
రుచి మత్కళ్యాణచేలంబుతో, వేంచేయంగదవ
య్య నామదిని గోవిందా రమాధీశ్వరా. 105

మ. ప్రకృతిభ్రాంతవిమూఢచిత్తులకుఁ జేరన్ రాక
ధర్మార్థకా, మకృతాచారుల కందరానిమునిగ
మ్యంబైనకైవల్యమున్, సకృదుచ్చారితతావకీన

మను రాజ్యం బిచ్చు నీధాత్రిపై, వికృతింబొందె
డివేళ జీవులకు గోవిందా రమాధీశ్వరా. 106

శా. వింటం జెల్లదు విష్ణునామమని విద్వేషంబుతో వీ
నులం, ఘంటల్ గట్టి ఘణంఘణంఘణమనంగా
భూమివర్తించు నా, ఘంటాకర్ణున కిచ్చినాఁడవు
భవత్కైవల్య తేజంబులం, వింటే మోక్షముగ
ల్గు టేమరుదు గోవిందా రమాధీశ్వరా. 107

శా. గట్రాలం బెనుకానలం గుహల గంగాసింధుదే
శాదులం, వట్రాగాపుల దేహమెల్ల బడలం
వర్తింపుచుం మేరువుం, జుట్రానెన్న?బిమార్గువ
చ్చినను నస్సిద్ధుండుగాఁడేని నా, వేట్రావాని
ప్రయాస మంతయును గోవిందా రమాధీ
శ్వరా. 108

రమాధీశ్వరశతకము సంపూర్ణము.

---

# పీ ఠి క.

భక్తచింతామణిశతకమును వ్రాసినకవి కూచిమంచి సోమసుందరుఁడు. ఈకవి కోనసీమయందలి సప్తగోదావరిమధ్యముననున్న పలివెలగ్రామనివాసి. కవి తననివాసస్థానమును నీశతకమునం దీవిధముగాఁ జెప్పెను.

పల్వేలపూర్ధామ... ప. 5.
మహాగౌతమీవిలసత్తీరతలస్థపల్వేలపురీ
విఖ్యాతవాసుండ... 108

ఈకవి వ్రాసిన యితరగ్రంథములలో కొప్పులింగేశ్వరశతకము మాత్రము ప్రకృత ముపలభ్యమై యున్నది. సోమసుందరకవిని గూర్చినవృత్తాంత మింతకెక్కుడు తెలియరాదు. ఈకవి సుప్రసిద్ధులగు కూచిమంచి తిమ్మకవి జగ్గకవి సోదరుల కావలివాఁడై యుండును. ఎంతకాలముక్రింద నీకవి యుండెనో యేయేగ్రంథములురచించెనో తెలియుటలేదు. పల్వేలపురీవిఖ్యాతవాసుండ ననుటచే నీకవిపల్వేలనివాసి యని స్పష్టముగాఁ దెలియుచున్నది. కవి కూచిమంచి తిమ్మకవివంశీయుఁడు గావున కౌండిన్యసగోత్రుఁడనియు నాపస్తంబసూత్రుఁ డనియుమాత్రము తెలిసికొనవచ్చును.

పలివెల సుప్రసిద్ధమగు శివక్షేత్రము. ఇట రెడ్డివీరులు నెలకొల్పిన శాసనములు పెక్కులుగలవు.

భక్తచింతామణిశతకమున మొదటి యిరువది మూఁడుపద్యములలో నంత్యనియమాలంకారముంటచేఁ బద్యములు చదువఁ జవులూరుచున్నవి. కడమపద్యములలో శివలీలలు పురాణకథలు నభివర్ణింపఁబడినవి. శతకమునందలి కవితాధార మనోహరముగ నిరర్గళముగా నున్నది. కవి యీశతకమునందు మత్తేభవృత్తములు శార్దూలవృత్తములు వ్రాసి, యటుల వ్రాయుటకుఁ గారణ మీక్రిందివిధముగా మనోహరముగాఁ జెప్పియున్నాఁడు.

నీవు వెలయ౯ మత్తేభశార్దూలచర్మములం బ్రీతి
వహింతు గాన నిపుడే మత్తేభశార్దూలపద్య
ముల న్నీ కుపహార మిచ్చితి...

కవి తాను నియోగియు బీదవాఁడునై యుంటచేఁ గాఁబోలున్న ఎనుబదియొనిమిదవపద్యమున న్నియోగినై జనించుటయు నందు దరిద్రుఁడగుటయుఁ బాపహేతువని చెప్పినాఁడు. పద్యములందలి భావములు శైలి మనోజ్ఞముగా నుంటచే నీశతకములసంపుటమునం దీభక్తచింతామణిశతకమును జేర్చి ప్రకటించితిమి.

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

నందిగామ
23-10-25.

శ్రీ ర స్తు.

కూచిమంచి సోమసుందరకవికృత

# భక్తచింతామణిశతకము.



శా. శ్రీమద్భూమిధరాధిరాజతనయా చిత్తాంబుజ
ద్యోమణీ,వ్యామోహార్ణవతారణైకతరణీ బాలేం
దుచూడామణీ, ప్రేమాభ్యంచితకంకణీకృతఫణీ
బృందారకగ్రామణీ, స్వామీ నామదిఁ బాయ
కుండు శివసాంబా భక్తచింతామణీ. 1

మ. నతగీర్వాణ మురారిబాణ కృతనానాలోకనిర్మా
ణసం,తతసర్వోపనిషత్ప్రమాణ త్రిజగత్కళ్యా
ణ సద్భక్తసం,తతిసంత్రాణధురీణ పుంగవలస
త్కంఖాణ భాస్వన్మహా, పతితోద్ధారకళాప్రవీణ
శివసాంబా భక్తచింతామణీ. 2

శా. రాజద్దివ్యధునీతురుంబ మునిహృద్రాజీవరోలంబ
నా, నాజీవాత్మభిదావిడంబ పరమామ్నాయస్త
వాలంబ నీ, రేజాతాక్షమహాకదంబ దురితా
ద్రిప్రచ్ఛిదాశంబ వి,భ్రాజద్భక్తజనావలంబ శివ
సాంబా భక్తచింతామణీ. 3

మ. ఘనవైశ్వానరదృగ్లలాట విలసద్గంగాజటాజూట
పా, వనశైలాప్త్యాచలకూట వేదచయభాస్వద్ఘోట
లోకవ్రజా, వనలీలాధృతకాలకూట హతగర్వ
గ్రస్తదోషాట శో, భనచంద్రార్ధకళాకిరీట శివ
సాంబా భ... 4

మ. నలినీబాంధవకోటిధామ రిపుసేనాభీమనిష్కామ
నిర్మలధామా హతకామవిద్విదభిరామారామ
సుత్రామ గీ, తలసన్నామ విపద్విరామ నిజభక్త
స్తోమ సుక్షేమ ప,ల్లవలసద్గ్రామ లలామధా
మ శివ... 5

మ. విలసద్భద్రతురంగ రంగదజహద్విజ్ఞానయోగా
తిని, ర్మలయోగిప్రియసంగ సంగరరిపుప్రాణా
నిలాహారకృ, ద్బలవద్బాణభుజంగ జంగమపురీ
దాహక్రియాచంగ ప, ల్వలపుర్యంబుజసంగిభృం
గ శివ... 6

మ. స్వవశోద్యజ్జగదండ దండధరగర్వధ్వాంతమా
ర్తాండ తాం, డవలీలాధృతకాండ కాండచయ
దీర్ణక్రూరవేదండ జ్ఞే, యవిధాసంవిదఖండ ఖండ
శశిచూడాలంక్రియాభోగవై, భవవిఖ్యాతసుర
ప్రకాండ శివ... 7

మ. అలఘుశ్రీకరసుందరాంగ కరుణోదారాంచితా

పాంగని,స్తులకారుణ్యాయుతాంతరంగ హిమవ
త్పుత్రీపరిష్వంగ మ,త్తలతాంతాశుగగర్వభంగ
మునిహృత్పంకేజసారంగ నిర్మలగంగాకలితోత్త
మాంగ శివ... 8

మ. నిలయీభూతబుధాంతరంగ త్రిజగన్నిర్మాణర
క్షాదిని, స్తులకార్యాభినయప్రశస్తవిచలద్భ్రూ
భంగ భక్తవ్రజో, జ్జ్వలచిత్తాంబుజమత్తభృంగ
సముదంచత్కోటికందర్పకో, మలరేఖాయుత
మంగళాంగ శివ... 9

మ. జలజాత ప్రభవాచ్యుతాదిసుమనస్సందోహసం
స్తూయమా, నలసన్మంగళదివ్యవేష గిరికన్యా
చిత్తసంతోష యు, జ్జ్వలబాలేందుకళావిభూష
కరుణాసంపోషితాశేషని, ర్మలకారుణ్యాసుధీవిశే
ష శివ... 10

మ. కలశీసంభవగౌతమాత్రిశుక మార్కండేయభృ
గ్వాదిమా, నిలలామావళిగీయమానమహిమో
న్మీలత్సుధామాధురీ, లలితాత్మీయకథాప్రసంగ
శ్రితకైలాసాంచలోత్సంగ భూ, వలయాభంగ
శతాంగ లింగ శివ... 11

మ. స్వవిభానిర్జితకోటిసూర్య పరతత్త్వజ్ఞానదాచా
ర్య లో, కవితానావనకార్య దీనజనరక్షావిశ్రుతా

దార్య వి, ష్ణువిధీంద్రాద్యనివార్య వీర్యసకలస్తో
త్రార్హచాతుర్య భ, వ్యవిమోక్షప్రదకీర్తిధుర్య
శివ... 12

మ. కలిదోషఘ్ననిజప్రసంగ త్రిజగత్కందాయమా
నాంగ దు, ష్కలుషాదభ్రతమఃపతంగ బుధ
హృత్కాసారచక్రాంగని,శ్చలసుధ్యానపరాయ
ణార్యభవపాశప్రచ్ఛిదాచంగ కే, వలవిజ్ఞానమ
యాత్మసంగ శివ... 13

మ. కృతనానాజగదింద్రజాల త్రిజగద్గీతాభిధాజా
ల సం, తతభక్తావనలీల ఘోరభవసంతాపార్తిని
ర్మూల వ, ర్ధితసత్కీర్తివిశాల శైలవరపుత్రీలోల
దీనావనా, ప్రతిమోద్యత్కరుణాలవాల శివ. 14

మ. పరతత్త్వోపనిషద్విహార వినమద్భక్తౌఘమందార
దు, స్తరసంసారభయాపహార జగదాధారా
గుణోదార భా, సురనామామృతసార నిర్మలప
రంజ్యోతిర్మయాకార స, త్త్వరజోముఖ్యవికా
రదూర శివ... 15

మ. నిజమాయాకృతసర్వలోక వినమన్నిత్యామృ
తాలోక వి, శ్వజగత్పాలనజాగరూక దివిషద్వృం
దార్యాంఘ్రినాళీక భ, క్తజనాస్తోకతమోవిమోక
పరిధూతస్వాశ్రితానేక జ, న్మజరామృత్యుభవైక
కశోక శివ... 16

మ. పరసంత్రాసకరప్రతాప శమితబ్రహ్మాదిసంతాప
దుర్భరమోహాంధతమఃప్రదీప విలసద్భర్మాద్రిరా
ట్చాపశ్రీకరసత్కీర్తికలాప నిత్యనిజభక్తవ్రాతని
క్షేప చిత్పరమానందమయస్వరూప శివ... 17

మ. నతభక్తవ్రతకల్పభూజ విలసన్నానాజగద్బీజ ర
క్షితగీర్వాణసమాజ పావనతర శ్రీమత్పదాంభో
జ వర్ణితకోటిగ్రహరాజతేజ కరుణానిర్వ్యాజ
దీనావన వ్రతపారీణ సురారిరాజ శివ... 18

మ. సవిలాసాగతదక్షయాగ భవమోక్షప్రాభవా
భోగ హైమవతీసంగతవామభాగ సకలామ
ర్త్యావనోద్యోగ సాధువరానందకరాత్మ యోగ
దృఢచేతోభూవపుర్దాహసం భవభస్మోల్లసితాం
గరాగ శివ... 19

మ. అవనీభృత్తనయాకళత్ర సమరజ్యాఖండితామి
త్ర దుర్భవదుఃఖాంబుధియానపాత్ర సితభాస్వ
ద్గాత్ర పంకేజబాంధవచంద్రానలనేత్ర నిర్మల
జగత్కళ్యాణచారిత్ర సత్పవిరస్తోత్ర జగత్ప
విత్ర శివ... 20

మ. అమితశ్రీకరసుప్రసాద నిజభక్తాభీష్టదాహ్లాద
య్యాగమసంచారవినోద దీనజనరక్షానంతతా
మోద దుష్టమహాపాపవిభేద ఘోరభవపాశ

చ్ఛేద బ్రహ్మోచ్యుత, ప్రముఖాభ్యర్చితపాద
శ్రీద శివ... 21

మ. పదపద్మార్చకకల్పవృక్ష త్రిజగత్పాపచ్ఛిదాద
క్ష దు, ర్మదదైతేయవిపక్ష విశ్వాలయనిర్మాణావ
నాధ్యక్ష చం, ద్రదినేంద్రజ్వలనాక్ష భక్తనివ
హోద్యద్భూరిసన్మంగళ, ప్రదరాజత్కరుణాక
టాక్ష శివ... 22

మ. ధవళాంచద్దరహాస మానిహృద యాంత ర్వాస
నిస్సీమవై, భవకైలాసనివాస భూరినిజసద్భక్తా
వనోల్లాస స, త్ప్రవరస్వాంతవికాస భాస్వదఖి
లబ్రహ్మాండభాండావళీ, భవరక్షాలయకృద్విలా
స శివ... 23

శా. మున్నా ఘోరహాలాహలాగ్ని త్రిజగంబుల్గాల్ప
నీవంతట, న్వెన్నుండాదిగ వేలుపుల్మొఱలిడ న్వే
వచ్చి నీవావిషం, బన్నాఁడాని జగంబుఁ గాచి
తటయన్నా యెన్న నీకన్న నా, పన్నత్రాణపరా
యణుల్గలరె సాంబా భ... 24

శా. సారోదారసుభక్తి బాణుఁడు నమస్కారంబు
గావించి యుం, పారన్వేఁడిన వానియింట సకు
టుంబారూఢిగానుంటి వి, ల్లేరీ భక్తమనోరథం
బు లిడువా రీవిశ్వమం దెంతయు, న్బారంజూచిన
నీవకాక శివ... 25

మ. క్షితిలోఁ బల్మఱు బోయకన్నఁ డిడునుచ్ఛిష్టోప
హారంబుల, బ్రతిమప్రీతిఁ బరిగ్రహించి యపవర్గ
ప్రాప్తుఁ గావించితౌ, పతితోద్ధారకళానిరూఢబి
రుదప్రఖ్యాతికిం జూడ నీ,ప్రతిలేఁ డెవ్వఁడు
దైవకోటి శివ... 26

శా. రిక్తాచారుఁ డొకండు పేర్మి శివరాత్రి న్వేశ్య
తోఁగూడి సం,సక్తిం దత్కుచసీమ నీకు నొకపు
ష్పంబుంచి యర్పించినన్, రక్తిం బ్రోచితి వార
భక్తసులభప్రఖ్యాతి నీయందెసు, వ్యక్తంబైనది
గాని లే దెచట సాంబా భ... 27

మ. అరుదార న్శివరాత్రియందొకఁడు చౌర్యాసక్తి
యుష్మద్గృహం, తరదివ్యస్థలి జాగరూప్తి గను
మాత్రన్ముక్తుఁడై యేగెని, న్నిరతాసక్తి భజించు
వారికరుదా నిర్వాణలక్ష్మీవిని, ర్భరసంశ్లేషసు
ఖాబ్ధిఁ దేలుటకు సాంబా భ... 28

మ. సురలాస న్సురగోలు వేళ గములౌచు న్వచ్చి
రేగాని వా, రరయన్ లోకహితార్థ మాగరళ
మింతైనం దినంజాలరె, వ్వరు లోకేశ్వర నీవు
దక్క నీఁక విశ్వత్రాణ సామర్థ్యమె, వ్వరికైన
న్గలదా త్వదన్యులకు సాంబా భ... 29

శా. భక్తింబాయక ఫల్గునుండు భజియింప న్మెచ్చి దేవీ

సమా, యుక్తిన్నీవు కిరాతవేషమునరా నుద్వృ
త్తిం బోరాడి య, వ్యక్తుండై ప్రహరించినంత
వరలాభంబిచ్చినావయ్యా నీ, భక్తానుగ్రహ మేమి
చెప్ప శివ... 30

మ. గరిమ న్నీశరణంబునొచ్చినను మార్కండేయు
రక్షించి దు, ర్భరవైవస్వత భీతిమాన్పి తేఁట నీ
వాత్సల్య మెన్నంగ నా, తరమా నీచరణానతార్థి
జనసంత్రాణైకదీక్షావిని, ర్భరభాస్వద్బిరుదంబు
నీకతగు సాంబా భ... 31

మ. అలకాధీశునకిచ్చినావు నవసంఖ్యాకాక్షయశ్రీని
ధుల్, జలజాతాక్షునకిచ్చినావు నిజభాస్వద్దివ్య
చక్రంబుఁ బెం, పలర న్వజ్రికొసంగినావతులది
వ్యప్రాభవం బౌభళీ, బళి నీసాటివదాన్యుఁ
డేఁడి శివ... 32

శా. బాధామర్షితబ్రహ్మమూర్ధముఁ దృణప్రాయంబు
గాఁద్రుంచియు, న్గాఢంబౌకృప సాలెపురువ్వునకు
మోక్షంబిచ్చియుఁ మించితౌ, రూఢిం జెప్పఁగ
నేల తక్కినసుపర్వ ల్నిగ్రహానుగ్రహ, ప్రౌఢి
న్నీకు సమాన మెవ్వారిఁక సాంబా భ... 33

మ. గురుపత్నీగమనోగ్రపాతకకళంకుండైన చంద్రుం
డు నీ, శరణన్నంతనె నెత్తిఁబెట్టుకొని వాత్స

ల్యంబు సంధిల్లఁగాఁ, బరిరక్షించితి విట్టియా
శ్రితకృపాపారీణు లింకెందునుం,బరికింప న్మఱిలే
రిఁకెవ్వరును సాంబా భ... 34

శా. లేరే వేల్పులెందఱేని మిగుల న్లెక్కింప వారె
వ్వరుం, గారుణ్యంబున భక్తవత్సలత మోక్ష
ప్రాభవారూఢినిం, పారం దావకదివ్యసన్మహిమ
లక్షాంశంబునంబోలలే, రౌరా మ్రొక్కిన నీకె
మ్రొక్కవలె సాంబా భ... 35

మ. గ్రహరాజుం గని నీవు పండులురులంగా గొట్టు
నవ్వేళ నే, గ్రహచారంబులుఁ జాలకుండె మఱి
యాబ్రహ్మోత్తమాంగంబు బల్, రహినీచేఁ దెగ
నేవిధాతనొసట్ల వ్రాసె న్భవద్దివ్యస, న్మహిమ
ప్రాభవ మింతెకాక శివ... 36

శా. నీచారిత్రము బల్విచిత్రముగదా నీసేవకశ్రేణికిం
పౌచిత్రాంబరరత్నభూషణసుధాహారాదికంబిచ్చి
నీ,వాచర్మాంబర మస్థిమాలయు విషాహారంబుఁ
గైకొంటి వా, హా చాతుర్యము చెప్పఁగాఁ
దరమె సాంబా భ... 37

మ. అణుమాత్రంబుఁ దలంప వాద్విజవధాద్యత్యం
తఘోరాఘముల్,కణమైనం బరికింపఁబోవు ఘన
రాగద్వేషలోభాదులన్, గణనంజేయవు జాతిధ

ర్మవిధిభంగంబుల్ రవంతేనియుం, బ్రణతాభీష్టవ
రంబు లిచ్చుతఱి సాంబా భ... 38

మ. గరిమ న్విప్రుఁ డొకండు చేత శివలింగంబుంచి
పూజింప నం,తరుపం దజ్జనకుండు గాంచి పడఁదన్న
న్వాఁడు క్రోధాప్తిఁ ద, చ్చరణంబుల్దెగఁ ద్రుంచి
తత్క్షణమ యస్వప్నాకృతిం జెందె నీ, పరిచర్యా
మహిమ ల్విచిత్రములు సాంబా భ... 39

మ. బలభిన్ముఖ్యమరుత్కిరీటమణి దీపశ్రేణి నీరాజితో,
జ్జ్వలపాదాబ్జుఁడవైన నీకు సరిపోల్పన్ దైవము
ల్లేరు శ్రీ,వెలయం గన్గొననీకుసాటి మఱినీవేగాని
విశ్వంబులోఁ, బలుకు ల్వేయునికేల చాల
శివ... 40

శా. శ్రీరాముండు కపిస్వరూపదివిషత్సేనాసహాయా
దిసం,భారుండై శతయోజనాయతముగా బంధించి
యున్నట్టి యా, వారాశిం దమి నొక్కగ్రుక్క
గను ద్రావం గుంభజుం డోపుటే, పార న్నీపద
భక్తిసన్మహిమ సాంబా భ... 41

మ. తనర న్సర్వసుపర్వలందుఁ బరతత్త్వంబెవ్వరో
సత్యభా, వనతోఁ దెల్పుమటన్న వ్యాసుఁడు
"నదైవం వాసుదేవాత్పరం", బని చేయెత్తివ
చింప నంత నిజబాహాస్తంభనంబైనస, ర్వనిరూఢిం
బరతత్త్వమీవనఁడె సాంబా భ... 42

మ. పురసంహారమఖాపహార నలినోద్భూతోత్తమాం
గచ్ఛిదా, స్మరచాపాంతకనాశ మృత్యుజయభీమ
క్ష్వేళపానాదిదు, ష్కరకృత్యంబులు నీవొనర్చు
కతనన్న ర్వేశ్వరుండంచునని,న్బరమామ్నాయము
లెంతయుం బొగడు సాంబా భ... 43

మ. తలఁదావంచుకొనె న్ఫణీంద్రుఁ డలిచింతన్వాగ్వరా
రోహవె, ల్వెలఁబాఱెఁ విధియేమితోఁపకయె
నిర్విణ్ణాత్ముఁడై నడైస, ల్గలయం గన్గొనుచుండె
గీప్పతియు శంకన్మౌఢ్యముంబూనె ని, న్వలనొప్ప
న్వినుతింపఁజాలమిని సాంబా భ... 44

మ. అలవిత్తేశుఁడు మిత్రుఁడై విమలకౌప్యాహార్య
మావాసమై, బలుమేల్బంగరుకొండ మేటిధ
నువై భాసిల్లు నాసర్వమం, గళ భార్యామణి
యైన నీకొలుచుభాగ్యం బబ్బునే యీజగ,
ద్వలయంబందును నెంతవారికిని సాంబా భ...45

శా. కళ్యాణాత్మక మైనచాప మురుభోగశ్రేష్ఠమౌ
నారి సా, కల్యాణూన రమానివాస మగు సత్కాం
డంబు భద్రప్రదా, మూల్యంబై తగువాహ
నంబు గల ని న్బూజించిన న్భాగ్యసా, ఫల్యం
బొటరుదే ప్రసన్నులకు సాంబా భ... 46

శా. సత్యజ్ఞానసుఖస్వరూప మగునీ శశ్వన్మహా

త్త్వంబు దా, నత్యంతాద్భుతమై పవిత్రకరమై
యజ్ఞానవిధ్వంసియై, నిత్యశ్రీకరమై చెలంగు
నిదిగో నిక్కంబు సర్వశ్రుతుల్, ప్రత్యక్షం
బుగఁ జాటుచుండు శివ... 47

మ. వెలయ న్సర్వసుపర్వరూప మగు నీ విశ్వస్వరూ
పంబు కే, వలరూఢి న్భజియింపలేక బహుదైవ
భ్రాంతిఁ బెక్కండ్రు మూ, ర్తులసేవింపఁగ వారి
కిం దదుచితోద్యోగానురూపంబుగా, ఫలదానం
బిడు మేటి వీవకద సాంబా భ... 48

మ. అరయ న్భూజలవహ్నివాయుఖరవీంద్వాత్మాష్ట
కంబెన్న నీ, పరమూర్త్యష్టకమై యెసంగ నిఖిల
బ్రహ్మాండభాండోత్కరం,బు రహిం దజ్జలబుద్బు
దోపమములై పుట్టు న్మనుం గిట్టు నీ, పరమానం
దమయస్వరూపమున సాంబా భ. 49

శా. లీలానిర్మితనై కకోటిఘననాళీకోద్భవాండచ్ఛటా,
మాలాజాలవిరాట్స్వరూపమగు నీ మాహా
త్మ్య మింతైన నా,నాళీకాక్షచతుర్ముఖాద్యమరులె
న్నంజాల రెన్నాళ్లకుం, బ్రాలేయాచలకన్యకార
మణ సాంబా భ... 50

మ. తనియ న్నేటిమనోరథార్థములఁ బొందన్వచ్చు
నుద్యద్విప,ద్వనధుల్దాఁటఁగవచ్చు న శ్రమతవిశ్వాం

బెల్లఁ దెల్లంబుగాఁ, గనఁగావచ్చు సకృజ్జపంబు
ననె వీఁకన్ శైవపంచాక్షరీ,మనురాజం బఖిలార్థ
సాధనము సాంబా భ. 51

శా. చేతోవీథిభవత్పదాంబుజముఁ దాఁజింతించి యెం
దేగినన్,భూతప్రేతపిశాచ రాక్షసగణంబుల్ పోవు
దవైవ్యసం, ఖ్యాతాపన్నిచయంబడంగు నిర
పాయాత్యంతసన్మంగళ, వ్రాతంబు ల్సమకూడు
నిక్కమిది సాంబా భ... 52

మ. నుదుట న్భస్మ మలంకరించి యఱుతన్ రుద్రాక్ష
ముల్దాల్చి లీ, లదలిర్ప న్భవదీయదివ్యచరితల్
గానంబు గావించుచు, న్మదమొప్ప న్విహరించు
వానిఁ గని తా మోహాతిరేకంబుచే, వదలంజాల
దు ముక్తికాంత శివ... 53

శా. నీలీలాచరితావళు ల్వొగడువానిం జూచి భీతా
త్ములై, జాలింబొందుచుఁ గాలకింకరులు తత్సా
మీప్యమందుండకే, చాలంగాఁ బరువెత్తిపోదు
రఁట మించన్ దవ్వగా నోజగ, త్పాలారాధిత
పాదపద్మ శివ... 54

శా. నీదాక్షిణ్యము నీకృపాతిశయము న్నీభక్తవాత్స
ల్యము, న్నీదీనార్థిజనైకపోషణము నీ నిర్వాణ
సంధాన మిం, కేదైవంబులయందుఁ గాన మిఁక

వేయేలా గణింపంగ నీ, పాదాబ్జంబులఁ గొల్చి
ముక్తుఁడగు సాంబా భ... 55

శా. నీకర్పించినపత్రపుష్పఫలపానీయంబు లుద్యన్మదా
స్తోకేభేంద్రమనోజవాశ్వ విలసత్పూర్ణేందుబిం
బాననా, ద్యాకారంబులఁ బుట్టి పూర్వభవవిద్యా
యుక్తిఁ బ్రాగ్భూపజక, ప్రాకారంబులఁ బాయ
కుండునఁట సాంబా భ... 56

మ. పరుసం బౌపులితోలు పైనిడి చితాభస్మంబు మైఁ
బూసి య, బ్బురమౌపున్కసరు ల్ధరించి జగము
ల్పుట్టించుచుం ద్రుంచుచుం, బరమాయాకలితేం
ద్రజాల మరుదొప్పం జేయఁగాఁ గాటికా, పరివై
యుండితివౌ బళీబళిర సాంబా భ... 57

మ. ధరణి న్రాజశిఖామణిం గొలిచి వేదండాశ్వర
త్నాంగనా, స్థిరభాగ్యంబులఁ గాంచునందు రది
యెంతేవింతగాదా దిగం, బరు నాయాదిమభిక్షుని
న్గొలిచి శశ్వత్ప్రాభవప్రోల్లస, త్పరమైశ్వర్య
ముఁ గాంచుచుండ శి... 58

మ. వివిధామ్నాయపురాణశాస్త్ర మనుసద్విద్యారహ
స్యంబులన్, హవనాదిక్రియల న్ప్రియాగముఖ
దివ్యక్షేత్రరాజంబుల, న్వివరింప న్సకలప్రపంచ
మును నీవేకాని విశ్వంబులో, భవధన్యం బిసు
మంత లేదుగద సాంబా భ... 59

మ. జలజాతాక్ష చతుర్ముఖత్రిదశభాషాశేషవాచస్పతుల్, పలుకన్నేరరు నీప్రభావలవముం భావింపలేరట్టిచో, నిల నేనెంతటివాఁడ నీదుమహిమం బెన్నంగ నోలింగ భ, వ్యలసద్భూరిదయాంతరంగ శివ... 60

మ. ఫలపర్ణాంబుసుమంబులిచ్చిన ననల్పశ్రీత్రిలోకీసము, జ్జ్వలసామ్రాజ్య మొసంగి నీవు తుదమోక్షంబిచ్చుచుండంగ నీ, సులభోపాయ మెఱుంగలేక మనుజుల్ క్షోభింతురే మొక్కొ యుత్పలినీబంధుకళావతంస శివ... 61

మ. చెనకన్వచ్చి మనోజుఁ డంతటనె భస్మీభూతుఁడై పోయె నీ, సున దక్షుండు నిరాకరించి చటులాస్తోకార్తిపాలయ్యెఁగా, న నిఁకెవ్వండు శివాపరాధ మణువైనం జేసి చేటొందకే, మనఁగా నేర్చు జగంబులోన శివ... 62

మ. క్షితినానావిధమర్త్యకోటిఁ దమవాసిం బ్రోవఁగాఁబూని దై, వతముఖ్యుల్దగుపాళ్లువెట్టికొనిరిబ్బంగిన్; యతుల్విష్ణుపా, లక్రియతుకర్తల్వతమ న్యపాలు శ్రుతిధర్మజ్ఞుల్ చతుర్వక్త్రుపా, ల్పతితానీకము నీదుపాలు శివ... 63

మ. అలఘూదారతఁబూనునాయెడను నీ కర్పించితిన్

మేను నీ, చుల యాచింపఁగలేను నీవెగతియంచు
న్నమ్మియున్నాను దీ, నులతోఁ బంతముమాను
నీకిపుడు నబ్బోప్రివ న్వశంబౌను న, న్వలదన్న
న్నిను మానఁబోను శి... 64

శా. ఏదైవంబులవంకఁ జూడ నిఁక నేనెన్నైన నిన్వీడ నీ
వేదిక్కంచిటు లున్నవాఁడఁ బలుకు ల్వేయేల
నీవాఁడ నీ, వాదేలా ననుఁగన్నవాఁడ యెపుడు
న్బల్మాఱునాతోడ నీ,పాదంబు ల్నెరనమ్మినాఁడశివ.

శా. ప్రారబ్ధం బను బల్నెపంబొకటి నాపై వేసి యాపై
మహా,దారాపత్యధనాదిపాశములచేతంగట్టి దు
ర్వారసం,సారాబ్ధిం బడఁద్రోసినీవటుతటస్థప్రౌఢి
తోనుండియ,య్యారే చిత్రము చూతువౌర శివ,

మ. చెలిమిఁ గుబ్బలిరాచకూఁతు రబ్బమైఁ జెన్నొప్ప
లేనవ్వవె, న్నెలనిగ్గు ల్దిశలెల్లఁ గప్పఁ జెలువౌ
నీరూపు బాగొప్ప నా, కలలోనైనను జూపుమప్ప
యడుగంగారానిదేతప్ప న, న్నలఁతం బెట్టిన నేమి
గొప్ప శివ... 67

మ. శివనామంబొకసారె భక్తివిభవ శ్రీ మీఱఁగాఁ
బల్కిన, న్వివిధాపన్నిచయంబడంగుఁ దతదు
ర్విఘ్నౌఘము ల్గుంగు నుత్సవము ల్పెక్కుచె
లంగు నిత్యపరతత్త్వశ్రేయముప్పొంగుఁ ద,ద్భవ
బంధంబులు ద్రుంగు నిక్కమిది సాంబా భ...68

మ. సవనవ్రాత మొనర్పనేల పశుహింస ల్సేయఁగా
నేల యో, గవిధానంబులు పూననేల తనువిం
కంజేయఁగా నేల తా, వివిధాభీష్టములొందవచ్చు
సుఖులై విశ్వేశ సద్భక్తితో, భవదంఘ్రిస్మరణం
బుఁ జేసి శివ... 69

మ. ఖలసాంగత్యము గాదు చేసినను దుఃఖంబీక నే
పోదు పెద్దలసాంగత్యముమానరాదు మతభేదం
బుల్ వృథావాదు ని, శ్చలసారం బగునీదుభ
క్తి వరమోక్షప్రాప్తికింబోదు మో, హాలతల్
ద్రుంపక ముక్తిలేదు శి... 70

మ. పరుల న్బాధలొనర్చి బల్ధనముసంపాదించి విఖ్యా
తికై, ధరలోఁ జేసిన యట్టిధర్మములు వ్యర్థంబై
చనుంగాక సు, స్థిరతంబొందునె సర్వభూతపరి
తృప్తుంజేయుటేనీమహో,పరిచర్యాకరణంబుగాదె
శివ... 71

మ. క్షితిలోఁ గొందఱు వారివారిమతముల్ శ్రేష్ఠం
బు లన్యంబులో, మతముల్గావనిచెప్పుచుందు రిది
నీమాయావృతభ్రాంతి సం, తతనానావిధజంతు
సంతతిహృదంతర్యామివౌనీకు స్మృతి గానట్టిమ
తంబునుంగలదె సాంబా భ... 72

మ. అరయన్నీ వపరోక్షత న్నిఖిలభూతాత్మస్వరూ

పుండవై, పరిపూర్ణస్థితినుండఁ గన్గొనక నిస్స్వాభవిం
తు రెండోజనుల్, పరమేశా భవదీయమాయఁ
దెలియంబద్ధోద్భవాదిత్యగో,పరమేశాదులకైనఁ
బోలదఁట సాంబా భ... 73

మ. విపరీతార్థకుతర్కవాదములచే విజ్ఞాన మొప్పా
రునే, కపటాచారవిడంబనక్రియలచేఁ గైవల్య
మే తెంచునే, చపలాశావిషయోపభోగములచేఁ
జల్లారునే తృష్ణ నీ, యపరోక్షానుభవంబు లేక
శివ... 74

మ. కలివేళ న్విధిచోదితక్రియలొగింగావింపఁగా లేక
తా, రలసుల్గొందఱు తత్త్వవేదులము మేమం
చు న్సుకర్మంబులి, మ్ములఁగావింపరుగాని భోగ్య
విషయంబు ల్మానగాలేరు ని, ష్ఫలదంభోక్తుల
ముక్తిచేకుఱునె సాంబా భ... 75

మ. నరుల న్మోసముపుచ్చి సొమ్ముగొన నానాశాస్త్రవా
దంబులు, న్వరవేదాంతవిశిష్టయుక్తులును దం
భప్రాప్తవేషంబులుం, గరమొప్పారునుగాని
సద్గురుకటాక్షంబింత లేకున్న నీ, పరతత్త్వం బె
ఱుఁగంగరాదుగద సాంబా భ... 76

శా. మీనం బెప్పుడు నీటనేమునుఁగుఁ దా మేషంబు
పర్ణాశనం, జేనిత్యంబొనరించుఁ బాము పవనం బే

గ్రోలు నేప్రొద్దున, ద్దాన న్యానికి నేమిపుణ్యఫ
లమొందంగ్గలై నట్లౌను నీ, ధ్యానం బించుక లేని
సత్క్రియలు సాంబా భ... 77

శా. దేవా తావకభ_క్తిలేనినరుఁ డేతీర్థంబులంగ్రుంకి
నన్, గ్రావాగ్రంబులపై వసించినను యోగశ్రే
ణిసాధించినన్, కైవల్యార్హుఁడు గాఁడతం డితర
కాంక్షల్మాని నిన్నాత్మలో, భావింపంగలవాఁడు
ము_క్తుఁడగు సాంబా భ... 78

మ. తనవారొక్కరుఁగూడ రారు యమబాధ ల్మాన్పఁ
గా లేరు మున్, ధనకాంక్షం దనుగూడినారు
తుదఁ జెంతన్నిల్వఁగాఁబోరు గా,వున వైరాగ్య
ముమీఱు ధీరులతిభవ్యుల్ వారు నీభ_క్తిభా,
వనచే ము_క్తికి జేరువారు శివసాంబా భ... 79

మ. ధరణిం గోరకయున్నఁ బోవు సుఖముల్ తాఁగో
రిన రావు గాఁ,పురముల్నిత్యముగావు సంతప్ర
జగుంపుంబోకలేపోవు నీ, శరణన్న న్విడనాడలే
విడియె మోక్షప్రా_ప్తికిందావు ద,బ్బుఱవేసంబు
లు మెచ్చవీవు శివసాంబా భ... 80

మ. తిరమై దేహమునిల్చునా శమనుఁడిం దే నిల్వఁగా
నోర్చునా, సిరిదానిల్కడ నేయునా యెపుడువా
సి న్వెన్నెలల్గాయునా, ధరసంసారము నిత్యమా

తెలివినొందన్లేక మున్నెన్నఁడో, పరమార్థంబొన
రింతు నేననిన సాంబా భ... 81

మ. చెదరుఁ దృష్టిమనీషయుం జెదరు బల్జీర్ణంబులై
యంగము, ల్వదలుఁ దంతములెంతయుంగదలు
శీలంబంతమున్నేచను, న్మదిమింజిక్కినవేళఁ జిత్ర
మిదియేమొతృష్ణ దానొక్కఁడే, వదలంజాలదు
గాని మానవుని సాంబా భ... 82

శా. జ్ఞాతిద్రోహులు బంధుఘాతకులు హింసాసత్య
శూన్యుల్ దయా, వీతస్వాంతులు సాధుబాధ
కులునై వేధించుచున్నాఁడు ని, ర్భీతిం దాఁ గలి
పూరుషుండిపుడు ధాత్రిస్నీవు పేటించిన, న్మాతం
డ్రీ బ్రదుకెట్లు సాధులకు సాంబా భ... 83

మ. ధనమే సాధనమెల్లకార్యములకుం దర్కింపసత్కీ
ర్తి జీ, వనమే పావనమెల్లలోకములకు న్వర్ణింప
నీపాదపూ, జనమే భాజన మెల్లభద్రములకుం
జర్చింపఁగా నేరికి, న్మనమే కా ఘునమోక్షకార
ణము సాంబా భ... 84

మ. ధర సత్కీర్తికి దానమే మిగుల సద్యస్తృప్తికిం
బోనమే, సరసత్వాప్తికి గానమే కలహానాశస్ఫూ
ర్తికి న్మౌనమే, గరిమావాప్తికి మానమే నిరత
మోక్షప్రాప్తికిఁ జ్ఞానమే, పరఁగుంగా కిఁకఁగా
న మేక్రియల సాంబా భ... 85

మ. నిను మెచ్చించుట భ_క్తినే జనులకు న్మేలౌట
సత్సో_క్తినే, తనకు న్బంధము రి_క్తినే పరమభ
ద్రస్ఫూ_ర్తి సద్వ్యా_క్తినే, కననిశ్చింత విర_క్తినే సక
లదుఃఖప్రా_ప్తి సంస_క్తినే, మనముం బట్టుట
యు_క్తినే యగును సాంబా భ... 86

శా. ఆయుర్దాయము సెల్లి మర్త్యులు సదా యా
మ్యాలయం బొందుటల్, శ్రేయస్సంపద నొ
క్కెడ న్నరులు నిశ్శ్రేయస్కులై యొక్కెడం,
గాయక్లేశము నొందుట ల్గనియు రాగద్వేషము
ల్మాన రీ, మాయాపాటవ మేమిచెప్ప శివ...87

మ. జగతిం జాడ నియోగియై మొదలఁ దా జన్మిం
పనేరాదు క,ర్మగతిం జన్మము గాంచెనేని బ్రదుక
న్రా దట్లు జీవించిన,న్వేగతో నిర్ధనుఁడౌట గాడ
దటులైన న్వేగ మిలా్వసిగో, న్వగతిం దాపసియై
చరింపఁదగు సాంబా భ... 88

మ. నినుసేవింపక పొట్టకూటికి జను ల్నిత్యంబుమూ
ఢాత్ములై,ధనికద్వారములందుఁగొల్చెదరు తత్కా
ర్యంబునేమందు గా, ననమందుండెడు కొండచి
ల్వకు శిలాంతర్వ_ర్తి యాకప్పకు, న్మనవాహా
రముఁ దెచ్చి నీవిడవె సాంబా భ... 89

మ. పుడమిం బెక్కువనంబుల న్మధుఫలంబుల్ స్వా

దుపానీయము, ల్గడునొప్పారు లతావితానములు
సౌభాగ్యంబౌగుహావాసముల్, గడిమింబ్రోచెడి
దాతవీవు గలుగంగాఁ గూటికై దీనతం, బడి
యాచింపఁగ నేల దుర్మదుల సాంబా భ... 90

మ. ఇరవందం జడలందు గంగగల నీకీభూజలస్థానము
న్నిరతిం జాబిలిపువ్వుఁదాల్చు దొరవౌ నీకీధరా
పుష్పముల్, గురులోకత్రయదీపకుండవగు నీకుం
దీపము మ్మెచ్చుగా, వరయన్ భక్తి యొకందు
గాని శివ... 91

మ. పరగ న్మన్మథదేహదాహ విలసద్భస్మాంగరాగం
బున, బ్బురమౌ బ్రహ్మకపాలమాలికలు సద్భోగీం
ద్రభూషాచయుం, బిరవొందం ధరియించు మేటి
వగు నీకీగంధమాల్యాదులం, బరితోషంబౌనరిం
చువాఁడెవఁడు? సాంబా భ... 92

శా. శంకాతంకములేక శంకరున కీశత్సామ్యమొం
దంగలే, రింకేవేల్పులటంచు దివ్యకరిపై హేమ
ధ్వజంబెత్తి యిూపంకేజప్రభవాండమెల్ల వినిపిం
పన్ భూరిభేరీమహా, ఘాంకారంబులు నిండఁ
జాటెదను సాంబా భ... 93

మ. బలువింతౌ బరువింత యౌ నవక యౌబంగార
పుంగట్టుచి, ల్వెలతేని న్వలతేనితంత్రి నొక కేల

న్నిల్లోనం బమ్మఁగా, బలిమిం బూనిన మేటివీవు
ననుఁ జేపట్టంగ వేఁగానె యా, బలిపుత్రాంగణ
పారిజాత శివ... 94

మ. సకలస్థావరజంగమాత్మ వని యశ్రాంతంబునిన్వేఁ
డ నీ, వకటా నాదుమొఱాలకింప విపు డాహా
కేవలస్థాణుమూ, ర్తికి నే మ్రొక్కినచందమయ్యె
శివుఁ డెంతేసుప్రసన్నాత్ముఁడన్, ప్రకటఖ్యాతికి
సంశయంబాదవె సాంబా భ... 95

మ. వ్రతనిష్ఠల్ సురభూసురార్చనలు దివ్యక్షేత్ర
యాత్రల్ శ్రుతి, స్మృతిధర్మంబు లోకింతయేనె
ఱుఁగ మీ శ్రీపాదపద్మంబులే, మతిలోనమ్మితి
నేననన్యరతినో మాతండ్రి శంభూసతీ, పతి నీవే
గతికావవే నిరతిసాంబా భ... 96

శా. తుంగాబ్ధాంబుకణంబు లెన్నఁదగు భూధూళిం
గణింపం దగు, న్నింగిం జుక్కలు లెక్కవెట్టఁ
దగు నింతేగాని నాతప్పులె, న్నంగాగా వేఁక నీ
వుగా కొకరు న న్రక్షించు వారేరిఁకె, బ్భంగిం
బ్రోచెదో నీవ దిక్కుసుమ సాంబా భ... 97

మ. పరఁగన్ శంభుఁడు దీనబంధుఁడని చెప్ప న్విమ్మి
యాస న్నిరం, తరము న్నే మొఱలిడ్డఁ బల్క వి
దియెన్న న్మోసమో లేక మున్, ధరనేఁ జేసినదో

సమో కరఁగ దన్నా నీమనం బింతయో, పరకారు
ణ్యాసముద్ర రుద్ర శివ... 98

మ. పరదైవంబవు నీ వటంచు మది నీపాదాబ్జముల్న
మ్మి నేఁ, బరదైవంబుల వేఁడలే దెపుడు నాపై నీవు
పేక్షించినం, బరఁగంగా ననుఁ బ్రోచువా రెవరిఁ
కక భక్తావనాంచద్దయా, పరమూర్తీ శరణాగ
తార్తిహర సాంబా భ... 99

శా. నీవేతల్లియుఁ దండ్రియు న్విభుఁడుసన్మిత్రుండుఁ
జుట్టంబులు, న్నీవే దాతవు దైవముక్ గురుఁడు
నా నిర్వాణనిక్షేపము, న్నీవే నాదగు తోడునీడ
మఱియు న్నీవే సమస్తంబు గా, భావింతు న్భవ
దన్య మే మెఱుఁగ సాంబా భ... 100

శా. నీపాలంబడితి న్నిరంతరము నే నీపాదముల్నమ్మి
తి, న్నీపద్యావళిఁ బాడుచుంటి నెపుడు న్నీకంటె
న న్నెవ్వరుం, గాపాడం దొరలేఁ డటంటి నిది
నిక్కం బింక నీచిత్తమో, పాపగ్రావవిభేదశంబ
శివ... 101

శా. నీవిఖ్యాతచరిత్రము ల్వీను చెవుల్ నీపూజకౌ
హస్తముల్, నీవాసంబుల కేగు పాదయుగము
న్నిన్గాంచు మేల్చూపు నిక్, గైవారం బొనరించు

జిహ్వయును నీకై మ్రొక్కుమూర్ధంబు నిన్భా
వింపంగల బుద్ధినాకొసఁగు సాంబా భ... 102

శా. నీకీర్తిశ్రుతి నీకథాశ్రవణము న్నీపాదసంసేవ
యున్నీకళ్యాణగుణానువర్ణనము నీ నిత్యాను
సంధానము, న్నాకుం బాయకయుండునట్లొసఁగు
మన్నా జన్మజన్మంబుల, న్భాకారిస్తుతపాదపద్మ
శివ... 103

మ. పరుల న్వేఁడకయుండ వేఱొకఁడు నన్బ్రార్థించిన
న్వానికిం, బరఁగన్ లేదనకుండ నామనము నీపా
దారవిందైకసంస్మరణం బేమఱకుండ నీవరము
లిమ్మా నాకు శశ్వత్కృప, న్వరదా శంకర సుప్ర
సాద శివ... 104

మ. నమదార్తైకశరణ్య నీవు వెలయ న్మత్తేభశార్దూల
చర్మములం బ్రీతివహింతు గాన నిపుడే మత్తేభ
శార్దూలవృత్తముల న్నీ కుపహార మిచ్చితిని
భక్తవ్రాత మేమిచ్చినం, బ్రమదం బొప్పఁ బరి
గ్రహింతుగద సాంబా భ... 105

మ. తనయు ల్మాటలు సూటి నేరక తమిం దప్పొప్పు
లెల్లాడినన్, జనకు ల్మోదముతోడఁ జూతు రటు
లే సర్వేశ నీవీజగజ్జనకుండౌట మదుక్తిలోపము
ల నెంచంబోక వాత్సల్యభావనిరూఢిం గరుణిం
చి కైకొనుము సాంబా భ... 106

మ. వితతశ్రీకరసత్పదార్థగరిమ న్విఖ్యాతి శోభిల్లు నీ
శతకం బెవ్వరువ్రాసినం జదివిన న్సద్భక్తి నాలిం
చిన, న్సతతాభీష్టసమస్తభోగపరమైశ్వర్యంబులం
బొంది శాశ్వతకైలాసపదంబుఁ గాంతు రొగి
సాంబా భ... 107

మ. చెలువౌ నీకృతిఁ గూర్చి నీకొసఁగితిన్ శ్రీకూచి
మంచాఖ్యస, త్కులసంజాతుఁడ సోమసుందర
వరాఖ్యుండ న్మహాగౌతమీ, విలసత్తీరతలస్థప
ల్వాలపురీ విఖ్యాతవాసుండ నుజ్జ్వలలీలం దయ
దీనిం జేకొనవె సాంబా భక్తచింతామణీ. 108

భక్తచింతామణిశతకము సంపూర్ణము.

---

# పీ ఠి క.

ఈసీతాపతిశతకము రచించినకవి సాహెబు రాణా రామన్న. ఇతఁడు వీరన్న రాజమాంబలకుమారుఁడు. భక్త్యావేశము రామభక్తి పురస్కరించి కొని కవి యీశతకమును మృదుమధురశైలిలో వ్రాసియున్నాఁడు. కవికులగోత్రాదికము జీవితకాలము తెలిసికొనఁదగిన యాధారము లీగ్రంథమునఁ గానరావు. ఒకానొక రీశతకకర్త మాధ్వుఁడని యనుమానము కలుగుచున్నదని వ్రాసిరిగాని గ్రంథమునం దటు లనుమానింపఁదగిన భాగములు గోచరింపవు.

కవి యాధునికుఁ డనుటకు సంశయ ముండదు. ఇందుఁ గొన్నిపద్యములు తొలుత నీతిబోధకములై ప్రజలదుర్నయములను గర్హించునవిగనున్నను మొత్తముమీఁద శతకమంతయు భక్తిరసపూరితమై శ్రీరామస్మరణానుభవముగ నున్నదనుట నిశ్చయము. కవితలో నందందుఁ గ్రామ్యచిత్కముగ వ్యాకరణదోషములు గలవు. శైలి యొకచో నిరర్గళధారాశోభితముగ నొండొకచో గూరుపు బింకము లేనిదిగను గానిపించుచున్నది. కొన్నిపద్యములలో భక్తిరసోద్బోధకములగు సమకాలిక శ్రీరాముని వివిధవిధములఁ గాపాడుమని పలు తెఱంగులఁ బ్రార్థించుటతో గ్రంథకర్త శతకము సంపూర్తి

గావించియున్నాఁడు. యౌవనమునఁ జేసిన పాపములకుఁ బశ్చాత్తాపమునొందుచు లోపముల క్షమించి కైవల్యప్రదాయకుఁడవు గమ్మని కవి రాముని మిగుల స్వతంత్రముగా వేఁడికొనెను. ఇందలిపద్యములు భక్తిరసద్యోతకములై భవతారకములై యలరారుచున్నవి.

కవి యంత ప్రౌఢుఁడు కాఁడు. గ్రంథరచనారంభమున నీశతకము వ్రాయఁబడెనేమో యని ధారావికలము కల్పనాక్లిష్టత పదాడంబరము చూచినఁ దోఁచును. కవితాగ్రంథముగ విమర్శింపక భక్తిరసగ్రంథముగ విమర్శింతుమేని యీశతకము విలువగలశతకములలో నొకటియగు ననుటకు సంశయము లేదు.

అందందు వ్యాకరణదోషములు కలవు. పద్యమధ్యమునందును బాదాదియందును ననవసరములగు పదములు సంబోధనములు కొన్ని కనుపట్టుచున్నను శతకము భక్తిపరతంత్రుల కెంత జదివినను విసువుగలిగింపనంత మృదుమధురముగా నున్నది.

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

నందిగామ
20-10-25.

శ్రీ ర స్తు.

రాణా రామన్నకవికృత

# సీతాపతిశతకము.



శా. శ్రీమద్భూమిసుతామనోహర దశగ్రీవాదినక్తం
చర, స్తోమారణ్యకుఠార సర్వవిబుధ స్తోత్రైకస
త్పాత్ర వి,శ్వామిత్ర క్రతువిఘ్న కృద్దనుజతీవ్ర
స్థేమ సంహారదే,వా మాంపాహియటంచు సంత
తము నిన్వర్ణింతు సీతాపతీ. 1

శా. కల్యాణప్రద సచ్చరిత్ర మునిహృత్కంజాతసం
చార కౌ,సల్యాగర్భసుధాబ్ధిశీతకర పాషాణ
స్వరూపాయితా,హల్యాశాపవిదూర సేవకనికా
యాధార రక్షింపవే, కల్యాణాచల చాపసన్నుత
నమస్కారంబు సీతాపతీ. 2

శా. లీలామానుషదేహ ఘోరరణకేళీసంతతో
త్సాహ ది,క్పాలవ్రాతకిరీట సంఘటిత శుంభద్ది
వ్యరత్నప్రభా, జాలాలంకృత పాదవారిరుహ సం
సారౌఘ గాఢస్ఫుర, త్కాలాంభోధరగంధవా
హాజిత దైత్యవ్యూహ సీతాపతీ. 3

మ. పురుహూతోపలనీలగాత్ర వికచాంభోజస్ఫుర

స్నేత్ర ని, ర్జరసందోహావిరోధియాధకుల దు
ర్వారాటవీ వీతిహోత్ర రతీశప్రతిపక్షముఖ్య
సురబృందస్తుత్యచారిత్ర వా,సరనాథాత్మజ
మిత్ర నీకిదె నమస్కారంబు సీతాపతీ. 4

మ. ప్రమదం బొప్పఁగ నీశుభాకృతిని హృత్పద్మ
స్ఫురద్రత్నపీ,ఠమునందుంచి నిరంతరంబు మదభీ
ష్టప్రాప్తియౌనట్లు వా,క్సుమజాలంబులఁ బూజ
చేసెదను గైకోవే దయాసాంద్రదై, త్యమదో
ద్రేకహరోగ్రసాయకసమూహారామ సీతాపతీ.

మ. తమి నా నేర్చు తెలుంగు తేటపడ నందంబొప్పఁగా
వాక్ప్రసూ,నములన్ బొందికఁగూర్చి నీకొసఁగె
దన్ మత్తేభశార్దూలవృ,త్తములింపారెడుపుష్ప
మాలికల చందంబొప్పఁగాఁ గాన్క నైయ్యము
నన్ గైకొని ప్రోవుమీ పలుకుతోడై వేగ
సీతాపతీ. 6

మ. పదసంధుల్ గణావృత్తభేదవిరతి ప్రాసాదు లూ
హించియున్, బదపద్యంబులు చెప్పుచొప్పెఱుఁ
గ నీపాదాంబుజధ్యాన మా,స్పదమున్ జేసి
రచించెదన్ శతక మాచంద్రార్కమై ధాత్రి నిం,
పొదవం జేసియుఁ జిత్తగింపు కృప బెంపొందంగ
సీతాపతీ. 7

మ. పరుసం బించుకసోక లోహ మపుడే బంగారమై
నట్లు నీ, వర కళ్యాణగుణ స్తవం బగుట నే
వాక్రుచ్చు కబ్బంబునం, దరయం దప్పులు గల్గి
యున్న నవి యోగ్యంబౌచు నెల్లప్పుడుం, ధరం
జెన్నొందును గాక భక్తజన హృద్యంబౌచు
సీతాపతీ. 8

శా. కన్యావిక్రయులై ధనంబున కపేక్షం జెంది లోకం
బునం, దన్యాయం బొడిగట్టుకోం దలంచి దుర్వా
పారులూహింప సా, మాన్య ప్రాభవ మిచ్చియిం
చిరకటా మర్త్యాళి శిక్షింపలే, రన్యుల్ నీవు స
హించి యుండుటకు చోద్యంబయ్యె. సీతాపతీ. 9

మ. తనయుల్ గల్గినం గల్గు సద్గతులు తథ్యంబంచుం
బుత్రార్థులై, మనుధన్యుల్ మదిం గోరియుందు
రిపుడీ మూర్ఖాళి సత్కన్యకా, జననంబైనను విక్ర
యించెద మభీష్టప్రాప్తిగా ద్రవ్యమా, ర్జనం గా
వించెదమంచు నెంతు రిదిమేరా చూడ సీతా
పతీ. 10

మ. అనఘుల్ తొల్లి జగత్ప్రసిద్ధమగు కన్యాదానస
త్పుణ్యమం, దనురక్తిం ధరజేయుచుండి రిపు డ
ర్థాపేక్షచే దుష్కృతం, బని డెందమ్మున లేక
యాత్మభవకన్యావిక్రయోల్లాసులై, మను దు
ర్మార్గులశిక్షసేయ విది ధర్మంబౌనె సీతాపతీ. 11

శా. పాపంబుల్ దరుచయ్యె సజ్జనుల ప్రాబల్యంబు
లేదయ్యె దు, ర్వ్యాపారాభిరతుల్ ధరన్ బలసిర
న్యాయంబు హెచ్చెయ్యె నీ,వే పాలింపకయున్న
నెవ్వారిఁక నుర్విం దీనులన్ బ్రోచువా, రాపన్నా
వన ప్రోవవే తడవుసేయన్ వద్దు సీతాపతీ. 12

మ. తలిదండ్రుల్ సుతులన్నదమ్ములు కళత్రంబంచు
నేవేళ మర్త్యులతిభ్రాంతిని జెంది నిన్ మఱచి
ప్రొద్దుల్పుత్తురయ్యో యముం, డలుకన్ బాము
లఁ బెట్టఁగా నపుడు డాయన్వచ్చి వారింపఁగాఁ,
గలరా వారెవరైన వట్టిభ్రమయేఁ గా చూడ
సీతాపతీ. 13

మ. బరువై తోఁచ నసాధ్యమైనపని నీపైఁ బెట్టఁగా
లేదు నీ,వరకానైనధనంబులో వ్యయము సేయన్
వద్దు నాకార్య మె, వ్వరితో నైనను దెల్పుసేయ
మనదేవా వాగ్వరంబొటకే, జరుపన్ జొచ్చెద
వెట్లో సంగెదవు మోక్షంబింక సీతాపతీ. 14

మ. బరువై తోఁచెనో లేక నాదురితముల్ పాటిం
చి చూడన్ మదిన్, వెఱపై యుండెనో వేళగా
దో యిది నీవే దిక్కుగా నమ్మి న్నేదిరుగన్ లేదొక్కో
డ దోషాకారణము నాదీనత్వమున్ బాపవే, వఱ
లైకెనే వ్వానజానసప్రముఖ దేవస్తుత్య సీతాపతీ. 15

మ. ధరనేఁజేసిన ఘోరపాపముల నంతంబొందఁగాఁ
జేయ దే,వర నీకన్నను లేరువేరొకరు గీర్వాణా
ళిలో న న్ననా,దరణన్ దండధరోగ్రకింకరులచే
తం జిక్కఁగానీక నీ,చరణాబ్జంబుల చెంతఁజేర్పు
ము నమస్కారంబు సీతాపతీ. 16

మ. ధరపై బట్టకుఁ బొట్టకేనొకరి చెంతంజేరి యాచిం
పుచున్, దిరుగన్ జేయకు రోగవేదనల నా ర్తిన్
బొంతగానీయ కీ,వరముల్ నాకిహామందొసంగి పి
దపన్ వాత్సల్యమొప్పన్ భవ,చ్చరణాబ్జంబులు
చూపు నమ్మితి నమస్కారంబు సీతాపతీ. 17

మ. వలదన్నన్ వెనువెంటనే దిరుగుచున్ వారేమి
వంచించినన్, దలవంపై మదిగుంది పొట్టకొఱకై
తపొప్పెప్పలొప్పన్ సిరుల్, గలవారిం బతిమాలు
చున్ దిరిగితిం గష్టాత్ములైనట్టి బీ,దలఁ బుట్టింపఁగ
నేల ధాత పనిలేదా వేరె సీతాపతీ. 18

మ. అడవుల్ ద్రిమ్మరవచ్చు కాల్నడను రే లందు,
న్నదిందాల్మిచే, నుదుకైనన్ జోరవచ్చు బెబ్బులు
లు దా మొండొంటెతోఁ బోరుచో, నడుమ న్ని
ల్వగవచ్చు దిట్టముగ నెన్నన్ గట్టిడా లేమిచేఁ,
గడగండ్లంబడరాదు మర్త్యులకు లోకంబందు
సీతాపతీ. 19

మ. సొగసౌ వేలుపుఁ దేనితో నిగనిగల్ జూపట్టునెమ్మే
నితో, నగవొప్పారెడు ముద్దునెమ్మొగముతో
సౌడెంపుహారంబట్టుశా,ల్జిగిమేనన్ వలెవాటుతో
పుడమిచూలింగూడి తమ్ముండు గొ,ల్వంగ నీవె
న్నఁడువచ్చి నిల్చెదవు మ్రోలందండ్రి సీతాపతీ.

మ. అడవుల్ ద్రిమ్మరఁబోతివో గడుసులౌ నారక్క
సుల్ మాయలన్, బొడకట్టం దెగటార్చ నేగితివొ
నేర్పుల్ మీఱఁగా భక్తులై, కృఁడని న్నాచిన
వారిచే మెసలలేకేచిక్కితో కాక యెక్కఁడను
న్నావదియేమి పిల్వ బలుకం గారాదె సీతాపతీ.

మ. దరిజేర్పంగలవాఁడ వీవనికదా దైన్యోక్తులం
ద్రౌపదీ, తరుణీరత్నము మత్తసింధురము సంతా
పాంబుధిన్ మగ్నులై, మొఱవెట్టం గరుణించి
నాఁడవనుటల్ ముఖ్యంబుగానమ్మి నీ, చరణాబ్జం
బుల చెంతఁ జేరితి నమస్కారంబు సీతాపతీ. 22

మ. అడవిం గూరలుగాయలుం దిని యనేకాబ్దంబుల
న్నిష్ఠచే, బెడిదంబౌతపమాచరించి నిను మెప్పిం
పన్ సమర్థుండఁగా, నడియాసం బడియుంటిఁ
బ్రోతువని కాదన్నన్ సరేకాని చొ,ప్పడదీమీఁ
ద భవత్ప్రతిజ్ఞయనినే భావింతు సీతాపతీ.

శా. గోటన్మీటఁగవచ్చు నట్టివనికై కొండంతగాఁ జే
సెదీ,పాటింకన్వినుసీకుమోసిన నొనర్పన్లేవెమున్

జౌటము, స్నీటం గొండలు దేల్పుకన్న బళువే
నేవేఁడుకార్యంబు నా,మాటన్న న్విసనై పదింత
తెలిపె న్మర్మంబు సీతాపతీ. 24

మ. ధరపై బట్టకుఁ బొట్టకై యొకని చెంతంజేరి యా
చింపుచుం, దిరుగంజేసితి వింక సద్గతినిజెందే
మార్గమేమైన నా, కెఱుఁగందెల్పకపోతి వీవఱి
కఘో! యేమందు నాకర్మమో, కరుణేలేదొ
మొఱాలకింపవు పరాకా యింత సీతాపతి.

శా. నిన్నేన్నాళ్లని వేఁడుకొం దెవరితో నే దెల్పఁగాఁ
బోదు లే, రెన్నఁ దీనశరణ్యులెవ్వరిఁక నీయా
రేడులోకంబులం,దన్నా! యెన్నటికింక దుర్దశలఁ
బాయం,ద్రోచియు న్నన్ను సం, పన్నుం జేసెద
వేమొ తోఁచదిఁకఁ దెల్పన్రా దె సీతాపతీ. 26

శా. కాయల్పండ్లును మెక్కి కాన లిరువుల్గా భీతిచే
మానుసు, ల్డాయంబోయినఁ బాఱుక్రోఁతితుటు
మెట్లుం గెల్చె రాకాసులం, బాయంజాలనికూర్మి
వారలను జేపట్టంగనేకాక ము, న్నేయంజాలిరె
వారలింతటిపనుల్ చింతింప సీతాపతీ. 27

మ. తనయుల్సోదరు లాత్మబంధులు సమస్తంబైనవా
రుండియుం, దనకుం బాల్పడు కర్మమెవ్వరయినం
దప్పింపఁగా లేరు; శౌ,ర్యనిధు ల్పాండవులుండి

యాద్రుపదకన్యారత్న మానిందుకొ,ల్వనఁ బ్ర
త్యర్థులచేత సిగ్గుపడు గోల్పోవె లేదె సీతాపతీ.

మ. అడుగంబోవుటకన్న లాఘవము కన్యాదానముం
బోలి చొప్పడదానం బనృతంబుకన్న ఘనపా
పం బర్థియాచించిన, న్వడిదానిచ్చుటకన్నఁ గీర్తి
యును నెవ్వల్లొందుకన్న న్వెత, ల్పుడమిన్లేవు
తలంపనీకు సరివేల్పు ల్లేరు సీతాపతీ. 29

మ. ఎలమిం దుర్జనుఁ డున్నచో టెఱిఁగి తా మే
తెంతు రెంతే దురాత్ములు పొందొల్లరు సజ్జనోత్త
మునితో ముఖ్యంబుగాధాత్రి నీఁగలు దుర్గంధ
యుత ప్రదేశమున కేగంజూచు నేగాకసొంపలరం
గస్తురిచెంత కేల చను యోగ్యంబెంచి సీతా
పతీ. 30

మ. అవివేకేమి యెఱుంగు సజ్జనుని మర్యాదల్
రసజ్ఞుంబలె, న్భవిసద్యోఘృతశాకసూప మధు
రాపూపాది సద్వస్తురా,గవిచారంబది జిహ్వకే
తెలియుఁగాక న్దెడ్డుకెట్లబ్బు నా, చవిఁ దానెంత
యుఁ గూడియుండినను గాసంతైన సీతాపతీ.31

మ. జగముల్ బ్రోచెడు ప్రోడవైననిను నిచ్చల్గొల్చు
నేనిట్లు నీఁ,చగతి న్బట్టరుఁ బొట్టకై రొటుకదిప్రపంచం
జేరఁగా న్నైతి న్వేనుఁగుపై నెక్కియు దిడ్డిదూరె

డుగతి స్సుమాటికాగొప్ప కొ,ద్ది గణింప న్బని
లేదు నాకిఁకను నీదే కాని సీతాపతీ. 32

మ. తురగస్యందన గంధసింధురభట స్తోమాదిదివ్యాం
బరా,భరణామూల్య సువస్తుసంపదలపై భ్రాంతు
ల్దలంప న్భవ, చ్చరణాంభోరుహ చింతనామృత
రసాస్వాదోల్లసచ్ఛ్రీపరం,పరచే నొప్పెడు పుణ్యా
శాలికిఁ దృణప్రాయంబు సీతాపతీ. 33

మ. అరవిందాసనుఁ డాదిగాఁగఁ దృణపర్యంతంబు
నీవైభవ, త్కరుణాపాంగ విలోకనంబునను
లోకంబు ల్తమిం బ్రోచు నే,ర్పరివై యుండియు
నన్నుమాత్ర మొకనిన్ రక్షింపలేవా! యనా,
దరణం జూచినఁ బ్రోచువా రెవరు భక్తత్రాణ
సీతాపతీ. 34

శా. చోరు ల్దారసమైనచో రిపుజనస్తోమంబు బాధిం
చుచో, ఘోరంబౌ గ్రహచారదోషములు పై
కొన్నట్టిచో భీతిచే, శ్రీరామాయని పల్కుమా
త్రమున నార్తిం బాసి పుణ్యాత్ముఁడై, చేరున్
మోక్షము దండహస్తుని బురి జేరండు సీతాపతీ.

శా. లేముల్బొందినవేళ రోగములు జాలిం బెట్టుచో
ఘోరసం,గ్రామంబౌతఱి సర్పవృశ్చిక మహో
గ్రవ్యాఘ్రభల్లూకము, ల్సామీప్యం బగునప్పు

డొంటిని బిశాచవ్రాతముల్గన్న నీనామోచ్చా
రణగాదె మానవులకెన్నఁ దిక్కు సీతాపతీ. 36

మ. ఒకమాఱెంచుకసేపు నీవిమల నామోచ్చారణా
సక్తుఁడై, నకలంకాత్ముల ఘోరదుష్కృత సమూ
హంబెల్ల వేగంబికా, పికలై పోవుఁ దొలంగు
దుర్దశతతుల్ పీడల్దరింజేరవా, సకలైశ్వర్యములం
జెలంగుదురు భాస్వత్కీర్తి సీతాపతీ. 37

మ. నెన రావంతయులేనివాఁడవుగదా నీవాజగన్మాత
సీతనుదప్పించక యగ్నిదూఱుమన డెందంబొ
ప్పియున్నట్టి నీకునసున్నబల్కుడగండ్లపాల్పఱచుట
ల్గొప్పానె నిన్నవ్వజేసిన మేలేమిఁక నేటికిం దె
లియవచ్చెన్గట్టు సీతాపతీ. 38

మ. శ్రితకల్పద్రుమ నీదుచర్యలు మహాచిత్రంబు
లాభారతీ, పతికైనన్ ఫణిరాజుకైనను నుతిం
పన్శక్యమా దీక్ష, జేసితివొ వేఁడినశత్రుమిత్రుల
నకన్ జేపట్టి రక్షింప; మా, కతఁడేసాక్షి విభీష
ణుండదె నిజంబైతోఁచె సీతాపతీ. 39

మ. శరణన్న న్గరుణింతు నన్నపలుకు ల్సత్యంబులం
చెంచి నీ, మఱుగున్జేరితిఁ గల్లలయ్యె నిపుడా
మాటల్నిజంబైన బల్కుఱునే వేఁడిన నూఱకుండు
దువు యేలాసేయఁగాలేని పెద్దతెకంపుంబను
లిట్లుపూనవలె భక్తత్రాణ సీతాపతీ. 40

శా. జాలింబొంది యొకప్పుడైన మదినెంచ న్లేదు నిన్నూరకే, హాళిం బిల్వనిపేరఁటంబరిగి చట్టై గాసిచేనున్న ప్రోయాలిం బ్రోచితి వెంత వేఁడినను మొత్తాలించవేమిట్లు న, న్నీలాగుఁ విడనాడిన న్గలదె మేలేమైన సీతాపతీ. 41

మ. తనకైశ్వర్యముగల్గువేళ హితుల న్దారిద్ర్యుల న్బంధుల, న్గని కారుణ్యముతోడఁ బ్రోచుచును లోకఖ్యాతిఁజెన్నొంది స, జ్జనుఁడై చాలఁగ ధర్మకీర్తులెలమి న్సాంపాద్యము ల్సేయనే, ర్చునరుం డేఘనుఁడుర్వినీకృపకుఁ బాత్రుండౌను సీతాపతీ.

మ. కపటస్నేహముచేసి నమ్మికలు వక్కాణించి కార్యార్థులై, యుపలాలింపుచుఁ గార్యమైనతటి మేలూహింపకేకిన్కచే, నపుడే లేనినెపంబులెంతు రెడసేయఁ బూనిదుర్మార్గులా, చపలస్వాంతుల నమ్మికొల్చినను మోసంబౌను సీతాపతీ.

శా. నీకళ్యాణగుణస్తవంబుమదిలో నిక్కంబుగావించుచు, శ్లోకు ల్పంకజబాంధవాత్మజభటస్తోమంబుచే బాధపా, ల్గాకం గాంచనగర్భముఖ్యసురవర్గంబందగాలేని నీ, లోకంబందు సుఖించియుందురనుపల్కు ల్విఁటి సీతాపతీ. 41

మ. పరమేష్ఠిప్రముఖామరు ల్మనములో భావింపఁగా

లేనినీ, వరయ న్మానవరూపుదాల్చుతతి భృత్యా
మాత్యసన్నిత్రవై, ఖరులన్జేరి నిరంతరంబు గడు
వేడ్కంగొల్చుచున్నట్టివా, నరులేనోములునోఁచి
నారో తొలిజన్మంబందు సీతాపతీ. 45

మ. వ్రతముల్దానజపాగ్నిహోత్రములు దేవబ్రాహ్మ
ణారాధన, ల్గ్రతువుల్మంత్రరహస్యముల్సకలస
త్కర్మంబులు స్నీవ నే, నితరంబేమియెఱుంగ వే
ఱొకటి ని స్నీరీతిగానమ్మితిన్, శ్రితకల్పద్రుమ
యెట్లుబ్రోచెదవో నీచిత్తంబు సీతాపతీ. 46

శా. చెంతంజేరినఁ గూర్మిలేక యిటు గాసింబెట్టుట
ల్సాడ సా, మంతంబేమనవచ్చు నిన్నిఁక మహా
త్మా లోఁకువో వారిపై, బంతంబేమిటికయ్య!
'పిచ్చుకపయిన్ బ్రహ్మాస్త్ర' మన్నట్లు నా, వంత
ల్దీర్చు మొఱాలకించుమిఁక దేవా! వేగ సీతాపతీ.

శా. నిచ్చల్బాయకగొల్చి యూరకయపోనిచ్చెన్ను నే
తోఁచెనా?, గచ్చుల్మానుము నిన్ను నేవదల లో
కఖ్యాతిగాఁజూటి ని, న్రచ్చన్బెట్టకమాన నమ్ము
ము యథార్థంబింతయు న్నేర్పుచే, నిచ్చేదారిఁక
లేదు వేఁడిన ఫలం బేమయ్య సీతాపతీ. 48

శా. కాసీజాలని మానవాధములపైఁ గబ్బంబులం
జెప్పినన్, గాసింబొందుట మాత్రమేకలుగు నా

కామ్యార్థము న్దోచదా, కాసంతైనను సత్కవీం
ద్రులకు భక్తత్రాణ నిన్గొల్చి నీ, దాసుల్గాకయ
భోగమోక్షములు సాధ్యంబౌనె సీతాపతీ.

మ. అరయ స్వర్గనుఁ డొక్కవేళను మహాహంకారుఁ
డై యూరకే, పరుషోక్తుల్మది నొవ్వబల్కెనని సం
భాషింతురా వానితో, ధరపై సజ్జను లెందునైన
ను యథార్థంబెట్లనం గుక్కకా, ల్గలవంగ్రమ్మఱ
దానికాల్గలవ యోగ్యంబౌనె సీతాపతీ. 50

మ. ఉపవాసంబులు తీర్థయాత్రలును మంత్రోపాస
నల్ ఘోరమౌ, తపముల్సేయఁగ నేల గాసిబడి
మర్త్యశ్రేణు లుర్విన్ వృథా, చపలత్వంబులు
మాని నిచ్చలమనీషన్నిన్ను సేవించిమో, క్షపదం
బందఁగరాదె సూక్ష్మమున భక్తత్రాణ సీతాపతీ.

మ. ఇనవంశోత్తమ విన్నపంబొకటి నీ వీరీతి నామీఁ
దికి, న్కనుమున్నాడినయట్టినీప్రతిన మానంబూ
నినావేమొ వల్దనువా రెవ్వారునిన్ను సంద్రమొ
డికంబై మేర తాఁదప్పివచ్చిన వారింపఁగ నేరికిం
దరము నీచిత్తంబు సీతాపతీ. 52

మ. ఇదిపుణ్యం బిదిపాపమంచు మది నూహింపంగనీ
దెవ్వారిం, గదియ న్ద్వేష మొనర్పఁ జేఁబడుపను
ల్గానీదు మర్త్యాళి కా,పదకున్మూలము ఛీ దరిద్ర

ము భరింపంజాలఁ గేల్మోడ్పుఁ జే, సెద నాచెం
తకుఁ జేరకుండనిపుడే శిక్షించు సీతాపతీ. 53

మ. అరవిందాప్తకులంబు పావనముసేయం బక్తికం
ఠాదిము, త్కరదైత్యాళినిసంహరింప నిజదాస
శ్రేణులన్ ధాత్రిపైఁ,గరుణందీక్షయొనర్చిప్రోవ
గను సంకల్పించి కౌసల్యక, బ్బురమొప్పన్ గొ
మరుండవైతివి జగంబుల్మెచ్చ సీతాపతీ. 54

మ. ధరపైనల్వురకొక్కవేళ విధి వ్రాఁతంజేసి ప్రా
ప్తించినన్, సిరిదాసంతతభాగ్యశాలిగతి రంజిల్లం
గనెట్లబ్బు బం,గరుత్రోకార్చిన పల్లురాతికిని జో
క్కంబైన వజ్రంపు సొం,పరయన్ గల్గునె యించు
కంతయిన తథ్యంబెన్న సీతాపతీ. 55

శా. అత్యుగ్రోగ్రతపోబలంబునను దైత్యశ్రేణులెం
చన్ సహా, స్రాక్షాదిక్రతుభుక్సమూహామతి దై
న్యస్వాంతులైమ్రొక్కినన్, రక్షింపంగననేకరూ
పములఁ జిత్రంబొప్పఁగాఁదాల్చి యా, రక్షోవీ
రుల సంహరించితివి శౌర్యస్ఫూర్తి సీతాపతీ.

మ. రవివంశంబునఁబుట్టి శంకరుధనుర్భంగంబుగావిం
చి దా, నవసంహారముఁజేసి నిర్జరుల నానందం
బునందేల్చిభూ, రివిభూతింజెలువొంది భక్తులను
ధాత్రింబ్రోచు శ్రీరామమూ, ర్తివి నేనెంతటి
వాఁడ నీమహిమ వర్ణింపంగ సీతాపతీ. 57

మ. బహుజన్మంబులనుండిచేసిన మహాపాపంబుల
న్మాపఁగా, గ్రహదోషంబులడంప దుస్సహ దరి
ద్రవ్యాధులన్ ద్రుంపఁగా, నిహసౌఖ్యంబులొ
సంగిభక్తులమనంబింపొందఁజేయన్ రఘూ,ద్వహా!
నీనామజపంబెచాలు నిముషార్ధంబైన సీతాపతీ.

శా. ధీరుండై భవబంధముల్దునిమి ధాత్రింబూజ్యుఁ
డై సంతత, శ్రీరంజిల్లుచు నీయనుగ్రహమున
జ్జైనొంది యాపిమ్మట, జ్జేరున్ మోక్షపదంబు శా
శ్వతముగాసిద్ధంబు వైవస్వత, ద్వారంబెన్నఁడుఁ
దేరిజూడఁడు భవద్భక్తుండు సీతాపతీ. 59

మ. ధరనావంటి మహాపరాధుఁడిఁక మర్త్యశ్రేణిలో
లేడు ని,ర్జరులెన్నంగనునీకుమించనిఁక నార్తత్రా
ణదీక్షాధురం, ధరులైనన్ మఱిలేరు సత్యమిఁక
నీదాసుండనై "యన్యథా, శరణం నాస్తి" య
టన్న న్యాయమున నిచ్చగ్లొల్తు సీతాపతీ. 60

శా. ఆర్తత్రాణకళాప్రవీణుఁడవు నీ వంచున్ మదిం
దోఁచె నా, ధూర్తత్వంబు సహింపనెవ్వరు సమ
ర్థుల్గారు నీకన్న నేఁ, "గర్తవ్యంమహదాశ్రమం"
బనెడు వాక్యంబెంచినిన్ గొల్చెద, న్మార్తాండాన్వ
యవార్ధిశీతకర నన్మన్నించు సీతాపతీ. 61

శా. వింటిన్నీ సరివేల్పులేడని జగద్విఖ్యాతిగానన్ను
నీ,బంటున్ గాఁ గృపఁజూడుమంటి నొరులం బ్రా

ర్థించ లేనంటినా, కంటెగా లేరుదురాత్ములంటి నిజ
భక్తత్రాణ నీదీక్షను, మ్మంటిం కేమనివిన్నవింతు
సెలవీయంగా రాదె సీతాపతీ. 62

మ. మురువౌపచ్చలతాళికీల్కడియము ల్మోత్తంపు
జౌకట్లు నుం, గరము ల్పావిలి రావిరేకయును
వేడ్కందాల్చి కౌసల్యముం, దర బల్కుద్దులుగు
ల్కుపల్కులును జోద్యంబొప్పఁగా నాఁడు నీ,
చిరుప్రాయం బొకనాఁడుచూపు మది రంజిల్లంగ
సీతాపతీ. 63

శా. చుంచల్లాడఁగ రావిరేక గదలం జోద్యంబుఁ
గా గల్లుగ, ల్లంచుం గజ్జెలు పాదపద్మములమో
యన్మోగ్రిల నన్నెత్తుకొ, మ్మంచుం జిందులుద్రొక్కు
చుంజనని కాహ్లాదంబు గావించునా, చంచద్బా
ల మనోహరాకృతిని నిచ్చల్గొల్తు సీతాపతీ. 64

మ. నిడుపౌచేతులు ముద్దునెమ్మొగము వన్నెల్గుల్కు
నెమ్మేనుసొం, పడరుంగొప్పకనుంగవ న్వాడఁదటొ
మ్మందంబు వీక్షించి మున్, జడదారు ల్మది మో
హామందిరఁట యాసాక్తైన నీరూపమె, న్నఁడు
నాకన్నులనిండఁజూచి మదినానందింతు సీతాపతీ.

మ. తొలినిన్వేఁడినవారలా నిరపరాధు ల్నేనుగా
నైతినా,యలనీవంచనగంటిదూఱఁబని లేదాగాని
తపస్స్వప్నలుం, గొలవారెవ్వరు తేరు నేనొకఁ

డనే గాంబోలు నీకంతగా, బలుపై యుండిన
మానెనేమయిన మాబాగింక సీతాపతీ. 66

మ. అలదుంగెంజిగిలాగుపైన నడిక ట్టందంబుగాగ
ట్టియు, న్వెలుగోలం గయిబూనిబత్తళికరీవిందా
ల్చి తమ్ముండు నీ, వలనాఁ డాముని జన్నముం గ
డపి యాహ్లాదంబుతో నేగు నీ,చెలువం బెట్టిదో
చూపునామనసు రంజిల్లంగ సీతాపతీ. 67

మ. మొదలంటం దెగ మొత్తెదం గొలల గుంపుల్
లేములంబట్టి పైఁ, జదియంగొట్టెద నల్కదీఱ జ
మునిం జక్కాడెదం గొల్లపె, ట్టెద వేల్పుల్ దొ
రసంపద ల్నలువ నోడింతు న్నిజంబంచునె, మ్మది
లో నెంచెద నీయనుగ్రహము సంపాదించినీ...

మ. జరుగంజొచ్చె దినంబులయ్యయొ వృథాసంసా
రమోహంబు ని,న్మఱువం జేయును మోసపుచ్చు
ట నిజం బౌనెప్పుడో పాముతో, సరసంబయ్యె
ను దీనినే స్తమిఁక నేచందంబునం బాయునా, తర
మా తప్పుకొనంగ నీకరుణచేతంగాక సీతాపతీ.

మ. కదలన్నీయవు మోహపాశములు నీ కళ్యాణ
నామంబుపైఁ, గుదురై నిల్వదు మానసంబడఁగ
దీతుదుర్బాధ సంపద్భ్రమ, ల్వదలంజాలవు వీని
తోఁ బెనఁగఁజాలక వింతసంసారపుం, గుదె నా
కుత్తుక కేలకట్టితివి నాకుందోడు సీతాపతీ. 70

మ. అలుకా పిల్వఁగఁ బల్కవేమిది పరాకైయుం
టివా లేక బీ, దలమాట ల్చెవినాటవా నెనరులే
దా కాక కార్పణ్యమా, బలువా ప్రోచుట కెవ్వ
రున్ మనవి దెల్పంజాలరా తీఱదా, తెలియం
జెప్పు బిఱాన నెందుకీఁక సందేహంబు సీతాపతీ.

మ. ధరణీపుత్రి నిజాంకపీఠమున నుద్యద్భక్తి వాతా
త్మజుం, డరయ న్రోలను బార్శ్వభాగముల నా
హ్లాదంబున నోస్సోదరు, ల్సొరది న్నల్గడలందునంద
మెసఁగ న్సుగ్రీవన క్తంచరే, శ్వరతారాసుత
ఋక్షనాయకులు గొల్వన్ రత్నపీఠంబునన్,
గరమొప్ప న్జెలువొందు నిన్నుఁగన నెన్నుండబ్బు
సీతాపతీ. 72

మ. కలకాలంబును జీతబత్తెములకై కాంక్షింపకేఁ
గొల్వ నీ, పలుకే బంగరుగాఁగఁ జేసితివి యేపా
టింక చాలెప్పుడో, నిలువంబెట్టక ప్రోతువా
యికను కానీ యెట్లుతప్పించుకోఁ, గలవో
చూచెద బంటుపంతమిది భక్తత్రాణ సీతాపతీ.

శా. సామంతుండవె శాంతమూర్తివెకృపాస్వాంతుం
డవే ధాతవే, సామాన్యుండవుగావు నాదు
దురదృష్టం బెట్టిదో నీకహో!, నామీఁదంగృప
బుట్ట నీదు నినుఁ బోనాడంగరా దింక సు,త్రా
మస్తుత్యపదారవిందయుగ భక్తత్రాణ సీతాపతీ.

శా. చేపట్టందగు నమ్మినందుకిఁక నీ చిత్తంబు పోరా
డఁగా, నోపన్ మ్రొక్కితి వేఁడుకొంటి గుఱిగా
నుంటిం దుదిందూఱితిన్, నాపై నిప్పటికైన నేనె
నరు గానన్ రాదు నీకింతగాఁ, గోపంబుండిన
నిల్వఁజాలుదురె భక్తుల్లోకిల సీతాపతీ. 75

శా. ఎన్నాళ్లయ్యెను గొల్వఁబట్టి యొకనాఁ డేమంచి
మాటైన న,న్నన్నావో మొగమైనఁ జూపితి
వో డాయన్ వచ్చితో లేక సం, పన్నుంజేసితో
తెల్పు వేమనుట కోపంబైన నన్నింతక, న్ననీ
వేమిఁకఁ జేతువైన సరె దీనత్రాణ సీతాపతీ.76

శా. నామీఁదన్ గృపలేదు నీకు నెనరున్నం బ్రో
వవా కారణం, బేమోకాని వృథాపరాధినగున
న్నీదుర్దశాంభోధి వీ, చీమధ్యంబున ముంచి
యుంచితివి నాచే నేమగు న్నీతలం, బేమో
తోఁచదు నమ్మియుండినఫలం బింతయ్యె సీతాపతీ.

శా. కాయల్గాసెను మ్రొక్కుచేతు లెపుడుం గైవార
ము ల్సేయఁగా, నాయెన్ జాలదినంబు లిప్పటికి
నెయ్యంబేమియుం లేకయే, పోయెన్ జిత్తము
వచ్చు టెన్నటికిఁక న్బొచ్చెంబునామీఁదనా, న్యా
యంబయ్యెనె నమ్మియున్న ననుఁ బోనాడంగ
సీతాపతీ. 78

మ. మునునీడెందము వెన్నవంటి దిపుడేమోకాని

నేనెంతవాఁడ, నీవు గాసంతయు నేటికిం గరఁగకుం
డెదె సత్కృపాంభోధి వీ, వనుచుం గొల్చితి
నింతనిర్దయను బాయం దోఁచుచుండం బెఱుం,
గను నీవక్కఱసేయకున్న నెవరింకం బ్రావు
సీతాపతీ. 79

మ. నినునేనమ్మికఁ గొల్వనో తలఁపనో నీమాటలే
మైన నే, విననో లాఁతులఁగొల్వఁబోయితినో నీ
వేదిక్కుఁగాఁ జూడనో, ల్లనో నీయాజ్ఞకుమీఱతి
యుండితినో జాలంబేమి నానేర మే, మనుచుం
బ్రోవవా తెల్పునీకిదియసాధ్యంబైన సీతాపతీ.

మ. నిను సేవింపుచునుండఁగా సిరులురానీ లేములే
వచ్చి పై, కొననీ మేలొనఁగూడనీ గ్రహాగతు
లుండింపనీ రోగవే, దనలే జాలియొనర్పనీ విను
మహాత్మా నీప్రసాదంబిదే, యనుచుం భావనఁ
జేసి డెందమున నాహ్లాదింతు సీతాపతీ. 81

శా. కాయంబెన్నఁగ నీటిబుగ్గ యిది నిక్కం బెన్నఁ
గా చంచల, ప్రాయంబుల్సిరులెంచిచూడఁగయ
థార్థంబింక సంసారమా, మాయానాటకమేది
నిల్కడవృథా మర్త్యాళికెందుఁ సుఖో, పాయం
బేమియుఁ గానరాదదియె మాబాగన్న సీతాపతీ.

మ. సిరులీజాలుదురో మనోరథముల న్సాధింపఁగాఁ
జేతురో, గుఱిగావ్రమ్మ నితం డటంచు మదిలో

గోరంత చింతింతురో, కరుణం బాముల కడ్డమయ్యె
దరో మోక్షంబిత్తురో తోఁచదీ, నరుల న్వేఁడెద
రేల సత్కవులు దీనత్రాణ సీతాపతీ. 83

శా. అన్నా విన్నపమైన గైకొనవు డాయఁగ రావు
నీమూర్తి నా, కన్నుల్చల్లఁగఁజూప వెన్నిదినము
లైవారము ల్చేసినఁ, నిన్నేలాగున నమ్మవచ్చు
నకటా! నిష్కారణం బూరకే, నన్నీలాగునఁ
బాముల న్బరచుటే నాయంబు సీతాపతీ. 84

శా. ఓదీనావన! యోపురాణపురుషా! యోచింతి
తార్థప్రదా, యోదైత్యాంతక! యోదయాజల
నిధీ! యోసూర్యవంశాగ్రణీ!, యోదుర్దోషవి
దూర! యోరఘుపతీ! యోలోకసంరక్షకా!,
నాదీనోక్తులఁజిత్తగింపు మిపుడైనంగానిసీతాపతీ.

మ. ఘనులాతొల్లిఁటిసత్కవీంద్రులవలె న్గబ్బంబులం
జెప్పి నే, నినుమెప్పింపఁగ లేనిమాట నిజమే
నెయ్యంపులేబ్రాయపుం, దనయుండాడినమాట
ల న్నెనరురాదాతండ్రికెంతైన న, ట్లనుకంపామతి
నాకవిత్వమున కాహ్లాదించు సీతాపతీ. 86

మ. తడవాయెఁ నినుఁగొల్వఁబట్టి దయలేదా పిల్చి
తేపల్కవెన్నఁడు నాముచ్చటదీఱఁగా నెదుటఁగా
నఁగ రావు నన్నింతక, న్నడసేయఁగ వలదిప్పుడేదె

లుఁపుమీ నానేర మేమున్నదో, తడయక రాదడి
యాసలేటికిఁక భక్తత్రాణ సీతాపతీ. 87

మ. సకలస్థావరజంగమంబులను సూక్ష్మస్థూలరూపం
బులై, ప్రకటంబొప్పఁ జరించు కేవలపరబ్రహ్మం
బవైనట్టిసేవకకల్పద్రుమ! నాతరంబగునె నిన్
వర్ణింపఁగాఁ జందమామకు నూల్పోగనురీతి
గాక పరికింప న్భక్తి సీతాపతీ. 88

మ. తనువు ల్సంపద లెల్లకాలమును నిత్యంబంచు
మోహాంధులై, జనులేవేళను నిన్నెఱుంగకయ
సంసారాంధకూపంబున, న్మునుఁగంజొచ్చెదరింతె
నిన్నెఱుఁగరేమోకాని నీమాయయో, మనుజ
శ్రేణులకర్మమో తెలియదా మర్మంబు సీతాపతీ.

మ. దయనీకెన్నఁడు వచ్చునోయని మహాత్మా చాలఁ
గన్పెట్టియుంటి యథార్థంబిఁకనైననుం గరఁగదా
డెందంబు నీమాటకే, మయినందూఱితినా యనా
దరణసేయం గారణంబేమి నా, పయినీకేమిటికింత
చెట్టిదఁపుగార్పణ్యంబు సీతాపతీ. 90

శా. క్రూరస్వాంతు లసత్యవాదులు కృతఘ్నుల్నీచ
సేవారతు, ల్దారాపుత్రవిహీను లంధులు పరద్ర
వ్యాపహారుల్దురా, చారుల్నిర్ధనులై జనింతురు
ధరన్ జన్మాంతరంబందు ని,న్నారాధించనిదుష్కృ
తంబునను మర్త్యశ్రేణి సీతాపతీ. 91

శా. ధీరస్వాంతులు సూనృతవ్రతులు వర్థిష్ణుల్లసత్కీ
ర్తివి,స్తారు ల్సాధుజనావను ల్సకలవిద్యాపూర్ణు
లై సంతత,శ్రీరంజిల్లుచునుందు రెప్డుడు ధరిత్రి
న్నొల్లిసద్భక్తి ని, న్నారాధించిన యట్టిపుణ్యాముని
మర్త్యశ్రేణి సీతాపతీ. 92

మ. తలిదండ్రుల్నైనరైన చుట్టములు దాతల్మిత్రవ
ర్గంబువే, ల్పులు నీకన్నను వేఱలేరనుచు నాలో
నెంచి నీబంటనై, కొలువఁగ వంచనసేయఁజొచ్చి
తివి లోకుల్మెత్తురా మ్రొక్కఁజే, తులుగోయఁగ
వలదైనఁ గీర్తి యపకీర్తుల్నీవె సీతాపతీ. 93

మ. అనయంబు న్భవదీయపాదకమలధ్యానామృతం
బానుచుం,దనివింజెందనిడెందమున్గలిగిసమ్యగ్భక్తి
సేవించుభ, క్తనికాయంబులరీతినిన్గనుటకాత్మజ్ఞాన
సన్మార్గసా,ధనమెట్లబ్బు భవత్కృపామహిమచే
తంగాక సీతాపతీ. 94

శా. దేవా ! లోకశరణ్యమూర్తి! వెస నాదీనత్వము
న్బాపఁగా,లేవా వంచనచేసి నన్నిటుల జాలింబె
ట్టుటేకాని ని, న్నేవేళ న్మదినమ్మియుండిన ఫలం
బింతయ్యెకానిమ్ము రా, జీవాప్తాన్వయవార్ధిశీతక
ర నీచిత్తంబు సీతాపతీ. 95

మ. కరిరాజామకరేంద్రుచేతఁబడి దుఃఖస్వాంతుఁడై
పల్కరు, న్మొఱవెట్ట న్వానివచ్చి బ్రోచుట నిజంబో

కల్లతూ శాస్త్రముల్, ధరపైఁబల్కుటఁజేసి నమ్మి
తి యథార్థంబై నరకించు దబ్బరయైన న్వాదనా
డు మేమి కలయింపంబోకు సీతాపతీ. 96

మ. తొలిపల్కుల్గొనిపోయి సోమకుఁడు సంతోషం
బునన్ వార్ధిలో, పలదూరంగని వానిపెంపడఁ
చి యాప్రాబల్యుల వ్వేళన, ర్మిలిచే నల్వకొసంగి
లోకములు కీర్తింపంగఁజెన్నొందునీ, చెలువంబై
తగుమత్స్యరూపమునన్ జేమోద్ధు సీతాపతి.

శా. దట్టంబౌతమిపాలవెల్లిఁ దరువన్ దైత్యుల్ సుర
ల్ కవ్వఁపున్, గట్టున్ గ్రుంగ నెలుంగు లెత్తి
వరదా! కాపాడుమంచున్ మొఱల్, వెట్టన్
గట్టుబిరాననెత్తితివి తాఁబేల్వేసమున్బూనినీ, మె
ట్టుందమ్ములఁ గొల్చువారికరుదే మేలాట సీతా
పతీ. 98

మ. కలనన్ దన్నెదిరించ లేరనుచుఁ దాగర్వించి ము
ల్లోకముల్, గలయం ద్రిమ్మరుచుండి నేల యవలీ
లంజుట్టి గొంపోవ బి, ట్టలుకన్ బట్టి హిరణ్య
నేత్రుని వరాహాకారమైత్రుంచి భూ, వలయం బె
ప్పటియట్లనుంచితివి భాస్వత్కీర్తి సీతాపతీ. 99

మ. హరినీ స్తంభములోనఁ జూపుమని ప్రహ్లాదుం గ
రంబొపదన్, బరపన్ ఘోరనృసింహమూర్తివ
యి స్తంభంబందుజన్మించి నిర్జరులగ్గింపఁగనాహి

రణ్యాకశిపుఁ సంహారముఁ జేయవే?, ధరనీభక్తు
లసాధ్యు లేరికయినన్ దండింప సీతాపతీ. 100

మ. తలపోయన్ జగదేకదాతవు మహాత్మా! మబ్బు
వార్వింపురా, కలుముల్ గెంటకయుండఁ జేయు
టకు లోకఖ్యాతియేనట్లుగా, బలిచేదానము
నేలమూడడుగులుఁ బ్రార్థించిగైకొన్ననీ, చెలు
వంబై తగు వామనాకృతికి నే జేమోడ్తు సీతా.

మ. అవనీనాథులఁ బల్మరు న్వొదకి రోషాయత్తవి
స్ఫూర్తినా,హవలీలం దెగఁగూల్చవే నిజకుఠారా
మోఘధారాహతిన్, భవదీయాద్భుతకీర్తిచంద్రి
కలు దిగ్భాగంబులం బర్వభా, ర్గవరామాకృతిఁ
దాల్చి మోదమునభక్తత్రాణ సీతాపతీ. 102

మ. జలజాతాప్తకులంబునందుదయమై సత్యస్వరూ
పంబుచె,న్నలరన్ లోకములెల్లఁ బ్రోచుచు నిశా
తామోఘకాండంబులన్, గలనన్ రావణకుంభ
కర్ణులను లోకఖ్యాతిగాఁ ద్రుంచిని, ర్మలసత్కీర్తిఁ
బ్రసిద్ధికెక్కితివి శ్రీరామాఖ్య సీతాపతీ. 103

మ. యదువంశంబునఁ గోర్కిదీర సుదయంబై రా
మకృష్ణాఖ్యులన్, ముదమొప్పన్ శిశుపాలకంస
మురచాణూరాదివిద్వేషులన్, గదనక్షోణిని
ద్రుంచి లోకములకున్ గౌతూహలంబిచ్చి న్నెమ్మ
దిఁ జెన్నొందవె భూరికల్మషవిరామా! రామ! సీ...

మ. అతిచోద్యంబుగ నప్పురాసురులభార్యల్ వేడ్కఁ
గావించుస, ద్వ్రితముల్ మోసముగాఁగఁజేసి
యు సముద్యత్కీర్తిచే నిర్జర, ప్రతతు ల్సన్నుతి
సేయఁగానెగడునీబౌద్ధావతారంబుసం, తతముల్
బ్రోచునుగాక నాదురితచింతల్బాపి సీతాపతీ.

మ. దురితస్వాంతు లసత్యవాదులగుమర్త్యుల్ ధా
త్రి జన్మించి సం, కరవర్గంబయిపోవ నాఖలుల గి
న్కర్ద్రుంచి ధర్మంబు సు, స్థిరతన్ నిల్పవె కల్కి
మూర్తివయి రాజీవాసనస్తుత్య భాస్కరవంశాం
బుధిపూర్ణశీతకర భక్తత్రాణ సీతాపతీ. 106

శా. స్వర్ణస్థాధరధీర నీగుణకథాజాలంబు సద్భక్తిచే
వర్ణింపన్ మదిగోర యీశతకమే వాక్రుచ్చితిన్
దీనిసం, పూర్ణానుగ్రహదృష్టిఁ గైకొని ధరన్
బోషించి సాయుజ్యసౌ, ఖ్యార్ణోరాశినిదేల్చు
మీఁద రఘువర్యారామ సీతాపతీ. 107

మ. పుడమిన్ సాహెబు రాణవంశకలశాంభోరాశి
సంపూర్ణచం, ద్రుఁడు వీరన్నకు రాజమాంబకు
సుపుత్రుండైనరామన్న సొం, పడరంగా శతకం
బొనర్చియు సముద్యద్భక్తి సర్పించెఁ బ్రే, ముడి
చేఁ గైకొని ప్రోవు డెప్పుడును లేముల్బాపి
సీతాపతీ. 108

సీతాపతిశతకము సంపూర్ణము.

# పీఠిక.

ఈశతకమురచించినకవి శేమెల రామదాసుఁడు. ఇతఁడార్వేలనియోగిబ్రాహ్మణుఁడు. అప్పయసూరి వేంకమాంబలకుమారుఁడు. ప్రతివాదిభయంకరము సింగరాచార్యులవారి శిష్యుఁడు. రావుగంగాధరరామారావుగారి పరిపాలనమునందున్న దుగ్గుదుర్తి గ్రామనివాసి. ఈయంశములు శతకాదియందలి పద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. గంగాధరరామారాయప్రభువర్యులు క్రీ. శ 1870 ప్రాంతములందుండియుంటచే నీకవియు నప్పటివాఁడనియుఁ బిఠాపురసమీపనివాసియనియుశతకకవులచరిత్రకారులు వ్రాసియున్నారు. పీఠికాపురసంస్థానప్రభువులగు నే గంగాధరరామారావుగారికాలమున నీకవి యుండెనో శతకమున విస్పష్టముగఁ దెలుపఁబడక పోవుటచేఁ గవిజీవితకాల మెంతవఱకు నిశ్చితమొ నిర్ధారణముచేయ నయితికాదు.

ఈశతకమునందు భక్తమందారమనఁదగు శ్రీరామమూర్తి యభివర్ణితుఁడయ్యెను. ఇందలిపద్యములు ధారాళశైలితో సులభగ్రాహ్యములై పఠనీయములై యున్నవి. స్వతంత్రభావములు మనోహరముగా నుంటచే నీశతకమును భక్తిరసశతకసంపుటమునందుఁ జేర్పఁబూనితిమి.

ఇందలినీతిపద్యములందుఁ గృతివిక్రయము,కన్యావిక్రయము, అన్యాయవర్తనము, ఈషణత్రయము, యాచ్ఞాదైన్యము,దరిద్రావస్థలోనగునంశములను గూర్చినపద్యములవలన గ్రంథకర్తసంసారకష్టములకు లోనై నానావస్థలకుఁ బాలై భవతారకుఁడగు శ్రీరాముని తారకనామస్మరణమున నీశతకము రచించెనని తోఁచును. భక్తిరసపద్యములలో శ్రీరామునిదయాశాలిత్వము దివ్యమంగళసుస్వరూపము భక్తత్రాణపరాయణత్వము కొనియాడఁబడెను. దశావతారవర్ణనమునుగూర్చియుఁ గొన్నిపద్యములు రచింపఁబడెను.

దాశరథిశతకమునందును రామతారకశతకమునందు శ్రీరామకర్ణామృతమునందువలె నీశతకమునందును శ్రీరామలీలలు మనోహరముగ వర్ణితములైయుంటచే నీశతకము రామభక్తుల కవశ్యపఠనీయము.

ఇట్లు భాషాసేవకులు
శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

నందిగామ.
20-10-25.

శ్రీ ర స్తు.

రేమెల రామదాసకవికృత

# మహిజామనోహర శతకము.



ఉ. శ్రీరమణీమనోహర యశేషఋషీశ్వర దేవతా
శ్రితా, పూరిత పాదపద్మములకు న్బ్రణమిల్లి
రచింతు నేఁడు సం, సారగభీరఘోరతరసాగర
మేను తరించఁగోరి నీ, తారకనామ కావ్యము
యథావిధిగా మహిజామనోహరా. 1

ఉ. రేమెలవంశసంభవుఁడ రేణిగ నార్వెలగోత్ర
జుండ నో, రామ సురారిభంజన సురార్చితవిగ్ర
హా రామదాసుఁడన్, కామ మెలర్ప నొక్క
శతకంబును గానుకగా నొనర్చి మీ, వామప
దాబ్జముల్ గొలుతు వ్యాసనుతా మహిజామనో
హరా... 2

ఉ. అప్పయసూరి సౌమ్యగుణి నంచితశీలిని వెంక
మాంబనున్, ఒప్పుగఁ బెండ్లియాడి ధర నుత్తమ
చర్యలఁగీర్తిఁ బొందె యా, కప్పురగంధికిన్ చతు
రగర్భజ రామయనామధేయుఁడన్, దప్పకఁ
జేతు మీభజన దాసుఁడనై మహిజామనో...

ఉ. ధైర్యము నున్నమహత్త్వమును ధార్మికమున్నన ధాన్య
సంపదా, దార్యమహాతపస్విభయదాకృతి పండిత
కోటికి నృదా, వార్యము సూరినట్టిప్రతివాది భ
యంకరయార్యసింగరా, చార్యులశిష్యుఁడ న్విమ
మలచక్రధరా మ... 4

ఉ. బాధలుమాన్ప ధీరప్రతిపత్తిభయంకరులైన రావు
గం, గాధరరామరావు కరుణారసభావముఁబూ
ని బ్రోవఁగా, మాధవ దుర్గుడు త్రిపురమందు
నివాసముఁజేయుచుండు మో, రాధమనోహ
రా కలుషరాగహరా మ... 5

ఉ. శ్రీరమణీయ మీచరణసేవయు మా కనయం
బొసంగుమీ, తారకనామమంత్రమును దాండ
వమాడఁగ నాదుజిహ్వపై, ధారణఁజేసి నాయ
ఘము తర్లఁగఁజేయుము శేషశాయి మీ, బారి
కిఁ జేరినాఁడసుమి పాపహరా మ... 6

ఉ. పావనరామమంత్రమును పాటిగఁబొందుట యె
న్నఁడబ్బునో, భావమునందు మీచరణపద్మము
లెప్పుడు నిల్పుటెన్నఁడో, భూవర మీదయారస
సము పూర్ణముగా మరివచ్చుటెప్పుడో, పావ
నుఁజేయ శక్తుఁడవు పాపహరా మ. 7

చ. పదములునమ్మినాఁడ నతిపామరుఁడంచుఁదలంప

కయ్యామీా, సదమలపాదపద్మములు సారెకుఁ
గొల్చినవారిదోషముల్, పదపదమంచుఁ ద్రోతు
వట పాయక నామొఱయాలకించి నీ, వదనముఁ
జూపవేమిటికి వాలిహరా మ... 8

ఉ. రమ్మిఁక జాలమేల నను గాపులుఁబెట్టకు దాస
కామ ని, న్నమ్మితి రామ నీదుదయ నాపయి నిం
చుకరాదదేమి మీా, కమ్మితి దేహమింకనిజ మూ
రడిఁబెట్టకు సూరికామ ని, న్నమ్మికచేతఁ గొల్చె
దను నామదిలో మ... 9

ఉ. ఓరఘురామయంచు బలుకోరికఁ బిల్వఁగ నేల
రావు రా, నేరము చాలఁగల్గినను నీరజనాభ
సహింపఁగాఁదగుఁ, గూరిమిచేత నీవు నను
ఘోరభవాంబుధిలోన వేసటల్, దూరముఁజేసి
యేలుమిఁక దోషహరా మ... 10

ఉ. కాముకుఁడంచు నీవుననుఁ గాలభటాళికిఁ జేర్ప
కయ్య యో,తామరసాక్ష దీను నిటుఁ దాపము
నొందఁగనేఁచ నాయమా, కోమలదేహ నామ
నవిఁ గూరిమితో వినరాద నాపయిఁ, దామస
మేలనీకు నిటు దాసునిఁగా మ... 11

చ. ఘనుఁడవటంచు నమ్మితి నఘాళులఁదోలుము రా
మదాసుని, న్ఘనతగఁ బ్రోవరావ ననుఁగంజదళా

త్తు నిరాకరించుట, న్మనమున యెన్నఁ డెంచకు
రమాపతి యెట్లుఁదలంచినావొ యీ, తనువును
నమ్మలేదుర సదామదిలో మ... 12

ఉ. వాసిఁదొలంగి నీభటులు వ్యాధినిబొందినఁ గీర్తి
యేరిదో, రోసములేక దాసునెడ రూఢిగఁ బ్రో
చెడివాఁడ వంచు నే, దోసిలియొగ్గి సంస్తుతులు
దోషహరా నినుఁ జేయుచుందు నీ,దాసులలోన
నేనొకఁడ దాసుఁడనై మ... 13

చ. కరివరు నేలినావు మునుఁ గాంతుయొకింతయు లేక
కాళము, శరణని వేఁడఁగానె దయశాలివి
యై కరుణించినావు నా, మొరవిని కావవేమి
నిను మోదముతో స్తుతిసేయుచుందునో, తరణి
కులేశ యూథపము ధన్యతకై మ... 14

ఉ. చూడఁగ నీపదద్వయముసొంపు నుతింపఁగ నెం
తవాఁడనే, వీఁడను నీదుభక్తియును నేమమువా
టునునైన సామది, వేఁడెద రామరామయని వే
డుకతోడ భజింపుచుందు నీ,వాఁడను నన్నుఁ
బ్రోవు మిఁక వాలిహరా మ... 15

ఉ. వాదముజేసి దాసపరివారజనంబులలోన నుండె
ద, న్నాదనినీవు యేవిధము మాయలుజేసిన నీదు
భక్తిచే, నాదరిజేరకుండఁగను నారదనిదాసులు

మెచ్చ రో లెద, న్స్వాదమె మీకునాకు మరివా
లిహారా మ... 16

చ. మరణమునొందువేళ నినుమాటికి పన్నగశాయి
యంచునే, దిరముగఁబల్కఁజాల నను దీనదయా
పర యేమిజేతువో, యిరవుగనిప్పుడేవఁడిని యీ
శ్వరపూజిత నీదునామము, ల్తరచి తరింపఁగో
రెద సభామదిలో మ... 17

ఉ. జాలముసేయఁగాఁదగదు చాలురనాపయి పంత
మేలరా, జాలియొకప్పుడైన ననుఁ జాలఁగ నమ్మిన
వాఁడటంచు నా,పాలిటఁ బుట్టుచాయె భవబంధ
ము లేగతిఁ బాపువాఁడవో, దూలితబాధ బెట్ట
కిక దోషహారా మ... 18

ఉ. దాసులు వెంట వత్తురని దానవమారణ వైన
తేయునిన్, వాసిగఁజూచి నీవతని వాహనమౌ
టకుఁ గారణంబగున్, భాసురహ స్తిగుఱ్ఱములు
పల్లకియుండఁగ వైనతేయునిన్, వాసిగ నెక్కు
టేమిటికి వాలిహారా మ... 19

ఉ. నారదగానలోలతను నామొఱవీనుల నాటదా
యెనో, తారకరామనామములు దాసులుబాడు
చుచుట్టుకుండిరో,పారములేనిపాతకుని భారము
గావినియూరకుంటివో, నేరములేదు యుండినను
నేలగదే మ... 20

ఉ. విన్నప మాలకించు పరవీరభయంకర నీదునామ
ముల్, సన్నుతిఁజేయుదాసులకు సాదరమొంతు
మొసంగినావు నీ,కన్న మహాత్ముఁడుఁగాఁ గలఁడె
కానకపోయితి నిన్నినాళ్లు నా,కన్న దురాత్ముఁ
డుఁగా గలఁడె కంసహారా మ... 21

ఉ. చిత్తమునందు నీపయిని చింతరయొకప్పుడు మాన
లేదు నీ,చిత్తమునందు నన్మరచి చిక్కులు పెట్టఁ
గనేల రామ మీ,చిత్తము నింత బింకముగఁ
జేసితె దాసుఁడు యెట్లునోర్చు మీ,చిత్తము కొ
ట్లుదోఁచినదా చిక్కదురా మ... 22

ఉ. ఎంతని వేడుకొందు నిను యేమనిదూరుదు యేమి
జేతురా, పంతము కెంతవాఁడ బలుపంతము జేయ
కు మోర్వఁజాల నీ, వింత శిలాత్మకుండవనియెన్న
డెఱుంగక పోయినాను నే, నింతటిలోన తేలి
తని యెంచకుమీ మ... 23

చ. కరివరునిన్ విభీషణుని గాకమునున్ గుహు
నిన్ గుచేలునిన్, మరియును గుబ్జనున్ రవికు
మారుని నాదిగఁగాచినావు గా, నరమరలేక నీ
వునటు నన్నొకనిన్ దయఁజూడకుందువా, పరమ
మునీంద్ర యోగిజనపాపహరా మ... 24

ఉ. ఏమిరరామ నన్నిటుల నేచుట ధర్మముగాదు

యేలరా, పామరుగాచుటే బిరుదు పావనరామ
తలంచి చూచినన్, బామరుగానివాని భువిఁ బా
లనఁజేయుటగాదు కేశవా, నీమది నెంచిచూడు
మిఁక నిక్కమురా మ... 25

ఉ. ఒక్కొకవేళ నిన్మదిని నోరఘువీర దలంపకుండు
వేరొక్కొకవేళ మీసాగసురూపము జూపుమ
టంచు వేఁడుదున్, మక్కువచేత వీనిని సమత్వ
ముజేయుము నీమనంబులో, తక్కినకోరికేల
పటుదైత్యహరా మ... 26

ఉ. నీదయగాదు నాపయిని నేఁ డెవరిన్ కరుణించమం
దునో, యాదవవంశపావనుఁడ యాదరమిం
చుక పుట్టదాయె నీ, పాద సరోరుహంబులును
భావములోపల వేఁడువారికిన్, నీదగు సన్నిధి
చ్చితివి నే నెరుసా మ... 27

చ. సనకసనందనాది మునిసంఘమె చాలునటంచు
నామొఱ, ల్దినమును వీనులన్వినియు దీక్షవహిం
చియుఁ బ్రోవకుంటివో, నను నటుగాక చాలగ
ను నాపద బెట్టదలంచినాడవో, మనమున నుందు
బుట్టె నిక మాన్పగదే మ... 28

చ. పరులను వేఁడనంటి నినుఁ బ్రార్థనఁజేయుచునుంటి
నిత్యమున్,దరగని పాదసేవయును దాసునకిమ్మను

మంటి శ్రీహరీ, పరమపదం బొసంగుటకుఁ బాత్రుఁ
డనైతినో లేదో చెల్పవే, పరమదయాంతరంగ
బవాఘపాపహారా మ... 29

చ. పటుతరమైన సూర్యులకు పన్నగభూషనుతప్ర
తాపనే, నెటువలె నోర్చువాఁడ జగదీశ్వర నన్ను
ను గావకున్న యా, చటులతరమ్ము నన్నుఁడుకు
చిమ్ముచునుండెడి పాపవారిధిఁ, యెటుదరిజేరు
వాఁడ నిఁక నేలగదే మ... 30

ఉ. ప్రోచిననీవు నన్ను విడఁజూచిన నీకృపఁగోరి
యుండితిఁ, భూచరఖేచరాళికిని బోషకకర్తవు
నీవెరామ చైఁ, జూచి కృపాకరుండవని సంతస
మంద భయంబుగోరితే, మోచనబుట్ట దిచ్చుట
కు యోగినుతా మ... 31

చ. శరణని మిమ్ము వేఁడఁగను శత్రునితమ్ముఁడటంచు
నీమదిఁ, నిరసన బుట్టకుండఁగను నెమ్మదిగా దయ
నేలినావు నే, నిరతము నిన్నుఁగోరి కరుణించుమ
టంచు భజించి వేఁడఁగా, కరఁగదు నీమనంబెటు
లు కంసహారా మ... 32

ఉ. భావజశత్రుమిత్ర భవబంధవిమోచన శస్త్రదీ
పికా, పావన నీలగాత్ర నవపద్మదళాయతనేత్ర
శ్రీకరా, బావనమాలసూత్ర ఘనపంకజనాభామ

రమాకళత్ర నా, భావమునందు కల్మషము బాపఁ
గదే మ... 33

ఉ. రంగదరాతి భీషమణిరాజవిరాజితభూష గోపి
కా, సంగసమగ్రవేష ననయంబున దాసజనాలి
పోష ని, ర్భంగతరంగ సంఘములపాప పయో
నిధి శోషకాము దు, స్సంగతిఁ బొందకుండఁగను
జేయగదే మ... 34

ఉ. దానవసంహరాయ రణదర్పిత శూరహరాయ
సేవకా, ధీనదయారసాయ జగదేకవిరాట్స్వరు
పాయ శ్రీరమా, మానసపద్మభృంగ యతిభాసిత
మంగళవిగ్రహాయ నా,మో నమయంచు మ్రొ
క్కెదుదుఁ బ్రోవగదే మ... 35

ఉ. దీనజనాళిఁ బ్రోచుటకు దిక్కెవరింకను సామి
యీవిధిన్, దీనతఁ బెట్టనేల భవదీయకటాక్షము
రాద నాపయిన్, కానిర నిన్ను నమ్మగను కష్ట
ము బెట్టఁదలంచినావుగా, కానకచేసితి న్నఘ
ము గావగదే మ... 36

ఉ. ఎన్నగరాని యాయమునిహింసకు లోఁబడకుం
డ మున్నె వో, పన్నగశాయి కాయమున బల్మి
యు దప్పక మున్నెవో మహో, పన్నశరణ్య కాల
భటబాధలు జెందకమున్నె సామి మీనన్నాత

పాదపద్మములచాటున నుంచుము ప్రేమతోడ
నా, విన్నప మాలకించు యతివేగముగా మ...

ఉ. రామ యనేకరాక్షసవిరామ సదాసుగుణాలలా
మ నీ,నామసుధారసంబు మరి నాకును దృప్తిని
బొందనియ్యవే, సామజరాజరక్షకుఁడ సంతత
ము న్భజియించి నమ్మితిక్, కామవికారము ల్గణఁ
చి కావగదే మ... 38

ఉ. చేసితి దుష్టకృత్యములు జీర్ణవయస్కుల జూచి
నవ్వితిక్, రోసితి సజ్జనుల్పయిని రోసము జేసితి
రామరామ నే,జేసిన నేరము ల్దలఁచి చిక్కులు
బెట్టకు దాసకామ నీ, దాసులలోన నేనొకఁడ
దాసునిగా మ... 39

ఉ. పాపములన్ని నీవు యెడఁబాపెడి సామివటంచు
నమ్మితిక్, యాపదఁబాపవే పరమయార్తశరణ్య
కృపాకరుండవై, జూపుము నీదురూపమిటు సూ
ర్యజనస్తుత నీవెదిక్కు ను,ద్దీపిత శత్రుమూర్ధ్నిచర
దివ్యశరా మ... 40

చ. మనవి పరాకుగా వినకు భాసురతేజ మదీయదో
షము, ల్గునిమి నిరంతరంబు కృపతోఁ బరిపాలనఁ
జేయుమయ్య మా, తనయుని మీఁదయింత ద
య్యదప్పిన్న వేరెని కేమనందు నీ,మనమ్మున కిట్లుదోఁ
చినది మంచిదటే మ... 41

ఉ. నీసరి దైవముల్గలరె నిశ్చయమౌాధర మానవా
ళిలో, నాసరి పాతకుల్గలరె నమ్మినదైవము నీవె
పాపము, ల్వేసముజెందకుండ నను వేంకటనా
యక జేయుమయ్య యా,బాసును జేయకయ్య
భవబంధహరా మ... 42

చ. అతికఠినుండవీవు బహునాపద బొందినవాడ
నేను నీ,మతముకు జాలిబుట్టదెటు మంచిది బం
గరురంగశాయి నా,పతితము మాన్ప వేరొకరు
భారకులెవ్వరు నీవుదప్ప న,న్నితరులు లేరు గా
చుటకు నేలగదే మ... 43

చ. దినముదినంబునందు యతిదీనుఁడనై బ్రతిమాలు
చుండఁగాఁ, గనికరమెంతలేదొ కడకంటినినైన
నుఁజూడవైతి వే, మనఁగలదీర్ఘకోప మిఁకమాని
ననుఁ గృపఁజూడుమయ్య మీ,తనయుఁడఁగాన
నేను ఘనదైత్యహరా మ... 44

చ. సలలితనీదునామ జపసంగతెలుంగ గిరీశగాను స
ద్విలసిత పాదపద్మభవదించుకరేణు మహాత్మ్య
భావముఁ, దెలియ నహల్యగాను జగతీవర నీ
మృదుసత్యభాషలఁ, దలఁపఁగ రావణాను
జుని తమ్మునిగాను భవద్విలాసముల్, దెలిపిస్తుతిం
ప నాతరమె దేవనుతా మ... 45

ఉ. నీదగురాకగోరి ధరణీతలమందున స్వాతివాన
కుఁకా, మోదముతోడ శుక్తివలె భూమిజనాయ
క నున్నవాఁడ స్వామీ! దను నీకు నింతచలమెం
దుకు నిన్నునునమ్మియుంటి రా,రా దరిఁజేర్చి యే
లగదరా కృపచేమ... 46

ఉ. ఫుల్లసరోజనేత్ర ఘనపుణ్యచరిత్ర విభూతిరాజి
తా, వల్లవరాజపుత్ర శశివంశజునర్జునమిత్ర గోపి
కా, యుల్లసరోజమిత్ర ఘనయోగిజనస్తుతిపా
త్రరామ నా, యుల్లములోపల న్నిలుముయోగి
నుతామ... 47

చ. దురితభరంబుదోలి మరితుచ్ఛమతంబు వధింపఁజా
లి ని, బ్బరపు సుబుద్ధినేలి పటుభానుజదూతలఁ
బారదోలి శ్రీ, ధర తవపాదపద్మ సుధధారలు
గ్రోలి భజించువాఁడె రా, తరగనిపుణ్యశాలి
ఘనదైత్యహార్తా మ... 48

ఉ. భావజకోటిరూప భవబంధవిదారణరూప పాం
డు రా, జీవయశఃకలాప పరచిత్తభయంకరచాప
యో మహా, దేవనుతప్రతాప జగదేకవిరాజిత
భూప రాగదే, కావగదే ననుం గృపను కంసహా
రా మ... 49

ఉ. వలదు చలంబు నాయెడను వారిజనేత్ర దయాస

ముద్ర న, న్నలసటఁబెట్ట నీకు మరినాయముగా
దని యెంతవేఁడినన్, పలుకవు యింకనే నెవరిపా
లికిఁ జేరుదునయ్య యయ్య నీ,తలఁపునఁ జాలిఁ
బుట్టదెటు దైత్యహారా మ... 50

ఉ. నీపదభక్తిసల్పుచు ననేకములైన దురంతకార్య
ముల్, పాపమనంబుచేత పరభామలకౌఁగిటఁ
జిక్కిచేసితిన్, పాపుఁడటంచునన్ను యెడఁబాయ
కు సామి తరింపఁజేయవే, తాపము నొందఁజాల
పటుదైత్యహారా మ... 51

ఉ. నీదరిఁ జేరినాఁడ బహునేరములెన్నక నాదరంబు
చే, నాదుభయంబుదీర్చి శరణాగతచిహ్నను
బొందవయ్య రా, మా దయయేలరాదు పర
మాప్తుఁడవంచును కోరియుండితే, ఖేదముబెట్టు
చుండితివి క్రూరహరా మ... 52

ఉ. కోరినకోర్కెలిచ్చెదని కుంభినిలోపల యార్యు
లందఱున్, భూరిగఁజెప్పుచుండఁగను బొందుగ
వింటి నిజంబునైతె సం,సారభయంబువాపి ధరఁ
జారుతరంబగు మోక్షమార్గమున్, నేరములెన్నొ
యున్న నీకనియ్యగదే మ... 53

ఉ. ఎన్నటికైన నిన్ను మదియందున సంతసమొప్పు
తోడ నా, కన్నులనిండఁ జూచుటకుఁ గల్గునో

గల్గదొ చెల్పవయ్య యా, పన్నతఁ జెందునయ్య
భవబంధముచేతను బ్రోవవయ్య రా, వన్న పరా
కదేల వినుమా మొఱ్ఱలన్ మ... 54

చ. దురితపయోధిలో మునిఁగి దోరకమున్నె జరాది
రోగముల్, బిరబిరవచ్చి యీతనువు బింకము
నొంచకమున్నె కుత్తుకన్, గురగురలాడుచున్
కఫముఁ గూడకమున్నె భజించ దోషముల్, శర
మునఁ గూల్పవయ్య పటుచక్రధరా మ... 55

ఉ. ధీరత నిన్ను వేఁడుటకు దివ్యచరిత్ర ధ్రువుండఁగా
ను దైై, త్వారిజనార్దనా పరమదైవమయంచు
నుతింపసాగ న,క్రూరునిఁగాను పామరుఁడ కృష్ణ
భవద్విను తేనుఁజేయఁగా, నేరనుఁ జాలమేల కరు
ణించఁగదే మ... 56

ఉ. చేసినదుష్కృతిన్ దునిమిచింతను బాపిటుఁగార
వంబుచే, దాసజనాళిలోఁ గలపి ధన్యత నొందఁ
గఁజేయుమయ్య యో, భాసురచక్రధారి పరభా
సురశౌర్యహతస్వరూప నా, దోసము కొట్టివే
యుటకుఁ దోఁచదుగా మ... 57

చ. పరమకృపానిధే విమలపంకజనేత్ర హరేయటం
చు నిబ్బరమతులై నిను న్భజన పాయకఁజేసిన
వారిపుణ్యముల్, తరమె వచింప శేషునకు ధాత

కునై ననునీదునామముల్, మఱవనివాఁడెపుణ్యుఁ
డగు మాన్యుఁడునౌ మ... 58

ఉ. కానుకలివ్వఁజాల కతికంధిగిరీశ ... లట్లనీ,మాని
తపాదపద్మములుభావమునందు భజింపఁజాల నా,
దీనతఁ బాపవేల జగతీధవ చాలఁగ నమ్మియుండి
తిఁక, దానవసంహరా దురితదైత్యహరా మ...

ఉ. దండధరుండుఁ బెట్టు పటుదండన కేను భయంబుఁ
జెంది నీ,యండను జేరియుంటి నభయంబు ఘనం
బుగ నివ్వవేమి కో, దండకళాప్రవీణ భవదండ
నుజేరిన దాసకోటికిఁక, దండిగ మోక్షమిచ్చితివి
దైత్యహరా మ... 60

చ. మునునిను వేఁడువారిని నమోఘముగాదయఁజూ
చినావు న,న్నును నటుఁజూడవేమి శరణోరఘు
రామ యటంచువేఁడుచుఁక, దినములు దుర్భరం
బుగను దీనదయాపర త్రోయుచుందు నీ, వినవు
యదేమి నామనవి వేదనుతా మ... 61

ఉ. తల్లివి దండ్రివంచు మరిదాత గురుండవటంచు
యేను శ్రీ, సల్లలితంబులైన పదసారసముల్ మది
నమ్మియుండితే, నల్లనిమేనువాఁడ కరుణారసమెం
దుకు బుట్టునయ్య నీ,యుల్లమునిండ కల్మషమె
యూగినుతా మ... 62

చ. మిమునిటు వేఁడుచుండఁగను మెల్లఁగఁ బ్రాణము లెప్పుడో వునో, కమలదళాక్ష వానినిఁక కాలభటుల్ గొనిపోవకుండఁగా, శమనుని కాజ్ఞ సేయుము విశాలబలుల్ దరి కావలుంచవే, మమ యిసునంటకుండ భవబంధహరా మ... 63

ఉ. రమ్ము విహంగవాహననిరంతరవైరము నీకునాకు నీ,సమ్మునులేదు నుండినను జక్కని రామ క్షమించి నన్ను మీ,సమ్ముఖమందునున్న మునిసంఘము లోపల నుంచివేయ దో,సమ్ములు ద్రుంపవే దురితసారహరా మ... 64

ఉ. బాములు నెత్తఁజాల నను భావములోపల నుంచవేల నా,సామివి నీవు చక్కగను శాంతముచేతను రావదేల ని,ష్కాముని జేయవేల భవసాగర వీచులనీఁదఁజాల నీ, ధామమునందు దాఁచఁ గదె దైత్యహరా మ... 65

ఉ. కోపము నాపయిన్ మదినిఁగూరిమిఁ బెట్టదు గావరావు నా,పాపము యేమొగాని యొకమారిటుఁ జూడకనుంటివేమి యో,తాపసబృంద యారిత సదాకలినంబు వహించియుండితే, నాపద లెట్లు బాతు వినునందసుతా మ... 66

ఉ. ఎంతటివాఁడవయ్య విను మెన్నటికిన్ నిన్నునమ్మ

రాదు నీ, చెంతనుఁ జేరియుండినను చిక్కులు
బెట్టఁదలంచితౌర నే, నింతకు నేమిజేసితిని నీవు
యెఱుంగని ఘోరకృత్యముల్, పంతముమాను
నాపయిని పాపహరా మ... 67

చ. నిను మరినమ్మరాదనుచు నేరములెన్నుచు బల్కి
నాఁడ నీ, మనమున ముద్దువాక్యముగ భావనఁ
జేయుము రోషగించకే, నను గృపఁజూడు దా
సుఁడ ననాదరణీయుఁడనైతి బ్రోవరా, తనువునిఁ
కే లనిత్యమిది దైత్యహరా మ... 68

ఉ. పొందని కాంతుల న్విడిచి పూజలొనర్చిన వారి
దోషముల్, కొండలవంటివైన ధరఁగాలి హరిం
చక యున్నె నిత్య మా, ఖండలసంపదల్ భువిని
గల్గకయుండునె ముక్తికాంత కై, దండను నివ్వ
కున్నె తుది దైత్యహరా మ... 69

చ. దశరథరాజగర్భమున ధారుణియందునఁ బుట్టి
యేపునన్, మశకములట్లు దానవుల మారణఁజేసి
సురాలికిన్ సదా,కుశలము నొందఁజేసి జనకోటికి
సంతసమబ్బునట్లుగా, దశదిశలెల్ల నేలితివి దైత్య
హరా మ... 70

ఉ. ఏటికి రామయీవరుస హింసను బెట్టెదు వోర్వఁ
జాల నీ,పాటికినైన నన్ను దమపాలికిఁ బిల్వుము

రంగశాయి నా, కాటలఁ బ్రోచినట్లు ననుఁ గావఁగ
రాద చలంబదేలరా, తాటకసంహారా దురితదైౖ
త్యహారా మ... 71

ఉ. శ్రీయుతమోహములో పరమసేవకసాధుజనాళితో
లస, చ్ఛాయలనీను హారసముదాయముతో
నతిశాంతమూర్తివై, రా యభయంబు నియ్యగ
దవే యపరాధినిఁ గావవే జగ, ద్గేయ గుణాల
వాల ఘనకీర్తిధరా మ... 72

చ. పరభయచక్రధారి భవబంధవిమోచనకారి యేల
రా, కరగదు నీమనంబు కనకాంబరధారి యిఁకే
మిజేతు యే, తెలిఁగున నాపదల్ గడతు దీనతఁ
బెట్టుట మంచియేకదా, వరమునియోగివంద్య
బహువ్యాధిహారా మ... 73

ఉ. స్నేహితుఁడైన యావరకుచేలునకున్ ధనసంప
దల్ బహూ, త్సాహముతో నొసంగి మరి దాసు
నిఁగాఁ గృపఁజూచినావు వై, దేహివిభుండ యా
కరణి దివ్యముగాఁ గరుణించకున్న యో, శ్రీహ
రి యెందుఁబోదు నిఁక చింతిలుచున్ మ... 74

చ. కరుణ యొకింతరాదొ నను గాచుటకున్ మరివే
ళగాదొ నా, మొఱవిన నీకు నాదరముఁబుట్టకయు
న్నదొ యిట్లుగాకన్, గరుణను జూడకుండు

టకుఁ గారణమేమి దయాసముద్ర నీ, దరిసైన
మెవ్విధిన్న గును దైత్యహారా మ... 75

ఉ. ఘోరము లైనబాపములఁ గూల్పఁగఁజాలిన
మేటివయ్యు సం, సారులకెల్ల నీవు సిరిసంపద లి
చ్చెడివాఁడవయ్యు నిఁక, భూరిగ గొల్చుభక్త
లకు మోక్షమునిచ్చెడివాఁడవయ్యు న, న్వోలు
గఁ జేసి తేమనుదు వేధనుతా మ... 76

చ. పలుకవదేల యో పతితపావన రామ యటంచుఁ
బిల్వఁగా, నలిగినయట్లు నుంటివిఁక నాదరమెప్పు
డుఁ బుట్టునయ్య నీ,తలఁపున శంకమాని భవదం
ఘ్రులుఁ జూపుము నమ్మియుంటి స,త్ఫలమునుఁ
బొందఁజేయఁగదె పాపహరా మ... 77

ఉ. ఇప్పుడు బ్రోవకున్న మరియెప్పుడు బ్రోతువు రం
గశాయి మా,యప్పవునీవు చాలఁగను యాదర
ముంచి ఘనంబులైన నా,తప్పులు గావు మీయె
డను దైన్యముఁ బెట్టఁగరాదు దీనుఁడఁ, దప్ప
కఁజేతు మీభజన దాసుఁడనై మ... 78

ఉ. బంటను దాసపోషబిరుదాంకితరామ పురారిమి
త్ర నా, జంటనుబాయకుండఁగను చక్కఁగ రమ్మ
ని వేఁడుకొంటి నీ,వింటివొ లేదొ నాదుమొఱ
వీనులసోక పరాకదేల నా,దంటకు రావదేల ఘన
దైత్యహారా మ... 79

ఉ. ఎంతని వేఁడుకొందు జగదీశ్వర నాపయిఁ బ్రేమనీ
కుఁ గా,సింతయునైన లేక మరిచిక్కులు బెట్టఁ
గరాదు నామొఱా,లింతువటంచు నమ్మితి నిలింపు
లగుంపుల నేలుమేటి క,త్యంతము భారమా నను
దయామతిఁ బ్రోచుట గానరాదు మున్, దంతి
నిఁ గావవే కృపను దైత్యహరా మ... 80

ఉ. పాపపుబుద్ధిచేత బహుపాపము లార్జనఁ జేయు
చున్ దురా,లాపము లాడుచుండెనని రాఘవ
రామ తలంపకయ్య నీ,దాపునఁ జేరియుంటి నను
దాసునిగాఁ గృపఁజూచి నేరముల్, కోపము లే
క బాపఁగదె కూరిమితో మ... 81

చ. కరివరదా రమారమణ కారుణికోత్తమ భక్త
పాల నీ,మఱుఁగునఁ జొచ్చియుంటి నను బంటుగ
నేలుము శాశ్వతంబుగా, పరమపదంబునందు
యతిభాతిగ నన్నునుపంగఁ గోరితిన్, సరగున నీవె
యాపథము శాంతముచే మ... 82

ఉ. ఏమిర రామచంద్ర నను నేలినవాఁడవటంచు వేఁడి
తే, కామితదాసుకోరికెను గైకొనకుంటివి యిం
చుకైన నే,నేమియుఁ జేయువాఁడ నిను నిష్ఠుర
వాక్యము లాడఁజాల రా,మా మనసందు వాద
మింక మాన్పుగా మ... 83

ఉ. శ్రీవర మీపదాబ్జములు సేవయొనర్చుచు నమ్మి
యుంటి నా, భావములోన యోపరమపావననా
మ పురారిమిత్ర న న్నావఁగ రాకయుండి చిరకాల
ముఁ జిక్కులఁ బెట్టుచుండితే, నావశమానె
యోర్చుటకు నాయమ లే మ... 84

చ. చిలుకను నొక్కవారసతి చేరికఁ బెంచియు దాని
మాటికిన్, బిలచిన రామరామయని భేదమునే
యక నీవు నంతనా, లలనకు మోక్షమిచ్చిన పురా
ణకథల్ నిజమైతె రామ నేఁ, దలఁచఁగ రావదే
మి ఘనదైత్యహరా మ... 85

ఉ. నాయముగాదు యింతకఠినమ్మువహించుట రం
గశాయి నేఁ, బాయని మోహజాలములు బంధ
ముచేతను జిక్కి బిల్చితే, నోయనిబల్కరాద
శరణొందిన దాసులఁగావ మేరగా, దాయదువం
శపావన రథాంగధరా మ... 86

ఉ. పాతకిఁ గాచు లే పతితపావనరామ ధరిత్రిలోన
ప్ర ఖ్యాతినిఁబొందు సామికని గానకఁ జేసిన
దోషసంఘముల్, యాతన బెట్టకుండఁగ దయారస
సముద్ర మదినుంచి బాపవే, ఘాతకిసంహారా
దురితపుంజహరా మ... 87

ఉ. మానవకోటిలో దురితమానవుఁడంచుఁ దలంచి

నీమది, హీనతఁజేయుచుండితివి యింతియెగా
ని దయాపరుండవై, బూనిన దోషముల్ దునిమి
మోదమునియ్యవు యింతపంతమా, దీనుఁడ నీద
యాంబుధిని దేల్చఁగదే మ... 88

ఉ. నాసరియైనపాతకుల నార్తుల నెందఱేఁ గాచితో
జగ, ద్భాసిని గాను మిమ్ములను దానవసూతి
తలంచినంతనే, భాసురరూపుతో వెడలి భక్తు
నిఁగాచియు నేఁడునన్ను నా, యాసముఁ బెట్టు
టేల దురితాళిహరా మ... 89

ఉ. నేనొనరించుపాపము లనేకము గుంపులుగూడి
యుండె రా, మానుజ వానినెవ్వరును బాపెడి
వారెటు లేరుగాన రా, వే నఘసంఘముల్
దునుమ వేల్పవు నీవె పరాకదేల లే, వే ననుఁ
గావరమ్ము యతివేగముగా మ... 90

ఉ. మేలుగ దాసకోటికి నమేయఫలంబులు నివ్వఁ
జాలి నా, పాలికిరాక నీవు పరిపాలనసేయక రా
మనామ మే, మూలను దాచుకోఁగలవె ముక్తి
ప్రదాయక నాకుఁదెల్పవే, చాలగఁ జిక్కులన్ని
డకఁ జక్రధరా మ... 91

ఉ. ఏనిఁకయెంత వేడినను యేమనవైతివి రామచం
ద్ర యా, దీనతఁబాపి చక్కఁగను దిక్కయి

ప్రేమను గావకుండినన్, దీనులఁగావ నీవె మరిది
క్కనుమాట లబద్ధమౌనుగా, గాన చలంబు
మాని ననుఁ గావఁగదే మ... 92

ఉ. రామ యనేకనామ బహురాక్షసగర్వవిరామ
యోపరం, ధామ గుణాభిరామ నృపతారకసో
మ వినీలనీరద, శ్యామ శమాభిరామ భవసాగర
మగ్నత నొందకుండఁగా, క్షేమముగాను నన్ను
దరిఁజేర్చగదే మ... 93

చ. జలచరరూపమై వడిగ సాగరమున్ జొరఁబారిసు
గ్రతన్, దలములుచేత యానిగమతస్కరవీరు
నిఁజీరివైచి రం,జిలుచును నాల్గువేదములుఁ జేకొ
నిచిక్కులువాపిధాతకున్, దెలిపియొసంగి తీవెక
ద దేవనుతా మ... 94

చ. ఘనమగు మంథరాచలముకవ్వముగా ఫణిరాజు
రజ్జుగా, నొనరిఁచి దేవదైత్యులు పయోనిధిఁ
బూని మథింపుచున్నచో, చనీ యడుగంట కూ
ర్మమయి శైలము దాల్చినవాఁడ వీవెకా, కనక
విశాలచేలధర కంసహారా మ... 95

చ. ధరఁ గని చాపఁజుట్టినవిధంబునఁ జుట్టియుఁ గొం
చుఁబోయి పా, గరమున డాగియున్న కనకాక్షు

నిక్రమించి వరాహమూర్తివై, ధరణిని తొల్లిచం
దముగ దక్షిణకొమ్మునదెత్తి గ్రక్కునన్, విరివి
గఁ జేసితీవెగద వేధనుతా మ... 96

చ. కనుగొన దేవబృందముల కద్భుతమైన నృసింహ
మూర్తిచే, దనుజులప్రాణము ల్బెదర స్తంభ
మునం దుదయించి వక్ష, మే, పున విదళించి హే
మకశిపు న్విదళించి వడిన్ సురారినం, దనుగ్రహం
జూచితివెగద దైత్యహారా మ... 97

చ. పదయుగళంబు భూగగనభాగమునందిడి శౌర్య
ధైర్యసం,పదుఁడగు నబ్బలీంద్రు నొకపాదముచే
తలఁ గ్రుంగఁద్రొక్కి పెం,పొదవ త్రిలోకముల్
నముచిసూదనుకియ్య వటుండవైన యో, సదమ
లమూర్తివీ వెగద చక్రధరా మ... 98

చ. ధరఁగల క్షత్రజాలములఁ దారుణ వీరపరాక్ర
మంబుచే, యిరువదియొక్కమారు పృథివీస్థలిఁ
గూల్చియు వారిరక్తముల్, త్వరితముగాను
పైతృలకు తర్పణమాడియు భూసురాళికిన్,
ధరను నొసంగితీవెగద దైత్యహారా మ... 99

ఉ. ఆలమునందు తాటకిని యంతము నొందఁగ నేసి
యాగమున్, పాలనఁజేసి గౌతమునిపత్నికి శాప

ముమాన్పి రామసీ, తాలలన న్వరించి యతిద
ర్పితు రావణకుంభకర్ణము, ఖ్యాళి వధించితీవె
గద ఖ్యాతిగనో మ... 100

ఉ. నందునియింట కృష్ణహాలినామముతోడుత వృద్ధి
బొందిగో, మ్మందలఁ గాచుచుండి వృషభాసురుఁ
డాదిగ క్రూరదైత్యులన్, మందునిభాత్రితృవీటికి
నమందముగా వసియింపఁజేసి గో,విందుఁడవైతి
వీవెగద వేధనుతా మ... 101

చ. ఇలఁగలమానవాళికి నచింత్యవిరాట్పురుషస్వ
రూపమున్, సులభముగాను నెల్లపుడుఁ జూపఁ
దలంచి దయాలవాల శ్రీ, లలితపు బుద్ధమూ
ర్తివయి లక్షణధామసుభద్రఁగూడిభూ,నిలయుఁ
డవైన సామి కరుణించఁగదే మ... 102

చ. కలియుగమందు సంకరనికాయజనంబును జూచి
పాపసం, కుల మెడలించ రౌద్రముగ ఘోటక
మెక్కి కరాసిఁబూని దు, ష్టులఁ బరిమార్చి వేగ
మున తొల్లియుగంబు లధర్మ పద్ధతిన్, నిలిపిన
కల్కి వీవెగద నేరుపుగా మ... 103

ఉ. ఏలినవాఁడ నీవయినియేను బొనర్చిన వృత్తజాల
ములన్, మాలికగాను గైకొని యబద్ధములున్న
క్షమింపవయ్య గో,పాలకృపాలవాల భవబంధవి
మోచన నిన్ను నెప్పుడుఁ, జాలభజింపుచుండు
పటుచక్రధరా మహిజామనోహరా. 104

మహిజామనోహరశతకము

సంపూర్ణము.

---

# పీఠిక.

మానసబోధశతకము చిత్తబోధశతకములమూలమున ఆంధ్రలోకమునకుఁ జిరకాలపరిచితుఁడైయున్న తాడేపల్లి పానకాలుకవి యీపార్థసారథిశతకమును రచించెను. ఇతఁడింతియగాక రుక్మిణీపతిశతకము మంగళాద్రినృసింహశతకము లక్ష్మీశతకము లోనగు గ్రంథములు గావించియున్నాఁడు. పానకాలుకవి నియోగిబ్రాహ్మణుఁడు; శ్రీవత్ససగోత్రుఁడు. కవినివాసము కొండవీటిసీమలోనిదియుఁ గృష్ణాతీరస్థము నగుతాడేపల్లి. ఇట కవివంశీయులు నేఁటికిని గలరు. కవిజీవితమునుగూర్చినయంశము లటవిశేషించి తెలియరావుగాని కవి యిప్పటికి నూఱుసంవత్సరముల క్రిందట జీవించియుండెననియు నితఁడు వైద్యమున మిగులఁ బేరుగాంచినవాఁడనియుమాత్రము తెలిసినది. ఇతఁడు వైద్యనిపుణుఁడనుటకు నేత్రదర్పణమే తార్కాణము కాఁగలదు.

క. పదిరెండుపర్వతంబులు
విదితంబుగ నదులురెండు విభుఁడు నృసింహుం
డదనైనదుర్గ మొక్కటి
పదపడి ముదమలరు తాడెపల్లి ధరిత్రిన్.

నేత్రదర్పణమునఁ బానకాలుకవి సహజముగఁ దనజన్మభూమిని గొనియాడియున్నాఁడు. తాడేపల్లి కొండలసంఖ్యపదిరెండు, రెండునదులు పురినొరసిపా ఱుచున్నవి. నృసింహుఁడు గ్రామదైవతము. కొండ పై నొకపూర్వదుర్గముగలదు. ఉన్నంతలోసరిపుచ్చు కొని మాతృభూమిగౌరవమును వేనోళ్లఁగొనియా డుపానకాలుకవి ధన్యుఁడు. ఇతనికవిత మృదుమధుర ముగానుండును. ముఖ్యముగా నితనిశతకములలో మానసబోధశతకమున కున్నంతప్రశస్తి మఱియొక దానికి లేదు.

ఈపార్థసారథిశతకము తిరువలిక్కేణిపార్థసారథి స్వామినిగూర్చి రచింపఁబడినది. ఇందలిపద్యములు విష్ణులీలలను గొండాడుచు శ్రావ్యముగఁ బఠనీయ ముగ మనోహరముగనున్నవి. కవి మంగళగిరిపాన కాలరాయనిభక్తుఁడు కావున పానకాలరాయఁడని పేరుదాల్చియుండును. ఇతనికవిత పానకమువలె మధురముగానుండుననుటలోసంశయమింతయు కేనియు లేదు. కవి తనప్రశస్తిని నేత్రదర్పణమున నిటులఁ జెప్పికొనియున్నాఁడు:—

గీ. అఖిలరాజాధిరాజసభాంతరా గ్ర
పూజితుఁడ సర్వవిద్యావిరాజితుఁడను.

ఈపద్యభాగమువలనఁ గవి రాజసత్కృతులనొం దినటులఁ దెలియుచున్నది. ఆరాజులపేరులఁ దెలిపి యుండునేని కవికాలము సులభముగా గురుతింప వీలుచిక్కెడిది. ఈకవిజీవితచరిత్రమునకు నితనిగ్రంథములకుఁ దాడెపల్లివా స్తవ్యులగు కవివంశీయులు కృషిచేసి భాషాభిమానమును బ్రచురింపవలసినయావశ్యకత విశేషించి కలదు.

అఱువది రెండుసంవత్సరముల క్రింద మదరాసులో ముద్రితమైన దోషవంతమగు నొకజీర్ణప్రతి నాధారపఱచికొని కవియభిప్రాయములనుగుర్తించి సవరించి యెటులో ప్రయాసమీఁద నీశతకమునకు శుద్ధప్రతి వ్రాయఁగలిగితిమి. ఇతనికవితలో నందందు స్వల్పలోపములు గలవు. ఇట్టివి పానకములో నెఱ్ఱుసులవంటివి. ఇతనిశతకములన్నియు ముద్రితములు కాకుంట పరితాపకరము.

నందిగామ.
1-2-25.

ఇట్లు భాషాసేవకులు
శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

శ్రీ ర స్తు.

తాడేపల్లి పానకాలురాయకవికృత

# పార్థసారథిశతకము.

---

ఉ. శ్రీరమణీమణీశ సువశీకృతమానిమనోబ్జకోశ
శ్రీం, గారవపుఃప్రకాశ మదకౌరవసైన్యవనా
శ్రయాశచా, ఖారగళోగ్రపాశ వృజినోరగసం
ఘపతంగమేశ ఘో,రారిచమూవినాశ సదయా
మృతనీరధి పార్థసారథీ. 1

చ. సమరముఖారిభీమ సుతసాధుజనావనకామమాని
హ్మౄ,త్కమలసహస్రధామ వ్రజకంజముఖీకు
ముదాళిసోమ స,ద్విమలగుణాభిరామ పరవీరభ
యంకరనామ దేవతా, విమతవిరామ పద్మభవ
వేద్యదయాంబుధి పా... 2

చ. గరుడతురంగ దివ్యమణికాంచనభూషణభూషి
తాంగ సం,గరరిపుకాడ్వ్విభంగ సనకస్తుతదివ్యక
థాప్రసంగ సా,గరతనయాభిషంగ మురగర్వస
మీరభుజంగ దుర్భవో, త్కరతమసఃపతంగ మృ
దుతల్పపయోనిధి పా... 3

చ. పరమకృపాలవాల భవబంధవిమోచనశీల లోక
సం, భరణయశోవిశాల నిజభక్తజనావనఖేల
శాత్రవో, త్కరవిపినాగ్నికీల కనకస్ఫుటదివ్యదు
కూల ధర్మరా,డ్వరసురసాలసద్గుణకదంబపయో
నిధి పా... 4

చ. తరణిశశాంకనేత్ర మదదానవమండలజైత్ర దు
గ్ధసా,గరదుహితాకళత్ర శుభకారణవిశ్వమహా
విచిత్ర సుం,దరఘననీలగాత్ర సురతారకదివ్య
చరిత్ర నీలకం, ధరనుతిపాత్ర పత్త్రికులనాథర
థీహరి పా... 5

చ. సరసవచోవిలాస విలసత్స్ఫుటకాంచనవాస
భావసం,భరితఘృణావికాస పరిపాలితపాదసరో
జదాస సుం, దరదరపాండుహాస నిరతస్ఫురితా
మితకీర్తిభాస సం, గరరిపుదాణ్ణిరాస మురకంఠ
విలుంఠన పా... 6

ఉ. ఘోరతరారిదూర ఘనకోమలచారుశరీర యా
మునా, తీరవిహార వల్లవసతీజనజార మునీంద్ర
మానసా, గార తుషారహీరకరకంఠపటీరస
మానకీర్త్యలం, కార సుమేరుధీర మురగర్వ
హరా హరి పా... 7

చ. శరనిధిరాడ్గభీర హిమశైలసమానసుధీర వాట

కా, మరమణిహార మారసుకుమారశరీర రిపుప్ర
హార భా, సురఖగరాడ్విహార రణశూర శ్రుతివ్ర
జసార కాననాం, తరకరిదైన్యదూర నిజదాసజ
నావన పా... 8

ఉ. నందయశోదనందన సనందనవందన సుందరాంగ
సంక్రందనవంద్యకుందరదరాజిత నందకహస్త
సర్వదా, నందముకుంద నందితసనంద జగత్త్రయ
తుందయిందిరా, మందిర మందరోద్ధరణమంజుల
భూషణ పా... 9

చ. భవహరణంబులై సకలపాపవిమోచనకారణంబు
లై, శివసనకాదియోగిజనసేవ్యములై శుభదాయ
కంబులై, భువిఁ బొగడొందుమీచరితముల్గాని
యాడెద నన్ను బ్రోవు మాధవ హరి వాసు
దేవ ఖలదానవసూదన పా... 10

ఉ. వ్రేతలకోర్కిదీఱ కడువేడుకతోడ యశోదగ
ర్భసం, జాతుఁడవై విదర్భనృపజాతను రుక్మిణి
బెండ్లియాడి వి, ఖ్యాతిగ ద్వారకాపురము
కాపురమై విలసిల్లి యాదవ, వ్రాతము నేలితీవె
గద వాసవసన్నుత పా... 11

చ. హాలహాలపూరితోరుకుచయై పెనురక్కసివ్రేత
లెల్ల భీ, తిలఁ జనుదెంచి కృష్ణయివె తియ్యనినా

చనుబాలు ద్రావ నాఁ, కలి నెడలించునీకు
ననఁగా నొకగ్రుక్కకు దానిప్రాణముల్, ద్రో
లఁ గిలఁ గూలఁజేసితివి దుష్టనిశాటిని పా...12

ఉ. గోపవిలాసినీమణులు గొల్వక కొల్వయి వారి
తోడ సల్లాపము లాడువేళల విలాసము కన్ను
లఁజూడనైతి నా, పాపవశంబుచేత నీకఁబల్కులు
నిన్నభజియించుచుందు నో, గోపకరూప కావు
నను కూరిమితోడుత పా... 13

ఉ. చిన్నికుమార మన్నుదినజెల్లున నీకనిపల్కతల్లి లే,
దన్నను నీవునమ్మ వటులైనను చూడుము నాదు
వక్త్రమం, చు న్నిఖిలప్రపంచమును జూపితివౌ
తలవాకిటఁ గృపా, సన్నుమతిఁ యశోదకుఁ
బ్రసన్నుఁడవై మను పా... 14

ఉ. వెన్నలు బాలు నేతులును వేడుకమీఱఁగ గొల్ల
యిండ్లలోఁ, గ్రన్నన ముచ్చిలింప వ్రజకాంతలు
కుయ్యిడ నయ్యశోద ని, న్నన్నన అోలగట్ట
నటుమద్దులుగూలఁగ నీడ్చి శాపసం,ఛన్నుల
యక్షురాట్సుతుల నయ్యౌనఁబ్రోచితె పా... 15

ఉ. వేడుక చేలము ల్విడిచి వ్రేతలు నయ్యమునాప
గాంబులఁ, గ్రీడలు సల్పుచుండఁగని కేరుచు
వస్త్రములఁ హరించి యా, చేడెలమానమెల్లఁ

గొని సిగ్గులువీడఁగఁజేసి వారుని, న్వేఁడఁగ చీర
లిచ్చితివి నేర్పున క్రమ్మఱ పా... 16

చ. ఇతరములేక వ్రేతలు యథేష్టముగా నినుగూడి
నిత్యముగ్, బతిహితబంధుభావములఁ బల్మఱు
క్రీడలుసల్పి వేడ్కతో,నతులితవైభవాప్తలయి
యంత్యమున న్భవదంఘ్రిపద్మసం, గతలయిముక్తి
గాంచిరి సుఖమ్ముగ ముగ్ హరి పా... 17

ఉ. నందునిమందలోన యదునందనులంద అమందభ
క్తిమీా, యందునఁగల్గివారుముదమందఁగసంపద
లందఁజెంది రా, నందము నందనందన సనందన
వంద్య ముకుంద కృష్ణ గో, విందయటంచు నిన్న
లఁచి వేడుకమీఱఁగ పా... 18

చ. కుతుకమెలర్ప నింద్రునకు గోపకులందఱు విందు
సేయఁగా, మతిఁ దలపోయఁగూడదని మాన్పఁ
గ నప్పుడు దేవరాజు కో,పితుఁడయి ఱాళ్లవాన
గురిపింపఁగఁ గేలను గొండయెత్తి గో,పతతుల
భీతి వోగడచి పాలనఁజేసితె పా... 19

చ. సుతుఁడవటంచు నందుఁడును జుట్టమవంచును
గోపకామినుల్, హితకరివంచు గోపజను లిష్టస
ఖుండవటంచుఁ బాండవుల్, మతిదలపోయుచుం
దురు రమాయుతమూర్తిని నిన్ను వారలే, వ్రత
ములొనర్చిరో తెలియశాదుగ్గ్ధా ముసుపా...

చ. నినుగని కన్మొఱంగి విధి నేర్పున గ్రేపులగోపబా
లురఁ, గొని చన ఛద్మవత్సముల గోపకుమార
కులఁ సృజింప న, త్తనయులఁ గ్రేపులఁ గని
ముదమ్మునఁ దల్లు లభేదబుద్ధిచేఁ, గనుఁగొనఁజేసి
తీవు మును కంసనిషూదన పా... 21

చ. వలువలు గంధముఁ పువ్వులు వంటకముఁ ఫల
ముల్ జలంబు లిం, పలరఁగఁ బాయకాదిజను ల
ర్పణసేయ కటాక్షదృష్టిచే, వెలయఁగఁ బ్రోచి
నాఁడవని వీడక వేడుకతోడ నీకథా,వలిఁ బరికిం
పఁ జిత్రమగు వారిజలోచన పా... 22

చ. పరగఁగ దుస్ససేనుఁడు సభాసదులందఱుజూడ
ద్రౌపదిఁ, పరిభవమొందఁజేయ నిను భక్తియు
తంబుగఁ గృష్ణ, వేఁడ న, ప్పరమపతివ్రతామణి
కపారములై తనరారుచేలముల్, కరుణ నొసంగి
కాచితివి కంసనిషూదన పా... 23

చ. కడువడిబాణజాలముల గాసిలజేసెడివానిచూచె
దే, బెడిదపుచక్రధారలను భీష్ముని జంపుదు
నిన్నుఁగాతున, న్వీడువిడు మర్జునా యనుచు విం
తగ గంతులొనర్చునట్టినీ, యడుగులు జూపవే
దయ దయామృతనీరధి పా... 24

ఉ. భీమసుయోధనుల్ గన విభీషణరోషవిషాగ్ని తప్తు

ర్మై, భీమతరాహవంబునను బెబ్బులులట్టులఁబోరు
నప్పుడా, భీముని గేలిసేయుగతి పెందొడలా
యము దెల్పి శత్రునిన్, హామికఁ గూలఁజేసిన
దయాగుణనీరధి పా... 25

చ. చలమున భీమమాగధులు చయ్యన కయ్యముజే
య నయ్యెడ, న్బలము దొలంగి భీమునకు భం
గము రాఁగఁ దృణంబుఁజీల్చి యా, చెలువున శత్రు
ని నునుమఁజేసిన నీమహనీయలీల లిం,పలరఁగ
నెన్న శక్యమె దయామృతనీరధి పా... 26

చ. సమరథులన్ మహారథుల సైన్యములన్ దగఁ
గూర్చి కౌరవుల్, సమరమునన్ బెనంగొనఁగ
శక్రతనూజునకు న్నియంతవై, క్రమమున శత్రు
లన్ దునిమి రాజ్యముధర్మజుఁజేర్చినట్టి నె,య్య
ము గణియింపశక్యమె దయామృతనీరధి పా...

ఉ. పాండవులంప కౌరవసభాస్థలికింజని దుష్టబుద్ధి
మా,ర్తాండసుతానువర్తులయి దర్పమునన్ధృత
రాష్ట్రసూను లు,ద్దండత నిన్నుఁ బట్టుకొనఁ
దార్కొన వారలు భీతిఁజెంద బ్ర,హ్మాండమునిం
డఁ దాల్చితి భయంకరరూపము పా... 28

చ. వనచరపీడితుండగుచు వారణనాథుఁడు మిమ్ము
వేఁడ న్నా,తని మొఱ నాలకించి సురతండములచ్చె

రువొందిచూడఁగాఁ, జని మకరిన్ మహోగ్రనిజ
చక్రముచేఁ బరిమార్చి యగ్గజేం, ద్రునిదురవస్థ
బాపితివి తోయజలోచన పా... 29

చ. కమలభవాండభాండములు కల్పనసేయఁగఁ
బెంపఁ ద్రుంప లో, కమునను నీవుదక్క మఱికి
ర్తలు లేరని చాటిచెప్పు వే,దములు పురాణశా
స్త్రములు దద్దయు మీామదిగాన నన్యులన్, మి
ము విడనాడి వేఁడఁగలమే?కలనైనను పా...30

చ. కడిమి భవత్కథల్ విననికర్ణములున్ భవదీయ
కీర్తనల్, నుడువనినోరు నిత్యము నినుం బొడఁ
గానని యట్టికన్నులుం, బుడమిని బాడుబొంద
లనఁబోలునటం చని మాటిమాటికిన్, తడబడ
కేనుచాటెద ముదంబున నచ్యుత పా... 31

చ. సదమలబుద్ధి నిన్ను తృటిసన్నుతిఁ జేసినవాఁడు
సర్వసం, పదలనుజెంది పాపములఁ బాయుచు
సంచితపుణ్యుఁడౌచు నా, పదలను జెంద కెప్పుడు
శుభంబులచే మని తా ముదంబునన్, తుదిని
భవత్పదంబుఁ గను తోయజలోచన పా... 32

చ. నలినసఖుండు తాను గగనస్థితినొక్కఁడయ్యుఁ
జూడఁగా, జలభరితంబులైన కలశంబులయందు

ననేకరూపుఁడవై, యలరెడుభంగి ప్రాణినివహం
బులయందు ననేకమూర్తివై, వెలయుచునుండు
నీవు మునివేద్య జనార్దన పా... 33

చ. స్థిరమతి మీపదాబ్జములెదిక్కని యెన్నుచు నిత్య
ముక్తులై, పరగెడు శ్రీరమాపరమభాగవతోత్త
ముల న్నుతించి తచ్చరణసరోజతీర్థ మనిశంబును
గ్రోలెద వేడ్క మీఁఱ మద్దురితవిముక్తికై రిపు
విదూర రమాధిప పా... 34

ఉ. కారణకార్యరూపములఁ గన్పడుసర్వము నీవ
టంచు నాసారససంభవాదులును సత్యముగాఁ
దెలియంగలేక నిక్కసారె భజింతు రట్టినినుసంస్తు
తిసేయఁగ నెంతవాఁడనో, నీరజనాభ కృష్ణ ఘన
నీరజలోచన పా... 35

చ. పొలుపుగ మీపదాబ్జమునఁబుట్టినబిడ్డను వేడ్క
మీఱఁ దాఁ దలనుధరించి శంకరుఁడు చాల్చె శివా
ఖ్యను జిత్రమెన్నఁగా, బలజదళాక్ష నీమహిమ
సన్నుతిసేయ నశక్యమైన నాకొలఁదికిఁ దోఁచి
నట్లు నినుగోరి భజించెద పా... 36

చ. కడుమధురంబులై యమృతకల్పములై కలు
షాపహంబులై, యడరెడు మీచరిత్రము లహ
ర్నిశల న్వినుచుండువాఁడు తాఁ, నిడుములఁ బొం

దకెప్పుడు నభీష్టసుఖంబులుగాంచి ధన్యుఁడై, పుడ
మిని భాగ్యవంతుఁడనఁ బొల్పెసఁగుఁగాగద పా.

ఉ. ఎవ్వనినాభియందు జనియించి విరించి ప్రపంచ
మెల్లఁ బా, నెవ్వనిసత్కటాక్షమునసృష్టియొనర్చె
నమర్త్యకోటికిన్, ఎవ్వఁడు మూలమైవెలయు
నెవ్వఁడులచ్చికిభ_ర్తయయ్యె నేనవ్విభునిన్నుఁగొ
ల్చెద నహర్నిశలున్ హరి పా... 38

ఉ. వింటిని మీచరిత్రములు వేడుకమీఱఁగ మిమ్ముఁ
జూడఁగాఁ, గంటి భవత్కటాక్షమున గణ్యము
లేనిభవాబ్ధిఁ దాఁటఁగాఁ, గంటిని దమ్మికంటి రిపు
కంటకదేశ ముకుంద కృష్ణ ము, కణ్ణంటికినైన
నీమహిమ గానఁగ శక్యమె పా... 39

ఉ. కేశవ పద్మనాభ హరి కృష్ణజనార్దన వాసుదేవ ల,
క్ష్మీశ జగన్నివాస నరసింహ మురాంతక చక్ర
పాణి క్రవ్యాశనవైరి శార్ఙ్గ నరకాంతక వామ
న తార్క్ష్యవాహ వా, రాశిశయాన నన్గరుణ రంజి
లఁ గావుము పా... 40

చ. అమలినభ_క్తిచేత కమలాధిప నిన్నెవఁడైనగాని
హృ, త్కమలమునందునిల్పి విహితంబుగ పూజ
లొనర్చువాఁడు న, య్యమభటబాధలం బొరయ

కంత్యమునందు భవత్పదంబు సిద్ధముగను జెందు
నంచు మరిదల్చెద మాధవ పా... 41

చ. ఉరగశయాన దేవ పురుషోత్తమ కేశవ రుక్మిణీ
మనోహర నరమిత్ర మిత్రకమలాహితలోచన
నిర్వికల్పభాసుర నవహేమనేత్ర మధుసూదన
కైటభహారి దేవ నిన్ శరణమటంటిఁ గావు నను
సర్వజగన్నుత పా... 42

చ. గురువులయాజ్ఞమీఱి బుధకోటులమాటలు గేరి
నిత్యమున్ బరులధనంబుగోరి పరభామల పొంత
లఁజేరిదుష్టులై, తిరిగెడుమానవాధములు దిక్క-
రి యంత్యమునందుఁ బాపమన్, శరనిధిలో మ
నుంగుదురు సత్యముసత్యము పా... 43

ఉ. పాయక నిన్ను సంతతము బ్రస్తుతిజేసిన మాన
వుండును, శ్రీయుతుఁడై సమస్తజనసేవితుఁడైపొగ
డొందుచుండు నా, రాయణ వాసుదేవ కమలాధి
ప శౌరి జగన్నివాస పద్మాయతచారునేత్ర నర
కాసురమర్దన పా... 44

ఉ. కంటి భవత్పదాబ్జములు కంటిని దేవరశంఖచక్ర
ముల్, కంటినియుష్మదంకగతలక్ష్మిని గన్నులకర్వ
దీరఁగాఁ, గంటిని తావకీనవరకౌస్తుభమున్, లలి

త్రోర్ధ్వపుండ్రముఁ గంటిని నీదువాహనముఁ
గంటిని మిమ్ముల పా... 45

చ. పతితజనావనుండవని పల్కులు నిన్గొనియాడుచుం
డు నే, నతిముదమంద సంతతము నాశ్రితకల్ప
మహీజ దేవకీ, సుత చతురాననార్చిత విశుద్ధయ
శోజ్జ్వలరుక్మిణీసతీ, హితకరసూరిసేవిత యహీన
పరాక్రమ పా... 46

చ. చపలుఁడ బుద్ధిహీనుఁడను జారుఁడ చోరుఁడఁ
బాపకర్ముఁడన్, గపటిని నన్నుఁ బ్రోచుటకుఁ గర్త
వు నీవనినమ్మియుంటి నో, తపనశశాంకనేత్ర నిర
తంబును వేడుకమీఱ శ్రీరమా, ధిప ఖలదూర
దేవనుత దీనదయాపర పా... 47

చ. యదుకులసార్వభౌమ కమలాధిప దీనశరణ్య గో
పికా, హృదయసరోజమిత్ర నవహృద్యఘనామల
గాత్ర కంధిరా, ట్సదన ముకుంద కృష్ణ భవస
న్నుత పన్నగతల్ప నిన్నుసమ్మదమునఁగొల్తుఁ
గావునను మానిజనావన పా... 48

చ. పరులగుణంబులెన్ని తమపాటిజనంబులు నెంచి
చూడఁగా, ధరణిని లేరటంచు నిరతంబును పెద్ద
ల నిందసేయఁగా, దొరకొనుదుష్టమానవు లధో

గతిపాలయి దుఃఖపూరితో, దరులయి రౌరవా
బ్ధింబడి తామునశింతురురు పా... 49

ఉ. పావనమైన మీచరణపద్మమరందము గ్రోలు
చున్న నా,భావము హీనదైవములపజ్జ వసింపఁగఁ
బోవనేర్చునే, తావకదాసదాసులకు దాసుఁడ
నయ్యెద నన్ను బ్రోవవే, శ్రీవనితామనోహర వి
రించిభవార్చిత పా... 50

చ. హలకులిశాదిలక్షణ సమన్వితపాదసరోజ కృష్ణ
యీ, కలుషములు శాశ్వతంబులని కాయము నిత్య
ముగాదలంచుఁ బాఁ,దెలసి ధనేషణాదికవిధేయు
మతి న్నడుచంచలాత్ముఁడై, తెలియక చేతనుండు
కడతేరఁగనేరఁడు పా... 51

చ. అనుపమభాగ్యశీలశరణాగతవత్సల దేవదేవ నీ,
వెనసిన సత్కటాక్షమున నెవ్వనిఁజూడవు నెవ్వఁ
డైన ని, న్ననుఁగొనఁ డట్టివాఁడు నరకంబున నింది
తుఁడై వసించునం, చనయము న్నట్టు నామదిని
నచ్యుత కావుము పా... 52

చ. మురహర వాసుదేవ భవమోచన శౌరి జగన్ని
వాస శ్రీ,ధర ముచుకుందపాల ఖలదానవమర్దన
శ్రీరమామనో,హర హరసేవ్య కృష్ణ భవదంఘ్రి

యుగంబను తెప్ప చేత నే,దురితమహాబ్ధిదాఁటెదను
దుర్జనసంహార పా... 53

చ. శమదమయుక్తియోగు లనిశంబుయమాదులచే
త నాత్మకా,యములఁ గృశింపఁజేసి హృదయాం
బుజపీఠములందు నీపదా,బ్జములిడి నిత్యముక్తు
లయి సర్వము నీవనితల్తు రట్టిని, న్నమలినభక్తి
నేఁగొలుతు నచ్యుత కావుము పా... 54

పంచాయుధస్తవము.

చ. ఘనతరనిర్ధళద్రిపునికాయవధూజన గర్భగోళమై
కనదురుకాంతిసంవిజిత కాండజదుర్గమృదపూర్ణ
బింబమై, దనరెడు నీదుచిందమును దద్దయు
భక్తినమస్కరింతు నా, మన మలరంగ సంతతము
మౌనిచయాన్విత పా... 55

చ. పటుతరవిస్ఫులింగము లభంగమహాత్ప్రశయాన
లప్రభా,పటలమువోలె దిక్తటులఁబర్వఁగదారు
ణవృత్తిజన్యలం, పటుఁడగుమేదినీసుతునిబట్టి ధ
రాస్థలిఁ గూల్చినట్టిమీ, చటులసుదర్శనంబునకు
జాగిలిమ్రొక్కెద పా... 56

చ. అమలసువర్ణరత్నకటకాంచితమై సురరాజసేవ్య
మై, సమదనిశాటవీరభటసంచయకాననవీతిహో
త్రమై, యమరెడుయుష్మదుజ్జ్వలకరాబ్జగతోరు

గడాసుదండమున్, బ్రమదమొలర్ప సంతతము
ప్రార్థనఁజేసెద పా... 57

చ. భవదురువిక్రమక్రమము ప్రాఘికి నెక్కఁగ దో
ర్వ్యగంబుచే, దివియననుస్ఫురించుగతిఁ దేజము
మీఱుచు బాణవృష్టిన, ద్దివిజవిరోధిసంఘముల
ద్రుంచి విరించిముఖాదిదేవసం, స్తవములు గాం
చునీదుఘనశార్ఙ్గముగొల్చెద పా... 58

చ. అతినిశితోజ్జ్వల న్నిజభయంకరరూపవినీలధార
చే, నతులబలాతిరేకమనుజాశనకంఠవిలుంఠనక్రి
మా, చతురతనెన్నికన్వడసిసంతతముఖ్ సురపూ
జ్యనీయమై,తిలిపొగడొందుయుష్మదసిక్ బ్రణ
వల్లెద పా... 59

దశావతారసూచకము.

చ. జలములజొచ్చినన్ శిఖరిచాటునడాఁగిన ముస్తె
లెత్తినన్,బిలమునగూడినన్ పరులభిక్షము వేఁడిన
రాఘమూతివై, ఘలరినఁగానకేగిన దురాశలజెం
దిన హానివైన ని, న్నలరుచుఁ గొల్తు నింక కలి
కాకృతివైనను పా... 60

చ. పనిగొనిపద్మసంభవుఁడు భారతితోనిదురింపఁ జో
రుఁడై కనుగొని వేదముల్గొనుచుఁ గంధినిజొ
చ్చినసోమకాసురు, న్వెనుకొని మీనరూపమున

వేగమె వానివధించి యాశ్రుతుల్, మునుకొని
బ్రహ్మకిచ్చి జగముల్ దగ బ్రోవవె పా... 61

ఉ. మందులు జేర్చి పాల్కడలి మంచిఘటమ్ముగ మం
దరాచలం, బందపుంగవ్వమై యహికులాధిపు
త్రాడుగ దేవదానవుల్, పొందుగఁ దర్వ నంబు
ధిని భోరున నగ్గిరి గ్రుంగఁ గూర్మమై, సుందరలీలఁ
దాల్చిన యశోనిధివౌభళి పా... 62

చ. ఇలఁగొని యారసాతలము కేగెడిమేలిమికంటిర
క్కసు, న్నలిని వరాహరూపమునఁబట్టి వధించి
ధరాతలంబు దెం, పలరఁగఁ బంటిమీఁద సకలా
మరులెన్నఁగఁదాల్చి లోకముల్, వెలయఁగ
నేలునీమహిమ వింతగదా హరి పా... 63

చ. హరిమయ మీ ప్రపంచమని యాడెద విచ్చటఁ
జూపుమంచుఁ జే, జఱచినఁ గంబము న్వగులఁ
జండతరోగ్ర నృసింహమూర్తివై, స్ఫురితనఖాళి
హేమకశిపు న్వడిఁజీలిచి బాలునేలు నీ, చరిత
ములెన్న శక్యమె విశాలయశోనిధి పా... 64

ఉ. వేలుపుమూఁకలందరిమి వేడుకతో బలి యాజ
గత్త్రయం, బేలఁగనెంచి మూఁడడుగులింపుగఁ
గుబ్జతవేడి వానిఁ బా, తాళముఁజేర్చి తత్పదవి
తత్ క్షణ మింద్రునకిచ్చినట్టినీ, లీలల లెక్కఁబెట్టఁ
గనులే రజముఖ్యులు పా... 65

ఉ. కంటకులైనపార్థివులకంఠము లిర్వదియొక్కపో
రులన్, బంటుతనంబున న్దునిమి పాయక తద్రుధి
రాపగమ్ములన్, వెంటనె పైతృకమ్ము లతివేడుక
దీర్చిచి భార్గవాఖ్యచే, బంటవలంతిభారము
బాపితివౌ భళి పా... 66

చ. దినకరవంశజుండవయి ధీరతఁదాటకద్రుంచి గౌత
మాం, గనుబవిత్రఁజేసి కరకంఠునివిల్లునుమాడి
సీతనొ, య్యనవరియించి కాననమునందుఁజరించి
పయోధిదాఁటి రా, వణుని వధించి తీవె రఘువ
ర్యుఁడవై హరి పా... 67

చ. అజహరు లెన్నఁగై రవహితాన్వయమందుజనించి
యచ్యుతా, గ్రజుఁడనయించి రేవతి కరగ్రహ
ణంబొనరించి సాధన, వ్రజములుదాల్చి ఘోరస
మరంబున ముష్టికముఖ్యదుష్టులన్, భుజబలిమి
న్వధించి జగము ల్మనసేయవె పా... 68

చ. త్రిపురవరుల్ దురంబుల సతీపతి నొంపఁగ
బౌద్ధమార్తివై, కపటమునం బదీయకులకాంత
లనిష్ఠలుమాన్పి శైలజా, ధిపునకు సాధనక్ర
మము చెప్పి పురంబులు గాల్చినట్టినీ, విపులచరి
త్రముల్ వినఁగ వింతగదా హరి పా... 69

చ. కరముల శంఖచక్రశరకార్ముకఖడ్గము లుల్లసిల్లఁ

గాఁ, దుర్గముపై వడిన్బ్బలిచి దుష్టుల బర్బరపా
రసీకఘూర్జరులను ద్రుంచి ధర్మముధరాస్థలినిల్పఁ
గఁ గల్కిమూర్తివౌ, గురుతరశీలదేవ నినుకోరి
భజించెద పా... 70

చ. కడలిఁజరించి మందరము కవ్వముగాభరియించి
పంటిపైఁ, బుడమిధరించి దైత్యసుతుఁబ్రోచి
బలీంద్రునివంచి రాజులక్, బొడిచి దశాస్యుఁ
ద్రుంచి హాలము న్గొని బుద్ధతమించి కల్కివై,
యలరెడునిన్ను వేఁడెద దయామృతనీరధి పా.

ఉ. శ్రీరమణీశ యోగిజనసేవిత పాదసరోజమందరో
ద్ధార సుమేరుధీర నిజదాసజనావనఖేల దీనమం
దార భుజంగరాణ్మృదులతల్ప జగత్త్రితయైక
మోహనా, కార కృపాసముద్ర హరి కాళియ
మర్దన పా... 72

చ. పదములఁగిల్కుటందియలు బంగరుదట్టికటీతటం
బునన్, ఎదసిరికౌస్తుభంబఱుతనింపుగఫాలతలం
బునన్మృగీ, మదతిలకంబు నొదలనుమంజులరత్న
కిరీటమూని నన్నదనుగఁబ్రోవవే దయ దయా
మృతనీరధి పా... 73

చ. నిరుపమనీలదేహ రజనీచరమర్దన గోపికామనో
హార నవనీతచోర వికచాంబుజనేత్ర జగన్నివా

సభా, సురగుణజాల హేమ మణిశోభితహారకి
రీటకుండలా, భరణ విరోధిసంహరణ పాండవ
పాలన పా... 74

ఉ. రంగు మెఱుంగుదువ్వలువ రాజితరత్నవిభూష
ణంబులు, ప్పొంగుచుఁదాల్చి నీలమణిపోలిక
మేన్విలసిల్ల శ్రీరమా, లింగన వైభవంబలరులీ
లఘటిల్లఁగ నేగుదెంచి నీ, బంగరు పాదపద్మ
ములు బాగుగఁజూపవె పా... 75

చ. వరద ముకుంద చక్రధర వాసవవందిత వాసుదే
వ వం, ధరధరణీధరోద్ధర సనందనసంస్తుత వేద
వేద్య శ్రీధర మురదైత్యభంజన పతంగకులాధి
పవాహ రాధికా, వర వరరత్నసంగతసువర్ణవి
భూషణ పా... 76

ఉ. దొంతరబాములన్వడలు త్రోవఁగనుంగొనలేక
జేలనై, వంతలఁబొందుచున్న నను వంచనసేయ
క బ్రోవుమంచు నే, చెంతకుఁజేరినాఁడ నెడసే
యక సత్కృపతోడఁ గావవే, దంతురశాంతి
దాంతిగుణధామ దయానిధి పా... 77

ఉ. పంకజనాభ ఘోరభవపాశవిమోచన గోపవేష
శే,షాంకశయాన శౌరి సుజనావన దారుణావాస
వేంద్రసా,శంకరశంఖచక్రధరశంకరసంస్తుత దేవ

దేవ నీ, కంకితమైనదీకృతి రయంబునఁ గైకొను
పా... 78

చ. అభవుఁడ వంతరాత్ముఁడ వనాద్యుఁడ వార్య
హితైకసత్కళా, విభవుఁడ వప్రమేయుఁడ వవి
శ్వుఁడ వక్షయతత్వబోధసా, నుభవుఁడ వార్త
బంధుఁడ వనుశ్రుతవీర్యుఁడవైననీవు నా, కభయ
మొసంగి బ్రోవవె దయామృతనీరధి పా...

ఉ. నందసునందనందన సనందనవందన కంజనేత్ర గో
విందముకుంద కేశవ త్రివిక్రమ కృష్ణ మురారి
సచ్చిదా, నంద పురందరామరగణస్తుత సద్గుణ
బృంద యిందిరా, మందిర మామకవ్యథలు మా
న్పఁగదే హరి పా... 80

చ. తలఁచుగ గోగణవ్రతనిశాంతపఃతి స్థితుఁడౌ
నృగుండు భూ, సురవరకోపదీపితవచోహతి దు
ర్భరనిర్జలప్రహిః, సరటగతి న్వసింపఁగని శాప
విమోచను జేసి బ్రోచితే, గుఱుతుగ నీమహామ
హిమ కోవిదు లెన్నఁగ పా... 81

చ. గురుతుగ కంసదాసియగుకుబ్జపటీరసుగంధబంధు
రా, గరుఘునసారలేపనము గైకొని పైకొనిరా
చి సుందర, స్మరశరలీలఁ దేర్చి సరసంబగుకోరిక
దీర్చి మోక్షసం, భరితను జేసినట్టినిను భక్తిని
గొల్చెద పా... 82

చ. గురుమతితోఁగుచేలుఁడటుకుల్ పిడికెండొసంగఁగ భుజించి భా, సురతరమోక్షసంపదలు శోభిలఁగా దయచేసితౌ భళీ, కరమనురక్తి భూమిసురకా మిను లన్నమొసంగ వారినా, దరమున బ్రోచు నీనెనరుదెల్పఁగ శక్యమె పా... 83

చ. అరుదుగ రాజసూయమఖమప్పుడు చైద్యుని మస్తకంబు ప, శ్లైరమనుచక్రధార నవలీలఁగద్రుం పఁగ నెల్లవారల, చ్చెరుపడ తేజమున్వెడలి జేరెఁగ దా నిను నీదుమాయ లె, వ్వరలకునైనశక్యమె ధ్రువంబుగ నెంచఁగ పా... 84

చ. విరివిగ గోపకామినులవేణువుఁబూని వినోదపం చమ, స్వరమృదుమాధురీరవ వశస్ఫురితాంగు లఁజేసి మోహన, స్మరసుఖకేళిదేల్చి సుకుమార ముల న్విలసిల్లునీదుసుం, దర మరయంగఁ గోరితి ముదంబునఁ జూపవె పా... 85

చ. విరటుపురంబున న్మదనవేదనకోర్వక కీచకుండు బి, త్తరిద్రుపదావనీశదుహితన్గవయన్ గజనువేళ ను గ్రుఁడై, కరువలిపట్టి నీదయనుగాదె వధించి యశంబుగాంచి దు, ర్భరుఁడగు మాగధున్ దృణ ముభంగెని జీలిచె పా... 86

చ. మురియుచు దుర్మదాంధమున మోసముగానక దుష్టచిత్తుఁడై, కురుపతిపాండునందనులఁ గొంచక

వంచనసేయ వానిసం,గరమునఁగూల్చి రాజ్యము
సుఖస్థితి ధర్మజుఁడేలు టెల్ల నీ,కరుణనుగాదె నీమ
హిమగాంచఁగ శక్యమె పా... 87

ఉ. మన్నుఁలుదిన్న బిడ్డఁడని మాటికి నిన్ను యశోద
బల్కఁ బ,ల్వెన్నలు మెక్కుచోరుఁడని వ్రేత
లు వేమరు అవ్వసేయఁ దా,ర్కొన్న దవాగ్నిమ్రిం
గెనని కొంచకగోపకుమారులెన్న నీ,చిన్నెలవిన్న
చోద్యము వచింపఁగ శక్యమె పా... 88

చ. పరులను వేఁడనంటి పలుబాములకోరువనంటి నీవ
నా,దొరవనినమ్మియుంటి నెటుదోఁచక వేదనఁ
గొంటి మేటిదే,వరవనివెంటనంటి నిను వర్ణనసే
యుచు వేఁడుకొంటి నా,మొఱవినుమంటి ప్రోవు
మనిమ్రొక్కఁగఁ గంటిని పా... 89

చ. నిరతము నిన్నుఁగొల్చుమహనీయులఁ జెందదుపా
తకవ్రజం, బరయఁగ నంచు దేవ భవదంఘ్రిప
యోజము లాత్మలోన సు,స్థిరముగ నమ్మినాఁడ
ననుచిక్కులుబెట్టఁగనేల ప్రోవవే,పరమదయాం
బుధీ విహగపాలరథీ హరి పా... 90

చ. ఉడుతను లేడినిన్ కరిని నూసరవెల్లిని గొండచి
ల్వనున్, బడవరిపక్షినిన్ బడుగుబాపని బూవు
లవాని చాకినిన్, బుడుతని బానిసన్ గడకు

బోయతయింతి నరణ్యచోరునిఁ, గడువడినేలు
నీనెనరు గాంచఁగవింతగు పా... 91

ఉ. దండముదండ మద్రిధర దండముదండము పాం
డవావనా,దండముదండ మద్రినుత దండముదం
డము చండవిక్రమా, దండముదండ మబ్జభృత
దండముదండము భండనోత్సుకా, దండముదండ
మార్యహిత దండముదండము పా... 92

ఉ. నీపదపద్మసేవనము నీపదభక్తులతోడి సఖ్యముఁ
నీపదపద్యముల్ వినుట నీపయిబుద్ధులు నాకొ
సంగవే,తాపసకల్పభూజనిజదాసజనావన యింత
కంటె నిం, కేపగిది నృణింపఁగలదే యపవ
ర్గము పా... 93

చ. సురతతిఁజూడ నచ్చరలు సొంపలరింపఁగనాడఁ
గిన్నరుల్, వరలయతాళసంగతుల వారక
గానముబాడ భూసురుల్, వరుసను స్వస్తివాచ
కముల నృణుతింపుచు వేడ్కరమ్ము నా, దురితము
లెల్లవీడఁ గృపతోడను బ్రోవఁగ పా... 94

ఉ. రవ్వలుజేసి గోపికలు రాయిడిఁబెట్టఁగఁ గావ
వైతివా, చివ్వలొనర్చుదైత్యులకుఁ జెచ్చెరనై
క్యమొసంగవైతివా, క్రొవ్వునబాళ్లలువ్వి జడిఁ
గొట్టిన శక్రునినేలవైతివా, పువ్వులఁ బూజసే
యునను బ్రోవనిదేమిర పా... 95

ఉ. ఒప్పులకుప్పనీవుముదమొప్పఁగనప్పులకుప్పలోన
బ,ల్గొప్పగఁ జిల్వపాన్పునను గోమలితోఁ బవ
ళించి లోకముల్, తప్పక బ్రోతువంచు విదిత
మ్ముగ నొజ్జలుచెప్ప నమ్మి యా,చొప్పున గొల్చు
నన్ను దయఁజూడఁగదే హరి పా... 96

చ. పరుఁడనుగాను రార భవబాధలకోరువలేర నిన్ను
సు, స్థిరముగ నమ్మినార మదిదీనత మానుపవార
సామి నా,మొఱవినవేర నేను నిను ముఖ్య
ముగా వినుతింపనేర న,న్నొరలను బెట్టమేర పరి
పూర్ణదయాంబుధి పా... 97

చ. గురుతుగ సత్యలోకమునకున్ హనుమంతుని
సర్వలోకసం, భరితునిగా బలిన్ జెలిమిబాయ
క ప్రాణికి మానిరాట్పదం,బరయఁగనర్కజాధిపు
న కామను రాజ్యపదాధికారముల్,విరివిగఁ గల్గఁ
జేయ దొరవీవనివింటిని పా... 98

ఉ. కంటిని రుక్మిణీసతిని గంటిని సాత్రజితీవధూ
మణిన్, గంటినిశంబరాంతకుని గంటిని శ్రీబలభ
ద్రదేవునిన్, గంటినుపాంగనాపతిని గంటినిమీ
పరివార మంతయున్, గంటినిమిమ్ము మీనెనరుఁ
గాంచఁగఁ గంటిని పా... 99

చ. శరణు సమస్తదేవగణసంస్తుతే దివ్యపదాంబుజద్వ
యా,శరణు కళిందజాతట విశాల వనాంతర

గోగణావనా, శరణు వ్రజాంగనావదనసారస
విస్ఫుటలోకబాంధవా, శరణు తుషారహీరఘన
సారయశోనిధీ పా... 100

చ. సరసిజనేత్ర రారగుణసాగర రారమురారి రారసుం
దరఘనగాత్ర రార శుకనారదసన్నుత రారగోపికా
సురతవిచిత్ర రార దయఁజూడవదేరకలంచెదేరనా
దురితముబాపవేర భవదూరదయానిధి పా...

ఉ. ఆతప మర్కుఁ డబ్జుఁడు హిమాంశువు లంచిత
వృష్టివారిద, వ్రాతమయత్నపూర్వముగఁ బ్రాణుల
కింపొనరించినట్లని, ర్హేతుకజాయమానకరుణేక్షణ
పంక్తుల బ్రోవ నీవెగా, దాతవటంచు నమ్మితి
యథావిధిగా నిను పా... 102

చ. జడుఁడ శఠుండ ధూర్తుఁడ నృశంసుఁడ దుష్టుఁ
డ కష్టుఁడన్దురా,త్ముఁడనతి ఘోరకల్మషుఁడ మూ
ఢుఁడ దుర్భవసాగరంబునన్, బడలినవాఁడ నోప
తితపావన మోహారి యో యదూద్వహా, తడయక
బ్రోవవేయనుచు దండము బెట్టితి పా... 103

ఉ. మ్రొక్కెద దేవకీతనయ మ్రొక్కెద సంతతసేవకావ
నా, మ్రొక్కెద దేవదేవ హరి మ్రొక్కెద భావభ
వారినేవితా, మ్రొక్కెద రుక్మిణీరమణ మ్రొక్కెద
పాత్రజితీమనోహరా, మ్రొక్కెద కంససంహరణ
మ్రొక్కెద గావవె పా... 104

చ. జయజయ దేవదేవ జలజాతభవార్చిత పాదపం
కజా, జయజయ వామదేవ గిరజన్మముఖామర
జాలసంస్తుతా, జయజయ వాసుదేవ నవసారసప
త్రవిశాలలోచనా, జయజయశారదాభ్రసురసా
లయశోనిధి పా... 105

చ. పుడమిని తాడెపల్లికులముఖ్యుఁడ విప్రుఁడ పా
నకాలురా,యుఁడ భవదంకితమ్ముగ శతోత్పల
చంపకవృత్తముల్ నుడం,బడర రచించినాఁడను
దయామతిగైకొని ధన్యుఁ జేయవే, తడయకనం
చు మ్రొక్కెదను దప్పక బ్రోవవె పా... 106

చ. నిరుపమకౌస్తుభాభరణ నీరదసీలశరీర హాటకాం
బర జగదేకవీర భవబంధవిమోచనశూర వాస
వా,వరజ ముకుంద కృష్ణ యదువల్లభ భూరియ
శోలసద్ధృతీ, తిరువలికేణిపట్టణపతీ గుణనీరధి
పా... 107

ఉ. మంగళ మిందిరాసహిత మంజులనీరదసీలవిగ్రహా
మంగళ మభ్రకేశనుత మానితకౌస్తుభహార
కంధరా, మంగళ మార్యలోకహిత మానిజ
నస్తుత పాదపంకజా, మంగళ మంచు నిన్నెపుడు
మానకఁగొల్చెద పా... 108

పార్థసారథిశతకము

సంపూర్ణము.

# పీ ఠి క.

ఈ రాజశేఖరశతకము చంపకోత్పలమాలికలతో రచింపఁబడిన యుత్తమశతకము. ఇది రచించినకవి సత్యవోలు సోమసుందరకవి. ఈయన నియోగి బ్రాహ్మణుఁడు. వేంకటరాయ మంత్రిపుత్త్రుఁడు. "శాంకరీవరపరిలబ్ధసారమృదు వాక్కలితానతగీతసాహితీపరిచయుఁడనై" అను శతకపద్యభాగమువలన నీకవి సంస్కృతాంధ్రభాషలయందె గాక సంగీత విద్యయందుఁ గూడ నిపుణుఁడని యెఱుంగనగును.

కొలఁదిగ నీతిపద్యములున్నను నుత్తమము మీఁద నీ రాజశేఖరశతకము భక్తిరసశతకములలో నొక్కటి. ఇందు తేలుతగలపద్యములు కొన్ని యంత్యనియమముతోడను గొన్ని ముక్తపదగ్రస్తముగ వ్రాయఁబడియున్నవి. కవిత నిరర్గళధారాశోభితమై మనోహరముగానున్నది. కులశేఖరాళ్వారులు చెప్పిన ముకుందమాలయందలి యీ క్రిందిశ్లోక మీశతకమున 87-వ పద్యమునఁ గలదు.

శ్లో. కృష్ణ త్వదీయపదపంకజపంజరాంత
మద్యైవ మే విశతు మానసరాజహంసః,
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే.

ఈశతకకర్త ప్రకృతము సజీవిగా నున్నాఁడు. ఈయన వచనకాందబరి లోనగు గ్రంథములు రచించెను. కవిత మృదుమధురము. కవి శతకమున 'సారెకు ముద్దుగుల్కెడు లసత్కవితామృదులత్వముక్షుధాధారలు చిల్కుపల్కులను దారపుభక్తియు నొసంగ రారా' యని చెప్పికొనినటుల నీశతకమునందు మధురశైలియు భక్తిరసభావములు నీశ్వరానుగ్రహమున గడించెనా యని శతకమునందలిపద్యములు చదువునపుడు తోఁపక మానదు. కవినివాసము గోదావరిమండలమునందలి యుప్పాడకొత్తపల్లియని తెలియుచున్నది.

మేము ప్రచురింపఁబోవు శతకసంపుటమునం దీయుత్తమశతకమును ముద్రించుకొనుట కవకాశము నొసంగి మాయుద్యమమునెడ సానుభూతిఁజూపిన యీశతకకర్తయెడఁ గృతజ్ఞులము. ఆధునికశతకవాఙ్మయమున నిట్టి విలువగలశతకములు చాలతక్కువగా నున్నవనుట యత్యుక్తి కాఁజాలదుగాన నీశతకము నుత్సాహముతోఁ బ్రచురించినారము.

ఇట్లు,

తండయార్పేట
చెన్నపట్నం.
16-4-26.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు
అండ్ సన్స్.

శ్రీ రస్తు.

సత్యవోలు సోమసుందరకవికృత

# శ్రీ రాజశేఖర శతకము.



ఉ. శ్రీకర దాసమానసనశీకన హైమవతీముఖాబ్జశో
భాకర సత్ప్రభాకర కృపారసపూరిత మంజువా
క్సుధా, శీకర వైరిభీకర విశేషలసద్గుణరత్నపా
ళీర, త్నాకర సర్వలోకసముదారదయాకర రాజ
శేఖరా. 1

ఉ. ఈశ జగత్ప్రకాశ నమదింద్రదిగీశ శరీరకాంతి
సం, కాశ నిశేశకాశ ధృతకాశ గిరిశ ధరాదిసర్వ
భూ, తేశ నిశాటనాశ జగదీశ విలుంఠితకర్మ
పాశ గౌ, రీశ వియత్సుకేశ పరమేశ కృపాకర
రాజశేఖరా. 2

ఉ. రాజత ధారుణీధర విరాజిత భూరిసువర్ణదుర్గస
ద్రాజ సురారినాగమృగరాజ పదానతభక్తియు
క్తగో, రాజ యశోజితాబ్జఘణిరాజ సఖాంచిత
రాజరాజ రా, రాజులకెల్ల నీవెగద రాజవు శ్రీ
కర రాజశేఖరా. 3

ఉ. తారగిరీంద్రధామ ధృతతారకనామ సురాద్రి
ధీమ సం, పూరితభక్తకామ పరిపోషితదేవలలా

మ దానవ, ద్దారుణశత్రుభీమ గజదానవదానవి
రామ శేఖరా, కారశిరస్థసోమ కృతకామ మహే
శ్వర రాజశేఖరా. 4

చ. భవలతికాలవిత్ర నతపాపవిమోచనసూత్ర సార
సో, ద్భవదివిజేశ్వరాదినుతిపాత్ర త్రినేత్ర గుణ
త్రయోల్లస, ద్భువననిదానచిత్ర ఘనపుంగవపత్ర
పవిత్రసత్కథా, శ్రవణవతీకళత్ర ఘనసార య
శోభర రాజశేఖరా. 5

ఉ. అంగజగర్వభంగ శరదభ్రశుభాంగ విలోలస
త్కృపా, పాంగ నగాత్మజాహృదయపంకజభృంగ
యశోజితేంద్రసా, రంగ దయాంతరంగ జలరాశి
నిషంగ మహీశతాంగ శ్రీ, పుంగవరాడ్తురంగ
ఘనపుణ్యగుణాకర రాజశేఖరా. 6

చ. సరసిజజామశేంద్రముఖసన్నుత దివ్యలసచ్చరిత్ర
భీ, కరదురితౌఘకాననని కాయవినాశన వీతిహో
త్ర భా, స్వరఘనసార గాత్ర విలసన్నతిహైమవతీ
కళత్ర కి, న్నరగణరాజమిత్ర వరనాకధునీధర
రాజశేఖరా. 7

చ. హితకవితాభిలాష సుకవీశ్వరపోష మనోజ్ఞ వేష
సం, తతపరితోష దాసజనతాకృతదోష తమిస్ర
పూష సం, భృతఫణిరాజభూష సరసేందుక

రాంచితమంజుభాష సం, హ్నాతనిపువర్గదోష నత
హృద్వరమందిర రాజశేఖరా. 8

చ. సురగిరిచాప దివ్యతనుశోభితభోగికలాప శార్వ
రీ, కరమణివల్లకీవ్రమలగాననినాదపరీతమాధు
రీ, భరసరిదంతరీ మునిభాషితభాసురచిత్స్వ
రూప సా, దరసరసానులాప నిజదాసదయాకర
రాజశేఖరా. 9

ఉ. మంజులభక్తలోకకృతమానిత గానరసానుకూల
స, ద్రంజితకంజజాదికపరాత్పరతత్వపరార్యజాల
ద్వి, డ్భంజనపాటవాంచిత విభాసురకోటిలసత్త్రి
శూల స, త్కుంజహ్నాదజ్జఖేల నతభూరికృపాకర
రాజశేఖరా. 10

ఉ. పన్నగరాజకంకణ ప్రసన్నజనావన భక్తియుక్తి
సం, పన్నమత్కృపాంప్రభవపాపవిమోచన దేవ
తాధిరా, ట్పన్నుతప్రోల్లసచ్చరణ సాగరతూణ
రమేశబాణ యా, పన్నజనార్తిసంహరణ భవ్య
కృపాగుణ రాజశేఖరా. 11

చ. నిగమసమూహఘోట బలనిర్జిత ఘోరనిశాట
పాపహృ, ద్గగనతరంగిణీకుముదకాండముదావ
హచంద్రికాధగ, ద్ధగితదిశాంతరాశిహిమధామ
కిరీట ప్రసన్నఖేట భ, ద్రగరజతాద్రికూట నగ
రాజసుతేశ్వర రాజశేఖరా. 12

చ. తొలుతను విఘ్ననాయకునిఁ దోరపుభక్తిఁ దలంచి భారతీ, లలనకు మ్రొక్కి లక్ష్మికిఁ జెలంగుచు నంజలిఁజేసి నెమ్మదిన్, గులుకుచు సర్వమంగళను గొల్చి పితామహాలు నెంచి యారమా, కలితు నుతించి నేఁడు శతకం బొనరించెద రాజశేఖరా.

చ. వలనుగ రాజతాద్రియు నివాసము హేమనగంబు చాపముల్, గలధనివైన నీకు మరి కాన్కలికేమి యొసంగువాఁడ నే, న్నలరఁగఁ జంపకోత్పలసుమావళుల న్మధుబిందుబృందముల్, జిలుకఁ గఁగూర్చి నీ కిడెదఁ జేకొను శ్రీకర రాజశేఖరా.

ఉ. సారెకు ముద్దుగుల్కెడు లసత్కవితామృదులత్వము న్సుధా,ధారలు జిల్కుపల్కుల నుదారపుభక్తియు నాకొసంగ రా,రా! రజతాద్రివాస! నగరాజసుతాహృదయేశ సాహితీ, సారమెలర్ప నీమహిమ సన్నుతిచేసెద రాజశేఖరా. 15

మత్తపదగ్రస్తచంపకము.—

సరసకవీంద్రసన్నుతలసత్పదపారస సారసాంబకా, పరిమితబాహువిక్రమ నివారణ వారణదైత్యఖండనో, త్కరకరలగ్నమేరుగిరికార్ముకకార్ముకసక్తభార్గవీ, వర వరబాణ బాణహాతపాపపురాసుర రాజశేఖరా. 16

చ. పలుమరు శబ్దగుంభనలు భవ్యసుధారసబిందు
బృందముల్, జిలికినరీతి వాగ్రచనచే సుకవిత్వ
మొనర్ప నేర్చియు, జ్వలభవదీయపాదనుతిసల్పని
జన్మము జన్మమే మహీ, స్థలి నటుగాన నిట్టికృతి
సల్పెద శ్రీకర రాజశేఖరా. 17

ఉ. నారదముఖ్యసన్నుత సనాతన తావకసత్కథా
సుధా, వారిధినంతయుఁ దవిలి పానముసేయఁగ
నెవ్వఁడోపు భా, గీరథినీరముల్ గటు లౌగిఁ
మశకంబులు గ్రోలుచుండవే, కూరిమి తృప్తి
యుఁ దులగగోత్రసుతావర రాజశేఖరా. 18

చ. తరికిట తాంధణాంకిణతతజ్ఝణుతద్ధిమితాంగతక్ఝ—
ణేఘం, తరి యని తాళలీలల మృదంగ ధిమిద్ధి
మినిక్వణార్భటిఁ, సరిగమపధల్ క్రమాక్రమత
సల్పుచుఁ బొల్పగురీతి శుద్ధసా, హురి నిదె గీతి
సేతు భవదుత్తమనామము రాజశేఖరా. 19

చ. కురువక మాధవీ వకుళ కుంద శిరీష లవంగ
యాలకీ, సరళలతా వితాన ధర సారస పాటల
జాల మాలతీ, గురుతర పారిజాత నవకోరక
చారులతాంత భూజనుః, పరివృతరాజతాద్రిమ
ణిభాస్వరమందిర రాజశేఖరా. 20

ఉ. చారు నమేరు నీప హరిచందన నింబ కదంబ

జంబు జం, బీర మధూక బిల్వ కరవీర తమాల
రసాల సాల మం, దార మహామహీరుహావితాన
విరాజితరాజతాద్రిసం, చార శుభప్రచార భవ
సాగరనాథర రాజశేఖరా. 21

ఉ. సారస చక్రవాక విలసత్కలహంస జలాటకు
క్కుటీ,వార విహార ధీరసురవారవధూకుచలిప్త
చందనో, దార మృగీమదాతిపరిభావనగంధిల
వాఃప్రపూరకా, సారపరీతరౌప్యగిరిసన్మణిమం
దిర రాజశేఖరా. 22

చ. లలితమృదంగవాదనకలాతతనాదఘుమంఘు
మిత్ప్రశ్రుతుల్, గలయుచు రంగురక్తియునుఁ గ్రా
లలయాతతగీతసాహితీ, కలనఁ జెలంగఁ బాదము
ల గజ్జెలుకట్టి ప్రదోషతాండవం, బలర నొనర్చు
నట్టి త్రిపురాసురసంహార రాజశేఖరా. 23

చ. నిటలతటాంజలిప్రణతనీరజగర్భశిరఃకిరీటసం, ఘ
టితమసారనీలరుచికాండమదాళిపరంపరాంచితో
ద్భటభవదీయపాదనవపంకజయుగ్మము సర్వసంప
దల్, పటుతరలీలఁగూర్చు నిజభక్తుల కిద్ధర
రాజశేఖరా. 24

ఉ. సారయశోజితాబ్జఘనసార తుషార పటీర హీర
మం, దార శతార తార దర తారక పారద

నారదాభ్రకా, సార మరాళ హార శర శారద
నారద శారదా సుధా, సార దయాకరా వినత
సన్ముని శేఖర రాజశేఖరా. 25

చ. లలితకటాక్షవీక్షణకలాపముచేఁ జెలువొందు
మోమునన్, గులికెడు మందహాస మది కోటి
శిరస్థితచంద్రచంద్రికల్, గెలువఁగ నేగులీలఁ
దులకింపఁగఁ దానకసమ్మదప్రభా, కలితకలావి
లాస మెదఁ గాంచెద శ్రీకర రాజశేఖరా. 26

ఉ. సారలవంగ సత్క్రముక శారదసార సమేతకమ్ర
పీఠీ రసభార గంధవహడింభక వార విరాజితాన
నాం, భోరుహ వల్లభారచితఘోరవిలాసకలాప
దీపనో, దారరతిప్రచార నిజదాసదయాకర
రాజశేఖరా. 27

ఉ. సాంకవగంధసార ఘనసార మృగీమదరేణుగం
ధివా, మాంకపంచో త్తరీయజనితాంచితశీతల
వాతధూతమిా, నాంకవిలాసకేళిజనితాయతని
ర్మలఘర్మబిందుబృం, దాంకితదేహజశ్రమని రామ
యవిక్రమ రాజశేఖరా. 28

ఉ. నాయక తావకీనగళనైల్యము సన్మదషట్పదభ్ర
మన్, జేయునటంచు శాంకరి హసింపఁగఁ జంప
కనాసవీవు నీకీయెడ నట్టిభ్రాంతిగలదేయనినవ్వ

చుఁ బ్రాణనాయకిన్, డాయఁగఁజేర్చి ముద్దిడఁ
గడంగెదు శ్రీకర రాజశేఖరా. 29

చ. కలువలదండలు న్వాలె నిగారఁపుమిన్కులనీను
పేరులన్, గళమునఁ బూనినాఁడవని గౌరి రహి
న్బరిహాససూక్తులన్, బలుకఁగఁ గల్వదండ
లనవచ్చును నీచిఱునవ్వువెన్నెలన్, గులుకునటం
చుఁ బల్కెదవు సూర్తి దయాకర రాజశేఖరా.

చ. గళముననొప్పు నబ్బెడఁగుకప్పుమరాళిని దెప్ప
గా మహాో, జ్జ్వలదరహాస మెల్లెడలఁ జల్లని వె
న్నెలనిగ్గుఁ గుప్పగాఁ, జిలుకలువల్కురీతి సుధఁ
జిల్కఁగఁ బల్కెడు గౌరిముద్దుప, ల్కులగమి
యొప్పఁగా మిగులగుల్కెడు శ్రీకర రాజశేఖరా.

ఉ. కీర మయూర కోకిల శుకీ కలహంస శకుంత శారి
కా, వార కలధ్వనుల్ గలిగి భాసిలుచుండెడు
పువ్వుఁదోఁట వి, స్తారపురాకృతాతిభవతారక
తావకసత్కథాసుధా, ధారలు గ్రోలుపూట
యు ముదంబిడు శ్రీకర రాజశేఖరా. 32

చ. సుర లతిభీతులై శరణుఁజొచ్చిన వారల నాదరిం
చుచున్, మురహరుని న్వసుంధరను భూరిమహీ
ధరము న్మహాంబుధిన్, శర మరదంబు చాపము
నిషంగము గాఁగ ధరించి యాజిలో, నురవడిఁ
ద్రుంచి తార త్రిపురోద్ధతదైత్యుల రాజశేఖరా.

ఉ. తావకసంస్తవార్హ లలితంబగు వాక్యతతిన్ గవు
ల్ ధనా, శావశులై కదర్యమదశాలి నృపాలుర
పాలుసేతు రౌ,హహా! వియదాపగాసలిల మబ్బిన
పట్టున నింబభూజమున్, హానిరి పుంచి పెంచు
నలబాలిసులట్లను రాజశేఖరా. 34

చ. రసమును గుర్తెఱుంగఁ జతి రమ్యకవిత్వము
జూచి మెచ్చలే, రసహీన మొంది గుండు న
హాహా! సువికత్వ మొనర్ప లేరస,ద్వ్యసరము సేయు
నట్టియవివేకికిఁ బాండితియుండుగాక యి,వ్వసుమ
తియందు నిందులకుఁ బాలగు నాతఁడు రాజ
శేఖరా. 35

ఉ. కొండెముసెప్పఁ బండితుఁడు కొండొక విద్య
నెఱుంగఁ డెంతయు, న్మొండితనంబు మొందు గడు
మూర్ఖుఁ డనార్యుఁడు తిండిపోతు నీ,చుం డతిబు
ద్ధిహీనుఁ డగు నోమరి సత్కవినింద సేయుచో,
నుండఁడు క్రిందుమీఁదుల నహో రిపుభీకర
రాజశేఖరా. 36

చ. పరులకు విద్యనేర్పుటకుఁ బాల్పడఁ డొక్కఁడఁ
జెప్పనేనిఁ దా, మరుగిడి తెల్పు మత్సరుఁ డమా
న్యుఁడు పల్కినపల్కె నిల్పఁగా, దొరకొనికయ్య
మాడుటకె తూగును గుచ్చితుఁ డట్టివానికి,

ధరను బ్రతిష్ఠ లేదుగద దానవరప్రద రాజ
శేఖరా. 37

ఉ. మానితగీతగీతియును మందరమధ్యమతారకం
బులుగ, దాన వితానసంగతులుఁ దాళగతుల్
గడురంగురక్తియుగ, గానవిహీనుఁ గానము
సుగంధవిహీనతఁ జెందునట్టి యీ, సూనమపా
త్రదానమును సొంపువహింపదు రాజశేఖరా.38

చ. మనమున నొక్కతీరు పలుమాటల పైకొకరీతి
చేయఁబూ,నిన దొకదారిగా నిటుల నీతిదొలం
గి మెలంగువారితో, జను లతిమైత్రిసల్పుదురు
సద్గుణధుర్యుని నిప్పువియోజకుం, డనుచును
గంటఁజూడ రహో!సుగుణాకర రాజశేఖరా.39

చ. విరివిగ నోటఁ దా ననుభవించక దీనుల కివ్వన
ట్టివాఁ, డతివముతో భూమియందిడినయర్థ మనర్థ
కమగుఁ జూవిూ తుదిగ, మరుగునఁ దాగియుండి
మధుమక్షికముల్ దగఁగూర్చు తేనెదా,బరులకుఁ
జెందురీతి నగుభవ్యగుణాకర రాజశేఖరా. 40

చ. సతతము యాచకావళికి సారధనంబిడుచో వదా
న్యుఁడౌ, చతురుఁడు తక్షణం బొసఁగ నయ్యన
లేదని తెల్పువాఁడె బల్, చతురతరుండు లేద
నఁడుం జాలముసేయుచు నిచ్చురీతి సం, తతమును
ద్రిప్పువాని యభిధానము గానము రాజశేఖరా.

ఉ. కోరికతో ధనాఢ్యుఁడని కుత్సితు నల్పుని దుష్ట
చిత్తునిన్, జేరినవార లీప్సితము చెంది సుఖింపరు
హానిఁగాంతు రా, చారుఫణాగ్ర భాగవిలసన్మణి
రాజము గల్గి వెల్గినన్, క్రూరభుజంగముఁ గవ
యంగఁగూడునె శ్రీకర రాజశేఖరా. 42

చ. నరులు స్వదేహశోషణ మొనర్చిన దానవె ముక్తిఁ
గల్గునం, చరయుదు రెంతవింత యహహా! యవి
వేకము వారినొంచు ని, ధ్ధర నొకపుట్టపై మిగు
లఁదాడనసేయఁగ నంతమా త్రన,య్యురగ మణం
గునే నతదయోదయ శ్రీకర రాజశేఖరా. 43

ఉ. భూతి శరీరమంతటనుఁబూసి జటాజినవల్కలాం
గుఁడై, శీతజలాతపాదుల వసించుచు వేషము
బూను దాంభికుం, డాతతభక్తియుక్తుఁడగు నప్ప
రతత్వపరు న్వలెన్ మహా, భూతపతీ! భవత్పద
ముఁ బొందునె శ్రీకర రాజశేఖరా. 44

చ. విమలతరప్రబోధముగ వేదము శాస్త్రపురాణ
పుంజముల్, గ్రమమున నభ్యసించి యటఁ గర్వ
విమోహితుఁడై జనాళికిన్, శ్రమఁగొని బోధసే
యుచును సత్పరతత్వము గానలేడు దా, నమరి
యుఁ దర్వి పాకరసమానని కైవడి రాజశేఖరా.

ఉ. ధీరుఁడు భక్తికల్గి భవదీయకృపావశుఁడౌటశాస్త్ర

ములన్, గోరి పఠించి సారమును గూరిమిమీఱఁ
గ్రహించి పిమ్మటన్, ధారుణి కర్షకుం డెటుల
ధాన్యమునెంచి పలాలసంహతిన్, దూరముసేయు
నట్టిగతిఁద్రోయును శాస్త్రము రాజశేఖరా. 46

చ. అనిశము లంతరాయము లనంతములై విలసిల్లు
శాస్త్రముల్, మనుజులకాయువల్పము సమర్థతఁ
గల్గుటదెట్లుగావునన్, ఘనమగు శాస్త్రసారము
ను గైకొను ధన్యుఁడు నీదు సత్కృపన్, వన
మున దుగ్ధ మంచవలె భక్తియుతాదర రాజ
శేఖరా. 47

చ. శిరమువహించుఁ బువ్వులను జెల్వుగ నాసిక యా
సుగంధముల్, గురుమతితో గ్రహించు నధికుం
డొకఁడెయ్యెడ సర్వశాస్త్రముల్, దొరకొని తాఁ
బఠించుఁ గడుఁదోరపుఁలీలఁ దదర్థమాత్మలో,
నరసి సుఖంబు నొందెడుమహాత్ముఁ డొకం డిల
రాజశేఖరా. 48

చ. హరియనుచున్ హరుం డనుచు నంబుజగర్భుఁ
డటంచుఁ గొందఱీ, వరుసను బల్కుచున్ బ్రకృతి
బద్ధులు గావున జ్ఞానహీనులై, పురికొని వాద
మొందెదరు మువ్వురి కవ్వలమూలమౌ పరా,
త్పరు నవికారుఁ గాంచునదె తత్వము శ్రీకర
రాజశేఖరా. 49

చ. హరియొ హరుండొ శ్రీధవపురాణుల కైక్య మ
టంచు వేదముల్, మొరవెడుచుండఁగా వినుచు
మూఢత భేదముసేయనేల దు, ర్భరమగునయ్య
విద్య నెడవాపి పరాత్పరతత్త్వ మూను సుస్థిర
మతిఁ దా సుఖించును సుధీజనతావర రాజ
శేఖరా. 50

చ. తనువు మనంబు ప్రాణములుఁ దద్దయు నింద్రియ
జాల మైక్యము, న్దనరఁగఁ జేసి భక్తిఁగొని తావక
పాదసరోజచింతనం, బునఁ గడు మోద మొందు
ఘనపుణ్యుఁ డొనర్చిన సర్వధర్మముల్, బొనరఁగ
నీకొసంగుచును బొందు భవద్గతి రాజశేఖరా.

ఉ. పావనతావకాంఘ్రియుగభావనయు న్వరసూర్య
దీప్తిలే, కేవరుసక్ దమఃపటల మేగును గేవల
శబ్దబోధచేఁ, బోవునె యెంతయు న్విరతిఁ బొందునె
చీఁకటి దీపవార్తచేఁ, గావున నీదుభక్తి గొనఁ
గావలె శ్రీకర రాజశేఖరా. 52

చ. వ్రతములు దేవపూజ లుపవాసములున్ బహు
దానధర్మముల్, క్రతువులు తీర్థయాత్రలును
గన్గొన వేదపురాణశాస్త్రముల్, గుతుకముతో
భవత్పదముఁ గోరిభజించు మహాత్ముఁ బ్రోవ నీ,
యతులితభక్తిఁ బోలవు దయాకర శ్రీకర రాజ
శేఖరా. 53

ఉ. ఆటలచోటనైనఁ బరిహాసపుమాటలనైన నీటు
గాఁ, బాటలనైన ఖ్యాతిఁగాని పాటలనైనను మాటి
మాటికిఁ, నోటను నీదునామము వినోదముగాఁ
గొనిముక్తిఁబొందిరౌఁ, గూటములన్ సుజంతుర
ట గోత్రసుతావర రాజశేఖరా. 54

చ. కలిబలిమిన్ రచించు ఘనకల్మషముల్ వహించి
చెంగటన్, నిలిచి భజించుభక్తులను నీదు కృపా
రసవారిచేత ని, ర్మలినులఁ జేయుచుందువట
మానక మానుగనీనునట్టి గోవులు నవవత్సల
న్బోలెను భూరిదయాకర రాజశేఖరా. 55

ఉ. చారువిలాసవాసముఖసారససారమ్మృదూక్తిమా
ధురీ, భారవిరాజమానరతిభావజభావజచాతు
రీపరీ, తారభటీకటాహవనితాజనతావశు లై
నితాంతసం, సారముఁ గోరి నిన్నుఁ గనఁజాలరు
మూఢులు రాజశేఖరా. 56

ఉ. కాలగతుల్ దలంచి భవకల్పితకార్యము లొం
దియు నృతీ, లోలురుగాక క్రోధ మద లోభము
లెల్ల నణంచి కల్మషోన్మూలన మాచరించి సమ
బుద్ధివహించి భవత్పదాబ్జభ, క్తాళులు నిన్నుఁ
జెందుదురు హా పరమేశ్వర రాజశేఖరా. 57

ఉ. సాంబకృపావలంబ బుధజాతవినీతపరీతధీలతా,
లంబ నితాంతభక్తినుతిలాలసమోదయుతాంక

సక్తహా, రంబ త్రిశూలచాలనపరాజిత ఘోర
సురారినికరా, శంబ భవత్కృపల్ శుభవిడంబన
లీశ్వర రాజశేఖరా. 58

చ. సలలితభావకాంస్త్రిజలజాతయుగాంచిత భక్తుఁ
డల్లఘూర్తుల ఘనదుర్మదాంధుల సుతుల్ వినసో
ల్లఁడు తా భజించునే, కొలంది గసాలసాలమాఘ
కోమలపల్లవఖాదిమత్తకో, కిల చలపత్రపత్రము
లాకించుక శ్రీకర రాజశేఖరా. 59

చ. నరు లెవరేని నీదుభవనంబున కొక్కప్రదక్షిణం
బు సు, స్థిరమతితో నొనర్చి పదసేవనులై శివశంక
రా శివా, పర వరదా యటంచు బహుభక్తిఁ
బఠింపఁగ దండపాణియుం, దిరముదిగాంచ రెన్నఁ
డును ధీర మహేశ్వర రాజశేఖరా. 60

చ. అమితభవత్పదాబ్జభజనామృతపానవిశేషమత్తచి,
త్తము కలనైనఁగోగదుగదా ఖలసేవనలక్ష నియ
న్నదీ, విమలతరంగమాలికల వేడుకతోడను
చూఁగు రాజహం, సము జలజాశికేగునె వెసన్న
గమేశ్వర రాజశేఖరా. 61

చ. హర త్రిపురాసురాంతక దయాకర శూలి కపా
లమాలికా, ధర గిరిజాపతీ యని సదా నుతి
లెప్పుడు భక్తకోటిపా, దరజము మచ్చిరంబు
నను దాల్తు నటేగకుండంచు జంకి కిం, కరులకుఁ

దెల్పుచుండునట కాలుఁడు శ్రీకర రాజశేఖరా.

ఉ. శంకర భక్తమానసవశంకర దుష్టనిశాటఘాట
నా, శంకర శంఖ పంకజగదా చక్ర హలాంకుశ
చాపముఖ్యరే, ఖాంకిత తావకాంఘ్రియుగ మా
దరలీల భజించునట్టి నీ, కింకరుఁ జేర రల్ల యమ
కింకరు లీశ్వర రాజశేఖరా. 63

ఉ. సారెకు ధీరులై సుగుణ సారతమీఁలు భవత్క
థాసుధా, ధారలుఁ గ్రోలుచుఁ జరణ దాస్య
ము సల్పెడువారి వారినిఁ, జేరినవారి ద్వారి
కినిఁ జేరకుఁ డంచు యముండు దూతలకు,మారు
చుఁ బల్కుచుండు భవదూర దయాకర రాజ
శేఖరా. 64

ఉ. వారక సత్యదూరుల నివారితదర్పులఁ గర్మబా
హ్యాచారులఁ, ఘోరుల బ్రహ్మఘాతకుల గోఘ్ను
ల దుష్టుల దుర్మదాంధులకు,వారినిఁ జేరు వారిదరి
వారిని సారెకు మీఱి చీరఁగాఁ, జారులఁ బంచు
కాలుఁ డనిశంబు పరాత్పర రాజశేఖరా. 65

ఉ. లాలితభర్మనిర్మితవిలాసభవన్మణిమందిరస్థఘుం,టా
లపితధ్వనుల్ శ్రుతివిడంబనగా వినుచున్న వా
రల, కాలుల లులాయకంఠపరికల్పితభూరిత
రోగ్రఘంటికా, జాలనినాదముల్ వినరు పారగు
ణాకర రాజశేఖరా. 66

చ. లలిభవదుత్తమాంగపరిలంబితదివ్యజటానటద్ధునీ
కలితతరంగఘుంఘుమితశక్రనినాదము నాలకిం
చువా, రలును యమాలయాంగణవిరాజితవైత
రణీతరంగమా, లలఁగలస్నైనఁగాంచరు కలాకలి
తావర రాజశేఖరా. 67

ఉ. ప్రాకటహేమచౌర్యముఖపాపకఠోరభుజంగపా
ళికిఁ, గేకులు నీదునామమునకీర్తనముల్ మధు
పానపాపకిం, పాకకుఠారధార లఘుభంజన నీదు
కథాభివర్ణనల్, చేకొనువారు దుష్కృతము
జెందరు శ్రీకర రాజశేఖరా. 68

ఉ. పట్టితి నీపదాబ్జములు భావుకలీల సమస్తసౌఖ్య
ముల్, ముట్టితి జన్మకర్మభవమోచన నీదుపదా
భిలాషినై, మట్టితి లోభమోహమదమత్సరరో
షనికాయ మిత్తతిఁ, గొట్టితి సర్వపాపముల
గోత్రసుతావర రాజశేఖరా. 69

చ. విడిచితి కర్మసంచయము వ్రేల్మిడి నీదుపదార్పణం
బుగాఁ, గడచితి పూర్వజన్మకృతకల్మషవారిధిశత్రు
వర్గముఁ, బొడిచితి జ్ఞానచంద్రికను బూని మదిం
దమమంత వింతగాఁ, దుడిచితి మేరుచాపధర
దుర్జనభీకర రాజశేఖరా. 70

చ. జగమున జీవకోటి శతజాతులనొంది నరత్వ
మూను మా, నుగ నట విప్రజన్మముగొనుస్వభావ

పుణ్యము చేత శాస్త్రిరైయై, తగియును నిన్ను గన న్మదిని దల్పక తా విడుచు న్ప్రియత్నవా, సగతసు ఘారసమ్మువలేఁ దత్త్వము శ్రీకర రాజశేఖరా.

చ. సురలు నిశాచరు ల్గలిసి సూటిగఁ బాటిలుదుగ్ధవార్ధి మందరగిరిచే మథింపఁగ నుదారహాలాహల ముద్భవించి య,త్తఱి జగముల్ గలంచు నెడ దానిని నీగళమందు నిల్పి శంకరతను నుజ్జగంబులను గాచితి వీశ్వర రాజశేఖరా. 72

ఉ. కంజజముఖ్యఖేచరనికాయ మట న్భజియించి మించి మృత్యుంజయ! తేనమోస్తు భవతోయధినాధర! తేనమోస్తు సద్రంజక! తే నమోస్తు నగరాజసుతాధిప! తే నమోస్తుతం, చంజలిజేసి పల్కె విజయాకర శ్రీకర రాజశేఖరా. 73

చ. పరమమునీంద్రదేవగణపన్నగఖేచర సిద్ధసాధ్యకిన్నరగరుడోరగాదిగణనాథపరీవృత రాజతాద్రిసాంద్రరమణిసింహపీఠయుత ధీరలసన్మృదులాంకసక్తస, ద్గిరివరకన్యకారచితగీతరసాదర రా...

ఉ. సారెలుమేళవించి విలసన్మణివీణలువ్రాని తుంబురుం, డారయ నారదుండును లయాంచితసంగతిగీతసాహితీ, సారముగా భవత్కథలు సారెకు గాన మొనర్చి తత్సుధా, ధారలు గ్రోలుచుందురు సదా జగదీశ్వర రాజశేఖరా. 75

చ. వితతకృపావలోకనసుధీచిలసద్దరహాసచంద్రికల్,
గుతుక మొనర్చి సేవకచకోరముల న్విలసిల్లఁ
జేయఁగన్, సతతము సత్కవాక్యలితచాతురి
మీఱఁగ సర్వమంగళా, సరసరసోక్తుల స్మసమ్ము
దాల్చెదు శ్రీకర రాజశేఖరా. 76

చ. కరమణికంకణధ్వనులు గ్రాల సలీలసువర్ణసుందఁ
చామరమున వీచుచో నలరి మంజులహార్చ
నాచమత్కృతుల్, సరసహితోపదేశములు సల్పఁ
గఁ బొల్చు నిజాంకస క్తశాం, కరినిఁ గటాక్షవీక్ష
లను గాంచు దయాకర రాజశేఖరా. 77

చ. కనకచిరత్నరత్నమయఘుంటలు [illegible] నుడా
[illegible], [illegible] గనను గన్న
ను చామరఖామొదల రహిం, చు [illegible] ల [illegible]
చు గడుచో [illegible] బుంగవ [illegible] [illegible]
గజఁగుండి [illegible] శ్రీకర రాజశేఖరా.

చ. అనయఁగ నొక్క [illegible] [illegible] సేయు నిశాం
తభక్తి సుస్థిరమతి యింద్రముఖ్యులగు దేవతలం
డె చెలంగు సర్వదా, పుటియుచుఁ [illegible]
ఘుకిలను బూజలొనర్చిన సేవకుల్ భవ, ద్గిరినివ
సించు టబ్బురమె దివ్యధునీధర రాజశేఖరా. 79

చ. కరములు నీపదార్చనముఁ గన్నులు తావకది
వ్యమూర్తి సుస్థిరమతి నీకథామృతముఁ జేహ

ము నీదగుసేవ జిహ్వ సాదరముగ నీదుకీర్తనలు
తద్దయు వీనులు నీచరిత్రలక్ నిరతముగోరు నిర
రధునీధర శ్రీకర రాజశేఖరా 80

ఉ. చల్లనినీకృపారసము సారెకుఁ గూడిమిమాఱ
నాపయిక్, జల్లినఁ జాలు పూర్వభవసంచితకల్మ
షతాపసంచయం, బెల్లనడంచెద న్ధృతినహీనభవ
త్పదభక్తి బీజముల్, జల్లుచు నారుబెంచెదను
సారదయాకర రాజశేఖరా. 81

చ. పతితుఁడనయ్య నీపతితపావననామ నమశ్శివా
యమంత్రతరణిచేఁ దరింతునుగదా దురితామిత
వారిరాశి సన్మతినిహసౌఖ్య మొందుటకు నాను
ది సందియ మొందనైతినో, సతతదయానిధీ! సుక
విసన్నిధి శ్రీకర రాజశేఖరా. 82

ఉ. శంకర సర్వసంపద లొసంగుము సంతస మొంది
శాంకరీ, పంకజగంధి దా నిడు నపారకృపామతి
నెల్లవిద్యలక్, గొంకక నట్టివేడుకను గోరిక లీరిక
లెత్తమిమ్ముని, శ్శంక భజించుచుందు నిఁక సాధు
జనాధర రాజశేఖరా. 83

ఉ. వేడుకనైన దాడిఁబడి వేదననైన ముముక్షుపా
ళిత్రోఁ, గూడికనైన భక్తిఁ గొని కొల్చుచునైన
తపస్సమాధులక్, వీడకనైన శంకరపవిత్రచరిత్ర

యటంచుఁ జేర్చ్రెనఁ, దో డిఁక వారికౌదువు
కుతూహలమేదుర రాజశేఖరా. 84

చ. ఇహపరసౌఖ్యదాయకుఁడ వీవె యటంచు సదా
ముదంబునన్, రహిని భవత్పదాబ్జములు రంజన
మీఱ భజించి సమ్ముదా, వహమగు నీకథామృ
తము వారక గ్రోలి సుఖించుచుంటి న, న్వహా
మున్కు దత్సుఖంబుగొను వాంఛను శ్రీకర ా.

ఉ. దీనతలేనిజీవనము దివ్యకళామయమైన నీపద, ధ్యా
నము పూర్వజన్మభవతారకతావకసత్కథాసుధా
పానము నిచ్చుట న్నది భవద్గతికి న్జను వేళ వేద
నల్, గాని నిరామయత్వ మొసఁగన్వలె శంకర
రాజశేఖరా. 86

ఉ. భాసురతావ కాంఘ్రివరపంజకపంజరమధ్యవ
ర్తిగాఁ, జేసెద నిద్దె మామకవశీకృతమానస
రాజకీరముస్, శ్వాసకఫాదిరోగములు వారక
కుత్తుకనొత్తువేళ నా, యాసముచేత నీస్మరణ
యాటెటు లీశ్వర! రాజశేఖరా. 87

చ. సరసుఁడెఱుంగు సత్కవనసారము సారెకు సార
సోదరో, త్కరమకరందమానుట కుదారమధు
వ్రత మొప్పుగాక ద, ర్దురము సమర్థమానె భవ
దూర! ధరాధరకన్యకావరా! సరసతగాంచు కా
వ్యరససారసుధాచర రాజశేఖరా. 88

చ. మదయుతుఁడ న్దురాగ్రహుఁడ మందుఁడ నైనను సర్వవైభవా, స్పదమగు నీపదద్వయము భావన సేయుచు నున్నవాఁడనో, సదయగుణాంబుధీ! దురితసంఘమడంచి సమస్తసౌఖ్యసం,పదల నొసంగుమీవు పరిశుభ్రగుణాకర రాజశేఖరా. 89

ఉ. గౌళ బిళావారీ శహాన కాఫి కమాచి ముఖారి నాట భూ, పాల మఠాణ బేగడయు భైరవితోడి వరాళులన్ శ్రుతుల్, మేళనచేసి ఱొల్లరఁగ మెండుగనీపయి సత్కృతుల్ సదా,బాళినిరంగు రక్తిఁ దగ బాడుదు శ్రీకర రాజశేఖరా. 90

చ. సరసకలాకలాప విలసత్కవివర్ణ్యమహావిలాస సుం, దర కరుణారసార్ద్రసముదారకటాక్ష భృదీక్షణాతి భా, సురముఖమందహాస పరిశోభితహర్మ్యవిరాజమానస, ద్వరగృహ వాకతిప్పపుర వాస! మహేశ్వర రాజశేఖరా. 91

చ. గురుతరభక్తి భక్తజనకోటి నితాంతము సేవ సల్పఁగాఁ, బరమకృపామతిన్ దగుశుభంబులొసంగి యభీష్టసంపదల్, గురియుచు బార్వతీపతినిఁ గూడి సుఖించుచు వాకతిప్పమం,దిరమున నిల్చి పొల్చు నగధీర మహేశ్వర రాజశేఖరా.

చ. ఘనుఁ డతినీచుఁజేరి మెలఁగన్ ఘనమంతవొలంగు నీచుఁ డా, ఘనునెడ బాయకున్కి నవఘూఘన

మొందు నిజంబు నావచే,తను శిల లెన్ని యో జల
ధిదాఁటును సూత్రము సూనరాజితోఁ, బనుపడి
యుత్తమాంగమున భాసిలు శ్రీకర రాజశేఖరా.

ఉ. త్రోవఁ దొలంగి దుర్గతులఁ దూగి వధూజన
మోహ పద్యముక్, ద్రావి ప్రమత్తుఁడౌట విత
తంబగు సంసరణాటవిక్ సదా, తా వసియించు
మూఢుఁడు కదర్యజరామృగరాజుచేతఁ గో,ల్పో
వుటెఱుంగలేడు నతభూరికృపాకర రాజశేఖరా.

చ. శతధృతివాసవాదుల కసాధ్యము నీదుమహాత్మ్య
మెన్న, దు,ర్మతులకు మా కశక్య మనుమాట లి
కేల భవన్నుతిక్ బవి,త్రత సరిగాఁ దలంచెద
సుధారసమానుటచే సురల్ గుశ్, ప్రతతిఁ బవి
త్రమాటగని భక్తజనాదర రాజశేఖరా. 95

చ. జనకుఁడ వీవె శంకర నిజంబు ధరాధరరాజపుత్రి
మ, జ్జనని పురాణదంపతులు సారకృపామతులైన
మీరు పెం,చిన తనయుండనౌట నుతిచేసితి
తప్పులు గాచి ప్రోచి భూ,జననుత భక్తిముక్తుల
నొసంగుఁడు శ్రీకర రాజశేఖరా. 96

చ. సురుచిరసత్యవోలుకులజుండను వేంకటరాయపు
త్రుఁడక్, ధరణిని సుందరాహ్వయుఁడఁ దద్దయు
మంత్రివరుండ శాంకరీ, వరపరిలబ్ధసారమృదు

వాక్కలితాతతగీతసాహితీ, పరిచయుఁడక్ భవ
చ్చరణభక్తుఁడ శ్రీకర రాజశేఖరా. 97

ఉ. సమ్మతిమీఱ నీశతకసారము గోరి పఠించుచున్న
వా, రిమ్మహి వస్తువాహనమణీభధరారమణీయ
భోగభా, గ్యమ్ములనొంది పొందికల నారవితార
కముగ సుఖించి నిక్కమ్ముగఁ బుత్రపౌత్రులను
గాంత్రు మహేశ్వర రాజశేఖరా. 98

ఉ. మంగళమందు సూనిజనమానితపాదసరోజ నీ
కిదే, మంగళమందుఁ గావ్యరసమార్గవగీతవిలోల
నీకిదే, మంగళమందు చారుతరమంజులసత్యసు
భాష నీకిదే, మంగళమందు సాధుజనమానససం
చర రాజశేఖరా. 99

చ. హర గిరిజామనోహర సురాద్రిశరాస మహేశ
సాంబ శం, కర పరమేశ్వరా గరళకంధర భూత
పతీ మహానటా, సురగిరిచాప భూతిధర శూలి
గిరీశ భవా మహేశ్వరా, పురహార దేవదేవ పరి
పూర్ణదయాకర రాజశేఖరా. 100

శ్రీ రాజశేఖరశతకము సంపూర్ణము.

---

# పీఠిక.

శ్రీ కృష్ణలీలల దెల్పు నీశతకము మాతండ్రిగారి చిరకాలమిత్రులును విజయనగర సంస్థానాస్థానపండితులు నగు శ్రీమాన్ ముడుంబై వేంకటరామనృసింహాచార్య స్వామిగారిచే రచింపఁబడినది. వీరు సజీవులై విజయనగరమునందే యుంటున్నారు. శ్రీకూర్మముదగ్గఱ వంశధారానదీతీరస్థమగు అచ్యుతపురి వీరిజన్మస్థానము. ఈ మనోహరమగు శతకమును శతకసంపుటమునఁ జేర్చుటకు వీరు అనుజ్ఞదయచేసి నందులకు కృతజ్ఞులము.

ఇట్లు,

తండయార్పేట
చెన్నపట్నం.
16-4-26.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు
అండ్ సన్స్.

శ్రీరస్తు.

# శ్రీరంగేశశతకము.

---

సీ. శ్రీరుక్మిణీదేవి చెలులతోఁ గూర్చుండి
ముచ్చటింపుచుచుండ వచ్చినీవు
సడియుడిపి సరవి సన్నఁజేసి కనులు
మూసిన ముదితయు ముసిముసినగి
చేతులఁదడిమి నెచ్చెలులార గోవర్ధ
నాచల కషణకిణాంక కఠిన
తరము లివి కఠినస్థలులకే తగునన
నీ నవ్వుఁగనుఁగొని నెలఁతలు సన
గీ. నౌనె నిజమని చనుమొట్టలంట నీదు
చాతురి నుతింప మాబోటిజనుల కేఁటుల
నలవియగునని నీకు జోహారొనర్తు
వీతభవతృష్ణ రంగేశ వేషకృష్ణ. 1

సీ. అడుగు హారంగెల్ల జడజాతముల కిచ్చి
జంఘుల సొంపుల శాలిగర్భ

ములనింపి తోడలసొంపు లనఁటుల కొసంగి
కౌను డాల్వాలి జడకానికిచ్చి
బాహుల నిగ్గు నిబ్బరమెల్ల మన్నుమో
సెడు ద్విజిహ్వునకిచ్చి జిగిమొగంబు
సొగసు గురుద్రోహి యగువానికొసఁగి మై
చాయ పయోవాహ సమితికిచ్చి

గీ. యిది తెలియఁబో దెవరికని మదిఁ దలంతొ
తగదుసుమి నన్నుఁ గావక తక్కితేని
రవ్వసేయుదు నిది గట్టి రచ్చఁబెట్టి
పీతభవత్కృష్ణ రంగేశ వేషకృష్ణ. 2

సీ. నెరివిరిసరులు నీకురులు బట్టెనుగద
మణికిరీటమున నీమస్తకంబు
తాకట్టిబడియెగద రతనపుంబాహు
పురులు నీజిగి బాహువులనుగట్టెఁ
గద నీ వెడఁదయొమ్ము గమలామహాదేవి
యాక్రమించెనుగద యవనిధరము
సుధ వేగఁ దెమ్మని సురలు నీవీపున
మోపిరిగద యెంత మోసపోతి

గీ. వకట యిటువంటి నిన్ను వేదాంతములు స్వ
తంత్రుఁడ వటంచుఁ బలికిన దారిఁజూడ
నర్థభేదంబు గనవడు నయ్యవారు, పీత... 3

సీ. చల్లనితావులు చల్లు మేల్మల్లెమొ
గ్గలదండ లురమునఁ గ్రమ్మి విరియ
ఘుమ్మని వాసనల్ గ్రమ్ము గులాబీవి
రులసొంపు నెరులసెంపు లలరింప
ధగధగమనీవి జిగి గొను నూనూగు
మీస మత్తరుపూఁత మెఱుఁగుఁజీన
నునుపుగన్పడ దువ్వ జొన్పను ల్వ్రేడలిము
త్యంపుచౌకట్లాడ లలవరింప
గీ. బల్కుసుంబాహరంగు నిబ్బరపురంగు
లీను సన్నంపుదువ్వల్వఁ బూని నీవు
సఖులతోఁ గూడి క్రీడించు జాడఁ దలఁతు, వీత.

సీ. మాతల్లి వైదర్భి మమత నీగుణగణ
ములు బలుమారు బుధులవలన వి
ని దినదినమునకు మదనుని వెతలను
గని నీదుభావముల్ గాంచి మదిని
పొగసున కుప్పొంగి పొక్కుచు మాటికి
మ్రొక్కుచుఁ జాలిమిఁ దక్కుచు నహ
హా యిట్టి ప్రాణేశుఁ డబ్బునా నావంటి
నెలఁత కటంచుఁ గన్నీరొలుకుచు
గీ. నెచ్చెలులకైనఁ జెప్పక నిజశరీర
మెల్లఁ జిక్కఁగ నిలువెల్ల వెల్లబారె
నెంత మోహనమూర్తివో యెఱుఁగమయ్య, వీతభ.

సీ. గంధంపు మైపూఁత: గనిసి జాల్కొను లేత
చెమ్మట లేమొకో చెలియ కిపుడు
కమ్మతెమ్మెర వీవు గ్రమ్మఁ గందినరూపు
కనుపట్టు నేమొకో కాంత కిపుడు
అపరంజినెరచాయ లడరెడు వేడిమి
వెలిమారు టేమొకో వెలఁది కిపుడు
కాటుక కన్నీటఁ గరగి జారినతేట
చూపట్టు నేమొకో సుదతి కిపుడు
గీ. అన్నిటికి నేడు చెలులార చిన్నవోయె
ననుచు నాసామి నిను మనమందుఁ దలఁచి
కుందు రుక్మిణిఁగని జాలిగొనిరి చెలులు, వీతభవ.
సీ. వెలిదమ్మిపూరేకు తెలిడాలుగల వాలుఁ
గనుదోయి కేనిద్రఁ గాంచమరచె
మృదులకేతకిపత్ర సదృశమౌ నెమ్మేను
హంసతూలిక సెజ్జ లంటమరచె
నిండుచందురునిపై దండెత్తు నెమ్మోము
మృగనాభితిలకంబు సొగసు మరచె
తేఁటిపై చకచకల్ దాటు చక్కనికురుల్
గడిదేర గుడిముడుపు మరచె
గీ. వినుడు చెలు లిది గోపాలు విడనిజాలు
యకటకట యేమిబోధింతు మనుచుఁ బలుకు
చెలిపలుకు వించు రుక్మిణి సిగ్గుగాంచు, వీత...

సీ. పైదాసనా నీదు భావంబు దాచఁగాఁ
దగదు నాతల్లి నీదాననమ్మ
నీవెతల్లని నీకునిల్వఁగా నుంటినే
తేటతెల్లముగాఁగఁ దెలుపుమమ్మ
నీకు నాకును వనంటెక మే గదవె న
న్నెఱుఁగవా యిటు దాచనేలనమ్మ
ముగ్ధ లెంతలులేరో మొగమోటమెందరో
యీరీతి మే మెందు నెఱుఁగమమ్మ
గీ. తరుణి నీనోటఁ బలికింపఁ దరముగాదె
తెలిసెఁ గృష్ణునిపైఁ గూర్మి కలదుగదె యు
టన్న వినుదాని సిగ్గెన్న నలవిరన్న, నీత... 9

సీ. మొగమెత్తనీని యీ తొగజేని నులుకింపఁ
దొయ్యలి వేసలి దువ్వవలదొ
నడుపనీయక రోసపడు నంచ నెడలింపఁ
జెలువధారావాటి జెలఁగవలదొ
పలుకనీయకఁ గూయు చిలుకల సులికింప
నతివ మ్రైసాంకవం బలఁదవలదొ
చూడనీయక కోల లాడించు మరుఁ డుల్కఁ
దెరవ కుంకుమబొట్టు దిద్దవలదొ
గీ. యేమి తెలియని చెలివిగా కేము నేగి
జేయుదుమటె యటన్న నెచ్చెలులఁ కువిద
యుత్తరంబీదు నినుఁబట్టి యుడుకుపుట్టి, నీత...

సీ. పున్నమరేయేని వెన్నెలల్ తిన్నగా
నేల నాడుదమమ్మ బాల రావె
కేళికావాపికాకూలమ్ములనుజక్ర
ములఁ గవగూర్తము ముదిత రావె
చంద్రుని కాంతిచే సగమైన చుక్కల
గణియింత మిప్పుడు కాంత రావె
యోణాక్షి కన్న మనచకోరాళి కాకలిదీర
లేవెన్నె లిడుదము లేమ రావె
గీ. యనుచు లాలించు చెలు లిటు లనుడు వినుచు
వత్తు రానను మాను కోపంబుబూను
రమణి నినుమదిఁగూర్చి విరాళిఁజేర్చి, వీత...11
సీ. పలుమారు పిలిచినఁ బలుకదు బింబోష్ఠి
యగుటచే నేమొకో యతివలార
నెమ్మోము జూపదు నీరేజమృదుపాద
యగుటచే నేమొకో యతివలార
పాడదు పంచమఫణితిఁ బల్లవపాణి
యగుటచే నేమొకో యతివలార
నగఁగుల్కు మనతోడ నగదు కోకస్తని
యగుటచే నేమొకో యతివలార
గీ. యనెడు చెలిపల్కు శుకపిక వనజవైరి
చంద్రికావ్యంజకంబయి చెలియ కకట
కఠినతరమయ్యె నినుఁగూర్చి కాకఁజేర్చి, వీత...

సీ. చుట్టుజరీమేల్కు సుంబంపురంగుస
న్నంపుటోణీపింజెనాగరికము
మీఱ సగమువిప్పి మేనఁగప్పి మిగులు
సగమును పింజపాటుగను సవ్య
గళపార్శ్వమంటి లేఁగ[illegible]లిపత్త్రమువంటి
వీపున జీలాడ విడచి మడమ
లనుదోట్టుపంచకట్టునమణిమయము
లగుపాదుకలనంటి యంటనట్లు
గీ. వెలయు లీలావిహారంబు సలుపు నీవు
మోహమునఁ గన్నులంగట్టు ముదిత దిట్ట
తనము విడనాడు ననుగావుమనుచు నేఁడు, నీత.

సీ. అపరంజియుట్లు ముత్యాలబల్కుంతితో
నంటి తరతరము నమరుచును జి
లుగు కెంపులరవ చెలువుగిలుకు సరులు
చంద్రహారంబులు ఛాయలీన
మేన గంధమలంది జానుగా నోరగా
ముడిచిన వెగముడి మొల్లసరుల
దట్టముగాఁ జుట్టి దానిపై శిఖిపింఛ
మలరిచి యమునావనాంతరమున
గీ. మెలఁగు నీమురళీగాన మృదులరీతి
నాతి వినురీతి భ్రమియు న[illegible]
మదనుఁ డెదఁ గ్రాఁచె [illegible]

సీ. నెమ్మోము చెలియయ్యు నీరజవైరి వి
    రోధింప నకట సరోజతతియు
నైనను గనికరమూనదు మరినేరి
    తోడ నేస్తముగట్టు తోయదంబె
శిఖినిప్రేచి దాఁ జీదరఁజేయు స
    మీరమైనను హంసవారమైన
నయయొ ధైర్యము జెప్పునది లేక మీఁదిమి
    క్కిలి తాపకారులై గనియసాగె
గీ. సామి వైదర్భి నిను మానసమునఁ దలఁప
మిత్రులె శత్రులైరి తచ్ఛత్రు లెటుల
మిత్రులగుదురు చాలు నీమీఁది ప్రేమ, వీత.

సీ. తలిదండ్రులకుఁ దెల్ప ఫలసిద్ధి యగుఁగాని
    పరిభవింపుచు లజ్జ పలుకనీదు
ఊగకే పరిహాస మొనరింతు రక్కట
    చెలులచేఁ జెప్పింప నలవికాదు
యిది చెలుల్ గ్రహియించి రేమొకో రుక్మితోఁ
    దెలుపిరా విఘ్నంబు గలుగఁజేయు
నూరకుండెదనన్న ఘోరాశుగములచేఁ
    గ్రాచెడే పూవుసింగాణిజోదు
గీ. అన్న చేదీశ్వరునికివ్వ నన్నుఁ దలఁచె
నెటులనుండునో యిఁక దైవఘటన యనుచు
నకట మదిఁగుందు నినుఁగోరి నారయొయ్యారి, వీత.

సీ. కృష్ణాయనుచు ముద్దు కీరంబుఁ బలికింపు
మంచుఁ జెల్మిని చెలి ననునయించు
నల్లనివాని నీ నాతిమోహించెనే
యని నవ్వు చెలియపై నలగి చూచు
గొల్లలేమా దురో కోమలి వెన్నదొం
గను దెచ్చునని నవ్వఁ గనలియుడుకు
వికటంబులకు నేమి వెలఁదులారా నన్నుఁ
జీదరించకుఁ డంచుఁ జెలులఁబల్కు
గీ. సార నాస్వామి నిను మానసాబ్జమందు
నిలిపి నీసుగుణంబులె దలఁచుగాని
వేరె యొకమాట వినదు నిండారఁ గనదు, సీత.

సీ. మోము చందురునంటి ముంగురుల్ శ్రమవారి
గురిసి కార్మొగు లనఁ గొమరుమిగుల
నూర్పు దెమ్మెరలచే నుడికి కెందలిరాకు
వంటి వాతెర వసివాడుఁ జూప
ముఖ వాసనాలోభమునఁ గ్రమ్ము భృంగసం
తతి నాస గ్రాచఁగాఁ దలఁగిపోవ
మైదట్టముగఁ బూయు మంచిగంధము కరి
తప్తమై తుకతుక ధ్వనుల నుడుక
గీ. సఖులమరపించి మదిలోన సంభ్రమించి
విడనితమి స్వాయమూని ని న్వెతుకఁబూని
విపినములప్రాంత కలకాంత వెడలె నంత, సీత

సీ. తుమ్మెదల్ జుమ్మని గ్రమ్మ దెమ్మెరలు
దుందుమ్మని గమ్మపూదుమ్ముఁ జిమ్మ
కమ్మవిల్దొర నల్మొగమ్ములఁ గ్రమ్ము న
మ్ములజడి యలజడి కలవడి తుద
నెదయదలు చిలుకరొదలు కలవలింపఁ
గోయిలమూఁకలు గొండకూక
ల బలుధాకల యొడల వెడలుకాకల
కాకలకంఠి చీకాకు పడుచు
గీ. ధృతివిడుచు తడబడుచు నేగతి నడచు ను
పాయమెఱుఁగ కపాయము బాపనేర
దకట చెలినేలఁదగదేమి యపుడె సామి, పీత...

సీ. మంజీరశింజాసమూహాహూతకలహంసి
గదలనీ నన్నట్లు కాళ్లఁ బెనఁగ
బహువర్ణసుమరజఃపటలచిత్రితకీర్ణ
కేశబంధము కేకిఁ గేలిసేయ
నవనవోదిత్వరోష్ణవిసర్పినిశ్వాస
మలరుజొంపములసొం పవఘళింప
నతీకజ్జలమిశ్రితాశ్రునిమ్నగకుచా
భోగఘట్టమునుండి పొంగిపార
గీ. నిను వెతుకఁగోరి వనిఁజేరి ననఁ గటారి
దారి నారినెగయుపూలఁ గోరి దూరి
శౌరియని తల్లడిలు మారయొయారి రాధారి, పీత

సీ. మొగమెత్తనీదాయె వెగటుతమ్ములపిండు
పలుకనీదాయె రాచిలుకదండు
గళమెత్తనీదాయె గండుకోయిలధాక
సొలయనీదాయె వే సోకుమూఁక
చేయెత్తనీదాయె చిగురుటాకుబిడారు
కాంచనీదాయె వేఁ గల్వబారు
తలయెత్తనీదాయె మలినాళిరింఛోళి
కదలనీదాయె దుర్మదమరాళి
గీ. కలికి గిరివడి గిరిజడి కాకపోక
నిలువలేక యనోకహా నిబిడకేళి
గహనకుసుమపరాగశర్కరలదరల, వీత... 20

సీ. నిండారఁ గాయు రేయెండవేఁడిమిఁ గ్రాగి
పదము లెట్టగనీని పచ్చికప్పు
రపుదిప్పలను జెప్పరాని నొప్పి ధృతిద
ప్పి విరాళిఁ ద్రోవదప్పి బలుదప్పి
గొని చివురుల మంటలని దేఁటులను పొగ
లని దెమ్మెరలఁ జిమ్ము ననలధూళి
కణముల విస్ఫులింగములని తలఁచి
హా వనవహ్ని చుట్టెడు ననుచుఁ దేఁటి
గీ. రొదలు వినుచు ననలకీల రొదలెయనుచు
జడుపుగొనుచుఁ జెలియపైకి వెడలు తెరవు
గనుచు నకటకటా యెంత గ్రాగెఁ గాంత, వీత.

సీ. గడిసి పైనుండు తుమ్మెదపిండనెడినల్ల
 ని దిరిసు దాడిగి బల్మొదలు మొదలు
కొని శ్రాకు దీవియ లనెడి డబ్బాడవా
 ల్బిగియించి విరహుల బీరమడఁచు
మావులపేరి యమ్మరుని బందీకొమ్మ
 లనుకైల చివురాకులను సనీల
గరపుకాల్బెట్టు చిచ్చురకీల్గ చెవిరంజి
 కవు బలుగుడకలు గలుగు పికము
గీ. లను దుపాకుల నెగయింపఁగను వెఁశలేదు
జోడుగుండ్లన కణకణలాడు కనులు
గనుచు మదినెంత వలవంతఁ గనెర కాంత, వీత.

సీ. తనదు కెంగేలుగవనుగని చివురుల
 ని గవయు కోయిలలగముల తన
నెమ్మోము తమ్మియనిదలఁచి గ్రమ్ముతు
 మ్మెదలను తన కెంపు పెదవి బింబ
మనివచ్చు రాచిల్కలనుతన కీల్జడ
 ఫణియనిబర తెంచు బర్హిణముల
నాశాము మేనేల దూరితినను దూరు
 సన విలువవిభూషణములు చిక్కు
గీ. బడిన ముత్తెంపుసరులును బారదోలె
గాక లేకున్న నేమానా కలికిమిన్న
మీఁదెఱుఁగదయ్యో భామ నీమీఁదిప్రేమ, వీత.

సీ. బంగరుమెఱుఁగుదువ్వలువతోఁ బిక్కల
దాఁక జీలాడు నిద్రాహారంగుఁ
జేతులతోఁ గెంపువాతెఱతెలిగప్పు
చిఱునవ్వుతో దొనచెలి చెలువము
దిగిచికొన్నట్టి నెమ్మొగముతో నీలంపు
దిమ్మల నిరుక్రేవ దిద్దినట్లు
దొడరు వెడఁదరొమ్ముతో నవలామూక
బోడువ మరుం డొరవెడలిచిన క
గీ. టారి జిలుగుమిటారపుటాగుతోడఁ
గన్నులనుగట్టి యావెన్కఁ గానరాక
నింతినలయింప నిచి త్త పెట్టులోర్చె, సీత...
సీ. చనదు ననువిడచి జనఁగ నిలునిలుము
నినునెనరున సామివనుచు నమ్ము
నాని మదినలజడి గొనివెడవిలుదొర
విడచునన జిలుకుజడికిజడిసి
కలువరాయనికిఁ గోయిలలకుఁ దెమ్మెర
లకుఁ జిలుకలకు......నోదు
గవలసె నీక నను గవయకున్నఁ దాళఁ
జాల నీయాన వేయేల ననుచు
గీ. విరిబోదలబారు వేమారు వెతకఁజేరు
వెతకి వేసారు నొకమారు విధినిదూరు
వెలఁది నీతీరు గనఁగోరు వెతలమీఱు, సీత

సీ. తళుకుటనంటి బోదెలలోన తనసీడ
గని యబ్బితివటంచుఁ గౌఁగలించు
కమ్మపూటీరాల నెమ్మిపింఛముఁగాంచి
డాఁగెదాయనివేగ డాయనేగు
విరిసంపగులసొంపు నెరికగా మదినెంచి
నాయాన నిలుమంచు డాయఁబోవు
నగిసె పూనెరివిప్పు జిగినీదుమెయిగాఁగ
మదినెంచి భ్రమమించి గదియఁదొడరు
గీ. భ్రమవదలి మరల భ్రమియును భ్రమిసిభ్రమియు
నొక్కగడె భ్రమవదలక యుండు చెలువ
పొలుపు నలవుగోలుపుతలఁపుడులుభ్రమిఁక వీత.
సీ. నెచ్చెలియొకతె యన్నెలతగాకయంత
వెతకివేసారియో వెలఁదులార
వేగరారమ్మ యేమోగాని మనబాల
యిచట లేదమ్మ నేనేమిసేతు
ననిపల్క నింతింత యనరాని దిగులుబ్బ
నందఱు జనుదెంచి యచటనచట
రోయుచు నటఁ గల్వరాయని రాబాట
నడుగుఁ జెమ్మటడాగు లగుటఁ గాంచి
గీ. యివి మిటారియడుగు జిన్నెలి గ్గారవున
నతివ కేళీవనము జేరెనన్నరొఁత
మోసమని తల్లడిల్లి రామఁ డితశ్ల్ల సీత. . . 27

సీ. చలువఱాబాట జనిపువ్వుఁదోఁట జ
వ్వని నచ్చటచట నవ్వనితలెల్ల
కమనీయవాసంతికాకుంజపుంజంబు
లను గుంజదళిపుంజలలితచూత
కలితకాంచనడోలి కలవలమాన మా
రుత మందగమన చారుతర సమప
రాగసైకతముల రతిఁజేనికత్తెలా
లి గొలగొలలబొలుపగు నెలవుల
గీ. వెతకుచు లతాంగిఁగానక వెఱపుబొడమి
గడమిగులు దల్లడంబుల నొడలుబిడలు
పడఁగఁబడుపాట్లు మాబోంట్లు బలుకుటెట్లు వీత.

సీ. కనుఁగొనల్వెడలు వెచ్చనినీరుపయిజారి
తళుకుఁజెక్కుల ధగద్ధగలుమాన్ప
విరిదుమారమున ధూసరమైననెరిగప్పి
మోముమిటారంబు మోటుపరుప
జారుపయ్యెదనంటు చలువకాటుకడాగు
గుబ్బచన్గవనీటు గొదువసేయ
తనువంటి చిమచిమ మ్మనుగెందలిరుటాకు
వెగరుటావిరిమేని జిగియడంప
గీ. తెమ్మెరలు రేచ పొగలయిదేంట్లుదోఁచ
భగ్గుమను మెట్టుదమ్మిపూటగ్గిడాయు
చెలిగని సఖుల్దటాలున నలమికొనిరి,వీత... 29

సీ. అమ్మమ్మ యెంత సాహసము జేసితివమ్మ
యింకనిను నమ్మరా దెంతమాట
దెచ్చితివమ్మ యిత్తెఱంగు లేనాఁడు మే
మెఱుఁగ మేవేళ కైద మేని దెలసు
మనుఁగి కురించి యామనియను పులిబొంచి
యున్న యీవనికి నిన్నొంటి నెచ్చు
పలవిరిసింగాణి గలజోదునకు నీయు
సురు దగలకపోదు సుదతి గదలి
గీ. వేగ రావమ్మ నీమనోవిభుని దెత్తు
మమ్మ యిది నమ్ముమమ్మ మాయమ్మ యనుచు
సఖియ లిటుదూర చెలిబిక్కఁ జరిచె సౌర వీత...
సీ. మొలక గాడ్పులకాక చెలిమోము ఘుమ్మనె
పన్నీరు చిలుకరే పడఁతులార
పూఁదేనె తుంపరల్ పొలఁతికన్నులదూలె
ననుబైఁటనొత్తరే వనితలార
యనఁటి వేడిమిదాకి వనజాక్షి మైగందె
వేగమంత్రించరే వెలఁదులార
యలరుటీనికలు నెచ్చెలి పాదములఁ జొచ్చె
మెల్లనదియ్యరే మెలఁతులార
గీ. మనము చెలిమిన్న నీపట్ల గనకజన్న
నకట మఱియెంత మోసమానోయటన్న
చెలుల కలవిలలట్టె నీవలరుఁబుట్టె, వీత... 31

సీ. ఘోర వాతాంఘూరవాతక మాసఖియ మైఁ
గందించెదా యని గసరువారు
శుకము మాసకియపై నొక నొత్తినగఁ జేసి
బెదరించెదా యని గదుముువారు
కోయిలా తుదకు నీ కూఁతఁబట్టుట చెలి
నలికింపనా యని యాడువారు
తుమ్మెదా దుశ్శకునమ్ము కోమలి నేఁచఁ
దొఁఅరితివా యని దూరువారు
గీ. త్రోవఁబడు పుష్పాదుల దవ్వ దుడుచువారు
జళుకుఁ గొనవలదని చెలిఁ బలుకువారు
నైరి సఖులెల్ల లలన నిన్గోరుకతన, నీత... 32
సీ. పువుటందలములోనఁ బువుఁబోఁడినుంచి మో
తపడంతు లంత ప్రోతలనడంచి
తత్తరంబుగ నెత్తి సత్తడి బిత్తడి
యొకతె ముందేగి భీతోచితోప
చారోపహారంబుఁ గూరిచి తెచ్చి య
త్తోయజాక్షికి దిగదుడిచి పార
వైవ బిరాలున వనితలు చెలి నంద
లము డించి యొలసి కల్వదొరచట్ల
గీ. మెట్లవెంబడి మెల్లన మేడఁ జేర్చి
చలువ లెన్నేనిఁ గూర్చి రచ్చంచలాక్షి
కౌర యిటువంటివింత లెందైనఁ గలవె, నీత...

సీ. పోరముల్ బరువాయె నన్నంబు వెగటాయె
 చెలులపై యలుకాయె చీదరాయె
తలఁపులు మెండాయె వలపు మిక్కుటమాయె
 చలువలు సెగలాయె నలసటాయె
నిముసమే యుగమాయె నెమ్మేను సగమాయె
 నిలుపు లేదాయె బల్సొలపులాయె
కన్ని రొలుకుటాయె కలవిలపాటాయె
 వెఱపు మోపాయె మై వెల్లనాయె
గీ. మరునిపగలాయె వగలెల్ల మంతమాయె
వలచుచెలి నిటువలె వెత గొలిపి తార
సరసుఁడవు లేర నీమేలు చాలుఁజాలు, వీత...

సీ. ఇప్పుడె బంగరుదుప్పటి వలెవాటు
 తోఁ దళుక్కఁగన్నులతో వలంతి
నగవలరేడు ముద్దుమొగముతో నెలమికాఁ
 డిటవచ్చెనమ్మ దన్నింతజూచి
గడుసిగ్గునను పరుగిడు నన్ను వెన్నంటి
 పడి కౌఁగిటనుబట్టి తొడనిడికొని
చెక్కుముద్దాడి చురుక్కున నామోవి
 నొక్కి చొక్కించి దాఁ జొక్కి చొక్కి
గీ. యొచటి కేగెనో కానరాఁ డేమిసేతు
నకట కలయని తోఁచుఁ గాదనియుఁ దోఁచు
నంచు వలవలఁ గన్నీరు నించుఁ జెలియ, వీత...

సీ. ఏమరి యేనున్న యెడఁ దటాలున వచ్చి
మోహనాంగుఁడు కను ల్మూసినట్లు
మూసిన నెఱిఁగియు ముదిత నొచ్చెనో విడు
విడుమమ్మ యనుచు నే వేడినట్లు
వేడిన మాఱెల్లుతోఁ బ్రాణేశుండు
విడక పేరేమని యడిగినట్లు
లడిగినఁ దెలిసి యానానంచు నగ వీడి
తటుకునఁ దల్పోర దాఁగినట్లు
గీ. దాగి కడకేగునెడ నన్ను దమ్మిప్రేయ
నొచ్చు పగసేయ దయఁ గౌఁగి లిచ్చినట్లు
నెలఁత కలవచ్చెనంచుఁ గన్నీరునించు, విత...
సీ. అచ్చుగా నీరూప మంతయుఁ బొడకట్టి
ముకురభావము జూచి మోహమొందు
నొంది దిగ్గున లేచి యూరకే చీకాకు
పడి నెచ్చెలులపైకి వెసలఁదోలుఁ
దోలి యద్దపుఁదల్పు లోలి బిగించి పై
పట్టుతట్టుపు తెరల్ బారుసేయుఁ
జేసి యాభావంబు చెక్కులు ముద్దాడి
కడుఁబ్రేమ బిగ్గనఁ గౌఁగిలించుఁ
గీ. గౌఁగిలించి యొకింత లోఁగరగుఁ గరిగి
పల్కవేమను ననిపల్కు నుల్కులేమి
కక్కటక్కట చెలి వెక్కివెక్కి యేడ్చి, వీత...

సీ. కూసెదు కనువెట్టి జేసెదు చాలవా
    కాకిశాపులు నీవు కోకిలంబ
అఱచెదు మొగమెత్తిపఱచెదు తెలియదా
    త్రుళ్లు మీవారిసంకెళ్లు శుకమ
యార్చెదు తెక్కలల్లార్చెదు దొరకునా
    కాంచనం బింతైన చంచరీక
గ్రమ్మెదు విరిదుమ్ము జిమ్మెదు గానవా
    చిలువవాచిచ్చు దక్షిణసమీర
గీ. రావు ఘనసాంకవామోద హేమగాత్రి
కాలఫణివేణి మాచెలిగాంగ నెఱఁగి
..తొలఁగ మేలని రపుడు నీచెలియ చెలులు, వీత.

సీ. సత్వసంపత్పూర్ణజనమైన వెలిదీవి
    మఱికొంతతేజంబు నెఱపినావు
దివిషదీశానాత్మభవసామ్యసంప్రాప్తి
    జనులు సోయగ మెన్న నొనరినావు
తతసహస్రకరప్రతాపంబు చల్లార్చి
    యత్యర్జునాభిఖ్య నలరినావు
కరపుష్టి కైలాసధరమందుఁ జూపి యా
    ముక్కంటితల కాలఁ ద్రొక్కినావు
గీ. కనుక నిను రావణున కెక్కు డనఁగవచ్చు
నోనిశాచరరాజ యనూనతేజ
..యనుచు శశిదూఱుఁ బలుమారు నతివబారు, వీత.

సీ. పలుగాకిమూఁకలోపలఁ బుట్టి పెరిగి బ
ల్లందుమీఱినది నీ కాల్బలంబు
పుడమి నాకులపాటుఁ బొనరించిగద మఘు
నానుబందు నీదండనాయకుండు
గాను గాడించినఁ గాని నీసదుర యూ
త్రోంటిగుణంబు నీతుంటవిల్లు
మధువెల్లఁ ద్రావి మైమ సెక్కి తిరుగు నీ
త్తేలు నీదు చండాలినారి
గీ. సోకునరదంబు రేఁడోఁచు పోనకుండు
గరచును గుఱ్ఱాలు విషజాతి గద సిడెంబు
భళిర తగు తగునని మారుఁ బడఁతిడూరు, వీత.
సీ. హారుకంటిసుంట నిన్నంట నీపూను యూ
వనజారి యొక్కఁడ వ్రక్కలయ్యె
నీకు సేనానియై నెచ్చెలియై ముందు
నడచు వసంతుఁ డేయుసవిఁ గలసె
నిలువెల్ల సార్వడు నెలుగొందు నీచేతి
తుంటవి ల్లెచ్చట దునిసిపడియె
సొనసి నగంబులైనను పెల్లగించు నీ
చలపాది పవనుఁ డెచ్చటికిఁ బఱచెఁ
గీ. దొలఁగు మిప్పురికరమున గెలువలేవు
పొలఁతి కోపాగ్ని పాలయిపో కటంచు
మగువ లెంచివచించి రమ్మరుగుఱించి, వీత... 41

సీ. ఎలుగెత్తుమాత్ర కోయిలపోజుఁ దొలఁగించి
పెన్గొప్పునను శిఖిపింఛ మడఁచి
మొగమెత్తి వాఋష్మని తొగతేని వెలికొత్తి
నవ్వుచు రేయెండ క్రొవ్వడంచి
పల్కులధాటిచేఁ జిల్కగుటాల్ నిల్పి
చూచి పూముల్కుల సొంపడంచి
ముడిబొమ్మలిడి కేలి వెడవిల్లు దునుమాడి
వేడియూర్పునఁ దేరు వెన్కఁజొనిపి
గీ. శ్రీమగతి మాలతాంగి నిన్ బిలుకుమార్చు
నని రొఱుఁగవాకొ యెదిరితి వైన నేమి
తొలఁగుమని మరునరి నీచెలియ చెలులు, వీత.

సీ. ఎగసి కో యనుచు కెంజిగురాకుబల్లెంబు
లంటి కోయిలబంటు లడరి నడువ
నలుగడ త్వాడదమ్రాతలనిండ నురువడి
వసరుతేఁజిపోఁజొ ముసురుకొనఁగ
నలరుదుమ్ములు గ్రమ్ము నడుగుమట్టుడులతో
తుమ్మెదకాల్దండు దొమ్మినేయ
రేరాయువలినిగ్గు వీరపాణాపుమస్తు
మొనసి వెన్నెలపుల్గు మొనలుదరుమ
గీ. రాజు బుతురాజు సూరెలరాగ గాడ్పు
టరదమున వచ్చు మరుఁగాంచి యతివ సొమ్మ
సిలె నకట నీయుపేక్షచేఁ గలిగె నింత, వీత...

సీ. గంబురాపొడి జల్లి కలువరేకులు తెచ్చి
యువిదకందోయిపై నుంచునొకతె
మోటు రేకువదల్చి మొగ్గతమ్ములు తెచ్చి
చెలియపాలిండ్లపైఁ జేర్చునొకతె
కప్పెల్ల దిగనూడ్చి కలువకాడలు తెచ్చి
సుదతిదండలనిండఁ జుట్టునొకతె
కఱకుపుప్పొడియూడ్చి కదళిపత్రము దెచ్చి
కనకాంగిమీఁదపైఁ గ్రమ్మునొకతె
గీ. కొమ్మ లిటుచేయుచలువలఁ దెమ్మదేరి
వెలఁది యొక్కింత కనుదోయి విచ్చి చూచె
నిను వలవనేలొ యిటువెత ల్గనఁగనేలొ, వీత...
సీ. తనవారు నను చేదిధరణీశునకు నిత్తు
రనియుఁ దన్నిశ్చితనూతముహూర్త
మప్పుడహితమయ్యె ననియును దెలిసి లో
నుప్పొంగు వెతలు పైఁ గప్పికొనఁగఁ
దలవంచి మదిఁ గొంతతడవు విచారించి
చెచ్చెర నపుడొక చెలియచేత
కార్యనిర్వహణవికస్వరచిత్తు న
నున్మత్తు హరిభజనోపయుక్తు
గీ. నెంచి విప్రకుమారుఁ బిల్పించి తెలుపు
నవి యొఱంగించి నీమ్రోల కనిపెనుగద
వార్థ్యమెందులకేగెనో మగువ కపుడు,వీత...

సీ. మోహనాకారు నెమ్మోము గన్గొని సొక్క
భాగ్య మీనేత్రముల్ బడయునొక్కొ
సారసాక్షుని పాదసరసీజములఁ బట్టు
భాగ్య మీహస్తముల్ బడయునొక్కొ
కమలేశుచేఁ దాళి గట్టించుకొనునట్టి
భాగ్య మీకంఠంబు బడయునొక్కొ
యఖిలలోకేశ్వరుఁ దలమిఁ గౌఁగిటఁ జేర్చు
భాగ్య మీగాత్రంబు బడయునొక్కొ
గీ. విభుఁ డనాలోచిత విశేష వివిధవినత
భూతరక్షకుఁ డఁట నన్నుఁ బ్రోవఁడొక్కొ
యనుచుఁ జెలియందు నరసందియంబుఁ జెందు, వీత.

సీ. అరయుఁడీ మనవిప్రుఁ డచటికేఁగెనొ లేక
యన్నకు జడిసి తా నాఁగెనేమొ
చనినను బ్రాణేశు సమయమయ్యెనొ లేక
నరుగ నసందర్భ మాయెనేమొ
వెతలెల్ల నిటుపైని విడువనౌనో లేక
దయమాలి వేరుగాఁ దలఁచునేమొ
మధువైరి నాకోర్కె మన్నించునో లేక
వలదని వార్తలఁ బంపునేమొ
గీ. యేగి జాగాయె విప్రుఁ డదేలరాఁడు
వేరుగాఁ దోఁచుచున్నది వెలఁదులార
యనుచుఁ జెలిసందియముఁ జెందుమనమునందు, వీ.

సీ. ఇది మనయుపవనం బిది యమునాకుల్య
మిది కమలాకరం బిది తటాక
మిది శుద్ధమరుభూమి యిదియ యరణ్యాగ
మిది గిరిపర్వతం బిది హిమాద్రి
యిది మృగయూథ మిల్లిది యుపత్యకసస్య
మిది మెట్టతామర యిది నవాగ్ని
యిది కుంజపుంజ మిల్లిది బాలసహకార
మిది క్రమగాంభము నిదె విదర్భ
గీ. మనుచుఁ దారసుఁ జెలికిఁ గింప నన్ని గనుచు
నేకసీరుండవై ధరిత్రీశ నిచయ
ఘోరపురబహిరంగంబుఁ జేరితౌర, సీత... 48
సీ. గురియ నల్ల మొయిళ్ళ మెలుగొప్పు మెయితళ్కు
పెరవారి కన్నుల కిరులుగొల్ప
తోలుకరి బలుమించువలె మించు దువ్వల్వ
జిగి పగరకన్నుల జిగ్గురనఁగఁ
గడమొగుల రొదల బెడగారు చిందంపు
వెడగుమ్రోఁత దొరల కడలుగొల్ప
వేలుపువిలుబలె వెలయు సింగిణి రాచ
గడుసు లకటు జిల్కు జడలుదెల్ప
గీ. వడివెడలు తేరుటుండలఁ బుడమివడఁక
గడగడల గడవెడల నప్పుడచు బడయ
నడచు నినుఁగని మది దిగుల్ బడరె దొరలు, వీత.

సీ. లేమకు గొల్లఁడాలే చాలియుండఁగా
యామూలరోమట్టి లెవతెమెట్టి
నెలనాగ కంఘ్రిచాయే చాలియుండఁగా
యీమోటుజిగిలత్తు కెవతె జొత్తె
ఎంతికి వాల్గన్నులే చాలియుండఁగా
యీచవి కలువరే కెవతె దురిమె
నిగురుఁబోణికి మై జిగె చాలియుండఁగా
యీగంబురాఁగంద మెవతె బూసె
గీ. ననుచుఁ గనువారలెల్ల మో టనుచు నొగుల
పడఁతి గౌరిలు వెలువడి నడచునంత
నెంతమోమాయెరా నీకదేమొకాని, వీత...50
సీ. బోఁటికందోయికిఁ గాటుకే మోటేమొ
లేకున్న నిటు సంచలించునొక్కొ
కొమ్మ కేల్దమ్మికి తమ్మియే కటకేమొ
గాకున్నఁ గెంజాయ గ్రమ్మునొక్కొ
సుదతిమేనికి వాలుఁజూపులే బరువేమొ
మారైనఁ గేలూతఁ గోరునొక్కొ
సఖికంధరకు చిన్నసరులె బర్వ్రిగేమొ
వేరైన రేఖలు దేరునొక్కొ
గీ. యనుచుఁ గనుజనులమనములందుఁ దోఁచఁ
బడఁతి గౌరిలు వెలువడి నడచి దొరలఁ
గనుచు నినుఁగనకట యుస్సు రనియె నకట, వీత.

సీ. నీసోఁగకనుదోయి నీమిటారపుఁజూపు
నీతళ్కుచెక్కులు నీదుచెవులు
నీయుంగ్రపుంగురుల్ నీనూఁగుమీసంబు
నీసన్నకనుబొమల్ నీదుమోము
నీనెఱాచిఱునవ్వు నీకెంపువాతెఱ
నీవెడందయురంబు నీదుగళము
నీదీర్ఘబాహువుల్ నీపిడికెడుకౌను
నీయొయారపుమేను నీహొరంగుఁ
గీ. జూచి తమిరేచి యుప్పొంగి సుందరాంగి
మెఱసెఁ దెఱగంటివాల్గంటికరణి నంత
నెంతమోహనమూర్తివో యెఱుఁగనయ్య, నీత.

సీ. గండభాగమునిండ కుండలప్రభవాని
చెలువారు బంగారుచేలవాని
శతకోటిభాస్కరద్యుతికిరీటమువాని
డంబారు శిరునామంబువాని
వనమాలికారమ్యవక్షస్థలమువాని
తళుకుముత్తెపుపేర్లు గలుగువాని
తరళాంగదద్వయీధాగధగ్యమువాని
నొసలిపై సరిశేషుమిసిమివాని
గీ. నిగనిగను కరిమేని బల్ నిగ్గువాని
సొగసుకాని నినుం గన సుందరాంగి
కపురు మరుపుత్తళికసొబగబ్బెగదర, నీత...

సీ. దరహాసచంద్రికా ధవళితాధరముతో
నధరరక్తాగ్రదంతాలితోడ
తతకటాక్షారుణీకృతకర్ణమణులతోఁ
గర్ణికాపీతాంశుకళలతోడ
మకుటరుక్పింఛచ్ఛాయమానాలకములతో
నలకశారితకిరీటాభతోడ
చారుకౌస్తుభరంజితోరస్థలంబుతో
స్ఫురదురఃపిహితకౌస్తుభముతోడ
గీ. చెలువలరు నినుఁగని యలిచికుర కపుడు
వెడలు ననవింటిదొరజిల్కు జడియనంగ
నీదు దట్టపుఁజూపులు నిగుడెగదర, వీత... 54

సీ. ఒగి జరాసంధుని మొగము వెల్వెలఁబాఱ
దంతవక్త్రునిగుండె తల్లడిల్లఁ
గాల్సేతులాడక గడురుక్మి వెగడొంద
వెలిగంది సాల్వుండు కొరడువాఱఁ
గని పౌండ్రకునియొడ ల్గడగడవడకాడ
రుక్మనేత్రుఁడు రిత్త రోసమంద
చైద్యుండు రథముపైఁ జదికిలఁబడి యూర్చు
గోలగోలేమని భీష్ముండు బలుక
గీ. నెల్లెడల భూమిపతు లబ్బు రెత్తిచూడఁ
దేరుదిగివచ్చి రుక్మిణీపారిజాతు
నెత్తికొనిపోవు నీసాబ గెన్నదరమె, వీత... 55

సీ. నిలునిలు కృష్ణ కన్నియఁ గొనిపవ నీకుఁ
శక్యమే యను జరాసంధుమీఁద
ననుఁజూడు మిదె యిదె నాబారిఁబడి నీకుఁ
జనవచ్చునే యను సాళ్వుమీఁద
వచ్చితి వెటుఁబోవవచ్చు నీకు నటంచు
ప్రదరముల్ నించు పౌండ్రకునిమీఁద
చుట్టుముట్టుడు గొల్లఁ బట్టి చంప్రుఁ డటంచు
రోషించి పలికెడు రుక్మిమీఁద
గీ. సరశతంబై లేనిధైర్యంబు పూని
మొనయు శిశుపాలుమీఁద నీయనుఁగుఁదమ్ము
చిలుకుజడి గ్రమ్మి కంపలు చెండెఁగదర, నీత...

సీ. పలువుర ఫాలమునఁ బట్టి పగ్గర నీడ్చు
పక్కపక్కన తల ల్పగుల నస్థి
వితతులు ఫెళఫెళ విరుగ బొళ్ళొళ్ళని
గ్రక్కున నెత్తురుల్ గ్రక్క మెదడు
టసలు తప్తప్పున నవనిపైఁ బడ దుప్పు
తుప్పున పై తల తునుక లెగయ
వలవల నెత్తురువఱదలు వాఱ శ
వంబులు దిభదిభ వసుధఁ గూలఁ
గీ. బట్టి రోకంటఁ బడమోదునట్టి నీదు
నగ్రజు నుదగ్రతరరణావ్యగ్రవృత్తి
కగ్గమయి బెగ్గడిలరె సాళ్వాదు లహహ, నీత.

సీ. నిబిడ నిష్ఠురభాణనిర్ఘాతపాతప
తత్ప్రతీపావనీభృత్ప్రతీక
శశ్వత్ప్రవద్రక్తఝురకర్దమితసమీ
కాంగణాధోవిశదవలచక్ర
రథసమాకృష్టివైపథికసారథికశా
హాతికృచ్ఛ్రవిక్రమదార్ఢ్య వివిధ
కంఖాళనిష్క్రమక్రమనిష్ఫలీకృత
రథికలోకపురస్సరత్కరాళ
గీ. శరవిఖండితసాదినిషాదిపతన
ధావమానాస్వగజమయ్యెఁ దావకాను
జన్మకోట్లల కనిలోన శత్రుసేన, వీత... 58

సీ. విఘటితరథము విభిన్నమాతంగము
విద్ధపదాతము వికృతహాయము
విద్రవద్యూథము విప్లుతయోధము
విచ్ఛిన్నచాపము వికలశరము
విధుతపతాకము వితృతదట్టము
విదళితహస్తము వితతశవము
వికృతజిహ్వాస్యము విలుఠత్ప్రతీకము
విగళదస్త్రౌఘము విరతరణము
గీ. నయ్యెఁ గదయయ్య భవదగ్రజానుజన్మ
రూక్షకోదండదండనిర్ముక్తనిబిడ
శరపరంపర కనిలోన శత్రుసేన, వీత... 59

సీ. పటుతీవ్రబాణసంపాతభీతుండయి
బరువంగసాగడే పౌండ్రకుండు
బలహస్తసముదగ్రహలము గన్గొని తేరు
మఱలంగఁ దోలఁడే మాగధుండు
భ్రామితాయోగ్రసంభ్రమరథాంకృతికి డస్సి
సమరంబుఁ దోలఁగడే సాల్వవిభుఁడు
హలముతోఁబాటు ప్రయాసంబున మొరంగి
చీకాకు నొందఁడే చేదినాథుఁ
గీ. డిన్ని కన్నారఁగనియు నిన్నెదిరికొనఁగ
నేల తల గొరుగుడుబడనేల రుక్మి
కరయ నిది రుక్మిణికి మఱి నెఱియ నకట, వీత...
సీ. దుష్టమృగంబులఁ దోలు పంచాననం
బన విజృంభించి నీ వఖిలరిపున
రేంద్రబృందంబు నిస్తంద్రవృత్తి నదల్చి
కోమలిఁగొని బలరామ సాత్య
కాత్మజు లిరుక్రేవ నరుదేర దుందుభి
ధ్వానంబు భూనభోంతరము నిండ
వివిధపతాకికావితతులు విజయసూ
చకములై నలుగడఁ జదలునిండ
గీ. ననుగతాసంఖ్య సైన్యంబు లనుసరించ
వచ్చు నంబుధులన మహావైభవమునఁ
బురిఁ బ్రవేశించు హెచ్చు నాబుద్ధి మెచ్చు,వీత.

సీ. పార్శ్వభాగముల రంభాస్తంభములు నిల్పి
పచ్చతోరణములు పాదుకొల్పి
బలుదట్టముగ నించి పన్నీరు జల్లించి
యెడనెడఁ బడగల నెత్తఁబంచి
మురువుగ ముత్తెపుముగ్గులు బెట్టించి
స్వస్తివాక్యంబులు చదువఁబంచి
మంగళధ్వానము ల్మహి మిన్నుఁ బూరించి
యెదురుగాఁగ నమాత్యు లేగుదెంచి
గీ. మ్రొక్కి నినుఁగూడి రాఁ బ్రోలి ముదిత లెల్ల
సౌధములనుండి సేసలఁ జల్ల నీవు
పురిఁ బ్రవేశించు పోచ్చు నాబుద్ధి మెచ్చు, సీత.
సీ. అగ్రంబునను జనకోగ్రసేనుమహీశు
లుచితాసనంబుల నుండుటయును
రెండవచతురాననుం డనఁదగిన గర్గ
సంయమి శుభవిధి జరుపుటయును
బలసాత్యకులు సేయుపనుల సేయించుచు
నుభయభాగములఁ గూర్చుండుటయును
ముదమున దేవకీముఖ్యపుణ్యాంగన
లొకక్రేవఁ గనుఁగొనుచుండుటయును
గీ. తండ్రి యప్పుడు నీవు వైదర్భియుతుఁ
కళుకుటపరంజినెలతాళిఁ గట్టుటయును
కన్నులనుగట్టు మది నరికట్టు నొట్టు, సీత... 63

సీ. అలసువద్మనమున కాశ్రయంబగుచేత
గరుణతో గజరాజుఁ గాచుచేత
గురునకు బ్రతికించి కొడుకు నిచ్చినచేత
మురళీవినోదిగ్గా మొఱయుచేత
నఖిలదేవతలకు నాలంబమగుచేత
నస్మదాదులకు దిక్కైనచేత
గోపికాకుచముల గోరు లుంచినచేతఁ
జెలఁగి పాశ్వన్న ముచ్చిలినచేత
గీ. నట్టి గోవర్ధనం బెత్తినట్టి చేతఁ
బట్టి నాతండ్రి శ్రీకృష్ణు పట్టిపనము
సన్నిద్రోక్కించు నీరంతు సన్నుతింతు, వీత...

సీ. మందమారుతచాల్యమానాంకణలతాల
తాంతహిందోళడోలాయితములు
ప్రేయసీసంగనప్రేమానుగతపాధ
పారావతవిలాసవలయితములు
నిబిడశాఖాదుర్దినితవసీమాధవీ
మంటపశిఖినాట్యమండలికలు
నిష్కుటవాపీవినిద్రారవిందమ
రందమత్తమరాళమందగతులు
గీ. కనుఁగొనుచు భీష్మకేంద్రుని తనయతోడఁ
గూడి క్రీడించు నమ్ముఁ గన్నతండ్రి నీకు

నిత్యమంగళ మఖిలసంస్తుత్యచరిత
వీతభవతృష్ణ రంగేశవేష కృష్ణ. 65

క. శ్రీమన్ముడుంబ వేంకట
రామనృసింహార్య రచిత రంగేశగుణ
శ్రీమధురకృతికి నఖిలస
భామహితంబైన ప్రథమభాగము ముగిసెన్.



## ద్వితీయ భాగము.

సీ. శ్రీధర శ్రీరమా శ్రీసైన్యనాయక
వకుళభూషణనాథ వనజనేత్ర
రామ యామునపూర్ణ రామానుజార్యగో
విందభట్టారక వేదవేద్య
కలివైరి కృష్ణ లోకగురు శ్రీశైలేశ
వరవరస్వాచార్య నిరుపమాన
దివ్యకల్పకపుష్పదీప్తమాలాబహూ
కారంబుఁ జేసెదఁ గాకతీర్చి
గీ. తేఁక మదుజ్జీవనానురూపైకరూప
రూపగుణభూతి లీలానురూపరీతి
గొంచ యకించను నను రక్షించవలయు, వీత...

సీ. చేతనా చేతన శేషి యో వేదాంత.
    రమ్య సర్వజ్ఞ శ్రీకాంత యనుచు
నిఖిలహేయప్రత్యనీకకళ్యాణైక
    తాన యోపు ప్రదాత యనుచు
వేద్యపరవ్యూహవిభవాంతరర్చాఖ్య
    పంచప్రకారవైభవ యటంచు
కల్పకక్షయము నొక్క డవై మరల నీ
    జగమెల్ల సృజియించు చతురయనుచు
గీ. ఫాలమున త్రిణయను నాభి పద్మభవుని
నింద్రు ముఖమున గన్న సర్వేశయనుచు
పాడియాడెదనయ్య నీవాడనయ్య, సీత... 67

సీ. సఖులు కొందఱు రహస్యమున నీవివిధక
    ళ్యాణగుణంబుల ననుభవింప
యపుడు నే దగ్గరి యడిగిన నాప్రేమ
    నెఱిఁగి నీకథలు నా కెఱుఁగఁజెప్ప
నదివిని యదిమొద లన్యసంగతిమాని
    యంతరంగంబు నీయందె తగిలి
యేయుపాయముఁ దోఁచ కెంతయు రేబవల్
    మదిఁగుందు ననుఁజూచి మద్గురుండు
గీ. తేర్చి కరుణించి నీతోడఁ గూర్చెనయ్య
నన్ను విడనాడు టెటువంటి నాయమయ్య
కరుణనేలఁగదయ్య మంగళతరాంగ, సీత... 68

సీ. సన్మహూర్తంబున సమ్మతంబుగ బంధు
మధ్యంబునను నీకు మద్గురుండు
నను యథావిధి నొసంగిన నగ్నిసాక్షిగ
లీలఁ గైకొని యేలుకొనియు
విడనాడి మఱచి తీవిధము నేనెఱుఁగక
విభుఁడు నన్నేలఁగ వేగఁ బ్రోవ
నేతేరఁడని మది నెంచి తుణంబు యు
గంబుగఁ గాలంబుఁ గడిపికొనుచు
గీ. మోహమునకగ్గమై సిగ్గు మోసపుచ్చి
యిటకుఁ జనుదెంచితి పరాకదేలనయ్య
యేలుకొనుమయ్య నేరంబు లెంచకయ్య, వీత.

సీ. సంతసం బొసఁగు నా శైశవం బెడఁబాసి
యిప్పట్టునను ప్రాయ మేలవచ్చె
వచ్చెఁగాక నసౌఖ్య మిచ్చు బుద్ధివికాస
మింతవేగంబె దా నేలబొడమెఁ
బొడమెఁ గాక త్రయీభూషణంబైన ని
న్నెదలోనఁ దలఁపోయ నేలనాయె
నాయెఁగా కకట నీ కఖిలంబుఁ దెలిసియు
నిట్టు నా ప్రేమ మఱపేల బుట్టెఁ
గీ. బుట్టెఁగాక దయాశాలి బ్రోచుననుచు
నమ్ముకొని వచ్చె ననిదైన నన్నుఁ గన్ను
లారఁ గనవేల యిదివీల చారుశీల, వీత... 70

సీ. నిర్గుణుండవటంచు నిర్లేపుఁడవటంచు
　　జను లెంతు రదినేఁడు సత్యమాయె
నగ్రాహ్యుఁడవటంచు నతిమాయికుఁడవంచు
　　జను లెంతు రదినేఁడు సత్యమాయె
నిష్క్రియాఁడవంచు నిఖిలస్థితుఁడవంచు
　　జను లెంతు రదినేఁడు సత్యమాయె
మోహనుండవటంచు మోసపుచ్చెదవంచు
　　జను లెంతు రదినేఁడు సత్యమాయె
గీ. నిఖలకళ్యాణగుణరత్ననిధివటంచు
పాడియాడెద రదె యిదె పలుకు వేలు
ముందు నీగుణమెఱుఁగక మోసపోతి, నీత. 71

సీ. మోహనాకార నా మోహంబుదీర ని
　　న్నించి బిగ్గన గౌఁగిలించికొందు
సుమసుకుమార నా భ్రమమెల్లఁదీర నీ
　　చెక్కిళ్లు ముద్దాడి చెనకికొందు
భామినీమార నా భావమీడేర నీ
　　మోము మోమునఁజేర్చి ముద్దుగొందుఁ
దతదయాధార నా వెతలు చల్లార నీ
　　చేదమ్ము లురముపైఁ జేర్చికొందు
గీ. నిగమసంచార నాపది బెగడుదీర
నీమృదుపదంబు లౌదల నిలిపికొందు
నిముస మిఁక నోర్వ నోపను నిజము నిజము, నీత.

సీ. కెందామరలకన్న నందమై యున్న నీ
యడుగు లీచెక్కిళ్ల నదుమకున్నఁ
దర్పణంబులకన్నఁ దళుకారి యున్న నీ
యలరుఁ జెక్కిళ్లు ముద్దాడకున్న
జొక్కంపువిరికన్న చక్కనై యున్న నీ
మేనట్టి కౌఁగిళ్లఁ బూనకున్న
కలవరాయనికన్న కళలీనుచున్న నీ
మోము కన్నులఁగప్పి మురియకున్న
గీ. నెటువలె దురంతసంతాప మింకునయ్య
యేమిసేయుదునయ్య నిన్నెలనయ్య
కరుణ నేలఁగదయ్య మంగళతరాంగ, నీత... 73

సీ. వనజాక్ష నీచక్కఁదనముఁ జూచినయంత
మనసు నీపయిఁ జాల మరులుగొనిరొ
మనసునీపైఁ జాల మరులుగొన్నంతనే
కోర్కె లంతంతకుఁ గొనలుసాగెఁ
గోర్కె లంతంతకుఁ గొనసాగునంతనే
రేయి జాగరణంబు బాయదయ్యె
రేయిజాగరణంబు బాయకున్నంతనే
చెలువంపు మేనెల్లఁ గలయఁజిక్కె
గీ. చిక్కి మదికెక్కియేమి రుచించదయ్యె
నయి మిగుల డెంద మీలోకభయము దొలఁకె
నింక యేమగునోకోస్వామి యేమిసేతు, నీత...

సీ. నొవ్వకుండఁగ గురుల్ దువ్వి క్రొమ్ముడిఁ దీర్చి
సొగసుగా విరిసరుల్ జుట్టనేర్తు
నునుపున్న మెఱుఁగాని నొసటిపై మృగనాభి
తిలకంబు చక్కఁగా దిద్దనేర్తు
కమ్మకస్తురి కుంకుమమ్ము కర్పూరముఁ గూర్చి
కలపంబు నెమ్మేన నలఁదనేర్తు
చెలువారు ఘనసారుఁ జిలుక మెల్లన కేల
విరులవీవనఁ బట్టి విసరనేర్తు
గీ. నేమఱకఁ జుట్టి మడుపు లందీయనేర్తు
చెంతఁబాయక తగుపనుల్ సేయనేర్తు
కోరివచ్చిన నన్నుఁ జేకొనఁగదయ్య, వీత... 75

సీ. నీకట్టివదలిన నెఱికె కస్నులనద్ది
యుత్తరీయంబుగా నుంచుకొందు
నీచుట్టివిడచిన నిరుపమమాల్యముల్
ముదమంది కొప్పులో ముడిచికొందు
నీమహోత్తరపాదనీరేజతీర్థంబు
చేఁద్రావి శిరమునఁ జిలికికొందుఁ
నీనోటికర్పూరంబు నెఱినీడెమిచ్చుచో
నమృతంబుగాఁ గేల నందికొందు
గీ. నీదుపాదుక లొదలఁ బాదుకొల్పి
చెనఁటిజన్మంబు సఫలత జేసికొందు
నయ్య దాస్య మొసంగఁగదయ్య నేఁడు, వీత...

సీ. వింతగాఁ జూచెద వింతలోనె పరాక
యీముద్ర లెవరు నా కిచ్చిరయ్య
యెఱుకలేదా మంచి నెఱజాణ వాదునా
కీకంఠసరు లెవ్వ రిచ్చిరయ్య
మఱచితా యిటుజూడుమానాఁటి కొనగోటఁ
దిలకఁ మెవ్వరు నాకు దిద్దిరయ్య
తెలియదా భళి మంచిదే నిచ్చ నెదఁజేరి
లీల నెవ్వరు బవ్వళించిరయ్య
గీ. చాలు దొరికితి నీఁక వగల్ సాగనీను
బట్టి విరిసరిఁజుట్టి నీ కట్టివైతు
నపుడెఱుఁగవచ్చు వర్ధితానంగవిభవ, వీత...77

సీ. దిగనాడి మొగమైనఁ దేరిచూడనివాఁడ
వేల నన్వాలపించి యేలితయ్య
యెావంతయైన నన్నాదరించనివాఁడ
వేల నాతోఁ గేళిఁ దేరితయ్య
మఱచి ముచ్చటకైన మాటలాడనివాఁడ
వేల నాఁడాబాస లిచ్చితయ్య
యింతగాఁ జలపట్టి యెగ్గుచేసినవాఁడ
వేల వేమాఱు నన్నెంచితయ్య
గీ. వదలి మొగమైనఁ జూపనివాఁడ వయయొ
యేల కలలోనవచ్చి నన్నేచెదయ్య
తగదు తగదిటు కటువోటుతనముసేత, వీత...

సీ. దయవాఁడవంచు నేఁ దలఁచుకొంటినిగాని
యింతనిర్దయుఁడ వౌ టెఱుఁగనైతి
మోహనాంగుడవంచు మోహించితినిగాని
యింత నిర్మోహివౌ టెఱుఁగనైతి
నెమ్మెలాఁడవటంచు నమ్ముకొంటినిగాని
యింత మాయకుఁడ వౌ టెఱుఁగనైతి
నెనరుంతునని చాల నిశ్చయించితిఁగాని
యింత నిర్దయుఁడవౌ టెఱుఁగనైతి
గీ. మోసపోతిని కటకటా మోసపోతి
నేమిసేయుదు నేఁనందు నెట్టులోర్తు
యింక నాకొద్ది తెరవు నుదొద్ది వెరవు, సీత... 79
సీ. సోఁగకన్నులవాఁడ సొలపుఁజూపులవాఁడ
మొలకనవ్వులవాఁడ ముద్దులాఁడ
జిగి పెన్నురమువాఁడ చిగురువాతెఱవాఁడ
తళుకుఁజెక్కులవాఁడ తక్కులాఁడ
బలు పెన్నెరులవాఁడ పసిఁడిచేలమువాఁడ
చెలువంపుమెయివాఁడ కులుకులాఁడ
కలికిచెయ్వులువాఁడ కళలునేర్చినవాఁడ
వగుటఁ గుల్కెడివాఁడ వన్నెలాఁడ
గీ. డంబుగలవాఁడ మణికిరీటంబువాఁడ
హారములవాఁడ నాప్రాణమైనవాఁడ
నీవు నన్నిపుడైనను బ్రోవఁదగును, సీత... 80

సీ. వలదు డాయకు రేలు వగలుసేయకు చాలు
    దుడుక నాకన్నీరుఁ దుడువరాకు
వెలుపు దెల్పకు కల్ల మరులుగొల్పకు మెల్ల
    నక్కునఁజేర్చి నన్నదుమరాకు
వలదు కోపము హెచ్చు వగకు లోపమువచ్చు
    చెక్కులుముద్దాడి చెనకరాకు
చనదు మె ప్పెదనమ్ము సతము జెప్పెదనమ్ము
    నొచ్చు నాకెమ్మోవి నొక్కరాకు
గీ. మనసు విరిగెను నీమీఁది మమత తరిగె
పోర మటుమాయలాడ యప్పొలఁతిఁగూడ
నడువనున్నట్లు విధిపోక నడుచుఁగాక, వీత...
సీ. మొగమాట మొగ్గేమొ మొగమైనఁ గనవేమొ
    పలుకైన వినవేమొ పలుకవేమొ
ననుఁ జూడవలదేమొ నెనరుంచఁదగదేమొ
    విడమైనఁ గొనవేమొ విడిచితేమొ
నాజాబుఁ గనవేమొ నను మంచిదనవేమొ
    చలముఁజేసితివేమొ చాలునేమొ
మునుబాస లేదేమొ మ్రొక్కితి వినవేమొ
    మిగుల నొచ్చితివేమొ తెగడితేమొ
గీ. తగనిపోరేమొ కలనైనఁ దలఁచవేమొ
మరల నాతోడ నేమని మాటలాడ
వచ్చితివి పోర నేనొల్ల వలదు వలదు, వీత...

సీ. నిద్దురన్నది లేక నిముసంబె యుగముగా
దిగులు జెందితి కను ల్దెలుప వటవె
నిజ మాపెతోఁగూడ నీకు నిద్దురలేదు
తార్క్షణమేల కాదంటినటర
నవ్వులాటల నన్నము సైప కింతగాఁ
జిక్కి తీమేనైనఁ జెప్పలేదొ
సత్యంబు నగుబాటు జనునె దేనికొ చిక్కి
యలసితివని మున్నె తెలిసెఁగదర
గీ. నీవు చెప్పినరీతిగా నిలుతు నిలిచి
నమ్మికలుసేతు నను నీవు నమ్మఁదగదె
నిన్నునమ్మను పోపోర నిన్నునమ్మ, వీత... 83

సీ. ఏపదంబులు శరకోపయోగివరేణ్యు
లేపదంబులు సంయమీంద్రవతాళి
యేపదంబులు యామునేయులకు ధనం
బేపదంబులు గొల్తు రెల్లసురలు
నేపదంబులు సర్వపాపప్రశమనంబు
లేపదంబులు త్రయ్యుదీరితములు
నేపదంబులజలం బీశుండు తలఁదాల్చె
నేపదంబుల తత్త్వ మెఱుఁగుటరిది
గీ. యేపదంబులు మాబోంట్ల కెల్ల దిక్కు
పరమపూరుష యట్టి నీపదము లెపుడు
హృదయమునఁదాతు నాప్రాణపదముగాఁగ, వీత.

సీ. పుట్టి చచ్చుచు నెంతొ బాగులఁగా దయవచ్చి
యిట్టికళేబరం బిచ్చితీవ
నను మనోవాక్కాయమునఁ గొల్చుటే సుఖం
బిది నమ్ముఁడని శాస్త్ర మిచ్చితీవ
నీవల్ల నించుకేనియు వంచనము లేదు
నాపాప మీభంగి నడువ నీదు
విషయలోలత దాస్యవిముఖతయును బోక
నంతంత కహహా నా కధికమయ్యె
గీ. తగనిపనిపుట్టి మదిఁ జాల దిగులుపుట్టె
నీవ కరుణించి పాపంబు నిలువరించి
మనుపఁగదవయ్య మనవి చేకొనఁగదయ్య, పీత.

సీ. త్రోవఁ దుప్పలలోన దొండజరాలన్న
భయమంది కడునుల్కిపడినయట్లు
కనులమూదిన నెంత ఘనబుద్ధికైన రె
ప్పలు తనంతనె మూఁతబడినయట్లు
తమశుభాశుభసూచనమునకై యొకవేళ
యవయవంబులు దామె యదరినట్లు
నిదిరించువేళల నిఖిలేంద్రియంబుల
తెలివియెల్లను దానె తొలఁగినట్లు
గీ. బోడము నవశంబుగా నాకు వెడఁగుబుద్ధి
దీని నడఁగింప నీకృపే దక్కఁగాక
తక్క నెద్దియు లేదు సత్యంబు తండ్రి, పీత...

సీ. పరమమువై వ్యూహపతివై విభవరూపి
వై... ... ... యిదియుఁగాల
కర్చాస్వరూపివై యతిరమ్యమగు సహ్య
జాంతరీపావని నవతరించి
నయనగోచరుఁడవై నమ్రుల నేలుచు
నింక జను ల్బ్రోతునంత్రో వెఱుఁగరనుచు
వకుళభూషణుఁడవై వరగుణామృత మిచ్చి
గ్రోలుమన్నను జడుల్ గ్రోలకున్న
గీ. నందుకై నీవు రామానుజాఖ్యఁ బొడమి
ప్రోచితివి సర్వజీవుల భూరికరుణ
నిట్టివాఁడ విదేల నన్నేలుకొనవు, వీత... 87
సీ. నీవాఁడనయ్య నిన్నే గొల్తునయ్య నా
కీవె దిక్కయ్య వే రెఱుఁగనయ్య
యార్తుఁడనయ్య నాయార్తిఁ బాపఁగదయ్య
హీనుఁడనయ్య యెగ్గెంచకయ్య
తాళలేనయ్య సత్యంబుఁ జెప్పితినయ్య
యిటుఁజూడుమయ్య యే మెఱుఁగనయ్య
శరణంటినయ్య యీ చలమేలనయ్య జా
లముసేయకయ్య యేలఁగదవయ్య
గీ. తావకపదాబ్జదాసతద్దాసదాస
దాసదాసపరంపరాదాసుగాఁగ
ననుఁ గటాక్షింపుమయ్య యేమనకుమయ్య, వీత.

సీ. నీవె నాతండ్రివి నీవె నాతల్లివి
నీవె నాతోడువు నీవె నీడ
నీవె నాగురుఁడవు నీవె నాసఖుఁడవు
నీవె నాసంపద నీవె ధనము
నీవె నాయేలిక నీవె నాప్రాణంబు
నీవె నాసుగతివి నీవె పతివి
నీవె నాపుణ్యంబు నీవె నాభాగ్యంబు
నీవె నావిద్యయు నీవె ధనము
గీ. నీవె నాదైవ మిదియేల నిఖల మీవె
నినుఁగొలుచువాఁడ నీవాఁడ నీసుతుండ
నీపరిచరుండ దీనుండ నీవె భరము, సీత... 89

సీ. కనకాంగదములతో ఘనకిరీటంబుతోఁ
జలితాలకములతోఁ జర్పుతోడ
మణికుండలములతో మహితచిత్రకముతో
సిరినొప్పునురముతోఁ జిహ్నతోడ
కౌస్తుభకలికతోఁ గమలనేత్రములతోఁ
జిగురాకుమోవితో నగవుతోడ
శంఖచక్రములతో స్వర్ణచేలంబుతో
నెఱిబన్నసరులతో నీటుతోడ
గీ. రత్నమంజీరములతోడ రశనతోడ
కటితటీకింకిణులతోడఁ గళలతోడ
వెడలు నీమువయశాలి సేవింపఁగంటిఁ, సీత... 90

సీ. అమ్మమ్మ యెంతసాహస మీపదంబు లా
    వికటమౌ శకటంబు విఱుగఁదన్నె
వినువారి మదికెంత వింత యీయడుగు లా
    చిలువ బల్దలలెక్కి చిందుద్రొక్కె
చూడఁజూడఁగ నెంతచోద్య మీచేతు లా
    బకునిగాటపుముట్టె బట్టి చీరె
నహహా యెంతబ్బురం బౌర యీహస్త మా
    గోవర్ధనం బెత్తి గొడుగుఁబట్టె
గీ. నాఁటి బలునోటుఁదనమును నేఁటిమెత్తఁ
దనముఁ బరికించి పరికించి మనముగరఁగు
నీదుమాయలు నాసామి నీకె తెలుసు, వీత...

సీ. పెదవిఁ బర్వెడు కెంపు పెంపు పల్వరుస పైఁ
    గదిసి గాటపు టెఱ్ఱకప్పు సేయు
విడువాలుగనుఁగ్రేవ నిగుడుజాయలు కుండ
    లములపైఁ గమలరాగముల నించుఁ
దళుకుఁజెక్కుల డిగ్గు దట్టంపువలినిగ్గు
    లఱుతముత్తెపుపేరు లగుచు వ్రేలు
నొసటిముంగురులు బల్మిసిమి మౌళికిఁ బ్రాకి
    నెఱి నీలిపట్టుజాలరు ఘటించు
గీ. నెగసి మీసపునెఱతళ్కుటిరులు విరియ
మొలకనగు పూపవెన్నెలల్ మోహరించు
నౌర నీసోయగముఁజూడ నలవియగునె, వీత...

సీ. ఏలాగు నినుఁబాసి యింక తాళఁగానవచ్చు
నేలాగు కాల్లాడి యేగవచ్చు
నేలాగు మదిఁ జాలిఁ దేలియుండఁగవచ్చు
నేలాగు మన్నుమి న్నెఱుఁగవచ్చు
నేలాగు కన్నీటిజాలాపికొనవచ్చు
నేలాగు విరిసజ్జ నెనయవచ్చు
నేలాగు నాహార మింపుగాఁ గొనవచ్చు
నేలాగు మైకాక లెడపవచ్చు
గీ. నేల నేలాగు ప్రాణముల్ నిలుపవచ్చు
నేల నినుఁజూడనారు నిక్లలనారు
కామహాతకువిఘాటి కేశవెఖసేతు, వీత... 98

సీ. ఎల్లవిద్యాలు నిల్వ కిడిన నీతోలిరూప
మే సూక్ష్మతరబుద్ధి కిష్టతమము
భవదీయ కైంకర్యపరుఁడు శ్రీకృష్ణార్యుఁ
డేమహాత్మునకుఁ బితామహుండు
నిరుపమానజ్ఞాననిధి రాఘవాచార్యుఁ
డేసత్వగుణవార్ధి కెలమిఁ దండ్రి
ధీరుండు మాతండ్రి వీరరాఘవగురుం
డేపుణ్యఖనికి గారాపుపట్టి
గీ. కేశవాశ్రమనికట మేకృతికి నిలయ
మట్టి శ్రీవత్సనారసింహాఖ్యుడయ్య
గరుణ నినునమ్మి వినుతింపఁ గాంచినయ్య, వీత.

సీ. రంగాంబికావీరరాఘవత్వమున న
  న్నడుపాలఁ గని పెంచు నొడయుఁ డెవఁడొ
వాత్స్యనృసింహార్య వైఖరి ననుఁగృత
  సంస్కారిగాఁ జేయు సదయుఁ డెవఁడొ
రమ్యభారద్వాజ రామానుజార్యాఖ్య
  భాష్యార్థమిడు దీనబంధుఁ డెవఁడొ
బంధుకూర్మాచార్యభావంబునను వైశ్య
  కృతిశక్తి యొసఁగు సుప్రతిభుఁ డెవఁడొ
గీ. వాని శ్రీరంగవేంకటవారణాద్రి
యాదవాచలములఁ బొద మూఁదియున్న
నిన్నెగా మదినెంచితి నీరజాక్ష, వీత... 95

సీ. శ్రీకూర్మమున కుదీచిఁ ద్రియోజనమైన
  వంశధారాతీర వసుధ నమరు
నచ్చుతపురి మంగళాలంబమైన శ్రీ
  వత్స ముడుంబ సద్వంశమునను
ననుఁ గృపఁ బొడమించి నరసింహపాదాఖ్యుఁ
  గావించి నిజవిద్యఁ గఱపి పెంచి
దివ్యదేశములెల్లఁ ద్రిప్పి దర్శనమిచ్చి
  తెట్టినేరములున్న నెంచుకొనవు
గీ. మఱియు నను నిరతాత్మకింకరునిఁ జేయఁ
దలఁచి కాఁబోలు నీనాఁటిదాక నచట
నీవు కేశవరూపివై నిలిచినావు, వీత... 96

సీ. సత్సంగమున వీని సంసారరుచి మాన్పి
గురుని ప్రాపున రూప మెఱుకపఱిచి
బరువాని బంధంబు విరియించి కడవేళ
మంచివాడిని వెల్వరించి యర్చి
రహాగాద్య పక్షోదయసవత్సరమరు
దిన శశి విద్యుదబ్ధీశశక్ర
వనజజులను నాతివాహకు ల్మన్నింప
గాంచనాండంబు భేదించి యవల
గీ. విరజ దాటించి వాఙ్మనోవిప్రకృష్ట
పరమపరమాద్భుతాద్భుతపదము పదము
జేతువట భళిభళి యెంత దాత వౌర,వీత...97

సీ. పాపరాశికి నుర్కిపట్టన శాస్త్రీయ
చర్యలకెల్ల నుచ్చాటనభూమి
నతి నికృష్టతమజీవితము నపస్మార
ఫక్కికకెల్ల బల్పట్టుకొమ్మ
నాశాలతకు నిరాధాలంబనంబు న
నాచారమునకు ముఖ్యాస్పదంబు
నతిదుర్నయమునకు నాలవాలంబు నీ
ర్ష్యావిషంబునకు మూలాకరంబు
గీ. నేవమాధ్యతి హేయాతి హేయతముని
నన్నుం దరిఁజేర్తువని మది నమ్మఁజాల
నేల కరుణించితు వీశ్వరీపాణిజుండని, వీత... 98

సీ. అపరాధి నపరాధి నఖిలలోకాధ్యక్షు
యపరాధి నపరాధి నార్తరక్షు
యపరాధి నపరాధి నవనతావనదక్షు
యపరాధి నపరాధి నఘువిపక్షు
యపరాధి నపరాధి నమలతాసంధుక్షు
యపరాధి నపరాధి నతిపరోక్షు
యపరాధి నపరాధి నఖిలైకసంరక్షు
యపరాధి నపరాధి నంబుజాక్షు
గీ. తగను దగ నెదుటనిల్వఁగఁ దగను తగను
జడుఁడ పాతకుఁడ దుర్బుద్ధి విడువ కకట
చెడితి నడియాసలేల నీచిత్త మింకను,వీత...99
సీ. మంగళం బెపుడు సోమకదైత్యహారునకు
మంగళంబు బలోద్ధమంధరునకు
మంగళంబు ధృతోత్తుంగభూతలునకు
మంగళంబు హిరణ్యమర్దనునకు
మంగళంబు బలీంద్రమదనివారణునకు
మంగళంబు కుఠారమండనునకు
మంగళంబు దశాస్యమరణకారణునకు
మంగళంబు ప్రలంబమారణునకు
గీ. మంగళంబు త్రైపురీవ్రతభంగకృతికి
మంగళము దుర్జనమ్లేచ్ఛమదనధృతికి
మంగళము నీకు వాత్సల్యమహితమతికి, వీత...

సీ. ఇది పఠించినవారి కిది ప్రేమవినువారి
కిది లిఖించినవారి కెగ్గు లేదు
ఇది గ్రహించినవారి కిది ధరించినవారి
కిది నుతించినవారి కెగ్గు లేదు
ఇది గణించినవారి కిది యొసంగినవారి
కిది గుణించినవారి కెగ్గు లేదు
ఇది మతంబనువారి కిది ఋతంబనువారి
కిది హితంబనువారి కెగ్గు లేదు
గీ. లేదులే దెపు డెపుడెగ్గు లేదు లేదు
కలఁ గనులఁగట్టి యాకృతిఁ బలిమిఁగొనిన
పాహి విశాళవా డేల సంతియుంబు, వీర...101

క. శ్రీమన్మడుంబ వెంకట
రామనృసింహార్య రచిత రంగేశ గుణా
శ్రీమహితకృతికి భక్తర
భామహనీయము ద్వితీయభాగము ముగిసెన్.

శ్రీ రం గే శ శ త క ము
సం పూ ర్ణ ము.

# పీఠిక.

మాధవశతకమును వ్రాసినది అల్లంరాజు రంగశాయికవి. ఈయన బహుగ్రంథనిర్మాతయు సుప్రసిద్ధకవియునగు అల్లంరాజు సుబ్రహ్మణ్యకవివర్యుని కుమారుఁడు. ఉభయభాషాకవి. అవధానవిధాననిపుణుఁడు. ఈకవి వ్రాసినయాంధ్రీకరణమగు చంపూరామాయణమువలన నీయన ఆరామద్రావిడబ్రాహ్మణుఁడనియుఁ బీఠికాపురసమీపస్థమగు చేబ్రోలు నివాసి యనియుఁ దెలియుచున్నది.

మాధవశతకము నీకవి ప్రౌఢవయస్సునందు రచించెను. రచనకాలము శాలివాహనశకాబ్దములు 1887 అనుటచే శతక మిప్పటికిఁ బదిసంవత్సరముల క్రిందటఁ బూర్తిచేయఁబడినటుల స్పష్టమగుచున్నది. ఈశతకము పీఠికాపురవాస్తవ్యుఁడగు కుంతీమాధవస్వామి కంకితముగా రచింపఁబడినట్టులఁ దొలిపద్యములవలనఁ దెలియనగును. ఈశతకమునందు శ్రీకృష్ణలీలలు విపులముగా నభివర్ణింపఁబడినవి. శతకకర్త జీవత్కవియు విమర్శనిపుణుఁడును నవయుగమున నున్నవాఁడును నగుటచే నీశతకము నాగరకులకు రుచించునటుల భావసమన్వితముగ వ్రాసెను.

ఈశతకమునందలి ప్రతిపద్యము భక్తిరసోద్భూతక మై మృదుమధురభావయుక్తమై శ్రావ్యముగ నున్నది. ఏకాదశపద్యము మొదలుకొని పండ్రెండు పద్యము లంత్యనియమాలంకారముతో మనోజ్ఞముగా రచింపఁబడినవి. పదజటిలము, నియమపరిపాటి, ధారాసౌష్ఠవము బట్టిచూడ నాయాపద్యములు కృతుల కాశ్వాసాంతములందుఁ జేర్పఁదగినవిగాఁ దోఁచుచున్నవి.

తొలుత నీశతకము శ్రీ॥ శ్రీ॥ చెలికాని లచ్చారావుగారి శతకసంపుటములందు ముద్రితమయ్యెను. పిదప మేము ప్రకటింపఁబోవు భక్తిరసశతకముల సంపుటములలోఁ బ్రచురించుటకు అనుజ్ఞనొసంగి మాయుద్యమమునకుఁ దోడ్పడిన శ్రీ అల్లమ్ము రాజారంగశాయికవిగారియెడలఁ గృతజ్ఞులమగుచున్నారము.

చెన్నపురి,
పుష్పవారం.
26-1-1926.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు
అండ్ సన్స్.

శుభమస్తు.

అల్లంరాజు రంగశాయికవికృత

# మాధవశతకము.



మ. శ్రీపీఠాపురమందు భక్తులను రక్షింపం దలంపూని
త, ద్వ్యాపారంబులఁ జక్కఁ జేయుచుఁ గిరీటాద్యు
త్తమాలంక్రియల్, దీపింపన్ జిలునవ్వుమోము
దగఁ గుంతీదేవిచేతం బ్రతిష్ఠాపూజల్ గనియు
న్న నిన్ గొలిచెదన్ స్వామీ హరీ మాధవా. 1

శా. క్రూరుల్ చేసెడి దుష్టకృత్యములఁ బోఁగొట్టంగ
శిష్టావళుల్, ప్రారంభించిన సాధుకృత్యములఁ
గాపాడంగ నూహించి పొ, ల్పారన్ యాదవ
వంశమందు జననంబై మున్ను శ్రీకృష్ణుఁడన్,
పేరన్వర్తిలినాఁడ వీవె కద సేవింతు న్నినున్
మాధవా. 2

మ. తొలిధర్మజ్ఞులు పాండునందనులకున్ దుర్యో
ధనుం డెన్నిగొం, దలముల్ గూర్పదలంచినన్
భువి భవత్కారుణ్యయుగ్వీక్షణం, బులచే నయ్యా
విగీటణంగుచు శుభంబుల్ వారికెల్లప్పుడున్, గ
లిగెన్ గావున నీవు సాధుజనరక్షన్ జేయుదా
మాధవా. 3

మ. మినుకుల్ వేయుఁక సేల కూళయు నజామిళుం
డు నారాయణా, యనుచుఁ దాను నిజాత్మజుం
బిలువఁగా నమ్మాధు నంతేడయుఁ, గనుచుఁ
వానికిఁ గాలకింకరులసంఘాతంబుచే సంభవిం,
చినబాధల్ దొలఁగించి మోక్షపదవిం జేకూర్చి
తౌ మాధవా. 4

మ. దురితాత్ముం డగుకైటభుం డనెడుదైత్యుం డెల్ల
లోకంబులం, దురహింసాన్వితకృత్యముల్ సలు
పఁగా నుద్యన్మహాక్రోధ విస్ఫురితస్వాంతుఁడ
వౌచు నయ్యసురుని న్బోరన్ వడింగాల్చిభూ,
భరము న్మాన్పినవాఁడ వీవకద దేవా శ్రీహరి
మాధవా. 5

మ. అలగాధానలినాయతాక్షిపయి నత్యంతానురక్తుం
డవై, లలితంబై సుమనోజ్ఞమైన సరసాలాపంబు
లన్ లీలతోఁ, బలుకన్ దాయుచు యామునాం
బువులలోఁ బల్మాఱు క్రీడావిచే, ష్టలుగావించి
తదంగనామణిని హృష్టంజేసితౌ మాధవా. 6

మ. కపటస్వాంతములోఁ బూతన విషాక్రాంత స్త
నద్వంద్వయై, నిపుణత్వంబున నీకుఁ బాల్గుడుప
నాసించాత్మ భావంబు నీ, వు పరబ్రహ్మమవౌటచే
నెఱిఁగి యాపూఁబోఁడి ప్రాణంబులౌ, కృపమరిన్

దీర్చి వధించినాఁడవు జగత్కల్యాణుడా మా
ధవా. 7

మ. పటుకేయూరపరిష్కృతంబయిన నీ బాహాచతు
ష్కంబు డి, క్తటముల్ నిండినశోభతోనెనయఁ
బద్నాశ్రైనలోకాళి యు, త్కటభారంబువహిం
తు వీవని జనౌఘుం బెన్నునే నీనయా, స్ఫుటవీ
ణావళి సోఁక రతనిడునంచున్ జెల్పెదన్ మా
ధవా. 8

మ. యమునాతోయములందు గోపికలతో నానంద
మొప్పన్ విహా, రము గావించుచు శీకరంబుల
రుదారన్ జల్లుకొన్నట్టి కా, లమునన్ వారికిఁ
గల్గినట్టిసుఖము ల్వర్ణింప శక్యంబె యా, ప్రమద
ల్చేసినపుణ్య మెట్టిదిరయో చెప్పంజాలనో మా
ధవా. 9

శా. శూరుండౌ నరకాసురుండు జగముల్ క్షోభిం
పఁగాఁజేసి చె,న్నారంగాఁ బదియాఱువేలనృపక
న్యాశ్రేష్ఠలన్ బల్మిచేఁ, గారాగారముఁ జేర్ప
నయ్యసురునిన్ ఖండించి బంధస్థలౌ, వారిన్ నీవు
వదల్చి యందఱ సుఖింపంజేసితౌ మాధవా. 10

శా. నీతోడన్ సహకారులై నిరతమున్ నీసత్కృ
పాపాత్రులై, గోతండులాల మేపుగోపకులు పె

ద్భుతల్ గా భవద్వేణు సం, జాతంబుల్ ఘనగీత
ముల్ విని యతిశ్రావ్యంబులై యుంట సం, ప్రీతిం
బొందిరి వారొనర్చిన తపశ్శ్రీ యెట్టిదో మాధవా.

శా. రాసక్రీడలొనర్ప గోపక వధూ రాజ్యంతరస్థుం
డవై, నాసాగ్రంబున ముత్తికం బమర మంద
స్మేరవక్త్రంబుతో, భాసిల్లంగను దొంటి నోముల
ఫలంబా యంచు వారెన్నఁగన్, నీసాన్నిధ్యము
వారి కబ్బెనుగదా నిత్యంబు శ్రీమాధవా. 12

శా. నీసందర్శన మాచరించిననరుండే మోక్షముం
బొందెడున్, నీసేవన్ సతతం బొనర్చుపురుషుం
డే మంచి ధన్యాత్ముఁడౌ, నీసూక్తుల్ విని నట్టి
మానవులకున్ నిత్యంబు వైకుంఠ సం, వాసం బబ్బు
నటంచుఁ జెప్పఁగఁదగున్ బక్షిధ్వజా మాధవా.

శా. నిన్నున్ జూడని కన్ను లేల యెపుడున్ నీస్తో
త్రమున్ జేయలే, కున్న జిహ్వయ దేల నిన్ను
మదిలో నూహించి ధ్యానింపలే, కున్నన్ జిత్త
మదేల నీకుఁ గుసుమవ్యూహంబుచేఁ బూజలన్,
బన్నన్ లేని కరంబ దేల యనుచున్ వాక్రుచ్చె
దన్ మాధవా. 14

శా. నీయాలింగన సౌఖ్యముం బొరయ నెంతేఁ గోరు
చున్నట్టి స, త్యా రామాషామణియున్ మొదల్గలు

గు నబ్జాక్షుల్ నినుంజూచువా, రై యుద్వా
హాముబొంది రక్తిచరితం బాలించు మర్త్యాళికిన్,
బాయున్ సంసృతిపాశబంధములు సంభావిం
పఁగన్ మాధవా. 15

శా. నీనామంబు స్మరించినేని దురితానీకంబు నిర్మూ
లకం, బౌనంచున్ మదిలోఁదలంచుచును నిత్యం
బున్ భవన్నామమే, శ్రీనారాయణ వాసుదేవ
యనుచున్ గృష్ణా స్మరింతున్ జుమీ, దీనుండ
న్ననుఁ బ్రోవుమీ కరుణతో దేవాహరీమాధవా.

మ. తొలి సాధుండు గజేంద్రుఁ డన్మొసలిచే దుర్వా
రబాధాప్తవి,హ్వలుఁడై నిన్ను హరీహరీయను
చుఁ బ్రోవన్ వేఁడుకోఁగా దయా, కలితస్వాం
తుఁడవైన నీవు మొసలిన్ ఖండించి నాగేంద్రు
నిం, బలరన్ బ్రోచితి వయ్యెడన్ మనుపుమ
య్యా నన్ను శ్రీమాధవా. 17

శా. సోమాదిత్యులు నీదు నేత్రయుగమౌచున్ జీక
టింగొట్టియు, ద్దామంబైన వెలుంగు లోకముల
కొందన్ జేయుచున్నారు ము,న్నామందాకిని నీదు
పాదములయందావిర్భవించెంగదా, నీమాహాత్మ్య
ము నాకెఱుంగవశమే నేమూఢుఁడన్ మాధవా.

మ. అలబాణాసురుఁ డాజిరంగమున . డాయన్వచ్చి

నీ వాని శౌర్యబలదర్పంబు నణంచి తద్భుజస
హస్రంబుం బడంగొట్టి ముక్కలితుంగా వనిరు
ద్ధునిన్ సతి నుషాకన్యన్ వడిన్ దెచ్చితౌ, తలమే
తావకదోశ్చతుష్కపటుసత్వం బెన్నఁగన్ మా
ధవా. 19

మ. మురదైత్యేంద్రుని సంహరించి మధుఁడన్ పూ
ర్వానురాధ్యత్వునిన్, దురమందున్ బలిమూర్ఛి
కేశిపలలాంఘోనాయకుం గాల్చి ముష్కరుఁడై వ
ర్తిలు వజ్రనాభదనుజున్ జక్కాడి నీవీ వసుం,
ధర నిష్కంటకఁ జేసినాఁడవు మహాత్మా మ్రొ
క్కెదన్ మాధవా. 20

మ. అతిదారిద్ర్యము నొంది విప్రుఁడు కుచేలాఖ్యుం
డు నీబాల్యమిత్రతనాత్మందలపోసి పిమ్మట భవ
త్సాన్నిధ్యముం జేరి నీ, కతఁడర్పింపఁగ దెచ్చినట్టి
యటుకుల్ హర్షంబుతో మెక్కి భూరితవైశ్వ
ర్యములిచ్చితీవతనికిన్ శ్రేయఃప్రదా మాధవా.

శా. నీకున్ వాహనమై ప్రపత్తిఁ గనుచున్ నిన్నున్
భుజాగ్రంబునన్, జేకొంచున్ వహించుచునట్టిఁ
డగు పక్షిస్వామి పుణ్యంబులన్, నాకుం జేరఁగ
నెంచరం బె యెపుడుం దల్పంబు దా నొటచే,
నాకాకోదరరాజు పుణ్యము లగణ్యంబుల్ గదా
మాధవా. 22

శా. భూనేతల్ ఘనగర్వయుక్తు లగుచున్ బోషిం
పకున్నా రిఁక, న్మానంబో నెడ సంతసంబు నవమా
నంబైనచోఁ జింతయు, న్మానంబూని నిను న్భజిం
చెద మదిన్ నాపైఁ బ్రసాదింపు మ,య్యా నీవే
గతి నీపదాబ్జముల నే ధ్యానించెదన్ మాధవా.

శా. నీవావిష్ణుఁడ వంచుఁ దానెఱుఁగమిన్ నీరేజగ
ర్భుండొగిన్, గోవత్సంబుల నాలఁ దాఁచఁ గను
గో గోవత్సరూపంబులన్, నీవే దాల్పఁగ నబ్బు
రంబుపడి వాణీజాని నీస్తోత్రముం, గావించెంగ
ద నీదుమాయ దెలియంగా శక్యమే మాధవా.

శా. ధీచాంచల్యము దేవదానవుల కొందింపన్ జగ
న్మోహనం, బౌచున్నట్టి స్వరూపమెత్తి యమృతం
బా దేవతారాజికిన్, బ్రాచుర్యంబుగ నిచ్చి రా
క్షసులకున్ రాకుండఁగాఁ జేసితొ, నీచర్యల్
మిగుల న్విచిత్రముగఁ గాన్పించుంగదా మా
ధవా. 25

మ. ప్రకటంబై తగుమల్లయుద్ధ మరుదారన్ జేసి చా
ణూరము,ష్టికులంబట్టి వధించినాఁడ విఁక దుశ్శీ
లాన్వితుం గంసునిన్, వికటాకారుని సంహరిం
చితివి పృథ్వి న్నీవు గోపాలబా, లకరూపంబున
నున్న దేవుఁడవు నిన్ శ్లాఘించెదన్ మాధవా.

మ. వికృతాకారిణి నా త్రివక్రను దయ న్వీక్షించి నీవప్సరో, నికరంబెల్లను మెచ్చుకోఁ దగినదానిం జేసితా ద్రౌపదీ, ముకురాస్యామణి కీవ నిర్మిత ములౌ పుట్టంబులం గూర్చి యా, మెకు మానంబును గాచినాఁడవు జనుల్మెచ్చంగ శ్రీమాధవా. 27

మ. కొలువై తుంబురునారదాదులగు భక్తుల్ వల్లకీగానము, జ్జ్వలతన్ జేయఁ దదీయగోష్ఠిఁదగుచున్ వైకుంఠమందున్న నీ, యలఘుప్రాభవసంప దున్నతులఁ గన్నార న్విలోకించు వా, రలకున్ ద్రెళ్ళునఁ బాపముల్ దొలఁగి దూరంబౌగదా మాధవా. 28

శా. నీచారిత్రములం బఠింప శుభముల్ నెక్కొంచు నుండున్ సదా, వాచాశాలిచేత నీదునుతులన్ వాక్రుచ్చిన న్వారి కా, రా చేకూరుచు నుండెడిన్ సకలతీర్థస్నానపుణ్యంబులున్, నీచేలోకము లుద్భవస్థితిలయా న్వీతంబులౌ మాధవా.

శా. నీవక్షస్థలమందు బాలరవికాంతిం గేరఁగాఁ జాలుచున్, శివిన్ భాసిలునట్టి కౌస్తుభమణి న్వీక్షించిన న్వాఁడు మోహావేశంబులఁ బాసి జ్ఞానకలితుండై మోక్షముం బొల్పదున్, దేవా నీవుధరించు చిహ్నమయినన్ నిన్నోర్పలు నో మాధవా.

శా. నీకంఠస్థలియందు వ్రేలుచు సుధీనిర్వర్ణ్యసౌరభ్య
గి, లాకల్పద్రుమజాత ఫుల్లవనమాలా వైజయంతీ
మనో, జ్ఞాకారంబు దలంచినను బుణ్యస్తోమ
ముల్ వానికిం, జేకూరుంగద తన్మహత్త్వులు
మనీషిశ్లాఘ్యముల్ మాధవా. 31

శా. ఆదుర్యోధనముఖ్యదుర్జనుల కత్యాశ్చర్య భీతి
ప్రదం, బైదీపింపఁగ సజ్జనుల్ వినుతిసేయన్ విశ్వ
రూపంబునెం, తే దర్శింపఁగఁజేసి యాసమయ
మందే తత్సభఁ బేర్కొనిం, జొదృష్టిన్ ధృతరా
ష్ట్రభూపతికి నీవందించితో మాధవా. 32

శా. నీహస్తంబున నున్న శార్ఙ్గధనువున్ నిత్యంబు
ధ్యానించినన్, దేహారోగ్యముగల్గు నందకముఁ
బ్రార్థింప నృమస్తాఘముల్, నీహారం బినదీప్తిఁ
బోలె నణఁగు న్నిన్ గొల్వఁగా భద్రసం, దో
హంబుల్ సమకూడునంచును దలంతు న్భక్తిచే
మాధవా. 33

శా. నీచక్రంబును సన్నుతించినను వానిం జెందరా
వాపదల్, వైచిత్ర్యం బగునట్లు నీఘనగద నృర్ణిం
పఁగా వానికిన్, దోఁచ నోసకదరాతిభీతి జగమం
దున్నీదు శంఖస్తవ, ప్రాచుర్యంబొనరింప సౌఖ్య
ములు గన్పట్టుంగదా మాధవా. 34

శా. నీపాదార్చన మెన్ని జన్మములకేనిఁ జేయు నాశ
ఖ్యునే, నీపంచాక్షరమంత్రసజ్జపము నే నిత్యంబుఁ
గావించెదన్, నీపాదానతభక్తబృందములతో
స్నేహంబు గావింతు న,య్యాత్మపద్మాక్ష కృప న్నను
న్మనుపుమా యశ్రాంతముగ్ మాధవా. 35

మ. నినుఁగన్నట్టిది యైన దేవకి పురంధ్రీరత్న మైయొ
ప్పు న, వ్వనితాగర్భము పావనంబునొనరింపం
బుట్టి మున్నామె నో, చిననోముల్ ఫలియింపఁ
జేసితివనన్ శ్రీకృష్ణరూపంబునో, డను గోపాల
కబాలురంగదిసి యాటల్నేర్పితో మాధవా. 36

మ. వసుదేవుండు తపోవిశేషములు పూర్వంబందుఁ
జేయంగ సం, తస మొప్ప న్ఫలియించినట్టిఫల
మీతండంచుఁ జా హృష్టమూ, నసుఁడై నిన్నుల
నందగోపకునియింటన్ జేర్పఁబుత్తెంచుచో, వస
మై యామునతోయమీవరుగఁ ద్రోవంగార్పదే
మాధవా. 37

మ. తనదుగ్ధంబులనిచ్చి పెంచిన యశోదాదేవి పు
ణ్యాళి యిం, తని లెక్కింపఁగ శక్యమే యొవని
కేన్ హస్తంబుతో దువ్వుచున్, నినునాడించుచుఁ
జంకఁబెట్టుకొని పానీయంబులం బోయుచుం, డిన
దై యర్మిలి ముద్దుఁబెట్టుకొనియా స్నేర్పెప్పఁగన్
మాధవా. 38

మ. అలనందుండు నిజాత్మజుం డవని నీకత్యంతముం
బ్రేమ జొ,బ్బిలఁగ న్మూపులలంకరింపఁగని సంప్రీ
తుండవై గొల్లప, ల్లలతో ని న్విహరించినాఁడవు
సులీల న్నీ చరిత్రంబు ని, చ్చలు నాత్మందలపో
యువారలకు నాశ్చర్యంబగుఁ మాధవా. 39

శా. పాకారాతిదురాగ్రహంబున శిలావర్షం బహో
రాత్రముల్, నీఁకఁ దాఁ గురిపింప నంత మొద
వుల్ భీతిల్ల గోవర్ధనా, ఖ్యాకం బైనగిరీంద్ర
మెత్తివెస నీవాఁగోపగోపాళి క, స్తోకంబైనసుఖం
బొసంగితివి నీదోశ్శక్తిచే మాధవా. 40

మ. పరకాంతా పరవిత్తనిస్పృహుఁడనై స్వామీ
భవద్ధ్యాన త, త్పరబుద్ధిఁ విషయోపభోగము
లపై వాంఛ న్విసర్జించి నీ, స్మరణంబే యొనరిం
చుచుంటి నిఁక నీచారిత్రమాలించుచుఁ, బర
మానందము నొందమందెనసి ని న్బ్రార్థించెదఁ
మాధవా. 41

మ. అలసాళ్వక్షితినేత సౌంభకవిమానారూఢుఁడై
కిన్కచేఁ,గలహంబుం బొనరింపఁగా నతని న్నైఁ గౌ
మోదకి న్నీవహా, జ్వాలశక్తిం బడవేసి గండ
కాఁచితత్ప్రాణంబులొక్కమ్మడిఁ,దొలఁగం జేసితి
నీవకా వె సకలాప్తుల్ మెచ్చఁగఁ మాధవా. 42

మ. అనివార్యం బగునట్టి కాలయవనుం డన్యాదృ
యుద్ధంబొన, ర్చిన వాని న్ముచికుందసంశ్రిత ధరి
త్రీభృద్గుహాంతంబునన్, జనఁగాఁ జేసి మునీంద్రు
చేత నతని న్జంపించి యమ్మౌనిచే, ననుకూలస్తు
తు లొందినాఁడవుగదయ్యా శ్రీహరీ మాధవా.

మ. నినుఁ బూజింపఁగ ధర్మనందనుఁడు యత్నింపన్
దదుద్దేశము, న్విని యంతన్ శిశుపాలుఁ డాగ్ర
హాముచే నిన్ దూలగానప్పుడా, తనిశీర్షంబును
ద్రుంచినాఁడవు సభాస్థానంబున న్నృపవర్యులె, ల్లను
మెచ్చంగ భవద్విదూషకులు నేలంగూలరే
మాధవా. 44

శా. కాళిందీహ్రదమందుఁ గాళియమహాకాకోదరుం
డంబువుల్, తీవ్రాళజ్వాలలనిండఁ జేసి జనుల
న్వేధింప నీవప్పుడా, వ్యాళోద్గర్వమణంచి తచ్ఛి
రములం దంఘ్రిద్వయంబుంచి సల్లీలన్నాట్య
మొనర్చినాఁడవు ప్రజల్మెచ్చంగ నో మాధవా.

మ. సమరాజేయపరాక్రముండగు జరాసంధుండు
నీతోడ యుద్ధముఁ గావింపఁదలంచుచున్న తఱిఁ
దద్బాహాసముద్రిక్తగ, ర్వము వారింపఁగ భీము
నిన్ జొనిపి సంగ్రామంబున న్వాని నంతము
నొందించితి వబ్బురంబుగను క్షుద్రధ్వంసకా
మాధవా. 46

శా. శ్రీరంగంబున రంగనాయకుఁడవై చెల్వొంది భద్రాద్రిలోఁ, శ్రీరామాఖ్య వహించి నీలగిరిలోఁ శ్రీమజ్జగన్నాథుఁడన్, పేర నచ్చొత్తిలి శేషశైలమున దీవి వేంకటేశాఖ్యఁ జెన్నారం బూనినవాఁడ వీవా కఁడవే గాయి యుంటివో మాధవా.

శా. నీకు న్మ్రొక్కెదఁ నీదుసేవకులతోఁ నెయ్యంబుఁ గావించెదన్, నీకీర్తిం గొనియాడెద న్మనసులోఁ నీధ్యానముం జేసెదన్, నీకెవ్వారును సాటిలేరనుచు నే నిత్యంబు వాక్రుచ్చెదన్, నాకు న్మోక్ష మొసంగఁగావలయు శ్రీనారాయణా మాధవా.

శా. నీవే విద్యల కెల్లఁ దానకమవై నెక్కొంచు సాందీపభూ, దేవశ్రేష్ఠుని చెంత విద్యలనుబూర్తిన్నేర్చికొన్నాఁడ విం,కావిద్యన్మణి పూర్వజన్మకృతపుణ్యం బెట్టిదో యేరికిన్, భావింపం దరమౌనె భక్తజనకల్పక్ష్మారుహా మాధవా.  49

శా. ఆపత్కాలమునందు నీస్మరణ మత్యంతంబుఁ గావించినన్, గాపాడంగఁ దలంతువీవు వనిలోఁ గార్చిచ్చు వేష్టింపఁగా, గోపస్త్రీలును గోపబాలకు లనేకుల్ వేఁడఁగా నప్పుడా, యాపత్తున్హరియించి ప్రోచితివి కావా యందఱన్ మాధవా.

శా. చోరుండై తగుసోమకుండు ద్రుహిణశ్రుత్యు

త్కారంబెల్లఁ బెంపార నున్మిచ్చిలి వార్ధిఁ డాఁగఁ
గని నీవవ్వేళ మత్స్యంబవై, యారక్షోధిపుఁ జం
పి వేదసముదాయంబు నవ్విడి దెచ్చి యంభోరుహ
స్మున కిచ్చినాఁడ సతేఁడా మోదింపగన్ మాధవా.

మ. అమృతంబు న్భుజియింప దేవ దనుజుల్ యత్నిం
చిమంథాద్రిఁ గవ్వముగాఁ బన్నగరాజు రజ్జు
వుగ నొప్పంజేయుచు న్బాలసంద్రము బల్మిన్మ
థియింప నీవపుడు కూర్మస్వామివై యానగేం
ద్రము నీకర్పరమందుఁ బూనితివి ధీరగ్రామణీ
మాధవా. 52

మ. అవని న్చాపనుజుట్టినట్లుఁగ హిరణ్యాక్షుండు
చుట్టంగ నీవు వరాహాకృతిఁ దాల్చి యాదను
జుని న్బోర న్వడింగూల్చి యీభువి నీకొమ్మునఁ
బూని ప్రోచితివి నీభూరిప్రభావంబుఁ జెప్పవ
శంబెవ్వరికైనఁగాదు వికచాబ్జాక్షా శ్రీమా
ధవా. 53

మ. అవిభేద్యాశయుఁ డాహిరణ్యకశిపుం డత్యుగ్ర
కోపంబుతో, భవదీయాంఘ్రిసరోజ భక్తవ
రుఁడౌ ప్రహ్లాదు బాధింప నూనవసింహాకృతిఁ
దాల్చి రాక్షసుని పెన్వక్షంబు ఛేదించి భక్తవ
రుం బ్రోచితి నీవకాదె దురితౌఘధ్వంస శ్రీమా
ధవా. 54

మ. బలిదైత్యాగ్రణి వంచనంబు నొనరింప న్వామ
నాంగుండవై, యిల మూఁడంఘ్రులుమాత్ర మీ
వడిగి యుర్వ్యాదివ్య ల్గాలమిన్, దలపై వాని
నిఁ ద్రొక్కి నాగభువనస్థానంబునన్ జేర్చితౌ, జల
జాతాక్ష భవత్ప్రభావ మెఱుఁగ న్శక్యంబె
శ్రీమాధవా. 55

మ. జమదగ్న్యాత్మభవుండవై సకలరాజన్యాళియు
న్నిదుర్గ్రో, ధనుషాగ్నిస్ఫుటకీలకు న్శలభబృందం
బై చనన్వారి రక్తముచేతం బితృదేవతర్పణ
ములం గావించి హర్షించితీ, వమర స్తీయువ
తార మద్భుతకరం బయ్యెం గదా మాధవా. 56

మ. శమదాంత్యాదులఁ బూని పంక్తిరథ కౌసల్యా
తనూజుండవై, ప్రమథాధీశధనుస్సుఁ గాల్చియ
పుడావై దేహిఁ బెండ్లాడి దు,ర్ధములో రావణ
కుంభకర్ణులను యుద్ధంబందుఁ జక్కాడి యీ,
తమ నిష్కంటకఁ జేసినాఁడవు సురల్ శ్లాఘిం
పఁగన్ మాధవా. 57

మ. యదువంశంబుముదంబునొంద బలరామాఖ్యుం
డవై రేవతి,మది రాత్రీమణిఁ బెండ్లియై ముసల
ముం బల్లాంగలంబూని దుర్మదుఁడైనట్టి ప్రలం
బరాక్షసునిఁ బోరఁద్రున్మి కాళిందియన్, నది పుర్దిం
చినవాఁడ వీవె జగదానందప్రదా మాధవా. 58

మ. పరమానందము భక్తకోటికి నిడ న్బాబ్ధస్వరూపుం
డవై, దురితధ్వాంత దివాకరుండవగుచు న్దుర్వా
దముల్ మాన్పి సుస్థిరచిత్తంబున నిన్నుఁ గొల్వు
మనుజశ్రేణి సదా ప్రోచుచున్, గరిమన్ లోక
ము నేలుచుంటివి కటాక్షంబొప్పఁగన్ మాధవా.

మ. కలికి స్వాకృతిఁదాల్చి దుష్టజనసంఘుధ్వంసముం
జేయ ని, స్తులదోర్విక్రమము న్వహించి విలస
త్తుంగాశ్వరాజంబుపై, లలిఁగూర్చుండి కరంబునం
దుఁ గరవాలంబూని తద్దుష్టని, ర్ధళనంబుం బొన
రింతు వెంతయు జగత్సంరక్షకా మాధవా. 60

శా. నీవే తండ్రివి తల్లివీవె చెలివీవే ప్రాణమిత్త్రుం
డవుః, నీవే నాకిఁక సద్గురుండవయిన న్నీవే సహా
యుండవుః, నీవే యాపదలందు రక్షకుఁడవు
న్నీవేసుమీ భ్రాతవుః, నీవేగావున నిన్ను భక్తిఁ
గొలుతు న్నిక్కంబుగన్ మాధవా. 61

శా. నీమందస్మిత మాసుధాంశుకిరణానీకస్ఫురచ్చం
ద్రికా, భూమాభిఖ్యఁ దిరస్కరించి కలశాంభో
రాశి సద్వీచికా, స్తోమంబు న్నిరసించి భక్తులకు
నస్తోకానుకంప సదా, క్షేమంబు ల్గలుగంగఁ జేయు
ననుచుః గీర్తించెదః మాధవా. 62

శా. నీనేత్రంబులశోభ యెవ్వనికి వర్ణింపం దరంబౌనే

ల,త్క్షీనారీమణికి న్నివాసమగుచుం జెల్వొంది
త్రైలోక్య ర,క్షానైపుణ్యముఁ బూని చూపరు
లకు న్సంధించు భద్రంబులన్, గానన్ దానికి
నద్దిరయే సరియనంగ నెల్లునో మాధవా. 63

శా. నీదేహంబును గన్నులారఁగనిన న్నీలాభ్రసంకా
శమై, మోదంబు న్ఘటియించుఁ దావక భుజం
బుల్ చూచిన న్గల్పశా,ఖాదర్పంబు హసింపఁగాఁ
దగి మదిం గౌతూహలం బూన్పు నీ, వే దైవంబ
వటంచుఁ గొల్తు మదిలో నెల్లప్పుడున్ మాధవా.

శా. కామక్రోధముల న్జయించి మదిలో గర్వంబు
వర్జించి ని, న్నేమర్త్యుండు దలంచి కొల్చునో
యతండే శుద్ధధన్యాత్ముఁడై, తా మోక్షంబును
జెంద నర్హుఁడని డెందంబందు నే నమ్ముచున్, నీ
మీఁద న్మదినిల్పికొల్చెదను దంద్రీ ప్రోవుమీ
మాధవా. 65

శా. నీశంఖంబు సుదర్శనంబు మొదలౌ నీదివ్యచిహ్నం
బు లెం,తే శృంగారముగాధరించిననరు న్వీక్షించి
నన్ జ్ఞాన మా, వేశించు న్సుకృతంబుగల్గునని
నే విస్రబ్ధచిత్తుండనై, నీశుంభద్వరచిహ్నముల్
దలఁచెదన్ నీభక్తుఁడన్ మాధవా. 66

శా. పాశంబు న్ధరియించి కాలుఁడు నను న్బాధింప

నూహించుచో, లేశంబైన నిను న్దలంపఁగలనో
లేనో యటం చిప్పుడే, కౌశల్యంబునఁ దావకస్మర
ణముం గావించెద న్భక్తితో, నోశాంతాకృతి
నన్నుఁ బ్రోవుము దయాయుక్తుండవై మాధవా.

శా. తర్కవ్యాకరణాది శాస్త్రములు శ్రద్ధాయుక్తిఁ
జర్చించుచుఁ, దర్కింపం బనిలేదు దాన యమ
బాధ ల్వాయునె యన్యసం, పర్కం బేమియులేక
నీచరణసేవాసక్తుఁడై యుండినఁ,గోర్కెల్వానికిఁ
జేకురు న్భవవిముక్తుండై తగుఁ మాధవా. 68

శా. ఘంటాకర్ణుఁడు యుష్మదాఖ్యను వినంగా రాద
టం చెప్పుడుఁ, ఘంటల్ కర్ణములందుఁ గట్టుకొ
నుటం గాంచే తదంహాశ్చటా, లుంటాకాత్ముఁడవై
దయారసము వెల్లుల్గ్రమ్మఁగా వాని కీ, వంటం
జేసితివయ్య మోక్షము ననాయాసంబుగఁ
మాధవా. 69

శా. శ్రీ కాంతామణి భూమియుం బదముల న్సేవించు
చుండంగ నా, వైకుంఠంబున శేషశాయివయి
సద్భక్తుల్ మహాభక్తితో, నీకీర్తి న్వినుతించు
చున్న తఱిని నీవైభవం బాత్మలో, నేకాగ్రత్వ
ముునం దలంచెదను లోకేశా హరీ మాధవా.70

శా. నీసత్యంబు విభీషణుండెఱుఁగు నీస్నేహాధ

ర్యంబునం, దా సుగ్రీవుఁడై సాక్షి భక్తజనరక్షా
సక్తిఁ బ్రహ్లాదుఁడుఁ, దాసుండే యగుసాక్షి
నీయభయదానంబందు గంతీంద్రుఁడే, యాసా
క్షీకృతుఁడుంచుఁ గొల్లు మదిలో నశ్రాంతముఁ
మాధవా. 71

శా. ఏలోకంబుననుండి యిచ్చటకు దా నేతెంచెనో
యింకఁ దా,నేలోకంబున కేగునో యది రవంతే
నాత్మ భావింపఁగాఁ, జాలం డెన్నిసహస్రముల్
గడచెనో జన్మంబు లెన్నుందగం, దాలోచింప
నరుండునీదుఘనమాయాక్రాంతుఁడై మాధవా.

మ. వినిన న్నీచరితంబులే వినవలె న్విశ్రాంతిమై
నెప్పుడుఁ, గనిన న్నీభవనైక మోహనకరాకా
రంబె కాంచన్వలెఁ, జనిన న్నీరుచిరాలయంబు
లకె యిచ్చం దాజనంగావలెఁ, మనిన న్నీపద
సేవచే మనవలె న్మర్త్యుండు శ్రీమాధవా. 73

శా. స్వర్లోకాంచితభోగము ల్మదిఁ దృణప్రాయం
బుగా నెన్నుచుఁ, నిర్లక్ష్యంబుగఁ జూచి నీదు
పదసాన్నిధ్యంబె నేఁగోరి యం,తర్లక్ష్యంబుగఁ
జేసికొంచు నెదలోనన్నిల్పి ధ్యానింతుఁ జ,
త్పుర్తిల న్ననుఁ గాంచి ప్రోవుమయ యంచు
న్వేఁడెద న్మాధవా. 74

మ. నరజన్మం బతిదుర్లభంబనుచు నెన్నంబోల్చిగా
యందు, భూసురజన్మంబు లభించు టుత్తమ
మటంచు న్వేదవేత్తల్ వచిం, తురుగా కట్టిద్వి
జుండు నీదుపదభక్తుండయ్యెనే న్మోక్షముం,బొర
యు న్భక్తివిహీనుఁ డొందఁగలఁడే మోక్షంబు
శ్రీమాధవా. 75

శా. ఏజాతి న్జనియించిన న్మతియుఁ దా నెచ్చోట
వర్తించిన, న్సౌజన్యకలితాంతరంగుఁ డగుచు
న్సద్భక్తితో నుండి నీ, పూజల్ చేసినమానవుం
డు సతతంబు న్సౌఖ్యముల్ వొందుచు, న్దేజ
శ్శాలియునై చిరాయువుగ వర్ధిల్లును న్భువి న్మాధవా.

మ. తనయుండజ్ఞతఁ జేసినట్టి యపరాధంబుల్ విలో
కించి త, జ్జనకుండవ్వి క్షమించినట్లుగను యుష్మ
ద్దాసుఁడన్ నేనొన,ర్చిన నేరంబులు సైఁచి నాపయి
దయాదృష్టి ప్రసారంబుచే, ననురక్షింపుము
దేవకీతనయ కృష్ణా శ్రీహరీ మాధవా. 77

శా. రంభాదుల్ దన చెంగటన్ నిలిచి యశ్రాంతం
బుఁ గ్రీడించిన, సంభోగాదృతి లేశమైనవిడ
దా స్వర్గాధిపత్యం బిఁకన్, జంభారాతికిఁబోలె
గల్గినను దృష్ణల్ వీడవట్లాట వి, స్రంభంబొప్పఁ
గఁగోరుచుంటిని భవత్సాన్నిధ్యము న్మాధవా.

శా. అన్యాయాధ్వమునందు వ ర్తిలకసత్యజ్ఞానయు
క్తుండనై, మనుష్యాద్రేకసుఖంబు లేక గతిసంభా
వించుచుఁ నీదు పా, దన్యాసోద్ధితధూళి నాశి
రమునందాల్తుఁ హారేయంచునే, నన్యంగొల్వ
క నీపదాబ్జములనే యర్చించెదఁ మాధవా.79

శా. నిన్నుఁ లోనస్మరించు మాత్రమున వానిఁ
సత్కృపావృష్టిచే, తన్నివెప్పుడుఁ బ్రోచుచుం
దువని పెద్దల్ చెప్పఁగా మున్ను నే, విన్నాఁ
డన్ మణి యార్తరక్షకుఁడ వీవేకాక జేజేలలోఁ,
గన్నాకుల్ మదినెన్నఁగాఁగలరె నీకన్నఁ హరి
మాధవా.    80

మ. జననంబందినతోడనే కలిగెయుష్మన్నామ సంకీ
ర్తనం, బును నీపాదసరోజభ క్తియు భవత్పూ
జాపరత్వంబు గా, వున నాకీవనుకూలదైవమవు
గా బుద్ధిఁ వితర్కించుచుఁ, వినుతింతుఁ
నినుసంతతంబు మదిలో వేడ్కఁ హరి మాధవా.

మ. ప్రళయానేహమునందు లోకములు వోవంగా
రహిఁ నీవు ని, శ్చలతేజోమయ రూపదీపిత
విశేషజ్యోతివై యత్తఱిఁ, వెలుఁగేకాకృతి
నొందుచుఁ జగములీవే వెండిపుట్టింతువో, జల
జాతాక్ష భవత్స్వరూపమె జగజ్జాలంబగుఁ
మాధవా.    82

మ. వ్రతముల్ దానము లెన్ని చేసినను దద్వారా
ణసీముఖ్య పు, ణ్యతమక్షేత్రము లెన్ని చూచిన
నుదా నాయశ్వమేధాది స, త్క్రతువుల్ చేసినఁ
దావకీన మృదుపద్రాజీవ సేవాసమా, గత
పుణ్యంబునుబోలఁ జాలవని వేడ్కం బల్కెదన్
మాధవా. 83

మ. తులసీదామములన్ ధరించుకొని చేతుల్ మో
డ్చి సత్పుంద్రవ, ల్లులు ఫాలంబునదిద్ది శుద్ధపట
ముల్ శోభిల్లఁగాఁగట్టి ని, చ్చలు నీనామము సం
స్మరించుచు భవత్సంకీర్తనల్ పాడుచున్, బలు
మాఱున్ నినుసన్నుతించు నరుఁడే భక్తుండగున్
మాధవా. 84

మ. జటిలైయుండుట ముండియైనటయును గాషా
యాంశుకంబుల్ ధరిం, చుటయున్ జేతులసత్క
మండలువుఁ గొంచున్ వేషముంబూనుచుం,
డుటయున్ లోనగునవ్విరుట్టులొసఁగు న్మోక్షం
బుతృష్ణన్ జయిం,చుటదైు నిన్నుభజించుచుండు
టయొయిచ్చున్మోక్షమున్ మాధవా. 85

శా. ఘోరంబౌ కురుపాండవాహవమునన్ గ్రూ
రాత్ములం గెల్వ దో, స్సారంబల్ల కిరీటకివాసఁగి
నీచాతుర్యముం జూపుచున్, సారథ్యంబొనరిం

చియాతనికిఁ దత్సంగ్రామసీమన్ జయం, బారన్
నీవానఁ గుఱ్చినాఁడు వలిసాహాయ్యంబునన్
మాధవా. 86

మ. అమృతం బానిన మానవోత్తమునకున్ వ్యా
ధుల్ జరా మృత్యువుల్, క్రమమొప్పందొల
గున్ దలంపభవదాఖ్యన్ నిత్యమున్ సంస్మరిం,
చు మనుష్యాగ్రణికుద్భవం బెనళియించున్ సత్య
వైకుంఠ వా, స మెగల్గున్ సుధనీదు నామసమ
మేచందానసా మాధవా. 87

మ. అఘువీరుత్తతిదాత్రదాత్రలఘుబల్య స్తోగసన్మం
దిర, ప్రఘుణార్చవిధి పాత్రపాత్రని శభాస్వ
ద్గోత్రగోత్రా సక్ర, న్నిఘుసాపాదక గాత్రగాత్ర
మరమౌని శ్లాఘ్యదోశ్శక్తిభా, జ్యఘువత్పుత్రక
మిత్రమిత్ర శశి శుంభన్నేత్ర శ్రీమాధవా. 88

మ. కటిభాగావృతధర్మచేల విలసత్కస్తూరికాచిత్ర,
క, స్ఫుటఖండేందు సమానఫాలప్రణత స్తోమ
ద్యుషత్సాల స, ద్వటపత్రాధిశయత్వశీల కమ
లాబ్జాతాననాలోల హ్రా, త్స్ఫుట చంచత్కరు
ణాలవాల వినమద్గోపాల శ్రీమాధవా. 89

మ. అసితాభ్రోపమ కాయకాయదతి భక్తాంహాస్త
మసూర్యార్యమా,ర్య సురతాంచిత భావభావభవ

జన్మాధానసనై పుణ్యపుణ్యసమూహప్రద సత్క
థారవ రసజ్ఞాత్యంతమాధుర్య దా,య్యసమానా
చ్ఛసమాఖ్యమాఖ్యశశభృద్బాప్యాంచదశ్యమా
ధవా. 90

మ. ఖలగంధర్వ ఖలీనఘోరపల భుగ్వ్యాళావళీవీన
ని,స్తులకారుణ్యనదీ నగోపతరుణీ దోశ్శ్లేషణాధీ
నకుం, డలిరాట్తల్పశయాన యోగిజన బృంద
స్వాంతయుంజానశ్రీ,జలజాక్షీఘనకౌస్తుభా కలిత
వక్షస్థాన శ్రీమాధవా. 91

మ. కరిరాజార్తి విదారచంద్ర రుచిరంగత్స్వైరయే
నస్సుము,త్కరకుల్యాల శతారదుగ్ధ సరిదీడ్గంభీర
బృందావనా,చరితాపార విహార సర్వజగతీ సం
రక్షణాధార శ్రీ,హరిణాక్షీయుగగారభక్త శుభ
దాయ్యాకార శ్రీమాధవా. 92

మ. పతగాధీశ్వర యానవేల్లదరి షడ్వర్గావరుంధాన
ర,క్షితగీర్వాణ వితాన యాదవకుల శ్రేయోద
నిధ్యానరా,జితశంఖారి దధానరాత్రి చరహస్తి
శ్రేణి కాలానభ, క్తతతిజ్ఞాననిదాన యోగివర
హృద్వ్యాలీన శ్రీమాధవా. 93

మ. భృతవేధోండ కటాహవల్లవ పురంధ్రీ క్షీరద
ధ్యాజ్యభు,క్త్య తులోత్సాహ విశిష్టజాన్వవథి

బాహానాహ దుగ్ధాబ్ధిమధ్యతలాంచద్వర గేహా
దారిత సుధాంశుశ్శాత్ర వవ్యూహా ప్రీణిత పద్మ
క్తసమూహా పాండవసహన్నగ్రాహ శ్రీమా
ధవా. 94

మ. రవికోట్యంచిత తేజపాతకతమిస్రశ్రేణికాఘార్ణకై
రవిణీరాజ పదంబుజాశ్రితసుపర్వశ్రేజలోకేశవా
సవపూజ్యాంఘ్రిసరోజ చారుతరతుశ్ళంశోభిచే
తోజ జైవ్వవసీలత్తను భాసమాజ సమనుష్య
వ్యాజ శ్రీమాధవా. 95

శా. శ్రీవత్సాంచదురఃకవాటజలరాశిస్ఫాయ మా
నప్రభా,వా వార్యశుగఘాట యధ్యాషిత
రమ్య ద్వారకావాట పాదావిష్టాష్టదిగ్దలాట
మణిదివ్యత్కుండలద్వంద్వ శోభావిష్కారికిరీట
సంస్తువద శేషభ్రాట శ్రీమాధవా. 96

మ. ఫణిభుగ్బర్హ్మయుతోత్తమాంగవిపదబ్జవ్రాతమా
తంగ సద్గుణ రత్నాళ్యనుషంగ కోపనిహతక్రూ
రతపాటాంగ కారుణికాపూర్ణతరాంతరంగ
గరుడారోహక్రియాచంగ మార్గణబృందాశ
యసన్నిషంగ పదనిర్యద్గంగ శ్రీమాధవా. 97

మ. నిగమోక్తస్తుతిఘోష కౌస్తుభసుమాణిక్యోల్ల
సద్భూష లోక గణాత్యద్భుతగోపవేష త్రిది

లోకశ్లాఘ్యసద్భావ సౌభగసంయుక్త మనీష
లాలితరమాబాహాసమాశ్లేష పాణిగృహీతి
[illegible]తిదోష దుష్కృతహిమానీపూష శ్రీమా
ధవా. 89

మ. సమరోర్వీజితబాణసేవక సమాజప్రోతకళ్యాణ
దుర్దమరక్షోభయకృత్కృపాణ నిజభక్తత్రాణ
కుర్వాణ సర్వమహీభారధురీణ పాలనకళాపా
రీణ కౌంతేయవిక్రమజాగ్రత్తనువారవాణ కృ
తలోకప్రాణ శ్రీమాధవా. 99

మ. యదువంశాంబుధిసోమ దుష్కృతసమూహక్షో
భకృన్నామ దుర్మదరాత్రించరభీను చంచదసి
తాభ్రశ్యామ వందారుసమ్మదసంధాయిచరిత్ర
ధామ సుమదామ స్తోమ వత్కంఠసీమ దిశా
పూర్ణయశోలలామ నతశుంభత్ప్రేమ శ్రీమా
ధవా. 100

శా. శ్రీకృష్ణాహరి మంగళంబు దనుజారీ మంగళం
బయ్యా సత్యాకాంతాధిప మంగళంబు యదు
నాథా మంగళం బచ్యుతా పాకారిస్తుత మంగ
ళంబు గరుడార్వామంగళం బర్హిలీలాగ్రైకోద్భా
శ్వత మంగళంబిదిగో మాంగళ్యంబు శ్రీమా
ధవా. 101

మ. ధరణీమండలి శాలివాహన శకాబ్దంబుల్మహీంద్రా
గ్ని కుంజల శీతాంశులసంఖ్యచేఁ బరగఁజంచ
ద్రాక్ష సాంఖ్యాకినవత్సరమందుఁ దగు జ్యేష్ఠపుం
బహుళపక్షంబందునా సప్తమీ, స్థిరవారంబున
నెల్ల నీశతకముం జెం బూర్తి శ్రీమాధవా. 102

మ భువిలో నల్లమరాజవంశకలాశాంభోరాశి పూ
ర్ణేందుఁ డార్యవరశ్లాఘిత సచ్చరిత్రుఁడగు సు
బ్రహ్మణ్య సంజ్ఞాక సత్కవికిన్ జిన్నమకు న్సు
తుండ నమరంగన్ రంగశాయ్యాఖ్యానా, కవి
నే నీశతకంబు నీకొసఁగితిన్ గైకొమ్ము శ్రీమా
ధవా. 103

మా ధ వ శ త క ము
సమాప్తము.

---

# పీఠిక.

ఈశతకము ప్రాచీనకవులు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు. ఆంధ్రకవులలో సుప్రసిద్ధులని పేరెన్నికగన్న యీకవియుగము రచించిన గ్రంథములను జదువనివారును ఈకవులప్రతిభాదికము నెఱుంగనివారును వర్తమానకాలమున జాల యరుదుగా నుండిరనుటలో సాహసము లేదు.

బహుగ్రంథరచయితలు శతావధానులు వివిధ బిరుదాంచితులునగు నీకవులకవిత కేవల ద్రాక్షాపాకముగ మృదుమధురపదగుంభితమై యాదికవులకవితను సర్వవిధములఁ దలపించుచుండును. వీరి యాంధ్రీకరణములగు శ్రీనివాసవిలాసము, బాలరామాయణము, ముద్రారాక్షసము, మృచ్ఛకటికము, స్వతంత్రగ్రంథములగు శ్రవణానందము, బుద్ధచరిత్రము, పాణిగృహీత లోనగుపుస్తకములు భాషావిదులమన్ననకు యువకకవులవరవడికిఁ గూడఁ బాత్రము లయ్యెననుట వీరి మహాకవితాప్రతిభకు దృష్టాంతములు కాగలవు. వీరికృతులలోని శ్రీకామేశ్వరీశతక మొకటి రచనాకౌశలమును విషయసందర్భమునుబట్టి యీ శతకము వేంకటశాస్త్రిగారు రచించినటులఁ దోఁచుచున్నది. (నా కేదిరోగంబు నీవివిచ్చుట నిక్కము

మూడఁ జేసెనవు. కృష్ణశాస్త్రివు మున్నర్కం పురోగంబు, సకలామయంబులను నొప్పి న్నన్ను సేవించు లోనగుపద్యములవలనఁ గవివ్యాధిపీడితుఁడై శతకమున నందందు బాధానివృత్తికిఁ గొన్ని పద్యములు రచించిరని తోఁచును. కొన్నిపద్యములు కవికిగల యాత్మగౌరవాభిమానములు, స్వతంత్రభావములు పూర్వాచారప్రీతిని వెల్లడించుచున్నవి. ఈకవుల గ్రంథములవలెనే యీ శతకముగూడ నూతనభావసమన్వితమై వాఙ్మయమున నొక గౌరవస్థానముగా నొందఁదగియున్నది.

ఆధునికులు సుప్రసిద్ధులునగు శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులజీవితచరిత్రము, వారి శతావధానసారము, నానారాజసందర్శనము, లోనగుపొత్తములవలనఁ దెలియుటవలనఁ నింతకంటెఁ గవితాప్రశంసయు నితరచరిత్రసందర్భములు జర్చింపక వదలుచున్నారము. ఈశతకమును పునర్ముద్రణము గావించుటకు సెలవొసంగినందుకు వారికికృతజ్ఞులము.

చెందయాప్పేట,
చెన్నపట్నం.
10. 1. 26

ఇట్లు
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు
అండ్ సన్స్

శ్రీ ర స్తు.

తిరుపతి వేంకటేశ్వరకవికృత

# కామేశ్వరీశతకము.

---

శా. శ్రీరామా రమణాదినిర్జర శిరస్సేవ్యంబు సంసార
సా, ఖ్యామయాంకురదోహదంబు పరితాపా
సార మత్యంతశో, భారమ్యంబు పరార్థదాయక
ము నీపాదంబు మోదంబు దై, వారఁగొల్తు నమ
స్కరింతు మది సంభావింతుఁ గామేశ్వరీ. 1

శా. నేరం బేనియు నేఁగు వేనియును మన్నింపన్ భవ
త్పాద మా, ధారంబౌనని నిశ్చయించికొని
నాతప్పొప్పులఁ జెప్పి సం, సారాంభోనిధి నుత్త
రించుటకు నిచ్చన్నిచ్చలుం గోరి ని, న్నారాధిం
పఁగఁ బూనినాఁడ దయ లేదా? తల్లి కామేశ్వరీ.

మ. అనురాగానుగతాంగనాజితుఁడనై యానందశ
బ్దార్థముల్, వనితా సౌఖ్యపరమ్ముచేసి మనముల్
వారింపఁగా లేని నా, జననం బేమిటికంచు నొక్కొ
కయెడన్ జర్చించియున్ మాననే, రని నన్నెట్లు
భరించెదో యెఱుఁగఁగా రాదంబ కామేశ్వరీ.

మ. తలఁచే నెప్డు విరాగమందు మదిసంధానింతునన్
మాటనీ, కెఱుఁగన్ రానిదె? అట్టినాదుమది కే

చేనొందు వైకల్యముల్, బోరయుల్ జేయు నిమి
త్తమేర్పఱచి యేమోహాంధ్యముం గూర్చెదె,
క్కరణిన్నేను వరింతుఁ? దెల్పుమిది సౌఖ్యంబొ
నా! కామేశ్వరి. 4

మ. చదువన్ లేదొకవిద్యకేనియు యదృచ్ఛాలాభ
మేకాని నే, నాదుగన్ లేదొకజేనికేనియును
నోహోయంటయేకాని నే, వెదకన్ లేదొక
వేశ్యకేనియును దావిందాటయేకాని యి,
య్యది యేరీతిగ నెల్లకార్యములు నాకౌఁగాక
కామేశ్వరి. 5

మ. ధనమార్జించితి నిచ్చితిన్ యశముసందన్ గంటి
భోగమ్ములన్, గనివిన్ జెందితిఁద్వత్కటాక్షమున
విద్యాంసుండనై మించితిన్, జననీ! యిందుగొఱం
త నాకు లవలేశంబైననున్ లేదునీ, చనవున్న
ప్పుడొకంటరిక్తుఁడగునే సంసారి కామేశ్వరి. 6

మ. జననంబందుట పెద్దయౌటయు గృహస్థత్వమ్ము
గైకొంట నం, దనులంగాంచుట పెండ్లిసేయుట
యిటుల్ నానాఁటికేదేనియున్, బనియున్నట్టు లె
న్నోఁచునొక్కొకపనిన్ బైపైవిసర్జించి శాం,
తినివేగన్ గనినిన్నుఁగొల్చుటయె ముక్తిప్రాప్తి
కామేశ్వరి. 7

మ. ధనమార్జించుటగాదు సూ!స్థలము విద్యల్ నేర్చు
కొన్నందుకే, మ్మనముల్ సత్క్రియలందుఁజొన్ప
వలె సామాన్యమ్ముగా ధర్మమే, తనకృత్యంబని
యెంచికోవలయు నద్దానన్ బరిజ్ఞానముల్, గాని
నానాఁటికి నిన్నుఁజేరవలెఁ గోర్కెల్ వీడి కా
మేశ్వరీ. 8

శా. దేహస్వాస్థ్యముకన్న వేఱొకటిము క్తిప్రాప్తి
కిన్ సాధనం, బూహింపంబడ దెందు దానికి మహా
యోగుల్ త్వదీయాంఘ్రిసే, వాహంభావము
హేతువందురది నిన్నర్థించుచున్నాఁడ సం, దే
హం బేటికి! దేహియన్నప్పుడు శక్తీ! తల్లి! కా
మేశ్వరీ. 9

శా. ఆధివ్యాధిపరీతమైన తనకాయం బర్థిఁ బోషించు
చున్, శోధింపన్ వలె వేదశాస్త్రములు సంశో
ధించి యద్దానిచే, సాధింపన్ వలెముక్తిమార్గమ
దియున్ సాధించి మోక్షార్థికిన్, బోధింపన్ వలె
జన్మమన్నదియే హా! దేవి? కామేశ్వరీ. 10

మ. ధనమున్నన్ సతిలేక తత్సుఖము సందర్భించి
నన్ సంతతిం, గనకాభాగ్యముగల్గ వేఱొకటి
యక్కామ్యంబు చేకూరనిం, కనునొక్కండదిగ
ల్గనొక్కఁడదియున్ గల్గన్ మఱొక్కండు లేన

నుఁ గోల్పడప్పుడు తృప్తియొక్కరణి లభ్యంబౌనా?
కామేశ్వరీ. 11

మ. జననాభావముననుగ్రహింపు మది నీశక్యంబుగా
దేని పై, జననంబందును నాకొసంగు మెటులో
సంగీతసాహిత్యముల్, పనిలేనీయుదరంపుఁ బో
షణకున్నై భాషాంతరంబుల్ జగ, జ్జననీ! దీనికి
నింతవ్యర్థపుఁ బ్రయాసం బేల! కామేశ్వరీ. 12

మ. ఎవఁడేరీతిని బెట్టిపుట్టునటులే యేర్పాటగుఁ
గాని వృ, త్తివిశేషమ్ములు దీనికింతమదినుద్రే
కించి తానెక్కుడౌ, వ్యవసాయంబొనరింపనేమి
యగుఁ! ద్వత్రా ప్రణేశుఁడా! విచ్చు వె, త్తవలేఁ
గర్మముదాఁట నెవ్వరికి సాధ్యంబౌనె! కామేశ్వరీ.

మ. ఇలు వేల్పైనను దాతవైనను మఱింకేమైనను
న్నీ వెనీ, బలమొక్కించుక కల్గువారలకు నైశ్వ
ర్యమ్ము హస్తస్థితా, మలక ప్రాయము నిన్ను
వీడి నరులంబ్రార్థింపఁగాఁ గల్గునే, కలుముల్
ధేనువుగాకదున్న లెటుదుగ్ధమ్మిచ్చుఁ? గామేశ్వరీ.

మ. నరనాథుల్ పలుమంది మిత్రులయియున్నన్
గాని తత్సన్నిధిఁ, స్థిరవాసమ్మొనరించునట్టి పని
నాచేఁగాదు నీవంటి స, త్కరుణాశాలిని
వెంపఁగాఁ బెత్తేఁగి విద్యాబుద్ధులన్నేర్పి నేఁ, బరు

లన్నిత్యము గొల్చుటొప్పగునె? యంబాదేవి!
కామేశ్వరీ. 15

మ. ఋణబాధల్ వ్రణబాధలం బ్రభుధులా యీ
బాధ నాకుం డ్రుదా, సుజ్ఞానోద్ధారసి లేక ద్రిశుద్ధిగ
నపర్యుం జేతఁ జేస్నాట ధా, గుణశోభావత్కటాక్ష
వీక్షణము లారోపించు వేళొక్క కా, రణమింకి
ద్యొక వేది దేనిజ నపర్ణా! తల్లి! కామేశ్వరీ. 16

శా. నారుంబోసిన దేవుఁ డెట్టిగతినైన న్నీరుదాఁబో
యఁడే, "యేరీతిన్నన కేగుఁగాల"మనిలో నేడ్వం
గనేమా! జమీం, వారల్ మాత్రము సర్వరి
తులను మోనంబందిరే! లోటులే, దే! రారా
జున్నకైనఁ, దృప్తికలవాఁడే రాజు కామేశ్వరీ. 17

మ. "తన పుత్రుల్ స్వమతేతరమ్ములగు విద్యల్ నేర్చి
పోషింతు"రం, చు మతభ్రష్టులఁ జేయు పండితు
లుసీపుల్ గారె? వీరింక ద్రవ్యముకై కూఁతుల
రోవెలందులుగఁ జేయలేరె? యెవ్వారిదూ,ర
మతేమాఁ, గలికాలపున్మహిమ వార్యంబౌనె?
కామేశ్వరీ. 18

శా. ఆచారమ్ములుపోయె వేదములయందాసక్తి లేదా
యెడు, ర్ధీచాతుర్యము హెచ్చె నీచులకు నాధి
క్యమ్ముదా వచ్చె సం, కోచం బెందును లే"దిహమ్ము

పరమ్మున్ గొండాటకుంబోరువా, రేచోటన్
గనరారు పాపమిదియేమీ? తల్లి! కామేశ్వరీ. 19

మ. మునునుద్యోగులు లేరొ? వారలు ధనమ్ముం గా
ర్పరొ? పూర్వవర్తనలన్ మానిరె? ప్రాని రేపలి
నపహాధర్మమ్ము వారిట్టులే, మనవచ్చున్ బ్రకృత
ప్రపంచగతి వర్ణాచారముల్ మూతనై, వ్వని
నెవ్వండని నిర్ణయింపఁదగు? నోవామాక్షీ! కామే
శ్వరీ. 20

మ. సకలమ్ముం గొఱగించుకొందురకటా! సన్యాసులా?
కారు బో, ట్టొకయింతేనియు ఫాలమున్ విడరదే
మో? ముండలా? కావు వి,ప్రసులోత్తంసులకిట్టి
పాటుకలిగెన్ బైవారిమాటేల? రెండు, దుకులో
కంబిటుమాఱె! నీకెఱుఁగరాదో, దేవి! కామే
శ్వరీ. 21

శా. అచ్చాఫీసులటంచు వాణులకుపాధ్యాయ
త్వమంచున్ మఱిన్, వెచ్చన్ బిచ్చుడిబచ్చుటిండు
లకడన్ వేదాంతమంచున్ మహో, ద్యచ్ఛారి
త్రులు పండితుల్ మెలఁగఁగానయ్యెంగదా?
పొట్టకై, చచ్చున్ గాలమువచ్చె గౌరవమునా
శంబయ్యెఁ గామేశ్వరీ. 22

మ. "బలిపాడాయెను గర్భుఁడున్ జెడిరె విప్రస్వా
ములర్థించు కో, ర్కెలనీ బూని మ ఱవ్వఁ

డెట్లునిలుచుఁ బృథ్వీస్థలిఁ దాతగా,వల"దంద్ర
జ్ఞాలుగొంద జెందుఁగలలాభంబింతగు ర్తింపరి,
క్కలికాలంబిటు కాలుచున్నయది దిక్కా! మొ
క్కా? కామేశ్వరీ. 23

శా. నానానీచకృతుల్ పొనర్చు సుతుహానాప్రక్రి
యాధ్యక్షుఁడో, వానిం జేసినఁ "బొట్టకూటికిది
నేర్వంబడ్డ" దన్నట్టి వి, జ్ఞానంబించుక లేక వేద
మనినన్ శాస్త్రములన్న కాసదా, తానిందింపఁగఁ
జొచ్చువాఁడెలుఁగునే? తత్త్వము? కామేశ్వరీ.

మ. గురువన్నన్ భయభక్తిసంభ్రమములే కాశమ్ము
నన్ గానరా,వరయన్ శాస్త్రోకకొన్ని యేనియు
ను మర్యాదాస్థితుల్ హానావి,వ్యరహిన్సై ర్చి
డి బాలురందు భృత్యోపాధ్యాయతాదోష వి,
స్ఫురణంబియ్యది కాక వేఱుగలదే? మూలంబు
కామేశ్వరీ. 25

మ. ధనమార్జింపదె? వేశ్య యంతకునునింద్యంబౌ
నసత్యప్రవ, ర్తనయున్ సేవయు విప్రజాతులకు
మేరా "నశ్వవృత్త్యాకదా,చన" యంచున్ మను
వాడఁడా? "యిదియదూష్యంబిట్టికాలమ్మునం,"
దనవర్ణాశ్రమపద్ధతుల్ విడుటయు న్యాయ్యంబె
కామేశ్వరీ. 26

మ. ఎవఁడేగోతినిఁ ద్రవ్వెదాని మఱివాఁడే కాక
"తాఁజెడ్డ కోఁతి వనంబెల్ల నుగాల్చురీతిఁ" గల
నీతిందాఁట శంకించునట్టి వివేకాత్ములఁ జూడఁ
ద్రోయుటకుఁ జాఁచిగోరు లత్యంతగర్హావిధు
లోర్చిధనసేతు రియ్యదియు సహ్యంబౌనె! కామే
శ్వరీ. 27

శా. "పూల లవ్వననుంచఁగావలెనె! యామ్నాయ
మ్ము లంఘింపఁగ, దే,! లంకఁ జననేమగుఁ?మ
డికిని స్త్రీఁబట్టనింద్యంబె!" యం,చాలోచింతురు
పూర్వ మెవ్వరును లేరా? యింతవా రక్కటా!,
పాలంబోలుకొలమ్ము వారలకు నిషాక్షేల? కామే
శ్వరీ. 28

మ. మనధర్మములు తప్పు లన్యమతధర్మముల్ ప్రశ
స్తమ్ము లం,చును వాపోయెడిమూర్ఖులీయుభయ
ముఁ శోధించిరే? పొట్టకూ, టోనరం బెట్టెడివి
ద్యకుం గలదె' యీయుక్తాపయుక్తత్వయో,జన
తానియ్యది వేదమూనా! మఱి శాస్త్రంబౌనా?
కామేశ్వరీ. 29

మ. తనధర్మమ్మున కన్యధర్మము విరుద్ధంబెంత యానం
తగ్గై,కొని వర్తించిన వ్యావహారికులు తఁ గొట్టిం
చిరే? యింటఁ జే, సినయాచారము వారినేటికి

హింసించుచున్ ? మహాచారమూ, నని మాత్ర
మ్మునఁ దాను బెద్దవారగ యౌనా? తల్లి! కామే
శ్వరీ. 30

మ. పెఱవారిన్ గిసుఁబించి విత్తముగొనన్ బ్రేరేపణ
ల్సేయు ౘక్కదుల న్నిక్కము న్యాయవాదులని
పల్కన్ దప్పు వేశ్యాగుణ, స్ఫురణంబంతయు
వీరియందుఁ గనవచ్చున్ వీరలు న్వారలున్,ధర
గేస్తు న్గెడఁదీయఁ గారకులు సత్యంబింత కామే
శ్వరీ. 31

శా. ఈవే యింద్రుఁడ వీవె చంద్రుఁడ వటంచెవ్వా
నిసేని న్ధనా, శావేశమ్ము మెయి న్నుతించు కవులా
హా! యెంత మూఢాత్ములో, దేవి! వీరొక కొన్ని
పద్యముల నీతేజమ్ము వర్ణింపరా, దా? విత్తము
నొసంగు దార్ఢ్యమది లేదా? నీకుఁ గామేశ్వరీ 32

మ. కలవారెందఱు? రిక్తులెంద? ఱెవు డిక్కంజాత
భూసృష్టి నా,ద్యులు బంగారము మెక్కి వృత్తి
కఁదదన్యు లెక్కుచున్నారె! యిక్కలుము
ల్నిక్కములో? వయస్సునత మో? కాయంబునా
పాయమో, కలయే నిక్కలయో మతేలధనికు
ల్గర్వింత్రు కామేశ్వరీ. 33

మ. అతిథుల్వచ్చిన గారవించుటకుఁ బ్రత్యబ్దమ్మున

న్నిమహా,వ్రతము న్నల్పుటను న్సుఖమ్ముగను గా
ర్హస్థ్యప్రచారమ్ము సం,తతము న్నిగ్గుటను న్స
రాసరి సిరిన్ దల్లి! నినుంగోర న్నిచ్చితి వామా
త్రమచాలు నెందు కధిక శ్రీమత్తు! కామేశ్వరీ.

మ. తలిదండ్రు ల్పనిఁబూని బాల్యమున విద్యాబు
ద్ధుల న్నేర్పలే, దెలమి న్ద్రవ్యముఁగూర్చి యిచ్చు
టయులే దీనాను సర్వమ్ము నీ,బలమే కారణమై
రొసంగె జననీ! ప్రార్థింతు నీరీతిగాఁ,గలకాలమ్ము
ను బోవనిమ్మధికమున్ గాంతుంపఁ గామేశ్వరీ.

శా. ఈవేళన్ మృతియేని రేపటికి రెండేతాదృశ
మ్మైన యీ,జీవమ్మందును గాయమందును సుత
స్త్రీబంధుగేహాదులం, దేవా రేనియు నాసనేయు
టది తప్పేరొయొక్కచోఁ జేసినన్, భావింపన్వలె
"నెంతసత్య"మనుచుం బల్మారుఁ గామేశ్వరీ. 36

మ. తమ ప్రాయమ్మునఁ బూర్వలోకవులు చిత్తభ్రాం
తిచేస్త్రీసమా, గమముంగూర్చి రచించు నాటక
ములుంగావ్యమ్ములుంజూచి బా,ల్యము నెట్లో
వెడలించి యౌవనము కానాసౌఖ్యమందు న్మ
నిం, గిమనంబిప్పుడిసీ! యటంచునువిరక్తింజెందెఁ
గామేశ్వరీ. 37

మ. అనుమానింపక కల్పనారుచులపై నాస ల్విసా

లించు నెమ్మనముం బ్రపుల్లగ లేక దుర్విషయము
ల్మన్నించుచు న్నాధుస, జ్జనసాంగత్యము వీడినట్టి
పరమజ్ఞాని న్నను న్నుద్ధవ, ర్తనకుం దార్చిన నీకృ
పారస మపారంబంబ! కామేశ్వరీ. 38

మ. మతినూహింప సతీసుతాది గతసంబంధమ్ము సర్వ
మ్ము కల్పిత మవ్వారల పోషణార్థమకదా? లె
క్కింపఁగారాని దుష్కృతులందేహి యొనర్చు
టకటకటా యీబంధమే యీజగ, త్తినలెకిం
గావలెనే? మఱొక్కగతి నీచేఁగాదె కామే
శ్వరీ. 39

మ. ఒక కొంతేని నిజమ్ముగాని వనితాయోగంపు సౌ
ఖ్యమ్ము సృష్టికి మూలమ్మనినిర్ణయించుటఁగదా
చేటొప్పటువాటిల్లెనీ,వొకటిం జేయమఱొక్కటా
యెనిదియేమో బ్రహ్మముంజూపు నంచకటా!యె
ట్టిమహాత్ములుం జెడుదు రన్యాయంబుకామేశ్వరీ.

శా. జ్ఞానంబించుక లేని కన్నియలతోఁ గైవల్యముం
బొంది బ్రహ్మానందం బిదియంచు నెంచు బుధుల
న్నా? యెంతమూఢాత్ము లెంతే నింద్యమ్ముని నో
టఁబల్కుచును దేని స్వీడఁగాలేరు విజ్ఞానుల్
హానిఁదలంచిన న్వ్రీడము నాశ్చర్యంబు కామే
శ్వరీ. 41

మ. గృహశృంగారము చేసి చేసి గృహిణీశృంగార

